అభినవసరస్వత్యనుబంధము.



శ్రీ

# స్వర్ణకారవ్యవహారము.



గుంటూరుజిల్లా పల్నాడు తాలూకా

జానపాడు నామక గ్రామ నివాసియును

నభినవసరస్వతీ పత్రికాధిపతియు నగు

జానపాటి పట్టాభిరామశాస్త్రిచే

వ్రాసి ప్రకటింపఁబడినది.



చంద్రికా ముద్రాక్షరశాల, గుంటూరు.

1918 సం॥ జులై

# పీఠిక.

స్వర్ణకారవ్యవహారమని కొందఱీ గ్రంథమునెడల ననాదరముం జూపుచున్నవారు. పుణ్యజనంమన్యులగు మఱికొందఱచేఁబుణ్యమా పురుషార్థమా యని యేతద్గ్రంథరచన నిరర్థకప్రయోజనముగఁగూడఁ బరిగణింపఁబడుచున్నయది. వీని కన్నింటికింగల కారణములు పరశ్రేయోఽసహనము పండితంమన్యత్వము మొదలగునవి యగుటట్లుండ నవిమర్శకత్వంబ యాదిమంబైయలరారెడిని. శ్లో॥ శక్తోయస్త్వాపితుంధర్మ ముపేక్షాం కురుతే నరః। సోఽపిపతతివనంనామ నరకం ప్రతిపద్యతే॥ యను సూతసంహితోక్తిం బట్టి ధర్మచ్యుతిగలుగునెడల నుపేక్షవహించుట నరకహేతువై యున్నయది. ఇదిధర్మ మిదియధర్మ మని కించిద్జ్ఞులమగు మనము నిర్ణయించుకొనవలసిన పనిలేకుండ శ్రుతిస్మృతిపురాణాదులే విడఁదీసియున్నయవి. ప్రతిమనుష్యుఁడును స్వస్వవర్ణోచితధర్మములు చెడకుండఁ గాపాడుకొనుట ముఖ్యకర్తవ్యము. కాని ప్రస్తుతము పలుమంది యందులకు భిన్నముగనే ప్రవర్తించుచున్నవారు. సకలజనులచేతను స్వస్వవర్ణోచితధర్మము లనుష్ఠింపఁజేయ నిగ్రహానుగ్రహ సమర్థుఁడగు ప్రభువునకుఁదప్ప నన్యున కశక్యమైన పని. అనేకు లధర్మమార్గగాములగుట చూచుచుండియు నస్మదాదుల మన్యథాచేయుట కశక్తులమై యున్నవారము. కాని యధర్మమని యనుకొనకకాని ప్రసక్తివచ్చునప్పుడు వాదింపకకాని తద్వాదమే ముదిరినయెడల వ్యవహరింపకకాని యుండము. అందులోఁ దనసంఘమునకుఁగాని తనగ్రామమునకుఁగాని సంబంధించినప్పు డూరకుండుట సమర్థునకు లక్షణమేకాదు. పలుగ్రామములలోనుండు కమసాలులు బ్రాహ్మణంమన్యులై బ్రాహ్మణులతో వితండవాదములుచేయుచు బ్రాహ్మణధర్మము లనుష్ఠింపఁ బ్రయత్నించుచున్నవారు. అది ప్రాభవవిహీనుల కనివార్యమే యగుఁగాక. అట్టికర్మము మాయూర మాసముక్షములోనే జరుగుట సంభవించినందున నేను సాధ్యమయినంతవరకిందువిషయమై వ్యవహరించి తుద కీచరిత్రము వ్రాయవలసివచ్చెను. ఈచరిత్రయొక్క సంగ్రహ మేమనఁగాఁ గాలవిపర్యాసముచే బ్రాహ్మణులు బ్రాహ్మణధర్మము లనుష్ఠింపక యన్యధర్మము లనుష్ఠిం

చుచున్నట్లే శూద్రాదులుకూడ స్వకులోచితధర్మములఁ బరిత్యజించి బ్రాహ్మణధర్మము లనుష్ఠింపవలెనని ప్రయత్నించుచున్నవారు. ప్రయత్నింతురుగాక. ఆబ్రాహ్మణులపై ద్వేషముకూడ వహించుచున్నవారు. ఈరీతి స్వభావముగనే బ్రహ్మద్వేష ముదయించుచున్న యీకాలమున మాయూరి యవరజులకు వైదికులపై వ్యవహారసంబంధమైన ద్వేషముకూడఁ బ్రవృద్ధమగుటఁ దన్మనంబులకుఁ బరితాపముంగలిగించుటకై గ్రామదేవతాప్రతిష్ఠ కమసాలులచేఁ జేయించిరి. వైదికులకును దనకునున్న వ్యావహారికవిరోధముచే బ్రాహ్మణత్వాభిమానము సహితము వదలి మాయూరికరణము తత్సాభ్యదులతో నేకీభవించెను. ఈరీతిఁ గరణము మున్నిభుఁ బెద్దకాపు మొదలగు పలుమంది యేకమయి కమసాలులచే నీ గ్రామదేవతా ప్రతిష్ఠ జరిపించుటయు గ్రామదేవతా విగ్రహములు బ్రాహ్మణులచేఁగూడఁ బూజనీయములని పురాణాదులలోఁ జెప్పఁబడుటవలనను దదాచార మనేకస్థలముల నుండుటవలనను నితరత్ర యెట్లులున్నను మద్గ్రామమునఁ దాతలనాఁటినుండియు మేము గ్రామదేవతలఁ బూజించుచుండుటవలనను బ్రాహ్మణేతరులుప్రతిష్ఠించిన విగ్రహములు బ్రాహ్మణులకుఁ బూజానర్హములగుటవలనను శాస్త్రవిరుద్ధముగా జరిగిన యీకార్యమునకై పరితాపపడుచుండిన నేను మద్గ్రామస్థులగు కొందఱుబ్రాహ్మణుల ప్రోత్సాహముచే నట్లనాచారపఱచిన కమసాలులను నందులకుఁ దోడైన శూద్రులను శిక్షింపవలసినదని గురిజాల స్టేషనరీ సబ్ మేజస్ట్రేటుకోర్టులో ఫిర్యాదుచేసి తత్ప్రకారము ఋజువుచేసితిని. ముద్దయి లందుపై మత్ప్రభృతిబ్రాహ్మణుల యంగీకారముతోనే యీపని సలిపితిమని వాదించి యాకోర్టువారి నెట్లో ప్రసన్నులఁజేసికొని శిక్షితులుగాకయే తద్వ్యవహారమునుండి విముక్తులైరి. తరువాతఁ దద్దేవతాశిలలు పునఃప్రతిష్ఠితములైనఁగాని బ్రాహ్మణులకుఁ బూజార్హములుకావుగనుక తత్ప్రతిష్ఠకగు వ్యయమా కమసాలులచే నిప్పించుచు నెన్నఁడు నిట్టిపనిచేయకుండ శాశ్వతమైన యింజక్షను దయచేయవలసినదని నర్సారావుపేట డిస్ట్రిక్టుమునిసిఫుకోర్టులో దావావేసితిని. ఆదావా యచటనే రెండుమూడువత్సరములవరకు

విచారింపఁబడక యుండియుండి తుదకు గుంటూరు డివిజనల్ డిస్ట్రిక్టు మున్సిఫుకోర్టునకుఁ డ్రాన్స్ఫరై క్రమముగా విచారింపఁబడెను. విచారణలోఁ బ్రతివాదులు "వాదివర్ణస్థులే బ్రాహ్మణులు కారు కాని మేము బ్రాహ్మణులమేయని వాదించుటయేకాక గ్రామదేవతలు బ్రాహ్మణపూజ్యములు కావనియు వాది మొదలైన బ్రాహ్మణులెల్లరుం దత్ప్రతిష్ఠాకాలమందుండి యిష్టపడుటచేతనే చేసినారమనియు నింకను నేమేమో కొంత పరస్పరవిరోధముఁ గూడిన తత్సాక్ష్యముం బోగుచేసిరి. అడిషనల్ డిస్ట్రిక్టుమున్సిఫుగారు రామబాలగోపాలము స్పష్టమైన "బ్రాహ్మణులెవ"రను నంశమును జాలదూరము చర్చించి తద్బ్రాహ్మణత్వమును బుట్టుకను బట్టికాక గుణములవలననే నిర్ధారణ చేయుచు జనులందఱుమట్టుకు వాదిసంఘమువారిని బ్రాహ్మణులుగా నెంచుచుఁ బ్రతివాదిసంఘమువారి నట్లెంచకపోవుటయేకాక నీచముగాఁగూడఁ జూచుచున్నారనియు గ్రామదేవతలు బ్రాహ్మణార్చ్యములు కావుగనుక తత్పునఃప్రతిష్ఠ యనవసరమనియు నందువలన వాదికిఁ దత్ప్రతిష్ఠావ్యయ మిప్పింప నక్కఱలేదనియుఁ దీర్మానించెను. తదుపరి జిల్లాకోర్టులో నపీలుచేయఁగా జడ్జిగారు వాదిసంఘమువారే బ్రాహ్మణులనియుఁ బ్రతివాదిసంఘమువారు సంకీర్ణసంకరులైన రథకారులనియుఁ దీర్మానించుచు గ్రామదేవతలు బ్రాహ్మణపూజ్యములు కావనువిషయములో మట్టుకు క్రిందికోర్టువారితో నేకీభవించితత్పునఃప్రతిష్ఠావ్యయాదికము నా కీయఁజేసినవాఁడుకాఁడు. స్వర్ణకారవ్యవహారమనఁగా నిది. ఇక్కార్యము ప్రతివాదులు సంకల్పించినది మొదలు జడ్జికోర్టు తీర్మానముపర్యంతము జరిగిన యావద్వృత్తాంతమును విచారణక్రమము,నుభయవాదుల సాక్ష్యములు నుభయన్యాయస్థానముల తీర్పులు మొదలైనవి చేర్చి స్వర్ణకారవ్యవహారమనుపేర నొకచరిత్ర పద్యశైలిలో లిఖించితి. ఇది మతసంబంధమైన వ్యవహారమై బ్రాహ్మణ్యమునుగూర్చి పోరాడఁబడినదగుటవలనఁ బ్రతివాదులు తమరు బ్రాహ్మణులనుటకును నాసంఘమువారు కారనుటకును ననేకగ్రంథాభాసములఁ గనఁబఱచుటయుఁ దద్విషయములన్నియు ననేకశ్రుతిస్మృతిపురాణేతిహాసయుక్త్యనుభవహేతుచరిత్రప్రదర్శనపురస్స

రంబుగ ఖండింపవలసివచ్చె. ఇంకను బ్రస్తావానుగుణముగ ననేకధర్మ రహస్యములు దెలుపంబడియె. కనుక నీగ్రంథము కేవలము కమసాలు లకును నాకును నడచిన వ్యవహారక్రమమునే తెలుపునదికాక యనేక ధర్మసూక్ష్మములు దెలుపునదికూడ నైయున్నది-ఇందుఁ గేవ లాసత్య ముతో నిండియున్న కమసాలులయొక్కయుఁ దత్సహాయులయొక్కయు వాక్యములు ఖండింపఁబడుటయేకాక ధర్మవిరుద్ధములైనప్పుడు న్యాయా ధికారులతీర్మానములు సైతము విమర్శింపఁబడియున్నయవి. కమసాలులు మేము బ్రాహ్మణులమని ప్రతిగ్రామమందును బ్రతివానితోడను వృథా కలహములాడు నీకాలమునఁ దద్వాదములు శ్రుతిస్మృతిపురాణేతిహాస యుక్త్యనుభవహేతుచరిత్రప్రదర్శనపురస్సరంబుగ ఖండింపఁబడియున్న యస్మత్పద్యంబులతోడను వీరు బ్రాహ్మణులు కారనియు సంకీర్ణసంకరు లైనరథకారులనియుఁ జేయఁబడిన జడ్జితీర్మానముతోడను గూడియున్న యీగ్రంథము ప్రతిగ్రామమందును బ్రతిమనుజుచేతను నుండువరకు లీలమైఁ దత్స్వర్ణకారవాగ్బంధము చేయుటకేకాక యనేకధర్మసూక్ష్మ ములఁ దెలుపుటకుఁగూడ సాధనమగుచున్నయది. ఇట్టియుపయోగకర మైన యీగ్రంథము సరిగాఁజదువకయుఁ జదివియు నవిమర్శకులును ననూయాగ్రస్తులును నయియు ననాదరముఁజూపు పండితంమన్యుల కనేకవందనములాచరించి యన్యవిషయమును ముచ్చటించుచున్నవాఁ డను. మఱియు నీగ్రంథమునఁ బ్రధానాంశము స్వర్ణకృద్బ్రాహ్మణ్య ఖండనమైనను బ్రస్తావానుగుణముగ నార్యసామాజికులు బ్రహ్మసామాజి కులు మొదలైన సంఘసంస్కారులమనుకొనువారి వాదములుకూడ రజస్వలావివాహఖండనాదిరూపమున నిరస్తములైయున్నయవి. చరిత్ర యంతయుఁ బద్యములతో వ్రాసి పద్యస్థవిషయముల బుజువుచేయుటకుఁ గ్రిందఁ జిన్నయక్షరములలో శ్రుతిస్మృతిపురాణేతిహాససూత్రభాష్యా ర్యోక్తిచరిత్రనిఘంటువులు పెద్దమనుష్యుల యుత్తరములు ధర్మాధి కారుల తీర్మానములు తత్సముఖమునఁ జెప్పబడిన సాక్ష్యములు మున్న గునవి యుదాహరింపఁబడియున్నవి. ఏవిషయము నేదిబుజువుచేయువ లెనో యావిషయమునకును దానికిని బెట్టఁబడిన సమమైనగుర్తులను జూచుకొని చదువరు లిందలియభిప్రాయమును గుర్తెఱుంగుదురుగాక.

## శ్రీసోమేశ్వరాయనమః

## స్వర్ణకారవ్యవహారము—ప్రథమభాగము.



శ్లో॥ రాజానో ర్థపరాయణాః కపటినో, విప్రా వికర్మస్థితాః
భార్యా భర్తృషుబద్ధవైరనిరతాః, పుత్రాః పితృద్వేషిణః
నిస్సారా పృథివీ నిరౌషధిలతా, నీచా మహత్త్వంగతాః
ఇత్యేవంసముపస్థితేకలియుగే ధర్మో వనాంతంగతః (ఆర్యోక్తిః)

ఉ॥ *అంతయునొక్కటే, సృష్టియు, నంతయు నీశ్వరావతారులే
యింతప్రపంచనాటకము వేయఁగబడ్డది యంతెకాని యా
వంతయుఁ గానరాదుభిద యాత్మవిచారణచేసిచూడఁగా
నింతటిదానికేలా మన కెక్కువతక్కువలంచుఁ బోరుటల్॥ 1

ఉ॥ నాటకవేషధారులకు నాటకకర్తవిధించినట్టి యా
బాటనెవెళ్ళుచుండుటది పథ్యము, జానకివేషమూనుచున్
దాటకచైదముల్ సలిపి తజ్ఞులసంతసపెట్టుచుంట యె
చ్చోటనుజూచియుండము వసుంధరలోపల నెన్నఁడేనియున్ ॥ 2

ఉ॥ వేషమునిర్ణయించి యటువెన్కను దానికినుండఁదగ్గవౌ
భాషలుభూషలున్ మొదలు ప్రాజ్ఞులుచెప్పిరి యంతెకాని యా
భూషణభాషణంబులనె పూర్వముచెప్పి తదర్హమౌనటుల్
వేషమువేయనౌననుట విన్నదికన్నదికాద యెంచుసన్ ॥ 3

ఉ॥ ఇత్తెఱఁగాది వర్ణభిదయేర్పడి యూపయి వర్తనంబు లు
త్పత్తినిజెందియుండుటది తథ్యముగాఁగను, బ్రస్తుతంబునన్

---

* శ్లో॥ మృత్పిండఏకో బహుభాండరూప స్సువర్ణమేకం బహుభూషణాని
గోక్షీరమేకం బహుధేనుజాత మేకఃపరాత్మా బహుదేహవర్తీ
(ఇత్యభియుక్తాః)

(1) వృత్తులుముందుపుట్టి యటువెన్క నుజాతులుపుట్టినట్లుగాఁ
బొత్తములన్ లిఖించుటకుఁబూనిరి బుద్ధిమదగ్ర్యులెందఱో॥ 4

క॥ 2మనుధర్మశాస్త్రవాక్యము జనులకి విశ్వాస్యమంట,సత్యమఁటయిహి
తనధర్మశాస్త్రవాక్యమె కనుఁ డాంధ్రచరిత్రకారు ఘనమగును క్రిన్

ఉ॥ ఇంతియె కాక వర్ణభిద లేలయటంచు వివాదసల్పుచున్
బంతముమీఱఁ బంచములఁ బంక్తినినుంచి భుజించుచుండి రీ
యంతకమేమనందుఁ "గలియైదుసహస్రము లేగుమీఁద నా
నంతయువర్ణసంకర" మటన్నది నిశ్చయమైకనంబడన్॥ 5

ఉ॥ ఇట్టివి పెక్కులున్న వవియెందుకు వ్రాయను
న్నట్టిచరిత్రకున్ వలయునంతయె కావలె నాకు*సీమహా

---

(1) హిందూదేశకథాసంగ్రహము, ప్రథమభాగము ౬౧ పుట

బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్రులను నాలుగుజాతులీకాలమునందే యేర్పడినవి వేదమంత్రములరచించినఋషులసంతతివారును వేదాధ్యయనముచేసి యజ్ఞయాగాది క్రతువులుచేయువారును, జేయించువారును, అరణ్యములలోనివసించి పరతత్వవిచారము చేయువారును బ్రాహ్మణులయిరి. దస్యులు మొదలగుశత్రువులదండించి రాజ్యములుస్థాపించినవారు క్షత్రియులయిరి. వ్యవసాయము మొదలైనవృత్తులలోనున్నవారును, వాణిజ్యముచేయువారును నగు నితరార్యులందఱును వైశ్యులైరి. ఆర్యులవలనోఁ బడిన యనార్యులందఱును శూద్రులుగానెంచఁబడిరి, ఇట్లు మొట్టమొదట గుణకర్మములననుసరించి వర్ణవిభేదమేర్పడినది.

2 ఆంధ్రులచరిత్రము, ప్రథమభాగము ౧౭౬-౧౭౭ పుటలు.

...వృత్తులనుబట్టి కులభేదములేర్పడినవిగాని కులభేదములనుబట్టి వృత్తులేర్పడియుండలేదు.... మనుస్మృతియందుఁజెప్పఁబడినభేదకారణములు కేవలము కల్పితములుగాని స్వాభావికములుగావు గనుక నవి యెంతమాత్రము విశ్వసింపఁదగినవికావు.

* శ్రీప్రౌఢసరస్వతీనిరూఢము.

క॥ ప్రాచీనసదాచార స । మాచారప్రవణతనిట ననియెదనుడి వి
ద్యాచాతుర్యాభినిధీ । సాచివ్యముగాఁగ దీనిఁజదువుఁడు సదయుల్! ॥ 8

ధట్టుల వ్రాతలన్నిటికిఁ దగ్గజ వాబిడఁగా నలంపురిన్

చ॥ “ కలిమికులాలమింపఁ ” డనిక్రాలెడినానుడి నేఁడు రేఁపు ని
ట్టలముగ బట్టబైలగుచు డంబడరెం బహుభంగులం బ్రచా
రలలితి వర్ణసంకరపు రాణ ధనాధిక రాజకీయకా
శలులగు నాంధ్రవిప్రముఖజాతులనీతుల యీతి పెంపునన్॥ 4

క॥ కొందఱుమా గ్రాజ్యేటు ల । మందాజ్ఞత సంస్కృతాంధ్రమానముగన కం
దండవిధుల నచ్చొత్తిం । పం దలరిరి, వారికొఱకుఁ బట్టితిఁగలమున్ 5

మ॥ స్వసదాచారము లెల్ల మానికొని విప్రవ్రాత మంత్యోద్ధ దు
ష్టసమాజాంబుధిఁబ్రుంగి శాస్త్రిముల నిచ్ఛాయుక్తిసిద్ధింప రా
జసమంచద్గతి యెట్లుకగ్గునొ సుధీసామ్రాజ్యధౌరేయతా
ప్రస్ఫృతింగాంచరు గ్రాజ్యుయేట్లు, తలవోవం బాహువుల్ నిల్చునే 6

మ॥ విడోమ్యారేజుసొసైటి కాంగ్రెసును కాన్ఫ్రెన్సస్సేవన్ సహో
సెడిషన్ బాంబును సీవయేజిక్రృతి నిస్సేహిందులాయర్సు హై
రెడుకేషన్‌గని తేటిహూణకలలం దెంతేని ద్రవ్యంబు జా
తి దుబాయించెడిచెడ్డత్రోవనిడ నేదీ ధర్మకర్మం బిటన్॥ 7

సీ॥ విధవావివాహంబు విధిబోధితంబఁట, స్త్రీవిద్య పూర్వసంభావితమఁట
ఋతుమతీసతి పెండ్లి స్మృతిచోదితంబఁట, స్త్రీస్వతంత్రత శాస్త్రసిద్ధమంట
నౌయాన మాద్యులుచేయుచుండిరఁట, హూణమ్లేచ్ఛదేశాటనము తగునఁట
జాతినీతిభిద దురీతులకిక్కఁట, ఏకమత్యము దానఁ జేకురదఁట
ఇట్టిదుష్టోహ లధవుల కెఱుకపఱచి । శాసనంబులకై పోరసాఁగెదరఁట
బ్రాహ్మణబ్రువగ్రాజ్యుయేట్ప్రతతిలోనఁ । గొంద ఱస్మజ్జనులు, వీరిగొనముగనుఁడు 8

క॥ అటువీరియభిప్రాయము । తటుమననంగీకరింత్రైధర్మప్రభు, ల
క్కట యేమిబుద్ధియిది, వా । రటశాస్త్రజ్ఞులఁ బిలచియడుగ, రగు, బళే॥ 9

క॥ గమగచ్ఛటుగోగ్రిజ్యే । ట్లు మహాశాస్త్రజ్ఞులగతి లూలా మాలా
లమరింప రాజాలే వా । నిమదింగై కొందు ర్కగణింపుఁడుధీయల్! 10

బట్టెఁ బ్రతిజ్ఞ యొక్కరుఁడు "ప్రౌఢసరస్వతి" యన్ బుధుండహో ॥ 6

ఉ॥ జాతిని నీతి నేకముగ సల్పిన నైక్యము హిందువుండలీ
ఖ్యాతిఁ బ్రవృద్ధమౌనఁట, యహో! మనవర్ణము నాశ్రమంబు వి
ద్యాతతి వావులున్ వరుస లంతము నొందును దాన, గ్రాజ్యుయే
ద్రావ్యతము శాస్త్రభీతి దెగ శ్రాద్ధముఁ జిడిపింప నింపగున్ ॥ 20

ఉ॥ "స్త్రీలకు విద్యనీయఁదగు స్త్రీలయ దేచ్ఛత సిద్ధిగాఁదగున్
స్త్రీలకు షోడశాబ్దములఁ జేయఁదగుం గరసంగ్రహంబునున్
స్త్రీలకు, బెక్కు పెండిలులు స్మృత్యుదితంబు" లటంచు దర్మతిన్
గ్రాలిరి గ్రాజ్యుయేట్ద్విజులు కాలవిపర్యయ మేమిచెప్పదున్ ॥ 21

క॥ పేడయు బెల్లము నేకం । బై డంబడరినవిధంబు నమ్మయుఁ బెండ్లా
మోడకరయొండెనకరణిఁ । బోడలు గ్రాజ్యేట్లుగనిరి పుంస్త్రీ విభిదల్ 22

పృథ్వి॥ స్వమాతృపితృదూషణాస్పదత భూసుర గ్రాజ్యుయే
ట్సమాజ మిటుసంచరించ నృపగౌరవంబింక నే
క్రమానఁగనుగొందు, రార యిదిగాన లేరన్న! పూ
ర్వమౌనివిధినిగ్రహాగ్రహులకేడ జ్ఞానస్థితుల్ 25

క॥ దుర్గతినీ గ్రాజ్యేటు ల । నర్గళతఁ గురాను బైబిలాద్యాచారో
న్నిగ్రతులైనఁ ద్రిశంకు । స్వర్గ మొకదవీరికింక వలయు నవనిలోన్ ॥ 26

ఉ॥ తాము కులాదినిష్ఠలను దత్తజలాంజలులౌట చాలదా
యేమిటు గ్రాజ్యుయేట్లగుణ మిట్లు, పురోహితముఖ్యవిప్రులన్
వేమరుఁ గూటికిం బిలచి వేడిషె మేపనుభీతిజూపు, బౌ
రా! మఱి రాజు లేకనరొ భ్రష్టనవీనకృతిప్రకాండముల్ 27

ఉ॥ బొంబయియాంధ్రపత్రిక "విభూతికరం" బని రండ పెండ్లి నా
లంబనఁ జేసి స్త్రీవిషయలంపటతం బళి! గ్రాజ్యుయేటువ్యా
సంబుల భర్తృయుక్తసరసంబుగ నట్టివకొన్ని యన్నెముల్
ఘంబిన వేడ్క నెల్లపుడు వ్రాసెడిఁ గంటిరె, యిద్దియద్దియే 29

తే॥ మఱియు నీ నూత్నమతముల మార్పుకొఱకు

---

ఉ॥ వీనిన గ్రాజ్యుయేటు లతివిస్మయచర్యల నైక్యమౌట లో
కానకు రాజ్యపద్ధతికిఁ గశ్మలముల్ ఘటియించు నంచు దు
ర్మానవిహారభంగముగ రాజులు శాసనపంక్తి శాంతి నెం
తేనొనరింతు, రద్దియును దెల్వికిఁ దేరిడియేమి కార్యమో॥ 31

శా॥ మీయుద్యోగధనాలు నిత్యములె॰ యేమీ గ్రాజ్యుయేట్లూ! మహా
న్యాయోపాయత "జైలునందిడుదు" మండ్రా? బాఁపలన్ శ్రాద్ధజ
గ్ధ్యాయత్తేతరులైనయంత, నివియే నా యైకమత్యస్ఫుర
ద్వ్యాయామంబులు? బోడబాఁపలను దెంపంబల్కుటల్ చుల్కయే? 32

క॥ మ్యారేజాక్టురుపూర్యాబ। శ్రీ రామాయణము నిటఁ గడిందిమగంటిమిన్
వేరచియించిరి మదరా। శిరస వాల్మీకి జాతిసిద్ధులు? గంద్రే? 33

క॥ తమ కెదియవసరమో శ్రుతి। సుమహితులుగ దానిఁ గొండ్రుసూ వాదముకై
గమనింపరు, వేదము శాస్త్రము నీ గ్రాజ్యేట్లు మానధనులై కంద్రే? 34

సీ॥ ఇంగ్లీషుసంస్కృత మెఱిఁగినవారలు దెలియుఁడీ గ్రాజ్యుయేటుల తెలువులు
"డ్యూరింగుబుతు"వను సార్థ మొకట వివాహకాలమున నె వఱలునంట
మెన్‌స్ట్రుయల్ డిస్చార్జి మీనింగు సంస్కృతభాషను రజసినాఁ బరఁగునంట
"చంద్రగంధర్వవైశ్వానరాంతము సతిబుత్వంత"మని శాస్త్రతత్త్వమంట
అగ్ని సంతతి సంపదలమరినట్టి। చెలిని వరునకుఁ బెండ్లికై చేర్చునంట
ఇదియ గృహ్యోక్త మాట వీరలెఱిఁగినదియ। మ్యారెజాక్టురుపూర్యాబర్ట్ మానమునను 35

సీ॥ విధవాబుతుమతీ వివిధవివాహాల ధర్మముగూడఁ బెట్టిరి గ్రాజ్యుయేట్లు
స్త్రీస్వతంత్రతఁ గలాభాస్వరతను సద్ధరతిఁ జూడఁబట్టిరి గ్రాజ్యుయేట్లు
చంద్రగంధర్వవైశ్వానరకామపుత్రతఁ గూడఁ బుట్టిరి గ్రాజ్యుయేట్లు
దేశాంతరవిహారధీస్థితి స్వర్గమార్గము నూడఁ గొట్టిరి గ్రాజ్యుయేట్లు
వేదశాస్త్రపురాణహల్యాణాది గీర్వా। శేషభాషాంతరీకరణాకలితత
లలిఁ జతుర్విధపురుషార్థములు భరించి। ప్రాజ్యసామ్రాజ్యపతులైరి గ్రాజ్యుయేట్లు 36

క॥ పారస్కరహారిహరమత। మేరూఢిఁ జతుర్థరాత్రిమిథునకృతికి ధీ
సారార్థము విప్రులకు-స। మీరితమగుకతన గ్రాజ్యుయేటులకొదవున్ 37

## పత్రికాస్థాపనమెచేయఁ బాటుపడెడి

క॥ మానవసూత్రంబెట్టుల। మానంబగు? నేమివిధిగ మఱియు మనుస్మృ
త్యావయనముధర్మస్థితి। నూనను గలి, గ్రాజ్యుయేడనూ నాకాంతుక్ 38
క॥ బౌధాయనముక్ సూప్యరియ। పై ధారుణి గ్రాజ్యుయేట్లుకలరెడి. వికటా
సాధారణతత్వజ్ఞా। నాధారము గాఁగఁ, జూడుఁడా తత్వజ్ఞుల్ ! 39
చ॥ కులములు గోత్రపంక్తు లనుకూలముఁ జేయుచు లోక మెల్ల నా
కులములనార్చి "వావు" లనుక్రూరపథంబులుమాపి శ్రాద్ధపీ
డలఁదోలఁగించి దీక్షలవిడంబితచర్యల వేద దేవశ్రం
ఖలములనూడఁగొట్టెదరు గ్రాజుయెటు ల్వరమోపకారులై 40
క॥ "సోషల్ రిఫారు" మని యిం।గ్లీషుఁజదివినట్టివిప్రకీర్తులిటం గాం
తైపుణనమ్భతచర్యల। నీపల్లజ్జ నెడదనిడ నెంచ, రయారే 41
క॥ కాస్మాపొలిటక్ క్లబ్బున। బిస్మిల్లాలగుచు ధర్మవిరహితులగు వి
ప్రస్మయయు గ్రాజ్యేటు ల। పస్మారముగొనిరి బుద్ధిబలము దలఁగఁగక్ 42
క॥ ఇట్టిసమాజంబులు బలు। పట్టుగ సమజంబులగతిబరఁగఁగ ధర్మం
బెట్టగుఁ దుదముట్టక, మన। పుట్టుకలకుఁ గారణంబుఁ బొడఁగనుఁడార్యుల్ ! 43
ఉ॥ ఎవ్వఁడ నెట్లువచ్చితిని, యెచ్చటనుండి యిదేమి దృశ్యమా
టెవ్విధి నైహికంబరయ నెచ్చటికింకను నేగఁగావలెక్
దెవ్వదియెంత యేపథము దానినిజూపెడివారలెవ్వరం
చివ్వడువుంగ నాక వృథనేగుచునుండిరి గ్రాజ్యుయేడ్విజుల్ 45
శా॥ శ్రీవిద్యాదికుకర్మలంబడినవారిక్ లెక్కసేయంగ నా
రా వేలురదురు గ్రాజ్యుయేణ్ముఖులు దుర్వారార్థసామర్థ్యసం
భావస్థైర్యత, నేనిటొక్కఁడను, నావారెవ్వరేనుందురో
నావాదంబును నిల్వఁద్రొక్కుటకు శ్రీనారాయణుండేనొకో? 46
ఉ॥ ఒక్కఁడనంచు నేభయమునొందను, భూమికినాథుఁ డొక్కఁడే
పెక్కురుగారు, దద్విధిగ విశ్వసృజస్థితినాశుఁ డొక్కఁడే
నిక్కము, సత్యపద్ధతికి నెమ్మి సహాయముడేల, బేలలై
తిక్కతనాననన్నటులఁ దెల్వినిబూనిరి గ్రాజ్యుయేడ్విజుల్ 4

## ప్రాజ్ఞులైనట్టి మల్లాది రామకృష్ణ

ఉ॥ “ఇక్కవితాచమత్కృతుల నీశ్వరసంస్తుతిభవ్యకావ్యమం
దక్కట వేదదేవవిషయామలఫక్కిఁగ నేర్చి కూర్పరా
దెక్కొ”యటంచుఁగొందఱు మనోంబుజముల్ గమలింత్రు కాంత్రైనా
కెక్కువ వేదశాస్త్రమతమే స్థిరమౌటను దీనినూనితిన్ 48

సీ॥ వేదశాస్త్రపురాణవిహితాచరణలేక ధర్మంబుగాదు నే కర్మఠునకు
విద్యావినయనయవృతసృపత్వము లేక యర్థంబువొసఁగు నే వ్యర్థగతికి
రూపయౌవనధనరూఢాంగములు లేక కామ మొప్పారు నే పామరునకు
షరససాధనచతుష్టయసంపదలు లేక మోక్షంబు దొరకు నే రూక్షమతికి
వీనిలోపల నాద్యంతమూనలేక మధ్యమునఁజిక్కియేద్తు రమేధ్యభుజులు
గ్రాజ్యయేట్పదవులె శాశ్వతేజ్యములుగ నైకమత్యార్థతత్వంబు నరయలేక 49

శా॥ తత్వజ్ఞానముఁబొంటె ధర్మములసంధన్ గ్రాజ్యయేట్ఛ్రిద్ధభో
క్తృత్వాదిన్ విడిపింప సంఘమున నర్థిఁబల్కి యన్యోన్యచో
రత్వప్రక్రియఁగూల్చి కేగిరఁట, యౌరా “బ్రాహ్మణానామ నే
కత్వ”న్యాయము సార్థకంపడఁగ నిక్కర్ణాలుదుర్యాజకుల్ 50

క॥ వేదగురునృపాచార స్వమాదరణము లేనివారి కలరు నెమానం
బేదాటినైనఁ బ్రాహ్మ, ర్యాదాతిక్రమణ తగునె గ్రాజ్యేటులకున్ 52

క॥ బంధురధీసింధువు లను, బంధాంతముగాఁగదీని పరమార్థము పు
ష్పంధయసమసంధ సురస్వముం ధరియింపఁజదివి గొనమునుగనుగొనుఁడీ 54

క॥ మెదలితిరా గ్రాజ్యేట్లుగఁ బొదలితిరాజాతినీతిఁ బూర్ణము సేయన్
బ్రిదిలితిరాకూటమునుం,డి దయామయులార! కరుణనిల్పుఁడు మాపైన్ 55

శా॥ గ్రాజ్యేట్లట్టులసంస్కృతోద్ధతిని నగ్రత్వంబుసూనంగ ము
త్పాప్రిజ్యత్వంబువహింతు రేని తమశాస్త్రార్థంబు మాతోడ వి
ద్వజ్యేష్ఠత్వముఁబొంటె సల్పుటకు నిల్వన్ రందు మీమీపదా
గ్రజ్యోత్స్నల్ దశదిక్కులంబఱప, వ్యర్థప్రజ్ఞ లిక్లేటికిన్ 56

సోమయాజులు గుంటూరుసీమయందు 8

సీ॥ సంస్కృతశాస్త్రవచఃప్రౌఢిఁ బ్రౌఢసరస్వతీపదవి దర్పంగను గని
యార్యసమాజి దయానందు వాదాన నుంకించుసద్యశోయుక్తిని మని
బ్రహ్మవిద్యాపత్రపతివిజృంభణము నల్లనఁ జల్లపఱచెడులాగును గొని
కోమటిమున్సీభుకోలాహలము వైదికాచారవిషయాన నార్పఁగఁజని
వేదశాస్త్రపురాణవివాదగరిమ మఱి థియాసఫిబ్రహ్మసమాజగులను
జఱచి శ్రీకుమారస్వామిశాస్త్రియనఁగ నిట నలంపురి ధర్మకర్మహానిలతు 57
శా॥ ఇంగ్లీ పర్వము దెన్గు సంస్కృతము నా హిందీమరాటుల్ గణిం
పం గ్లానింబడి తేటి సద్గురుకృపామాత్రాశ్రయైకాప్తి నే
నాంగ్లో సాక్సను లాటినుల్ స్వమహిమోద్యచ్ఛక్తి సాధించి పే
ర్మిం గ్లాసామ్యము నుర్వి విప్రములవార్ధింగంటి, నక్ వింటిరే 58
శా॥ టీగ్రాజ్యేటులఁజూచి కోమటులు నల్లే కంసలుల్ రెడ్లు గ్రా
ఛగ్రీవుల్ మఱి సాలెజాండ్రలును నెవ్వారెవ్వరో వేదము
ష్టిగ్రాహంబున నార బ్రాహ్మణులకంటెక్ దొడ్డవారౌటకై
వ్యగ్రోత్సాహతనోటు దుశ్చరణకృత్యంబుల్ ప్రపంచింతురా 59
క॥ ఈవాదముఖండించుటకై వినుఁ డీభారతమునఁగా దిఁక నింగ్లం
డో వేల్సో పోవఁయును, గావున సన్మార్గమరయుఁ గ్రాజ్యేటిమిత్రా! 51
మ॥ ఇది మీ బోధకు వ్రాసినాఁడనుసుడీ యేగ్రాజుయేట్లూ! గుణా
స్పదులై యింతట సంఘసంస్కరణలంజాలించి సద్బుద్ధి శా
చదయా మైత్రులఁ జిత్తమందు సుకృతిక్ సాధింపఁగోలించి భూ
విదితంబై తగు వేదశాస్త్రమతముక్ విద్వద్గతిం గాంచుఁడీ 52
క॥ మంగళములు గ్రాజ్యేటులకుం గలుగుత మంచిత్రోవగొని పూర్వాచా
రేంగితము నెలంగ నడచుమ్మం గురుదేవకరుణను విశుద్ధివడయుతక్ 53

---

శ్లో॥ వ్యాకరణజ్ఞావ్యరుపున్యాటిబర్టీ ఖండనంతను వే సుధీః
శ్రీకుమారస్వామిశాస్త్రీ త్వహంప్రౌఢసరస్వతీ
అథ కథావిధి మవధారయంతు సుధియో యత్రైకేచన పరేజ్యాశీలలాలసాః

క॥ కావున నావలికథరుఁ

గ్రాజ్యేయేడభిధానవిధానాః క్షితిదితిసుతానా మృతుమతీసతీపరిణయనం నయాభి
నయవతయా బంహిష్ఠయా వాచా తత ముదితవంతః ప్రత్యవతిష్ఠంతే......మ్యారేజాఫ్
టరుప్యూబర్టీనామకేన పుస్తకేన,తత్ర*“సోమః ప్రథమోవివిద”ఇతిమంత్రస్థవిద్యారణ్యభా
ష్యమేవగృహీత్వా “మనుజాయథర్తేర్ధనపుత్రైస్సహితా మిమా మగ్నిః ప్రాయచ్ఛ”
దితివాక్యాత్ “రజస్యగ్ని”రి త్యత్రవచనస్యచ, Menstrul. discharge, ఇత్యర్థం
కృత్వా యథాకథంచిదపి స్వమతం పిసాధయిషంతశ్చ-తత్ర యద్యాచార్యభాష్యస్యాశ
యో ఋతుమతీవివాహపరస్స“న్నగ్ని ర్ధనపుత్రైస్సహితా మదా”దిత్యభవిష్య త్తదా
పురుషస్య వివాహోనావశ్యం భావేన సంస్కారా స్స్యాదిష్యత్ - ప్రథమే వివాహ
ఏవ పుత్ర ఉపస్థితే పున్నామనరకనివృత్త్యుద్దేశక ఋణమేవ నాసేత్స్యత్- తథా సం
స్కారపరిగణనే గర్భాధానపార్థక్యమపి నాభిప్రైష్యత్ -అపిచ,రజస్వలాందత్వా రౌర
వ మిత్యా ద్యర్థవాదఏ”వే త్యేతేషాం మనీషా నవైవిదుషాం......మీయతే- తథాచే
ద్బహుసూత్రమంత్ర,భాష్యవ్యాకోపప్రసంగః-అర్థవాదస్యానైకత్వం, తస్య...బహుధా
శాస్త్రైర్విహితత్వాత్- కోసా వమీషా మర్థవాదో ప్యత్ర? “శాస్త్రంచాత్ర ప్రవృత్తం
స త్ప్రవృత్తింమరుతేద్విధా విధానేన నిషేధేన శృంగగ్రాహికయాస్తుత” దితి- “సత్యే
కస్మిన్నపిబాధకే సాధకసహస్రస్యాప్యకించిత్కరత్వా” దిత్యాదిన్యాయేన బహువ్యభి
చారదర్శనా దేతేషాంమతం నవిద్వన్మనీషితం, శిష్టాచారోరరీకృత న్యాయమార్గదుష్ట
త్వాత్ -క్వచి దుదీచీనేషు శిష్టాచారపారంపరీణో ప్యాంధ్రాదిపంచద్రావిడే ష్వనను
భూయమానత్వాచ్చ- తత్తేషామేవ దత్తసూత్రమంత్ర భాష్యాణాం తుష్యతుదుర్జన,న్యా
యే నాంగీకృత్య విఖండయంతః పండితమండలీ మభిమండయామో యథార్థసంభావ

......*“సోమః ప్రథమోవివిదే, గంధర్వోవివిదఉత్తరః, తృతీయోగ్నిష్టేపతి
స్తురీయస్తే మనుష్యజాః” ఇతిమంత్ర......అర్థః సోమః ప్రథమః త్వాం వివిదే లబ్ధవాన్
తతః ఉత్తరో గంధర్వో విశ్వావసుః వివిదే,తృతీయ స్త్వగ్ని స్తేపతిః,మనుష్యజాత
స్త్వహంతే తురీయః పతి రితి.

“సోమో దదద్గంధర్వాయ గంధర్వో దదదగ్నయే, రయించ పుత్రాగం శ్చా
దాదగ్నిర్మహ్య మథోఇమా”మితిమంత్ర......అర్థః-సోమః గంధర్వాయ, అదదత్...
గంధర్వః,అగ్నయే,అదదత్ -అగ్నిః,అథో,అథ,రయించ, పుత్రాంశ్చ,ఇమాం త్వాంచ
మహ్య మదదాత్...

...ప్రవర్తమానాస్త్వితి

బోవుద, మేనునిన, నాదిపురుషుడు స్వేచ్ఛా

నేన......రజోదర్శనానంతర వివాహవిధిస్తు క్షత్రియ......శూద్రాదీనామేవేతి ప్రకృత్య కించి త్తత్తదవసరఏవ నిరసన మతిసంగృహ్య క్రియతే, తథాహి......

(4) సూ 2-1-10 "అగ్నేరుపసమాధానా ద్యాజ్యభాగాంత" ఇతి "సోమః ప్రథమోవివిద" ఇతిమంత్రభాష్యే కన్యాయాః హ్లాదకత్వ మోహనత్వ తేజస్త్వవర్ణన రూప సోమగంధర్వాగ్నినామగ్రహణపరమేవ, నైవకన్యాయాః పూర్వపతిపరిగణనపరం తత్ర రూపకాలంకారస్య ప్రమేయత్వాత్, తథాహి, "నహి వేదే సర్వేశబ్దా రూఢా" ఇత్యారభ్య "తాస్తా హ్లాదిన్యో మోహిన్య స్తేజస్విన్యః కలా స్సోమగంధర్వాగ్నిరూపిణ్యః స్త్రీ ష్వావిశేశవ మధీ" త్యాది నిరుక్తవచః ప్రామాణ్యస్య సిద్ధత్వాత్, సోమస్య హ్లాదకత్వం గంధర్వస్య "గంధమామోద మర్ప" తీతి వ్యుత్పత్త్యర్థధాతో రచి "గంధస్యార్వో గంధర్వ" ఇతి షష్ఠీతత్పురుషసమాసే కృతే శకంధ్వాదిగణస్యాకృతిత్వా త్పరరూపం మోహనత్వ మగ్నే స్తేజోవత్వంసుప్రసిద్ధమేవేతి, యత్కించిత్ "తుష్యతుదుర్జన" న్యాయగ్రహణేనాపి ప్రకృతే నకించిదపి ఫలం భవద్రజోవతీవివాహవాదబలపరమిత్యలం,

(5) సూ 2-1-11 "అథాస్యైదక్షిణే" నేతి "గృభ్ణామిత" ఇతిమంత్రభాష్యే కన్యాహ స్తంగృహీత్వా వరవచనపరం "మహ్యం త్వా పూర్వోక్త సోమగంధర్వాగ్నయో న్యేదేవావా గార్హపత్యార్థం భోగార్థంవాదు" రిత్యేవ- గార్హపత్యకృత్యే కింభవన్మతర్తుమ త్యభీష్టా

(8) సూ 3-8-9*"తయోశ్శయ్యామంతరేణ" ఇతి. ఉదీర్ష్వాతో విశ్వావసు" వితి మంత్రభాష్యే దండరూపగంధర్వేణసహ ఉనునయసంభాషణం-తత్తు వివాహసమయే తత్తేద్వృగత్సవాదిషు మోదసంపాదకమితి నజానీషే? తదప్యత్రాధైకశయ్యాయాం 2 హ్వ్యాపునుమంగలీ ష్వాపస్థితాసు బహుసంబంధిబాంధవేషు చ సత్సుకిల? నత్వేకాంతే. తథా సత్రా ప్యదృష్టచరత్వా త్తదానీం కథంకారంభో స్సమావేశనం సిధ్యతి?

(9) సూ 3-8-10 "ఉత్తరాభ్యాం యథాలింగ" మితి "అఘశ్యం" త్వేతి మంత్రభాష్యే వధ్వా వరంప్రతి *మాంగృహీత్వా పుత్రా ద్వైశ్వర్యవాన్భ" వేతి "సమంజ

* 8 "తయోశ్శయ్యామంతరేణ దండో గంధలిప్తో వాససాసూత్రేణవా పరివీత ష్ఠ" తీతిసూత్రం- తదర్థః-తయో ర్వరవధ్వోర్దంపత్యో శ్శయ్యామంతరేణ శయ్యాయా మధ్యభాగే, దండః గంధలిప్తః, చందనాదిలిప్తస్సన్ వాససా సూత్రేణవా పరివీత స్తతి, స్థాపయితవ్యః...

భావనతోడఁ గ్రమంబుగఁ

త్యితిమంత్రభాష్యే "పరస్పరప్రేమాస్పదభాషణం సరస్వతీకారయా" త్యిత్యేవ, నభవదభ్యుపేతాసభ్యవ్యవహారపరం

తత్రైవ "వోత్తరాస్త్రిస్రో జపి" త్యేత్రె "ప్రజాపత" ఇతి మంత్రభాష్యే జపోఽభిప్రేతః సర్వా వివాహసిద్ధిసంపాదకదేవతా ద్వావపివధూవరౌ ప్రార్థయేతే, అన్యోన్యదర్శనోత్తర భావిసంయోగార్థ స్పృశనాద్యానందసంపద్వృద్ధ్యై నైవ భవదధిగతగతిసిద్ధ్యై

తత్రైవ "శేపగ్ం సమావేశన" ఇత్యారోహోరు" మితిమంత్రభాష్యే "ప్రహరామ శేఫ" ఇతిమంత్రవాక్యం తూష్ణీంగృహీత్వా "మేఢ్రో మేహన శేఫసీ" త్యమరం సంస్మృత్య గ్రాహ్యయేట స్తాపరిసూత్రస్థ లింగశబ్దేనసాకం యథాభిమతం పంటింగర్థం నిష్కంటకతమో చ్చావచం కృతవంతః కచ్చిత్' అలమనేనాజ్ఞాన విజృంభణేనానాచారసమాచార నిబంధనప్రబంధాలంభనేన, ఇత్థమేవఖలుభవంతో విధవావివాహాది శాస్త్రార్థం సర్వంత ఉజ్జృంభంతే- "భాషితంయథాభిజనం జనస్యకర్మాపివై యథావృత్తి వృత్తిరపియథాజ్ఞానం"......"అస్వర్గ్యం లోకవిద్విష్టం ధర్మమప్యాచరేన్న" త్యితిమనువచనమపి నాశ్రుణోః? "శ్రుణుతాయంతు శేపగ్" మితిగర్భాధానకాలపరః-తథా నచేత్ప్వత్కుద్వయావలంబనం సూత్రమంత్రభాష్యకారయో స్తదుపష్టంభకానాం వచనానాం గతిరపి క్వ? (1) "సర్వాణ్యుపగమనాని మంత్రవంతి భవంతి (2) యచ్ఛాదా యచ్ఛ్రాద్ధా విత్తి శాలికిః (3) రాగప్రాప్తేఽరాగప్రాప్తఇతి (4) ఏతచ్ఛ రాగప్రాప్తసమావేశనాశ్రితం వివాహకర్మార్థం క్రమజపయోర్విధానం (5) సమావేశనకాలః (6) బోధాయనస్తు వికల్పం సమావేశనం" ఇత్యాదీనా మన్యేషాంచ వక్ష్యమాణానాం- అనేనైవ భవద్భృతమతీవివాహవి స్తరస్తు నిరస్తో స్తవ్యస్తగ్రస్తతయా, కథమితి చేత్పునశ్శృణుత, "అన్యోన్యైనా మభిమంత్రయే" తేత్యత్ర§సమావేశన మన్యేన కథంకారం? "యదాతుమలవద్వా" సేత్యాదివాక్యైః కాలాంతరభావిసమావేశనరూపవ్యా

---

§ రాగప్రాప్త మరాగప్రాప్తమితి సమావేశనం ద్వివిధం, తత్ర వివాహశేషహోమానంతరక్రియమాణస్య, అరాగప్రాప్తస్య సమావేశనస్య, ఉత్సర్గశాస్త్రత స్సామాన్యతో జపార్థత్వమేవ- రాగప్రాప్తస్యతు, ఋతుకాలికస్య సమావేశనస్య, అపవాదశాస్త్రతో గర్భాధానార్థమి త్యన్యత్రవిస్తరః

హారదత్తసుదర్శనార్యభాష్యద్వయమావేక్ష్యయథామతిప్రకాశం
వ్యలిఖద్గురుమూర్తిశాస్త్ర్యభిఖ్యోప్యపివృత్తిం ప్రౌఢసరస్వతీయవాచా

పారస్య బలీయస్త్వా త్తథోత్సర్గశాస్త్రస్య వివాహశేషహోమానంతర క్రియమాణస్య జపరూపసమావేశనపక్షస్య కాలాంతరద్యోతక "శేపగ్ంసమావేశన" ఇత్యభిమంత్రణ రూపవాదశాస్త్రస్యచపరస్పగందండాపూపాయితత్వాద్భవదభిలషితం ముషితనిర్విశేషం

(10) సూ 3-8-12,13 "ఆరోహోరు" మితి "యదామలవద్వా" సేతిచ రజసః ప్రాదుర్భావాదితి మంత్రభాష్యేణగర్భాధాన పరతావసీయతఏవ, యదిచతుర్థి సంవేశన మృతుసంవేశనంచ యుగపత్ప్రాప్యేతే త"దారోహోరు" మిత్యాదినా-తస్మా"త్సంవత్సరే ప్రాప్తేదశమ" ఇత్యాదివక్ష్యమాణత్వాత్ దశమేవర్షే తూపస్థా యాం కన్యాయా రోమశత్వం నసంఘటతే, తతో మైథునంనిషిద్ధ" మిత్యాద్యలం భవత్కలివిద్యావద్యప్రలపనేన,

(a) ఇతోఽధికభవత్ప్రథమానుబంధే ప్రలపితబోధాయనవచనానినభవదనుగ్రాహకాణి, సమూహతా మన్యదేవాం,

(b) తథాశ్వలాయనాద్యర్షి వచనానివా నకామ ప్యుపపత్తి మనుసందధతే భవద్ద్వితీయానుబంధే,

(c) తథైవ భవత్తృతీయానుబంధేచ బోధాయనాది లఘువిష్ణ్వంతానివావాక్యాని నసుతరాం భవదిష్టాధాయకా న్యపిత్వరిష్టాధాయకాని

అన్యదపి కించిదుక్త్వా లేఖినీం విశ్రామయామః

అత్రికశ్యపౌ॥ పితుర్గేహేచయాకన్యా రజఃపశ్య త్యసంస్కృతా సాకన్యా వృషలీ జ్ఞేయా తత్పతి ర్వృషలీపతిః॥ యస్తుతాముద్వహేత్కన్యాం బ్రాహ్మణో జ్ఞానదుర్బలః అశ్రాద్ధేయ మపాంక్తేయం తంవిద్యా ద్వృషలీపతిం॥ మనుః॥ ఉత్కృష్టా యానురూపాయ వరాయ సదృశాయచ అప్రాప్తవయసంకన్యాం దద్యాదేవ యథా విధి॥ స్మృత్యంతరే- ప్రాప్తేచదశమేవర్షే వివాహ్యే కన్యకాబుధైః ప్రదాతవ్యా ప్రయత్నేన నదోషః కాలదోషతః॥...... మాతాచైవ పితాచైవ జ్యేష్ఠభ్రాతా తథైవచ। త్రయస్తేనరకంయాంతి దృష్ట్వాకన్యాం రజస్వలాం॥ హేమాద్రౌ ప్రాయశ్చిత్తకాండే మార్కండేయః యాకన్యాపితృవేశ్మస్థా యదిపుష్పవతీభవేత్ అసంస్కృతాపరిత్యాజ్యా నపశ్యేత్తాం కదాచన॥ వివాహేచ నయోగ్యాసా లోకద్వయవిగర్హితా। ఏనాంపరిణయన్విప్రో నయోగ్యో హవ్యకవ్యయోః॥ నతస్యాంజనయేత్పుత్రం కానీన స్సహికథ్యతే మాతా పితాచ పుత్రశ్చ త్రయస్తే వృషలాస్మృతాః॥ యదాపుష్పవతీకన్యా తస్యై

♦ తే॥ అట్లుకావించుసృష్టియం దతనియొక్క
వదనబాహూరు పదములవలననుండి
బ్రాహ్మణక్షత్ర విట్ఛూద్రవర్ణజనులు
వరుసదప్పకప్రభవించి వరలిరపుడు॥

స్తమగ్నాతి నతత్రదోష స్తస్యాస్తి గేహస్థాచే త్సదోషభాక్॥ గౌతమః॥ యదారహః
ఏవతీ ద్విజస్తా ముద్వహేద్యది! కాలాంతరేపివాజ్ఞాతా తదాచైవ పరిత్యజేత్। య
ఛదాత్మ సశ్శుద్ధిం తదా చాంద్రాయణంచరేత్ కామాతుర స్తదావర్తే త్స చండాల
ాభవేత్॥ పుత్రోత్పత్తిర్యదిభవే త్తథాపతితఏవసః॥ ఇత్యా ద్యలంకురుతఖలు?
వ్యపిసిద్ధం ¦లోకవిరుద్ధం నాచరణీయం నాదరణీయం, ఉక్తోహి ధర్మవ్యతి
సః, యా న్యనవద్యానికర్మాణి తానిసేవితవ్యాని నో ఇతరాణి యాన్య
్మకగ్ం సుచరితాని తాని త్వయోపాస్యానీతి, ఏతాదృశాంశివాక్యాన్యుపేక్ష్యవాఽ
దృత్యవా యద్భవ ద్భవాదృశప్రతారణ్లోకోపన్యసనం అజ్ఞాతసంస్కృతవిలసనంకృత
హృద్వరప్రహసనం, అశక్తదౌర్జన్యయుక్తివికసనం స్త్రీపరవ్యసన మతితరాం జరీజృం
తాం, పునఃపున రనాచారవిచారమారంభంతాం,భవ దర్థవాదాదికానాదివాదస్త్వన
ాద స్సుతరాం వ్యర్థవాదఏవే త్యల మత్యంతానంత జల్పనకల్పనే నోంనమశ్శివాయ,
శ్లో॥ మంగళంగ్రాజ్యయేడంగసంగదోషవిభంగినే
సంఘసంస్కరణోల్లంఘనం ఘనం ఘటతే యతః

♦ సాయణాచార్యప్రణీతభాష్యోపేత పురుషసూక్తమ్-షష్ఠమపత్రమ్
బ్రాహ్మణోఽస్యముఖమాసీ ద్బాహూ రాజన్యఃకృతః
ఊరూతదస్యయద్వైశ్యః పద్భ్యాంశూద్రో అజాయత
......అస్యప్రజాపతే ర్బ్రాహ్మణో బ్రాహ్మణత్వజాతివిశిష్టఃపురుషో ముఖమా
న్ముఖాదుత్పన్న ఇత్యర్థః- యోఽయంరాజన్యః క్షత్రియత్వజాతివిశిష్టః స బాహూ
తో బాహుత్వేననిష్పాదితో బాహుభ్యా ముత్పాదిత ఇత్యర్థః- తత్తదానీ మస్యప్ర
పతే ర్యదాయపూరూ తద్రూపో వైశ్యః సంపన్న ఊరుభ్యా ముత్పాదితఇత్యర్థః, తథా
్య పద్భ్యాం పాదాభ్యాం శూద్రః శూద్రత్వజాతిమాన్పురుషోఽజాయత
శ్రీ భాగవతము. తృతీయస్కంధము. 188 వ పుట.
॥ ధరణీదివిజులు శ్రుతులును, నరవర! యమ్మేటి ముఖమునఁబొడమెట భూ
సురుఁ డఖిలవర్ణములకుఁ గురుఁడుఁ ముఖ్యుండునయ్యె గుణరత్ననిధీ! 216

◆ ఉ॥ వారికియాజనాదిక మవారిగ వృత్తిం విధింపఁగాఁబడెన్
◆ వారలనుండియే యితరవర్ణశతంబు ప్రభూతమై బహి

క॥ ధర బ్రాహ్మణాదికము ద్విస్కగ బాధలఁబొందకుండఁ గైకొని కావన్
బురుషోత్తముబాహువులన్ నరనాథకులంబుపుట్టె నయతత్త్వనిధీ! 217

క॥ గణుతింపఁగఁ గృషిగోరక్షణవాణిజ్యాదికర్మకలితంబుగ నా
గుణనిధియూరువులందున్ బ్రణుతింపఁగఁ వైశ్యజాతి ప్రభవంబయ్యెన్ 218

తే॥ తివిరి సేవకధర్మలై దేవదేవు, పదములను శూద్రసంతతు లుదయమైరి

◆ మాధవీయయుక్త పరాశరస్మృతిఆచారకాండ

ప్రథమాధ్యాయము యాజనప్రకరణము.

......యాజనేతువిధిశ్శూన్యయతే, ద్రవ్యమార్జయన్ బ్రాహ్మణః ప్రతిగృహీ్వ
యా ద్యాజయే దధ్యాపయేద్వా......జీవనోపాయత్వేన యాజనస్య ప్రాప్తత్వా
త్తద్ధేతుత్వంచ మార్కండేయపురాణేవర్ణితం యాజనాధ్యాపనేశుద్ధే తథా శుద్ధప్రతి
గ్రహః ఏషా సమ్యక్సమాఖ్యాతా త్రితయంతస్యజీవికేతి॥......బ్రాహ్మణస్య యాజ
నాదినా వైశ్యస్య కృష్యాదినేతి నియమః......సర్వథాప్యస్తి బ్రాహ్మణానాం జీవన
హేతు ర్యాజనం......

వైశ్యధర్మప్రకరణమ్

మూ॥ ౬౧॥ లాభకర్మ తథారత్నం గవాంచ పరిపాలనమ్
కృషికర్మచ వాణిజ్యం వైశ్యవృత్తిరుదాహృతా

శూద్రధర్మప్రకరణమ్

మూ॥ ౬౨॥ శూద్రస్య ద్విజశుశ్రూషా పరమోధర్మఉచ్యతే
అన్యథాకురుతేకించి త్తద్భవే త్తస్య నిష్ఫలమ్

మూ॥ ౬౩॥ లవణం మధు తైలంచ దధి తక్రం ఘృతం పయః
నదుష్యే చ్ఛూద్రజాతీనాం కుర్యాత్సర్వేషువిక్రయమ్.

అ॥ శూద్రస్తు యదా ద్విజశుశ్రూషయా జీవితుంనశక్నోతి తదా కిం కుర్యాది
త్యత ఆహ॥ లవణమితి॥ యది శుశ్రూషయా జీవితుంనశక్నోతి జీవనాయ లవణాదివిక్ర
యం కుర్యాత్ - నతు లవణాదీని విక్రీయమాణాని విక్రేతు ర్దోషమావహంతి......

మూ॥ ౬౪॥ వేదాక్షరవిచారేణ శూద్రఃపతతి తత్క్షణాత్ ।

◆ ప్రతిలోమానులోమజాతి నిరూపణప్రకరణమ్

ప్కారమునూని◆ శిల్పములు స్వప్రియవృత్తులుగాఁగమీఁదట నీ
తీరు జనం బనంతమయి తేజరిలెన్ భువి భూరిభారమై॥ 11

చ॥ తమతమవర్ణధర్మములఁ దప్పక పూర్వికు లాచరించి ర
శ్రిమమున, ప్రస్తుతంబునను సర్వమునుం దలక్రిందులయ్యె,న
క్రమముప్రవృద్ధమయ్యె,నిటు కాలము సర్వము మాఱిపోయి నే
మమె కడుదూరమైచనియె మంచిపథంబుననుండువారికిన్॥ 12

తే॥ "వలదుకుయ్యో మొఱో మఱుంకువల"దటంచు, బ్రాహ్మణుల్ బ్రాహ్మ్యము
స్వీడఁబాలుపడిరి, "మాకుఁగావలెఁగావలెమా"కటంచు, నన్యజనమం
దుకై పాకులాడఁదొడఁగె॥ 13

మ॥ అదియట్లుంటనె చాలమందియును బ్రహ్మద్వేషభూయిష్ఠులై
పదరన్ సాగిరగౌరవంపునుడు, లావాక్యాగులందున్ మఱిన్
ముదరంజొచ్చెను గొంతమందికదియేమో, పెక్కు రవ్వారలే
కద మాగ్రామమునందుఁ బెద్దతలలై క్రాల్బుద్ధిమంతుల్ కనన్॥ 14

......యాజ్ఞవల్క్యః॥ సవర్ణేభ్య స్సవర్ణాసు జాయంతేహిసజాతయః। ......
సజాతయో మాతాపిత్రుసమానజాతీయాః॥ బ్రాహ్మణదంపతిభ్యాముత్పన్నో జాత్యా బ్రా
హ్మణోభవేత్- ఏవం క్షత్రియాదిష్వపి......తేషుచజాతివిశేషే షూత్తమాధమభావం
వివినక్తి దేవలః॥ తేషాం సవర్ణజాశ్శ్రేష్ఠా స్తేభ్యోన్యే గనులోమజాః అంతరాళా బహి
ర్వర్ణాః పతితాః ప్రతిలోమజా ఇతి॥ విజాతీయా న్మిథునా దుత్పన్నా అంతరాళాః-
తేచ ద్వివిధాః- అనులోమజాః ప్రతిలోమజాశ్చ, తత్రానులోమజా స్స్వవర్ణేభ్యో హీనా
అపి న వర్ణబాహ్యాః మాతృసమా న ప్రతిలోమజాస్తు వర్ణబాహ్యత్వాత్ పతితా అధ
మాః......విప్రాన్మూర్ధావసిక్తాఇ త్యానులోమ్యేన వర్ణసంకరజా దర్శితాః- బ్రాహ్మ
ణ్యాంక్షత్రియాత్సూతఇతి ప్రాతిలోమ్యేన వర్ణసంకరజా దర్శితాః- మాహిష్యేణ కర
ణ్యాంతు రథకారః ప్రజాయతఇతి సంకీర్ణసంకరజా దర్శితాః......ఉక్తత్రైవిధ్యే వ
ర్ణసంకరం చాశ్రిత్యోత్పద్యమానా వర్ణాభాసా షష్టిర్భవంతి- సంకీర్ణసంకరమాశ్రిత్యో
త్పద్యమానా జాత్యాభాసా అనంతాః॥

◆ శబ్దరత్నాకరము 1046 వ పుట.

శిల్పము. సం. వి. అ. న. 1 చిత్తరువువ్రాయుట లోనగు శిల్పులపని. 2 నృత్త
గీతవాద్యాది చతుష్షష్టి బాహ్యక్రియలు...

1912 వ సంవత్సరము ఫిబ్రవరి, అభినవసరస్వతి.

తే॥ బ్రాహ్మ్యమొప్పనుదలనొప్పి బ్రాహ్మణులకు, నొందఁజూచుచున్న వారొయలుదాని
బ్రాహ్మణుండయిపుట్టుటె ప్రథమకష్టమందు వైదికుండైపుట్టు టథమమిపుడు

ఉ॥ వైదికుఁడయ్యుఁ గాలమునుబట్టి యొకించుక లౌకికప్రభన్
బోఁదొడఁగంగఁ గొందఱకుఁబుట్టెనసూయ మదగ్రజన్మపై
భేదములఁ గురించియిటు పెద్దపెఱుంగఁ గ్రమక్రమమ్ముగన్
వాదములాడఁజొచ్చి రిపువాగునఁ గొంతజనంబు తోడుగాన్॥ 15

మ॥ మునుపేముక్కడిగాఁగఁ బైని బడిసెమ్ముంగల్గిన ట్లంత నీ
యనయవ్యూహము నైజమై వెలయు బ్రహ్మద్వేష మత్యంతమై
తనరం దానికిఁదోడుగాఁగఁగలిగెం ద్వాప్త్రిశిసఖ్యంబునన్
గనుగో నెట్టిరి కట్టివారిపయి నే కల్గుంగదా కూరుముల్ 16

క॥ ఈమాడ్కి మామకీయగ్రామస్థితులుండియుండి కడకొకపఠి దు
ష్ప్రామాణ్యమైన కార్యము కామించి యొనర్చిరకట కలిమహిమమునన్

• ఉ॥ ఏగురమేముగూడికొని యీశుప్రతిష్ఠయొనర్చి పూజలన్
బాగుగఁజేసి సంతసిలుభాగ్యము నేటికిఁగల్గెఁగాని ము
న్నే గుడియుం బ్రసిద్ధమయి యిందలరారదు, గ్రామశక్తులే
మాగురుపూజలందుకొని మన్నుచునుండినయట్టి దేవతల్ 18

---

## • శివప్రతిష్ఠాహ్వానపత్రిక.

క॥ పదివేలన మస్క్రియలన్ బదఁపడియొనరించి మిగులఁ బ్రముదముగ దురన్
దదనంతరమున నెదకతి విదితంబుగ వ్రాయువార్తవిధమేమనినన్॥

క॥ త్యాజ్యాదిక విరహితమై యిజ్యాదిసుఖేటవృత్తి నెన్నఁ దగినదౌ
యీ జ్యేష్ఠబహుళపంచమిఁ బూజ్యంబగు సింహాలగ్నమున మాయూరన్

క॥ మేమువినిర్మించినయా। శ్రీమన్నూత్నాలయమున శివునిప్రతిష్ఠన్
గామించిసలుపుటన్నై, నేమించిరి వేదవిదులు నిజముగఁ గానన్

క॥ శ్రీవి సతీసుతయుతముగ నావేళకు సరుగుదెంచి యత్యనురక్తిన్
సేవించియాయుమేశుని సోవలెఁ గైకొంచుమాదుపూజ లొకింతన్

సాధారణసంవత్సరజ్యేష్ఠ శు ౧
భానువాసరము

విధేయులు
జానపాటి వెంకటప్పయ్య
ఈ పట్టాభిరామశాస్త్రి
ఈ చినప్పయ్య
ఈ పురుషోత్తం
పప్పు సీతారామశాస్త్రి

ఆ॥ అందు, పాతపాటియమ్మయన్ పేరునఁ
దనరు నొక్క దేవతాలలామ
ఇంకనొక్కయామె యొసఁగుఁబోలేరమ్మ।
యనెడిఖ్యాతమైనయాఖ్యగలిగి 19

సీ॥ బాగుగా వేయంగఁబడినట్టిమోకొండు
లలిని దిరుగఁదగ్గలావుకలిగి
చేకొద్దివిసరినచిన్నిరాతికిఁగూడ
గోచరింపనియట్టి కొనలుగలిగి
దశదిశల్ వ్యాపించి దట్టమైకన్పట్టు
నురుతర శాఖాళిభరముగలిగి
వేజనంబులకేని విశ్రామహేతువై
నీరంధ్రమైనట్టి నీడగలిగి
తే॥ గీ॥ పెక్కుజాతులపులుఁగులుం బ్రీతినెపుడు
కోరివసియింపఁదగినన్ని గూళ్లుగలిగి
పాతపాటమ్మగుడికిలోపల నొకండు
వెలసియుండె ననాదిగా వేఁపమ్రాను 20

సీ॥ నికటపుంబెదబావి నీటకేతెంచెడి
మానవుల్ నిలుచుంట దీనిక్రింద
సామాన్యజనులెల్ల సందడుల్ సేయుచు
తీరికూర్చుండుట దీనిక్రింద
చుట్టుప్రక్కలయిండ్లశూద్రాదిపశుతతుల్
తిన్నగాఁబడుకొంట దీనిక్రింద
బ్రాహ్మణాదిజనంబు పారలౌకికవిధుల్
తీర్చియేగుచునుంట దీనిక్రింద
తే॥ గీ॥ జాతరల్ సాగునప్పెల్లజనులుగూడి
దేవతం గొల్చుచుండుట దీనిక్రింద

నిన్ని విధముల మాయూరి యెల్లజనుల
కుపకరించుచునీవృక్ష ముండెఁ జిరము 21

మ॥ ముదముంగూర్చుచునుండియుండియిటు, పెన్మూలంబుతోఁగూడనా
పెదనింబద్రువు నేలఁగూలి గుడి నిర్భేదంబుగావించుచున్
బదుగుర్గూడి పొనర్పఁ జేసిమరలం బ్రాసాదనిర్మాణమున్
మది సంప్రోక్షణకుం బ్రయత్నపరులై మంత్రంబుగావించుచున్ 22

ఉ॥ "ఉండెను వాఁగునావలను నొండొక దేవత, దానికొల్పులన్
బండికిఁబోవ రామిఁ గడు బాధగనున్నది, కాన నూరిలోఁ
గొండొక చోటనిల్పుదము, కోరియయుంటి మొకండునల్పగన్
కొండవదిప్రతిష్ఠ" యని ప్రీతినొనర్చిరి తత్ప్రయత్నముల్ 23

వ॥ ఇట్లొనర్చుచు

చ॥ "వెనుకటిదేవతాశిలల విగ్రహరూపమె లేకయుండెఁ గా
వున నవవిగ్రహమ్ములకుఁ బోవలె దుగ్గి" కటంచుఁ బోయి యా
పనినెఱవేర్చి యాజకుని బ్రాహ్మణుఁ జేయుటకున్ సహింప కొ
క్కని రథకారుఁ దెచ్చుటకుఁగా జతనంబులు సేయుచున్నెడన్ 25

ఉ॥ అప్పని మత్సహోదరునియాత్మకు నిష్టముగాకయున్కిఁ దాఁ
జెప్పిన శత్రుభావమునఁ జేకొనరంచుఁదలంచి చప్పునన్
బప్పునుదర్శనాఖ్యబుధుపాలికినేగి యుదంతమంతయున్
విప్పివచించి యాబుధుని వేగమపంపఁగవారిమ్రోలకున్ 26

క॥ ఆపండితుండు కరణము
ప్రాపుననున్నట్టి కాపువారినిగని తాఁ
గోపంబురానియటు వివి
ధోపాయములన్ వచించె"నుడుగుం" డనుచున్ 27

వ॥ ఇది యునుంగాక

చ॥ కరణముగారియింటను నొకానొకరుండుటసంభవించి యా
పురుషుఁ "డిసీ" యనం బెదరి పూనికమానకొనంగనయ్యొ, నే

సరునకుఁగూడనింద్యమయి న్యాయముదప్పినయట్టికార్య మా
సరసున కెట్టునిష్టమగు, సభ్యుఁడతండు, యథార్థవాదియౌ. 29

ఉ॥ తంగెడరామకృష్ణకవి తత్క్షణ మప్పనినుండి వారి ని
ర్భంగిమరల్చి చెప్పిచనె "వర్తిలునొక్కరుఁ డల్ల తోండపిన్
లైంగుఁడు బ్రాహ్మణుండును గలావిదుఁ డాగమవేత్త" యంచు, నా
సంగతివిన్నమీఁద నటుసల్పిరి తోడ్కొనిరా బ్రయత్నముల్ 30

ఉ॥ అప్పుడు మత్పితృవ్యునకు నాత్మజుఁడైన చినప్పయాఖ్యుతోఁ
జెప్పి సహాయుఁగాఁగఁగొని శీఘ్రముతోండపి కేగి యాద్విజున్
గొప్పగఁదోడితెచ్చుటయు నూతన విగ్రహసంస్థ యాబుధుం
డొప్పినరీతిఁ జేసి తమయూరికిఁదాఁ జనె నొందిసత్కృతుల్ 31

క॥ అంతయుసక్రమముగ నే।సాంతంబుంబొందెఁగాని చతురుఁడొకండీ
యంతరమున నొనరించెన్। సుంతయకృత్యంబు, దానిఁదొప్పెమనినన్

ఉ॥ "బ్రహ్మకులంబుమాది,, యనుభ్రాంతివసించెడిస్వర్ణకారుఁ డా
బ్రహ్మము గిన్నెలాన్వయుఁడు పన్నినప్రప్రథమంపు గుట్రచే
బ్రాహ్మణయాజనంబునకు భంగమువాటిలకున్కిఁ గ్రూరవా
జిహ్మగమట్లు మర్వకయ చిత్తమునం బగఁబూనియుండఁగన్ 33

చ॥ పిలువఁగనయ్యె నాతనినె విగ్రహఘట్టనమాచరింపఁగన్
"సలిపెద నాకుఁగాఁదగిన సత్కృతియయ్యెడిచో" నటంచు నా
ఖలుఁడువచించె, "చూచెదము కార్యముసాఁగఁగని" మ్మటంచు న
న్నలుగురుపల్కి, రప్డు బహునాయకవాట నెవఁడొసంగెడున్ 34

ఆ॥ అంతమీఁద నాతఁ "డసు దెంతు నరు దెంతు"
ననుచు నేగి రాక యట్టెయుండ
దూరదృష్టిలేని మోటుకులైన మా
వారు మరలఁ బిల్వఁగోరరైరి 35

వ॥ అదిగనిపల్కె యాజకుఁ "డహా! యిది యేమిటి, యంత్రయు క్రమౌ
నది మఱి హేమపుంబక, యయ్యది యేరుహరింత్రతో, కావ్యున్

గుదురుగ ఘట్టితంబగుటగూడను విగ్రహ"మంచు మాటికిన్
సదయతఁ జూతుఁగాని యటుసల్పక యే చని రెల్లవారలున్ 36

క॥ అయ్యోడనటు లేగిన బ్రాహ్మయ్యకు దయయుదయమై తనంతటఁ దానే
"అయ్యా! బిగియింతమురండయ్యోడ"కనికొన్ని దినములరిగినమీఁదన్

ఉ॥ కాపులుఁ దోడికొంచుఁ జని ఘట్టనసేయక యున్నవున్నటుల్
లేపెను విగ్రహంబులను రేకులయున్కి పరీక్ష సేయఁగన్
జూపడవయ్యె యంత్రములు, చూపఁ నయాగ్రహమందుచుండఁగన్
"బాపఁడు తీసి"రన్నటుల బ్రహ్మము తేల్చె స్వయుక్తిచాతురిన్ 38

ఆ॥ అందుమీఁద మూర్ఖులెనట్టియవరజుల్
"యాజకుఁడు చినప్పయయును గలిసి
తీసి"రనుచు మిగులఁ దిట్లు సాగించిరి
యచ్చటచట దౌష్ట్యమతిశయిల్ల 39

తే॥ పండితారాధ్యమతమునం బ్రబలియున్న
యట్టిముదిగొండవంశ మయ్యాజకుసిది
వీరభద్రయ్యయను పేర వెలయువాఁడు
పెద్దమానిసి యిటువంటిసుద్దియున్నె 40

చ॥ కరణము గ్రామమున్నిభును గాపులు తక్కుజనంబు లెందఱో
యరిగిరి దేవుపెండిలికి నందఱు పెత్తనగాండ్రె. యాటచే
నరిగిచినప్పయాఖ్యుఁడును నయ్యయి కార్యభరంబుపూనియున్
దిరిగెను, నాతఁడే యెటులఁ దీసెడి? నన్యులుతీయ రెట్టులన్? 41

ఆ॥ అరయ గ్రామబాహ్యమందు నాగుడులుంట
ఒకటఁ దలుపులున్న నొకట లేవు
ఎవరునున్ హరింపకే యూరకుంటకు
నంత ధర్మకాలమా? గణింప॥ 42

ఉ॥ విగ్రహమున్ బిగింపకయ వేగమయేగుటయేల తా మొదల్
నిగ్రహముం దృజించి కడు నేర్పునవచ్చుటయేల క్రమ్మఱన్

విగ్రహ మున్నదున్నటులఁ బెట్టిబిగింపక యెత్తుకేల? యీ
వ్యగ్రతచూడ నంతయును బ్రహ్మమయంబ యటంచుఁ దోఁచెడిన్

*చ॥ అతివినయాన్వితంబులగు నాతని మాటలకున్ భ్రమించి మూ
ర్ఖిత మహీదేవయుగ్మము నెకమ్మమహాప్రజ తిట్టిపోయెఁగన్
మతిరహితోక్తులం గనలమానిరిమామకు లేమనాక, దు
ష్కృతి మొనరించియున్నఁగద చింతిలి రోసము దెచ్చికొంటకున్

§ఉ॥ తిట్టుట మాఱుమాటయిడ దెబ్బలుగొట్టుట మాదు గ్రామమున్
గట్టిన నాఁటినుండియును గన్నకులస్థుల కుగ్గుపాలతోఁ

---

* అతివినయం ధూర్తలక్షణం.

§ (1) డిక్రిని అమలునెరవేర్చునిమిత్తము మనిషినిపట్టుకోవడమునకు వారంటు. సివిల్ ప్రొసీజరుకోడుయొక్క 232 డో శెక్షను నర్సారావుపేట డిస్ట్రిక్టుమున్సబుకోర్టు ఆన 1900 సంవత్సరపు 26 నవంబరు సివిల్ వ్యాజ్యము.

వాది. యక్కలపిచ్చయ్య సా॥ గుండ్లపల్లి, ప్రతివాది. పున్నంచంద్రయ్య సా॥ జానపాడు, ...... ఆన 1901 సంవత్సరం ది 10 నవంబరు తేదీన పగలు 8 గంటలకు జానపాడు గ్రామములో ప్రతివాది కరణం యింట్లోయుండగా వాది కనుపర్చినాడు. నేను సదరు ప్రతివాదిని పట్టుకున్నాను. పట్టుకోవడముతో నామీదతిరుగబడి తనచేతిలోయున్న కర్రతో కొట్టవచ్చినాడు. నేను కొట్టవచ్చినకర్రనుపట్టుకున్నాను. ఆకర్రనువదిలినెట్టి నన్నునెట్టి వుడాయించి పరిగెత్తినాడు. అప్పట్లో గ్రామమునసపు కరణంగారు చూచుచుండిన్ని నేను రిపోర్టుయివ్వమంటే యివ్వక నిరాకరించి ప్రతివాదికి కుమ్మక్కుగా మాట్లాడినారు...ప్రతివాదికొట్టవచ్చినకర్రను యిందుతో దాఖలుచేసుకున్నాను...

18-11-1901 (Sd) K. V. Narasimha Rao,
Process server.

పరా:—ఈపైదోషికి గురిజాల సబ్ మేజస్ట్రేటుకోర్టువారిచే 15 దినములు శిక్ష విధింపఁబడినది.

బెట్టిన, దద్ది యొక్కొకరిపేరఁ బ్రయోగముచేసినప్పుడ
టిట్టులుచేయు, నొక్కయెడ నేమియుఁ జేయకే పోవుచుండెదుర్. 45

(2) మ... గురిజాల స్టేషనరి సబు మేజస్ట్రీటుకోర్టు వారిసముఖమునకు.

ఫిర్యాది. నందా... నరసింహ్వాము సా॥ జానపాడు.

ముద్దయిలు. I. వున్నము చినవీరన్న. II. జానపాటి సీతారాముడు, III. జానపాటి రంగయ్య. సా॥ జానపాడు.

448-323 సెక్షన్ ప్రకారము వ్రాయించిదాఖల్ చేసుకున్న చార్జీ...

నేరముజరిగిన తేది— 28-1-03.....

సదరు తేది సాయంత్రము 6½ గంటలప్పుడు ముద్దయిలు శివద్రవ్యమును అపహరించినట్టు తమను నేను అన్నానని నాయింటికి......వచ్చి నన్ను 1 టో ముద్దయి జుట్టుపట్టివంగతీసేసర్కి 2-3 ముద్దయిలు గుద్దినారు......1 టో ముద్దయి కమ్మకులస్తుడున్ను 2-3 ముద్దయిలు అన్నదమ్ములున్ను 3 వ ముద్దయి కరణమున్ను అయియున్నాడు. ఆరోజు ఉదయమున నీరుకట్టుగింజలవిషయములో నేను 1టో ముద్దయి వివాదులుపడుతూవుంటే పయిగా 2-3 ముద్దయిలు కుమ్మక్కుగావచ్చె......సదరు 1 టో ముద్దయి మిగులప్రసంగములుతిట్టుతూవుండేసర్కి పయిగా 2-3 ముద్దయిలు నన్ను కొట్టినారు......

☞ పరా:—ఈకేసు విచారించిచార్జిచేసినతర్వాత కాశీరాజు గోపాలకృష్ణయ్యగారి ద్వారమున ఫిర్యాదికి ఖర్చులిచ్చి రాజీపడుచుకొన్నారు.

(3) ......తీర్పు.

ఫిర్యాది. జానపాటి పట్టాభిరామశాస్త్రి-జానపాడు

ముద్దయిలు: కాటూరు నారాయణుడు. వడ్లవెల్లి కోటయ్య } జానపాడు

నేరము—తిట్టవలెననితిట్టుట, గుడ్డను నక్రమముగాఁబట్టికొనుట, ఇం॥ పి॥ కో 504 వ సెక్షనుక్రింద, 1871, 1 ఆక్టు 21 సె॥ క్రింద శిక్షింపఁదగినది.

ఎట్లుకనుగొనఁబడినది—నేరస్థులని.

శిక్ష—ముద్దయి లొక్కొకరు, రు 15 లు జరిమానా యీవలసినదనియు, లేనియెడల 15 దినము లొక్కొకరు కఠినశిక్షయనుభవింపవలసినదనియు, కోర్టుఫీజాక్టు క్రింద ముద్దయిలిద్దఱు రు 2-8-0 లు సమానభాగములుగా ఫిర్యాదికీవలెననియు......

గురజాల 31—1—13 } (Sd) పి. యమ్. సోమయాజులు, స్టేషన్ మేజస్ట్రీటు

మత్తకోకిల॥ అప్రతిష్ఠకు మూలమైయిటు లాప్రతిష్ఠ సమాప్తికా
విప్రవర్యుల మీఁది ద్వేషము వేర్లు పెట్టెఁ బ్రవృద్ధమై
యీప్రకారమ యొక్క వత్సర మేగుపై దురదృష్టతన్
స్వప్రతాపముఁ జూపెఁ గత్తెర జానపాటఁ బ్రవేశమై 46

ఆ॥ అప్పు డాఁడలు పెరిఁగెనఁట కొంతమందికి
అమ్మవారు పూనెనంట లెస్స
యంత్రహరణమైనయ క్కారణంబునఁ
దొలఁగె సత్తయనుచుఁ బలికిరంట 47

చ॥ ముడియఁగ గ్రామమందు బలుమంది ప్రజల్ కలరా గుణంబునన్
గడగడలాడఁగం దొడఁగి గ్రామణియున్ మునిసీభు కాపులున్
ముడుపులు కట్టి శక్తులకు మ్రొక్కి యొకింత శమించినంతనే
తడయక జాతరల్ సలుపఁ దామెదలోఁ దలంచి యంతటన్ 48

ఉ॥ "మేలొనగూడఁగం బ్రజకు మే మొనరించెద మిష్ట కొల్పులన్
జాలధనంబు కావలెను జాగొనరింపక యిం"డటంచుఁ జం
దాలు వసూలు చేసి యొకతక్షకుఁ దోడ్కొని వచ్చి రప్డు యం
త్రాలను వేయఁగన్ మరలఁ దద్దుఁడొకండును లేకయుండుటన్ 49

ఉ॥ వచ్చిన తక్కలాడు నొకవాసరమందట రాజవీథిఁ దో
డ్తెచ్చిన వారలై చదురుదీర్చెడిపట్టున నేను నెందుకో
యచ్చటఁ బోఁ దటస్థమయి యందఱకోరికెఁ గూరుచుండియున్
దచ్చరితంబు సర్వమును దాలిమితోడత నాలకించితిన్ 50

చ॥ అహహ "యేమి తీసుకొనవె"దంచుఁ గలాదుసినందఱప్పు డా
తఁడ శిగభూములే మొదలు, దానికినొప్పమి నూఱులాఱులే
యడిగెను, మాయుదారులకు నయ్యదియున్ భరమై పదింటికే
యొడఁబడ వేఁడె, రప్పుడొక యుక్తియుఁ బల్కఁగఁ దోఁపకుంటి నేన్ 51

మ॥ ఎఱుఁగన్ రామిసిగాదు బ్రాహ్మణ్యమె మహిన్ హెచ్చైన వర్ణంబటం
చెఱుఁగన్ రాసదికాదు తక్షకకులం బేదానికిం దక్కువం

చెప్పుకైకూడ మదీయవర్ణజనులం దీరీతి ద్వేషించి యా
నరుఁ బూజింపఁగనున్న వారి యెడలన్ నానాల్కయే మూడెడిన్ 52

ఉ॥ చూపితి వ్యంగ్యపున్ నుడుల సుంతయు నిష్టము లేని భావమున్
నాపలుకుల్ గ్రహింపఁగలనాథుఁడు లేఁడట, నింతకన్ననున్
గోపవిఘూర్ణితాత్ములయి కొట్టుటకేనియుఁ జంకకుందు నా
పాపులలోన నేమియని బైటికి రాఁగలవాఁడ నయ్యెడన్ 53

చ॥ ఇదియునుగాక యంత్రములె యీతఁడు స్థాపనఁ జేయునన్నటుల్
పదుగురునోళ్ళనుండియును బల్కఁగఁబడ్డది కాని, యయ్యెడన్
విదితము కాదొకింతయును విగ్రహసంస్థయుఁ జేయునంచు నా
కెద కదియే యెఱుంగఁబడ నేమి వచింతునొ యెట్టులుందునో 54

మ॥ ధరణిన్ నేర్చిరి శాబరాదికములౌ తంత్రాల్ ద్విజన్మేతరుల్
మెఱయంగూర్చుచు వాని బీజములచే మేలైనయంత్రంబులన్
దిరుగం జొచ్చిరి, కొంతమందిజను లీధీచుత్క మంత్రంబులన్
బరమోత్కృష్టతఁ జూచుచుండిరి మహామంత్రాభిజ్ఞాత్మతన్ 55

తే॥ అట్టులే యీతఁ డెవ్వానియంత్రములను
స్థాపనము జేయు విగ్రహాధఃప్రదేశ
మందటంచును నెంచితి నంతెకాని
య ప్రతిష్ఠకు సిద్ధమా నంచెఱుంగ . 56

మ॥ "ప్రతిమందీయక యంత్రసంస్థ యెటులం బ్రాప్తించు" నం చందు రే?
క్షితిఁ బెక్కండ్రిటు చేయుచుంట కలదే, సిద్ధాంతమీ మాట, "యీ
కృతి శాస్త్రోక్తమ?" యన్న; తక్షకునకీకృత్యం బదే శాస్త్రసం
తతియందున్నదియో వచింపవలెగా? తత్ప్రచ్ఛకుల్ ముందుగన్ 57

తే॥ అచట నా యనుకరణము ననుజుఁడైన
సీత యాహ్వాయుఁ డొక్కింత నీతియుతుఁడు
కక్షయున్నను బాడితపక్షపాతి
కానవాపైని స్నేహంబు గలిగియుండు 58

క॥ అదికారణముగ నాతనిఁ
గదిసి రహస్యముగ నేను "గమసాలెలక
న్న దొరకకుండిరె, నీవి
య్యదియొప్పితె బ్రాహ్మణుండవయ్యు" నటన్నన్ 59
తే॥ "శూద్రజాతులు చను దెంచి రౌద్రముగను
జేయుచుండెడి పశుహింసచేఁ జెలంగు
గ్రామదేవతతో మన కేమి కార్య
మద్ది నీచులు పోయెడి యాలయంబు 60
చ॥ కనుకను నెవ్వఁడేసలుపుఁ గాక, తదిష్టము, వాండ్రగోలతో
మనకిపు డేల యంచుఁ గడుమంచిగ నుత్తరమున్ వచించినన్
మనమున నేదితోఁప కటు మౌనము దాల్చితి, నన్ని హేతువుల్
కనఁబడు నప్డు "కూడ" దని ఖండితవాదము చేయకుంటకున్ 61
తే॥ అంతఁ దప్పించుకొని యెట్లొ యచోటునుండి
యివలఁబడఁగల్గి యొక్కింత యెడకు, నాదు
భ్రాతకును మఱికొందఱు బ్రాహ్మణులకుఁ
జెప్పితిని జూచివచ్చిన చిత్రమెల్ల 62
ఉ॥ భ్రాత వచించె నంతు పయి బాగుగఁ జర్చయొనర్చి తెల్పుచున్
"సీతయు నమ్రభావమునఁ జేతులు మోడ్చి వచించినంతనే
యాతని మాట నమ్మితివి, యయ్యది పోలునె? గ్రామదేవతల్
మాతలు కారె యెల్లరకు, మాన్యులు గారొకొ బ్రాహ్మణాళికిన్ 63
క॥ కొలువులలోపల బ్రాహ్మణు
లల పోలేరమ్మ గుడికి నరిగి సపర్యల్
సలుపుచునుండుట లెఱుఁగవె
కులహీనులె కొలుతురనుటకున్ భ్రమియంగన్ 64
చ॥ నిశిసమయంబునం జరుగు నీచపుఛాగవధాదికంబు, లా
పశువధతోడ నేమిపని బ్రాహ్మణజాతికి, వార లేగుచో
విశదముగా నెయుండు, నవి వేకుల మాముకు లాదినుండి యీ
దృశమగు పూజనంబునకు దేవతసన్నిధి కేగుచుంటకున్ ౬.

చ॥ కడఁగినదిట్టిదుష్కృతికిఁ గమ్మమహాప్రజ, వారికిం దగన్
నుడువఁగలేక త్రొక్కెనిటు నూతనపద్ధతి, తానెముందుగా
బుడిబుడిఁగొంచుఁబోవఁడొకొ పూర్వమునందు బజంత్రిమేళవుం
గడబిడతోడఁబోనమును, గాదనినీతయ యిట్లుచెప్పఁగన్ 66

చ॥ "వల"దని చెప్పిచూత,మదివార్వనిరేన్ గడుమంచిదేయగున్
దెలిపినమీఁదఁగూడఁ దమద్వేషము నీవిధిఁదీర్చికొంటకున్
దలఁచి వినూత్నయంత్రములస్థాపన బత్తునిచేతనే యటుల్
సలుపఁగఁజేసినం గుడులచక్కికిఁబోవుట మానికోఁదగున్ 67

చ॥ కొలుపులు రేపె, బోనములుకొంచుఁ జనంగమదిందలంపనే
నలుకులుముగ్గులున్ సహిత మస్మదగారమునందుఁజేయ, మీ
పలుకులుఁ నచ్చినన్ నిలుఁడు బ్రాహ్మణులందఱు, నచ్చకుండినన్
వలసినరీతిగం జనఁగవచ్చును, నామతమిద్ది రూఢిగన్" 68

ఆ॥ ఖండితముగ నిట్లుకావించు మాయన్న
యాప్రసంగ మందఱాలకించి
సంశయములువీడి చననయ్యె నిండ్లకుఁ
దాము నిశ్లె చేయఁదలచి మదిని 69

ఉ॥ ఒప్పిపదింటికేయచట నుత్తరపుంగ్రియచూచికొంచు నా
గొప్పకలాదుఁ డుండుటయుఁ గూడిరిరాత్రికి బ్రహ్మమాది మా
యప్పలుకొంతమంది,యపు డాయన యెవ్వియొ కొన్నిముచ్చటల్
చెప్పుచుఁగూరుచుండుతఱి చేసిరివారొకప్రశ్న మాతనిన్ 70

క॥ "ముందఱమీర్చేసెడిపని
యందమదెట్టిదియొ వినఁగ నభిమతమయ్యెన్
సందియమందక చెప్పుఁడ
మందానందంబుగలుగ మాకందఱకున్" 71

ఉ॥ ఈవిధిఁజేయుప్రశ్నమున కిట్టులనాతఁడిడెంజవాబు దా
నావల, "యంత్రముల్ సలిపి యయ్యవి స్థాపనచేయుమాత్రమే
నావిధియంతకెక్కువగ నాకెదియుం దెలియంగరాదు,మీ
భావమదేమొ,యెందుకని ప్రశ్నముఁ జేసితిరో వచింపుఁడీ" 72

చ॥ అనుటయు వారలిట్లనిరి,"యయ్యదిచాలదుకీర్తిరాకకున్
మనకుల మెట్లొ వృద్ధియగుమార్గమొకండుతటస్థమయ్యెఁ, గా
వున మన మిప్డెపోవలయుఁ బోయెడిపోకడయెల్ల, నందుకై
యొనరుపనొఁ బ్రతిష్ఠయును, నొప్పుఁడు మీరలుకూడ దానికిన్ 73

చ॥ ఎదితెలియంగ రావలెను, నేరు పరీక్షయొనర్చు వారునిన్
జదివియెదో యొకండు వర్షమున్ మునుభూమిసురప్రతిష్ఠయం
దెదియెదియాచరించిరొ యదేయొనరింపఁ బ్రతిష్ఠకాదొకో
పదుగురమున్ సహాయముగవర్తిల నేమిభయంబు నీకికన్ 74

క॥ వెనుకటిసంప్రోక్షణమే
మన చేనొనరింపనున్న మధ్య నెవండో
యనఘుండుపుల్లవేసెను
బొనరింపఁగఁ జేసిరంత భూమిసురుని చేన్ 75

తే॥ వారువేసినయంత్ర మేతీరుగాను
మనయదృష్టమువలననే మాయమయ్యె
పిలిచిరీసారిమననె,యిప్డెకద మనదు
నాటసాఁగించుకొనుటకు నవసరంబు 76

క॥ "ఇల మేమెబ్రాహ్మణుల" మని
బలిమిన్ వాదించి భంగపఱతురుగానన్
సలిపి ప్రతిష్ఠాకృత్యము
తలవంపులు చేయవలయుఁ దద్విప్రులకున్ " 77

ఆ॥ ఇటులనూఱిపోసి యేమేమొ, చివరకు
మెడలువిఱిచి యెట్లొ యొడఁబడంగఁ
జేసిరపుడు రాత్రి చెఱిసగమగు వేళ
కల్పవిద్యుఁడైన యక్కలాడు 78

ఉ॥ చేసి తదాలయంబునకుఁ జేరిచి యాతనినర్ధరాత్రియే
బాసటగన్ మెలంగ నటుపైని బురశ్చరణాదికం బెదో
చేసెడివానిచందమునఁ జేరుదురాకలపేరుఁ బూని యా
పూసలుద్రిప్పికొంచు రవిపొడ్చెడిదాఁక వసించె నాతఁడున్ 79

ఉ॥ "సత్త్తోలంగి శోభయును జాలకయున్నదియమ్మవారు, బల్
వేత్తయితండు, గాన సలిపించుటబాగు పునఃప్రతిష్ఠ,, యం
చత్తఱి మాదుసంవసథమందలి యాకమసాలెలేగి యా
పెత్తనగాండ్రతో నుడువఁ బ్రీతిని "మంచి,, దటంచుఁబల్కిరున్ 80

తే॥ వెల్లియచ్చటినుండి వే విగ్రహములఁ
బెద్దబావిజలంబులోఁ బెట్టిసరిగఁ
దిరుగఁ జొచ్చిరి యందఱు కెలుకగాఁగ
నూర నాయాయికార్యంబు లొనరుచుటకు 81

చ॥ సకలజనుల్ ప్రబుద్ధులయి సాఁగిరి వీథుల సంచరింపఁగన్
బ్రకటితమయ్యె గ్రామమున బాగుగ "సౌను బ్రతిష్ఠ,, యంచు, సం
చకితమనస్కులై ద్విజు లసమ్మతిఁజాటిరి నాల్గువైపులన్
వికటముగం బ్రసంగములు వేమఱుసల్పిరి కాఁపులెల్లెడన్॥ 82

క॥ ఈమాదిరినుండు నెడన్
ధీమంతులుకొంతమంది తేలి మదీయ
గ్రామసభాపతియగు నా
రామయధామంబు ముందరం గూడినొగిన్ 83

ఉ॥ ఆయెడఁ బెద్దకాఁపునకు నాగమనంబుతటస్థమైన నా
ధీయుతుఁగాంచియిట్లనిరి మె దిట్ట మదీయసహాయ రుండు "నీ
వే యిటుసల్పఁబూనితొకో యెవ్వఁడొ యల్పుఁడుచేయఁదగ్గ యీ
హేయపుఁగార్యమున్ వినిన నేమనియందురు నీదుబంధుగుల్ 84

సీ॥ బ్రాహ్మణసంతృప్తి బహురీతిఁగావించి
సన్నుతుల్ గాంచె నీ కన్నతండ్రి
బ్రాహ్మణుం బొడఁగన్న భక్తివిశ్వాసముల్
దద్దఁజూపించె నీ పెద్దతండ్రి
బ్రాహ్మణముఖముగా బహుపురాణంబులఁ
దావినె నీపెదతండ్రికొడుకు
బ్రాహ్మణుచే నడ్డఁబడి యథాశక్తిమై
నిచ్చెడివాఁడవే యీవుకూడ

అట్టినీకిప్పు డేలొకో యకటయిట్లు
బ్రాహ్మణద్వేష మేర్పడె బహుళముగను
గాకయుండిన నీరీతిగం గలాడు
చేఁ బ్రతిష్ఠలుచేయింప సిద్ధమగుదె ? 85

తే॥ భువి ద్విజాతులతర్వాతఁ బూజ్యమైన
కమ్మవంగడమున జన్మగాంచినావు
ఊరిలోఁ బెద్దకాఁపువైయుండినావు
కానికార్యముచేయింపఁ గడఁగినావు 86

క॥ మాకుఁ మీకుఁ బాట్టి
యేకాలమునుండియొ కల,దింకులకై మీ
రీ కమసాలెలచేతన్
బీకింతురె? ద్విజులునిల్పఁ బెట్టిన ప్రతిమల్ 87

ఉ॥ కమ్మలులేరొకో యెచటఁ? గతులులేవొకొ బ్రాహ్మణాళితో
సమ్మతిచేయుచుండిరొకొ సల్పఁగ నిట్టివినింద్యకార్యముల్
కమ్మకులానకంతటికిఁ గట్టితిరీరపకీర్తి, కమ్మలే
కిమ్మననీరుమి ప్మొచటికిఁ జనినం గనుఁ డింకమీఁదటన్ 88

ఆ॥ బ్రాహ్మణులకుమీకుఁ బగయున్న వ్యవహార
సరణిలోనఁ జూపఁజనునుగాని
బ్రహ్మకర్మనిట్లు పరులచేఁ జేయింప
బ్రాహ్మణులు జయింపఁబడిరియొకో 89

క॥ మనధర్మశాస్త్రమునకీ
పనికూడనిదగుటటుండఁ బ్రభుశాసనమున్
గనుగొనినంగూడనిదే
యనుమానమువలదు "నేర"మనుటకు నింకన్ 90

క॥ ఉండినకర్మంబుండఁగ
వెండియుపాకర్మమొందు వెంటఁబడెదున్
గొండొకవడి యోచించుకొ
నుండందఱుఁగూడి యొకట, నుడివితిఁగానన్" 91

క॥ అనవుడు "మావాండ్రతనిన్
గొనివచ్చి మఱేదో మిడుకుకొనుచున్నా"రం
చనుచును నటనుండకయుఁకఁ
జనియెన్ మెలమెల్లనతఁడు స్వస్థలమునకున్ 92

ఉ॥ నాకగపడ్డవారలకు "నాయకుకా," దని యెంత చెప్పినన్
జేకొన కమ్మ్రదూర్తులను "శిల్పి ప్రతిష్ఠయొనర్ప నర్హుఁ," డం
చాకమసాలెవర్ణమునె యాదృతినై నుతియింపఁబూని య
స్తోకవితండవాదములతో నెదిరింపఁగఁబూని రయ్యెడన్ 93

చ॥ అచట జలాధివాసమఁట, యంత నెదో యధివాసమంట, యా
కుచరితు లాచరించుచును గుప్పయియుండిరి, రంగవల్లికల్
రచితములై యెసంగె గృహరాజములందును, బిండివంటలున్
బచనముసేయఁగాఁబడియెఁ బల్వురయిండ్ల నివేదనార్థమై 94

ఉ॥ బోనములిచ్చివచ్చుటకు భూసురులేరుఁ దలంపరైరి, యా
పూనికఁజూచి వైశ్యులును బో విరమించిరి, "వీరలేరునున్
బోనపు డెట్టులన్ మనము పోవుద"మంచు విశంకితాత్ములై
మానిరి తాముకూడ నెటో మాకరణాల్ భయమంది యాంక్షకున్

ఉ॥ మానినవారుమానవలెను మానియెయుండక యిండ్లవెల్పులన్
లోన నలంకరించి పెసలున్ మినుముల్ ఘృతముఖ్యవస్తువుల్
దేనియమించి యప్పము లుదీర్ణముగన్ సలిపించుచుండి, రే
రే నరుదేరరంచు మదినెంతయు సంశయమందకుండఁగన్ 96

క॥ ఆతఁడె*గరణముశమ్ముఁడు
సీతారామయగృహంబు చెంతకు మరలన్

---

* అస్మద్విరచిత చెన్నకృష్ణచారిత్రము 8 దవపద్యము.

సీ॥ అకలంకహృదయుండు సకలగుణాభిరాముఁడు వెంకటప్పందు మొదటివాఁడు
కరణిక మొనరించి ఘనుఁడునాఁబడిమించు రంగయాఖ్యుండు తర్వాతవాఁడు
వ్రాఁతపూఁతలలోన ఖ్యాతుఁడౌ నరసింహరావగుఁ దదనంతరంబువాఁడు
నాలవవాఁడు సంచాలితశత్రుహృత్థ్సలుఁడు సీతారామసచివవరుఁడు
బలమునందల భీమునిపాటినాఁగఁ, జెలఁగు చినవెంకటప్పయ్య చిన్నవాఁడు
గాఁగఁ దనయుల నేవురఁ గరముప్రీతి, సాఁకెనీ చెన్నకృష్ణయ్య జానపాట

బోతినినే నాతనిమది
యేతీరున నున్న యదియొ యిప్పుడటంచున్ 97
తే॥ పోయికూర్చుండి యొక్కింత, యాయుదారు
కడకు నరుదెంచి పోయెడిఘనుల నెల్లఁ
బిలిచి "యగసాలె యమగు లేకొలువుఁడింక"
యనుచు నేమేమొ యాక్షేపమాచరింప 98
ఉ॥ సారెకు స్వర్ణకారజనసంస్తవముం బొనరింపఁ బూని య
వ్వారలపక్షమూనినటు వారికిదోఁ చెడిలాగు, వారినే
కేరడమాడినట్లు మదికిం బొడఁగట్టెడిలాగు నాకు, నీ
తీరునసీతయాహ్వయుఁడు ధీరతమైఁ జరియించె నయ్యెడన్ 99
ఉ॥ "భూసురులేగనప్పు డటుపోయినఁ బిమ్మట వారు యుష్మదా
వాసపుఁగార్యముల్ జరుపవత్తురె" యం చెపరేని ప్రశ్నమున్
జేసిన సీతయాహ్వయుఁడు చెప్పినదుత్తరమేదొ దేవతా
భ్యాసముఁ జేరువాసివలె నయ్యయి చేతలఁ దానటించెఁగా 100
క॥ రూఢిగ మాయూర్కరణాల్
గాఢముగన్ మందలింపఁగడఁగక యీదృక్
ప్రౌఢిమగలవారగుటనె
మూఢజనుల్ గలము తాకు మొనగాండ్రగుటల్ 101
క॥ వారలననువర్తింపక
యేరీతినొ యుండునెడల నేగుదు రవలన్
వారే లేకుండినఁ దమ
నేరుపొకింతయును సాఁగనేరద యూరన్ 102
ఉ॥ అక్కడఁ బెద్దబావిదరి సందడుఁగూడి సువర్ణఘాతకుల్
చక్కనివిగ్రహంబులకుఁ జందనకుంకమసారభాదులన్
మిక్కిలిపూసి యొప్పునగు మేల్వసనంబులుకట్టి బండిపైఁ
జెక్కురుపట్టి పెట్టి యటఁ బెద్దలుకొందఱు కూరుచుండియున్
ఉ॥ "బాగుగనున్నదిప్పు"డని పల్మరుపొంగుచు నాత్మలందు నూ
రేగఁగఁ దీయునప్పటికి హేళి యనిష్టతఁ జందుఁడయ్యెనో

నాఁగ ఖమధ్యఁజేరి కిరణంబులతైక్ష్ణ్యము నెల్లఁజూపఁగన్
సాగెను, కాల్యకృత్యములుసల్పి భుజింపఁగ లేచి రగ్రజుల్ 104

మ॥ బహువాద్యంబులు మ్రోయదిక్కులద్రువన్ బాజారు బాజారునన్
గృహముల్ గల్గినచోటనెల్ల నిలువం బెట్టించుచుం బాడి త్సు
ప్రహితార్థంబుగ నృత్యముల్ సలుపుచున్ గ్రామంబునందంతటన్
బ్రహరార్థంబుచరించి రుత్సవముతో బత్తుల్ ప్రమోదంబునన్॥

చ॥ "పరిభవకారి యీతనిది బ్రాహ్మణజాతిక" టంచు నెంచి యే
జరిపిరి నారలామహము, సత్యముగానది మాదుజాతికిన్
బరిభవకారియెయగుచుఁ బాగుగనుత్సవవేళ వీథికిన్
మురియుచు రాగ లజ్జయయి మూలలయందె వసింపఁగాఁబడెన్ ॥106

ఉ॥ భాసురకీర్తియైన యొకపాటివకీలు మదీయబాంధవుం
డాసమయానవచ్చుటయు నాతనిఁగూడి మదగ్రజుండు నేఁ
జేసితిమప్డు భోజనము, చేసెడిపట్టున నార్యకర్ణసం
త్రాసకరంబులైన పలుతప్పెటచప్పుడు లాలకించుచున్॥ 107

ఉ॥ "ఎక్కడిదింతపాడురొద?" యిట్టులఁ దప్పెట బ్రద్దలయ్యెనున్?
దిక్కులుపిక్కటిల్లగ నుదీర్ణమనుష్యగళస్వనంబులున్
మిక్కిలిమ్రోచునున్నయవి మీనిలయంబులపజ్జనే మఱిం
తెక్కువసే" పటంచు నతఁడీవిధిఁ బ్రశ్నముసేయ మమ్ములన్॥

ఉ॥ ఉన్నచరిత్రమంతయును నొయ్యనఁజెప్పినవారమైతి మే
మన్నుడువుల్ వినంబడినయంతనె యాతఁడు విస్మితాత్ముఁడై
"యెన్నడుఁజూడ మిట్టిపని, యియ్యది యెంతయొగొప్పతప్పు, మీర
క్రన్నననేగి చార్జియిడఁ గార్యముసర్వము చక్కనయ్యెడున్"॥ 109

క॥ అని యేమేమోసంగతు
లనుకూలముగన్ వచింప నందఱముున్ భో
జనముం జేసితి, మంతటఁ
జనిమా రేగించుకొనుచుఁ జయ్యనబత్తుల్॥ 110

మ॥ చనిపోలేరమ పాతపాటమలకున్ సంప్రోక్షణంబన్న పే
ర నమాంగల్యపుఁగృత్యముల్ సలిపి యూరం దార ప్రఖ్యాతినిన్
గొనఁగంజాలిరి, యంత బోనములనుం గొంపోవఁగన్ వేళగా
గనరారందురు మందుకేన్ ద్విజుల నొక్కండేని, కోమట్లనున్॥111
చ॥ వరకులజాతులైన యొకబ్రాహ్మణవైశ్యులుదప్ప భక్తిమై
నరిగిరిచాలమంది వృషలాదులొకొక్కరుబోనమూని, **మా**
కరణముగారు "వత్తు" మని కాఁపుల సంతసపెట్టిపెట్టి కు
మ్మరికిడెఁదండులమ్ములొక మానెఁడొత వ్వేఁడొ వండిపెట్టఁగన్॥
క॥ ఈవిధిఁ గమసాలెలచేఁ। గావింపంబడఁ బ్రతిష్ఠ గష్టంబయ్యెన్
భూవిబుధులకందఱకున్। బోనీల్గాకుంట శక్తిపూజనమునకున్॥113
చ॥ తదుపరి నర్సరాట్పురికిఁ దానొకరెండుదినంబులేగుపై
నెదియొస్వకార్యముండెచని యిచ్చటిప్లీడరు చెప్పినట్టి య
య్యది మది నమ్మఁజాలకయ యచ్చటిపెద్దవకీలుమ్రోలనే
తుదవఱకున్ మదగ్రజుఁడు తుందుడుకంతయు విప్పిచెప్పినన్॥ 114
చ॥ "నిజముగనిద్ది పెద్దదగునేరమె, మీయధికారిముందరన్
విజయముకాదుమీ, కతఁడు వేలకువేల్తిను, మీదుశాత్రవ
ప్రజ బలవంతమైనయది, పాఱఁగనై చెద రెన్నియైననున్
గజిబిజియైచనుందుదకుఁ గార్యముమీయది వెంకటప్పయా! ॥ 115
క॥ అందుననే మేమందఱ। మెందేన్ గురిజాలప్రక్క కేగకయుంటల్
వందలువదలంగల వరి। బృందమునకు మీరు చార్జిపెట్టినయెడలన్"॥
*a* సీ॥ విద్వత్కవీంద్రముఖవివిధార్యసన్మాన
కరణసంపాదితఘనయశుండు

---

*a* తిరుపతివేంకటేశ్వరుల గుంటూరుసీమ ఉత్తరరంగము
క॥ ఉరుకీర్తి నరసరాట్పుర। వరవాసుఁడు పంగనామువంశ్యుఁడు సుగుణో
ద్ధురుఁడు నరసింగరావు। ప్పురమునకున్ మమ్మును స్వయముగఁదాఁ బిలిచెన్ 118

అన్నవస్త్రప్రదానాద్యాదృతానేక
బాడబవిద్యార్థిబాలకులకు
ఇంగ్లీషువారు నెంతే మెచ్చ మాట్లాడు
హూణభాషాప్రౌఢి నొప్పఁజాణ
వాదనైదుషి నెంతవ్యవహారమైనను
గెలిపింపఁజాలిన బలువకీలు

గీ॥ పంగనామాల శ్రీ నరసింగరావు
తత్త్వమీరీతినుడువ మద్భ్రాంతియంతఁ
"జూత" మనియనుకొంచు స్వచేతమందు
నచ్చెమాగ్రామమున కొకవారమునకు॥ 117

తే॥ వచ్చి ప్లీడరునుడివినవార్తయెల్ల
నాకువినిపించి తా మున్న నేకములగు
వ్యాజ్యములలోనఁ దిరిగినవాఁడగుటను
"బూర్వపుంబగదీర్చికోఁబూనె" ననుచు॥

చ॥ తలఁచి విమర్శకుం డెదియొదారికి లాగఁగలాఁడటంచు నా
వలననె చార్జిచర్య జరుపంబడు టుత్తమమన్న భావము
న్దెలుపుట యేవిలంబముగ నేనును దానికిసిద్ధమైతి, నీ
సలిపినయట్టిపాడుపని సహ్యముగామిని నంతరాత్మకున్॥ 118

క॥ ఇరువురముం గురిజాలకు। మఱుదినమున వెళ్లి నచట మాట్లాడుటకే
సరియైనయట్టిప్లీడరు। కలవై పని సుంతయేని కాకుండుటయున్॥

---

శా॥ "ఊరేగింపొనరించి తెచ్చితిమి మిమ్మోమహాయనఘా, నేఁడు నిం
పారంబం పెదమట్లె" యంచు నరసింహారావులోనైన యా
ధీయుల్ పల్కఁదొడంగి రెట్లో యలసద్ధీమంతులన్ మాన్చి కా
ర్యారంభంబునఁ జేసి యేగితిమి మే మానాఁడు గుంటూరికిన్॥ 128

ఆ॥ వె॥ జానపాటమూకు "జార్జినినిం" డంచు
నాదియంద చెప్పి యరిగినతఁడు
లానరి చిలుకూరు లక్ష్మినారాయణ
దా చెపలివసింపఁ దడయకరిగి॥ 120

క॥ వ్రాయించినరిగఁ జార్జి। యాయ్మన ద్వారమున వెళ్ళి యయ్యాదిదాఖల్
చేయఁగ నెంచిన రాపీఁ। డాయెనునధికారియతనినంతికమునకున్॥ 121

సీ॥ ఏదియో యొకనెపంబిడి త్రోసి వేయక
తిన్నగాఁ జార్జినిదీసికొనఁడు
పైప్రివేటుప్లీడర్లుపట్టువకాల్తులన్
స్థిరబుద్ధి దాఖలుచేసికొనఁడు
దండిప్లీడరు నేని దాలక్ష్య పెట్టక
క్రాసుచేసినను మల్ వ్రాసికొనఁడు
కోర్టునకరుదెంచు పార్టీలనెల్లరం
బువ్వఁదిట్టగ నోరుమూసికొనఁడు
గీ॥ ఇన్నికళలుగలిగియున్న మేజస్ట్రేటు
పల్లెపాటిజనుల భాగ్యగరిమ
రాఁ దటస్థమయి బిరాన ట్రాన్స్ఫరు గాక
యొక్కనాలు గేడు లుండనయ్యె॥ 122

మ॥ అపుడేయొక్కటి కోర్టులేనిదినమై యందందు వెళ్ళించి యా
విపరీతాత్మునిదృష్టియందుఁబడఁగన్ "వీల్గాదుపో"మ్మంచు చెదో
నెపముం బెట్టిమరల్చె నొండహామునన్, నేనంతమర్నాఁడుపో
యుపడన్ ముందర నేదియో వెదకెఁగా మేముందునాదోసమున్॥ 123

క॥ వెదకి యది యేటొ చెప్పఁగ। నదియుదినేదిద్దికొనుచు నాచార్జిన్
దుదకెట్లొ పెట్టఁగలిగితి। వదల కతనికన్న మొండివాడనగుటచే॥

చ॥ అదియదియన్నియుంగలిసి యయ్యెనుజార్జియొసంగనాటికిన్
బదియయిదుందినంబులిటు, పల్వురెఱింగినకొట్టులిట్టువం
టిది యిది కాకయుండుటను నిల్కడయయ్యెనునింతకాలమున్
దుద కిది యొక్కహేతువయి తోడ్పడెమాయధికారిగారికిన్॥ 125

చ॥ అయియయియన్నియుం దుదకు వ్యర్థమయయ్యెనుచార్జి, యేమనన్
న్యాయముగనే విమర్శనముసల్పక యాతఁడు విద్గురేలకున్
రయముగఁ జేసెఁదారిఫరు"రమ్మటన్యాయముకల్గకున్న నే
న యిదివిమర్శ చేతు"ననినాదనుకన్నులనీళ్లు తుడ్చుచున్॥ 126

ఉ॥ పోయితినంతనేమగునొ పూన్కియటంచును,పిద్గురాళ్లలో
నాయకుఁగప్డు స్టేసనున నాయఁడుగారొకరుండఁ గమ్మమా
నాయనలేగిపిల్పుటయు న్యాయము తేల్చుటకేగుదెంచెఁదా
నాయనగారు, ప్రప్రథమ మయ్యెనుగోష్ఠియొకండువారికిన్॥ 127

క॥ కృపలేక తఱిగికోళ్ళన్
గపటాత్మత మెసవి త్రావి కల్లున్ సారాయ్
త్రపవిడిమాయుర్కమ్మలు
కుపథమునఁదిరుగుచుండ్రుగోష్ఠియటంచున్॥

క॥ ఆగోష్ఠులకనుకూలురు। రాగనె యాహూతిసలిపి రయమునదమకున్
లోఁగొనియెదరెంతటియు। ద్యోగినినేన్ న్యాయమెట్టులుండెడినింకన్॥

ఉ॥ కేసువిమర్శకుంగడఁగి క్రిందికివీఁదికిఁ జేసి స్టేషనా
ఫీసరుగారుపోవుటయుఁ బెట్టితినేను బిటీషనొండు"వీ
ర్పాసిరిన్యాయమార్గమును గ్రమ్మఱ సొంతగ మీర్విమర్శకున్
దీసికొనుం"డటంచుఁ బయిధీగునకున్ మదిఁ దత్తరంబునన్॥ 130

తే॥ ఆపిటీషనుజూచి ధర్మాధికారి
యప్పుడిడి పైలులో "నింకదప్ప"దనుచు

ముందుగా న్యాయపక్షమే పూని కేసు
చాలవఱకు విచారించి చార్జిచేసె 131

క॥ "పండితుఁడవీవు, నీసరి
దండిమగల్ లేరుచూడఁ దక్షులలో"నం
చొండొక స్తోత్రము చేయుచు
నుండంగన్ మొదలుపెట్టె నొక్కొక్కయెడన్ 132

క॥ నాదియు బ్రాహ్మణవర్ణమె
యేదేన్ దేల్పంగవలయు నిందె"యటంచున్
నాదగుపక్షముఁబూనిన
మాదిరిమాట్లాడె మధ్యమధ్యను నాతోన్ 133

చ॥ ఇదిసకలంబు ముద్దయిలకెక్కుడభీతిజనించి యేగియో
కుదురుచుకోఁ బ్రయత్నపడుకోసముగాని కనంగ నాదుపై
నొదవుకృపావిశేషమయియుండదు, వంచకులిట్లు లేకదా
మెదలుట లోకమందుఁ దమమిత్రతఁజూపుచుఁ గొన్నిఘస్రముల్

ఉ॥ ముద్దయిలందఱుం దమది మూర్ఖత సుంతయుఁ గాదటంచు మే
మద్దెసనుంజికూడఁ దమయాపసికిష్టులమైతిమంచు నీ
విద్దెకలాదులున్ సలుప వేమఱుచూచుచునుంటిమంచుఁ దా
మెద్దియొ చెప్పికొంచు నపుడిందుకుఁ దెచ్చిరి కొంతసాక్ష్యమున్ 135

క॥ కమసాలెలుకొందఱు సా। క్ష్యము చెప్పిరి వారికద్ది క్రమముగుఁగా క
క్రమముగవచ్చిరికొందఱు। కమసాలెలపక్షమూని గ్రామణిముఖ్యుల్

చ॥ ధరణిసురుండుతానగుచుఁ దక్షుకవర్ణజులప్రతిష్ఠలన్
జరుపుటకున్ సహాయమును జాలనొనర్చినయట్టిప్రౌఢు మా
కరణముగారి ముద్దయినిగానటుఁ జేర్చుట యుక్తమైననున్
బారపడివిడ్చితిం దుదకు బోనముదాఁ గొనిపోఁడటన్నధీన్ 137

చ॥ విడిచిననాకుఁ బాచితము వెంటనెచేసె, నదెద్దియంచనన్
వడివడిసాక్ష్యముల్ నుడువవచ్చెను బంధులఁగూడి "నీకునీ
నడవడికూడ"దంచును ఘనంబుగ నెందఱుబోధచేసినన్
విడువఁడు తానుబట్టిన విసింద్యపుఁబట్టుదలన్ మనంబునన్ 1·8

క॥ "మునిసీభుల్ ముద్దయిగా
నొనరించితిరీవు కాననొప్పితి సాక్ష్యం
బున"కనుచును నేమేమో
యనుకూలతనన్నుఁగూర్చి యతఁడువచించెన్ 139

ఉ॥ ఇద్దఱిదొక్కగ్రామమయి యెవ్వియొవైరములుంటఁ జేసి యీ
కొద్దిపనింబొనర్చుటకుఁ గోర్టునకెక్కెను నీతఁడిట్టులన్
పెద్దమనుష్యుఁ డుత్తముఁడు పెత్తయుఁ దంగెడ వీరయాహ్వయుం
డద్దిర సాక్ష్యముంబలుక నాయనకున్ మనసెట్టులొప్పెనో 140

ఉ॥ ఉత్తరసాక్ష్యమందుఁ దమకున్నయపాండితిఁజూపి యెవ్వియో
బత్తులు వాదముల్ సలుప "బాగుగలేదిది"యంచు నెంతయో
మొత్తుకొనంగనే నవుడు మోసముచేసెను "గోర్టుపక్షమై
ఎత్తురు ప్రాజ్ఞులొక్క"రనిపల్కులు నాయధికారిచెప్పఁగన్ 141

క॥ శ్రీనాభివంశపంకజ। భానుండగు రామమూర్తిపంతులుగారిన్
నేనందుఁ గోరసాక్ష్యము। "నానధికవ్యయముకోర్టు"కనియుడిగించెన్

తే॥ అందుపైనేను దాడెపల్యాంజనేయ
శాస్త్రిగారినిగోరిన సమ్మతింపఁ
కెవరొవత్తురువత్తురం చెన్నొదినము
లచటఁ బడవేసియుంచె మమ్మకటయతఁడు 143

ఉ॥ బాగుగనేర్చి హూణకలఁ బండితులై సురభాష నున్నతో
ద్యోగము నేయుచుండిన మహోన్నతులేయరుదేర సాక్షులై

సాగదు స్వప్రతాపమని సాకునెదోకలిపించి వారికా
యోగమునంబునొప్పకయ యాతఁడు దుష్ప్రథముఁ విధించెగా 144

చ॥ గడపఁగనేమొచెప్పుచును గాలమునీవిధ ముద్దయిల్ భయం
పడి పదిమందిగూడి పలుపాట్లకులోనయి వర్తమానముల్
నడిపిరి యయ్యగారికిఁ, గనంబడెనెద్దియొలాభ, మందుపై
విడుదలచేసెనందఱిని వేగము కేసును గొట్టివేయుచుఁ 145

ఉ॥ "మీకరణాలెచేసిరిసుమీ యిటు బ్రాహ్మణులయ్యుఁదాము, నే
నేకరణిఁ విధింతునిఁక నియ్యది నీకుహితంబుగాను, కై
కోకిదియాత్మలోన సివిలుకోర్టున నేగిసఁ గల్గు న్యాయ"మం
చాకులపాటునఁ మరలనాదృతిచూపియె పంపెనాపయిఁ 146

---

a ముద్దయిలు

I. వోలేటి లక్ష్మయ్య
II. నందిగామ కాశీపతి
III. సిరిపురపు భిక్షాపతి
IV. నందిగామ చినబ్రహ్మయ్య
V. జుజ్జూరి మల్లయ్య
VI. వున్నము చినవీరయ్య
VII. వున్నం చంద్రయ్య
VIII. బొగ్గవరపు శేషయ్య
IX. కాటూరు నారాయుఁడు
X కూరపాటి ల చ్చన్న

ఫిర్యాదితరపు సాక్షులు.

1. జానపాటి పట్టాభిరామశాస్త్రి
2. ముదిగొండ భద్రయ్య
3. జానపాటి రామయ్య
4. జానపాటి అచ్యుత రామయ్య
5. నందా నరసింహము
6. రాంపల్లి మహాదేవశాస్త్రి
7. పత్తిల వీరాస్వామి

ముద్దయితరపు సాక్షులు.

1. జానపాటి రంగయ్య
2. జానపాటి జానికి రామయ్య
3. ఏలూరు సర్వయ్య
4. వెల్లటూరు శేషావధానులు
5. సిరికొండ దశరథయ్య
6. తంగెడ వీరయ్య
7. వంటల వెంకయ్య

ఆ॥ *a* యాజనాధికారమగసాలె జాతికిఁ
"గలదు లేద"టంచుఁ గట్టిచేయఁ
గాద యిది మదీయకార్యంబు కావునఁ
దద్విమర్శచేయఁ దలఁపలేదు" 147
క॥ అని యేమొవ్రాసి వెంటనె। కనఁబఱిచెదనదు తెలివి "కమసాలెలకీ
పనియందర్హతకల"దని। "యనిరెవరో సాక్షు"లనుచు, హా యేమందున్
తే॥ చాలచోట్లఁబ్రతిష్ఠలన్ సలిపిరంట
కాని మాదినపాటిలోఁ గరణమయ్య
యొకఁడు తేలెను సాక్షియై యుర్విపైకి
నదిశిలాక్షరమయ్యె ధర్మాధిపతికి॥ 149
ఉ॥ *b* మాదినపాటిబ్రాహ్మణులు మాదిప్రతిష్ఠకు నొప్పికొంచుఁదా
మాదెసకేగి బోనములనర్పణజేసిరటన్న దెంతయున్
గాదునిజంబు, వీరయయు గ్రామణితమ్ముఁడు సీతయాఖ్యచే
బాధితుఁడై యటుల్ పలికెఁ బాపము బంధుజనప్రియంబుగన్ ।150

---

*a* పై కేసుయొక్క తీర్పు. ఇంగ్లీషుకు సరియైన తెనుఁగు

(15) సివిల్ కోర్టుయొక్క యధికారములోవుండు పార్టీలహక్కును స్థిరపరచుటయ నునది యీకోర్టువారివిధికాదు, కావున నాయంశమును విచారించఁదలఁపలేదు.

(17) 4-5-6-7 ముద్దయితరఫుసాక్షులవల్లఁ గమసాలెలు ప్రతిష్ఠలుచేయుటకర్హులని యుఁ జాలగ్రామములలోను దాచెపల్లిమాదినపాడు గ్రామములలోను జేయించిర నియుఁ దెలియవచ్చుచున్నది. అందులో మాదినపాడుగ్రామములోఁ గొలదికా లములో జరిగినట్లు తెలియుచున్నది.

*b* తంగెడ వీరయ్య సాక్ష్యము.

ఇప్పటికి 10 సంవత్సరాలక్రిందట నాగ్రామములోవుండె మాదెమ్మదేవతను నా గ్రామములోని యావత్తుమంది పెద్దఅగ్రహారంకాపరస్తుడయిన వకవిశ్వబ్రాహ్మణివల్ల ప్రతిష్టచేయించినారు సదరుదేవతకు బ్రాహ్మణులు బోనముయిస్తారు......బ్రాహ్మణులుకూడా విశ్వబ్రాహ్మణులవల్ల ప్రతిష్టచేయుటకు యిష్టపడినారు......ప్రతిష్టకాలమందు బ్రాహ్మణులుకూడా వచ్చియుండిరి...జానపాడుకరణం రంగయ్య నాకు బంధువుకాడు......

చ॥ తమకును మాకునుం గలుగు దారుణపుం బగ మాదుగ్రామణుల్
శ్రమకలిగింత్రుగాక కడుసాక్ష్యము పల్కంగ, నింతమాత్రనే
విమనస్కుడై యిటుల్ పలుకు వీరయ యోగ్యత యేమనన్వలెన్
దమకరణాలెపల్క "రిదిశ" ప్పనియెందలొ నిందసేయుచున్ 151

క॥ తనపితనుడియన్న "తముకా" దనుసుందర రామయాఖ్యుడను నేమో కా
తనకున్ మాకరణాలకు ఘనబంధుతయుండియుంట కల్లయటంచున్

* క॥ మాదినపాటిద్విజాతులు
మాదమ సంప్రోక్షణంబు మాటే యెఱుంగర్
"కా దెలుగుదు" రనియే యనుం
డా దేవతఁ గొల్వరంట యవ్వారెపుడున్ 153

క॥ పెదయగ్రహారమందంట
చదివినకమసాలెయంట సంప్రోక్షణమున్
గుదురుగఁ జేయించునంట
య్యది యెంతయథార్థమగునొ యరయుఁడు ప్రాజ్ఞుల్! 154

క॥ ఉన్నవి నలుబదికొంపలు
ఎన్నడునట బత్తులుండు టెఱుంగరయెవరే

---

*బ్రహ్మశ్రీ జానపాటి పట్టాభిరామశాస్త్రిగారి దివ్యసముఖమునకు.

విన్నపములు. పల్లిలక్ష్మీనారాయణ కృతనమస్కారపూర్వకముగా వ్రాయుచున్నది.

అయ్యా! నాకు 50 సంవత్సరముల వయస్సు వున్నది. నేనెరిగిన తర్వాత మాగ్రామములో ఏ దేవతకు గాని కమసాలలచే ప్రతిష్ట చేయించబడి యుండలేదు. మాగ్రామములో మాదమ్మ యనునొక దేవత వున్నమాట వాస్తవము. ఆ దేవతకు కొలుపులలో గాని యితర సమయములలో గాని శూద్రాదులు బోనములు చెల్లించి కొలుచుటయె తప్ప బ్రాహ్మణులు కొలుచుట ఎన్నడును లేదు. బ్రాహ్మణులు తమ యిండ్లలో తామె దేవత పేరుజెప్పి నైవేద్యములు పెట్టుకుందురు. ఇంతే సంగతులు, చిత్తగించవలయును.

పల్లి లక్ష్మీనారాయణ వ్రాలు.

నెన్నికగన్నకలాదానె
క్రన్ననవీరయ్యగారు కల్పించిరిగా

ఉ॥ వీరయగారికింజతగ వెంకయగారొక రేగుదెంచె "మా
యూర నెదో ప్రతిష్ఠ యయియుండెను బత్తులనుండి" యంచు, నా
పేరెవరేని నెప్పుడును విన్నది కన్నదికూడఁగాదు, మా
వారికినెట్టులో దొరకె, వాసిగడించె వచించిసాక్ష్యముల్ 156

* ఉ॥ దాచెపలిం బ్రసిద్ధుఁడుకదా యరయంగను బిచ్చిరెడ్డితాఁ
జూచిన నింకనుంగలరు సువ్రితులెందఱొ, యిందఱుండ నే

---

* దాచేపల్లి పురవర్ణన.

చ॥ వరదాచేపలివంశ నాయక మహావారాశికిన్ నిండుచం
దురుఁడౌ వెంకటసుబ్బయాఖ్యుఁ డెపుడుం దోట్పాటుగానుండఁగాఁ
బరభీముండగు పేరిరెడ్డి యెదుటన్ భాసిల్లఁ గోలాకులాం
బురుహాదిత్యుఁడు పిచ్చిరెడ్డి నిరతంబున్ సల్పు దీనన్ సభన్॥ 66

క॥ వేంకటసుబ్బయమంత్రిఁ గ। శంకరహితుఁబొగడ నేను లావరిసటవే...... 67

ఉ॥ సంకటమొందునప్పుడును...పంకవిదగ్ధ దేహులను బాయకయుండి మెలంగునప్పుడున్
బొంకకయుండునీతఁడు......... 68

క॥ సత్యవాక్ప్రౌఢుండని। నిత్యముబుధవర్యులెన్న నేర్పరియగుచున్
ప్రాత్యుల కతిదూరుండై। కృత్యము సలుపుచునితండు కుంభిని నిలిచెన్ 69

తే॥ ఇట్టికరణంబుతోఁగూడి రట్టులేక । పిచ్చిరెడ్డియు సల్పెడిఁ బెద్దసభను......70

క॥ దుష్టజననిగ్రహంబును। శిష్టజనానుగ్రహంబు సేయఁగనితనిన్...విధించె......71

సీ॥ హెడ్కలెక్టరు మొదల్ హేమాహెమీలను సన్మానసర్టిఫికెట్లు నొసగఁబడె
డిస్ట్రిక్టుబోర్డులో శీవిగులుక్కు చానొక్క మెంబరుతానయి మెప్పువడసె
కజవుల నిలు పేదనరులందానరయుచుఁ గబళముల్ వేయించి ఘనతగాంచె
సర్కారులోఁగూడ "సత్యవంతుఁ"డని సర్టిఫికేట్టుపొందితాఁ గడుఁజెలంగె

గీ॥ దాచెపలిలోన చేర్మెను తానెయగుచు। జనులకారోగ్యమిడి చాలఁ జతురతగనె
దురితపథవర్తులయినట్టి నరులపాలి। పిడుగనందగునట్టి యాపిచ్చిరెడ్డి॥ 72

నీచునిసాక్ష్యమో మనము నిశ్చయమం చెటునమ్మనౌనొ మీ
ర్యోచనసేయుఁడీ చదువరుల్ కడుబాగుగ మానసంబులన్ 157

ఉ॥ ఈతఁడెవోయకార్య మిహిహీయన నెల్లరు చేసెనంట యా
హేతువుచేత బ్రాహ్మణు లనిష్టత నీతని ఝుంటఁ బెండ్లిరా
నాతని సేగకుండిరఁట, యప్పుకలాదులు వచ్చి కార్యమే
రీతినొ వెళ్లబుచ్చిరఁట ప్రీతియుఁ టప్పటినుండి వారిపైన్ 158

---

ఉ॥ ఇట్టిఘనుండితండగుట నీతని పేరు సమస్తదిక్కులం
దట్టచరించి సత్పురుషసంగముదాల్చి యజస్ర మీశనిన్
జుట్టివసించెనాఁగ రణశూరుఁడు దుష్కృతదూరుఁడైన తోఁ
బుట్టువు పేరిరెడ్డియును బూర్వజుప్రోలవసించు నెప్పుడున్॥ 78

చ॥ ......కవిజనసంచయంబునకు గౌరవమొప్పఁగఁజేయ నేర్చియున్
భువిమనెఁబేరిరెడ్డియుటఁ బూర్వజు నానతిమీఱికే రహిన్॥ 74

By command of His Excellency the Viceroy and Governor-General in Council this certificate is presented in the name of his most Gracious Majesty King Edward VII; Emperor of India, to M.R.Ry. Kola Pitchireddi Garu, son of Narisireddi Garu in recognition of his services as a Headman and as Chairman of the Dachepalli Union.

Madras<br>
1st January 1903

(Sd) ....................<br>
Chief Secretary to the<br>
Government of Madras.

(True Copy)

......George V., Emperor of India, on the occasion of His Majesty's Coronation Durbar at Dehli to M. R. Ry. Kola Pitchireddi Garu, son of China Narisireddi Garu; in recognition of his services on Local Boards.

Madras.<br>
12th December 1911

(Sd) Hon. W. STUART.<br>
ag. Chief Secretary to the<br>
Government of Madras.

(True Copy)

ఉ॥ అందున నేగుదెంచె రీతిఁ, దయ్యది సత్యమె యైనఁ బెద్దలే
యెందుకు రాకయుండ్రొ, నిజమే యగుఁగావుత, నేరొ చేసినార్
పొందలఁబంచు నందఱికిఁ బథ్యముగాదది, యట్లచూచినన్
గొంద అసుల్ హరింతు రదికూడఁ బరిగ్రహయోగ్యమే కదా 159

*ఆ॥ ఈయన నామధేయుఁ డిటు పల్కె తర్వాత
సత్యమరయఁ గోరి జాబు వ్రాయ
జరుగలేదనుచట సంప్రోక్షణంబు చేఁ
బ్రీతి నిడె జవాబు పిచ్చిరెడ్డి 160

ఉ॥ "ఆయమ్మ ప్రతిష్ఠ దా చెపలి నాయెను మాదివపాటిలోన" నం
చీయుభయుల్ వచించినది యెంతయథార్థమొ తెల్పినాఁడ మా
వ్రాయసకాండ్రు "బ్రాహ్మణులు వచ్చిరి యిష్టముతోడ" నంచు నే
మో యనుకూలతం బలికియుండిన సాక్ష్య మొకింత చూడనా 161

సీ॥ స్వర్ణకారుల చేత సంప్రోక్షణంబులం
జేయింతమని మున్ను చెప్పలేదు
"అతనికి కార్యంబు నాచరించుటలోన
నర్హతకలదె" యంచడుగలేదు
అతనిఁ దోడ్తేఁబోవు నవసరంబునఁగూడ
నడిగియభీష్టంబు పడయలేదు
అతఁడరుదెంచిన యావలనైనను
బిలిచియాసంగతి దెలుపలేదు

---

* శ్రీ జానపాటి పట్టాభిరామ శాస్త్రులువారి సముఖమునకు.
వి. కోలా పిచ్చిరెడ్డి దండములు పెట్టి వ్రాసుకున్నది.
యీ గ్రామంలో వున్న...అంకాళమ్మ అనే శిలను పూర్వము యెప్పుడు ప్రతిష్ట చేసినారో మాకు తెలియదు...శిల శిథిలమయినందున క్రొత్తది వకటి షుమారు 15 సం వత్సరముల క్రిందట తెప్పించి తిర్గి స్థాపన చేయించినాము. వక యంత్రబిళ్ళ కంసాలి బత్తుడు చేత చేయించి దాని క్రింద వేసి విగ్రహమును నిలువ బెట్టించినాముగాని శాస్త్రప్రకారము ప్రతిష్ఠ చేయించివుండలేదు.

చిత్తగించవలెను, విధేయుడు, కే. పిచ్చిరెడ్డి.

సర్వమైపోవుచుండెడి సమయమందు
గ్రుద్దులాటలకేగుటల్ కూడవనుచు
మంచిమాటలచే నందలించినట్టి
బ్రాహ్మణుల్ దీనికింక నిష్టపడుటయెట్లు॥ 162

క॥ ఎందుకనియొప్పికొందుమొ!
యెందులకని యప్రతిష్ఠకేగుదుమోమే
మందఱ, మిదియాలించిన
మందునకే నమ్మకంబు మదిఁగలుగునొకో॥ 163

క॥ కులమునకధికుండౌ యో
యలఘుకళాకలితుఁడనియె యారథకారుఁ
బిలిపించి యప్రతిష్ఠలు
సలిపించుటకిష్టపడుట సకలమహీసురుల్॥ 164

సీ॥ చాలకాలమునుండి సంవర్ధితంబైన
యస్మదగ్రజుమీఁదఁ యాగ్రహంబు
వశులైమెలంగని వైదికజనులపై
నావిర్భవించు నీర్ష్యాతిశయము
మునిసీఫుఁబెదకాఁపు మొదలౌ జఘన్యజుల్
తననుండి విడిపోదురను భయంబు
ఆజన్మసిద్ధమై యలరారుచుండెడి
యక్రమారంభ నిజాభిరుచియు
నిన్నియుం జేయనిది చాలహీనమనుచు
మదికిఁదోఁపక సాక్షియై మాకరణము
కోర్టునకునెక్కి ముద్దయిల్ కోరినట్లు
పలికెఁ * బినతండ్రితోఁగూడి ప్రల్లదములు॥ 165

---

ముద్దయిలతరఫు 2వ సాక్షి జానపాటి జానకిరామయ్య కైఫీయ్యతు.
1టో ముద్దాయి ప్రతిష్టచేసినది నాకు యిష్టము. 1-3-4-5 ప్రాసిక్యూషన్ సా

* ఉ॥ మూడవసాక్షి వర్తకుండు, మున్నిభు గ్రామమౌ పెద్దకాఁపురున్
గూడి "వచింపుసాక్ష్య" మనిగుబ్లులుమంగనె భీతినంది యీ
పాడునుడుల్ వచించుటకుఁ బాల్పడె, తానుబ్రతిష్ఠయానెడ
న్బోఁడట, యిష్టమేయఁట, కనుండు తదుక్తుల నేమియర్థమో॥ 166
ఉ॥ గడ్డియుఁగంపయుందిని విగర్హ్యపు వృత్తిగడించియర్థమున్
వడ్డికిసచ్చిబీదల దివాలసపించుననగాని యూరిలో
హెడ్డుల బాకిమాత్రిముంరకేవిదు నుందుద, పెక్కులేల, షైఁ
బెడ్డలు వేయువారల కెస్పెట్టెదుసీతఁడువంక దండనుల్ ॥ 167
తే॥ అంతియేకానియరయంగ నుంతయేని

---

ఉలుకూడా 1టో ముద్దాయితో ప్రతిష్టలుచేయించను వొప్పుకున్నారు ప్రతిష్టకాలమందు నేను వుండినాను......నా రెండవకుమారుడు నా గ్రామంలో చదువులబడి వుంచినాడు. 6వ ముద్దాయితాలూకు కొమారులు బడికిచదవనువస్తారు......1డి ఫెన్సు సాక్షి రంగయ్య నా అన్న కొమారుడు, శీతారామయ్య, నరశింహాయ్య నాకు అన్న కొమారులు. కుమ్మరవానికి బియ్యముయిచ్చి బోనము యివ్వమని చెప్పినారు.

* 8వ సాక్షి యేలూరు సర్వాయ్య కైఫియ్యతు.

...కోమటి.....నా గ్రామంలో పోలేలమ్మ పాతపాలెమ్మ దేవతలువున్నవి సదరీ దేవతలు యిప్పటికి రెండు నెలలకింది పునహా ప్రతిష్టచేయించబడినవి. 1టో ముద్దాయి ప్రతిష్టలు చేసినాడు. ప్రతిష్టలకుగాను గ్రామంలో యావత్తుమంది చందా వేసుకున్నమాట నిజము. ప్రతిష్టలు చెయ్యాను నా గ్రామంలో వుండేవాండ్లు యావత్తుమంది వొప్పుకున్నాము......1-5 సాక్షులు 1టో ముద్దాయి ప్రతిష్ట చెయ్యాను వొప్పుకొన్నారు. 1టో ముద్దాయి ప్రతిష్టచేసినపుడు నేను పోలేదు......నాకొమారునిమీదవచ్చిన తప్పుసృష్టి కేసులో 6వ ముద్దాయి 5వ ముద్దాయితండ్రి 8వ ముద్దాయితండ్రి ......సాక్షులుగావచ్చినారు. 6వ ముద్దాయిమీద వచ్చినకేసులో నేను సాక్షిగావచ్చియుంటిని. 6వ ముద్దాయి నాకు బాకీయుండేమాటనిజము......నేను బోనముచెల్లించలేదు. యితరులు యెవరెవరు బోనము చెల్లించినది నాకు తెలియదు. నా గ్రామంలో పెద్దకాపు 6వ ముద్దాయి......1టో ముద్దాయివల్ల ప్రతిష్ట చేశినందుకు నాఆక్షేపణ యేమిలేదు......

పిన్న పెద్దవివేకంబున్నయచట
అతఁడుకాఁపులఁగరణాలనందఱవిడి
నిజముపల్కుట కేరీతినిల్వఁగలఁడు! 168

తే॥ వారికాతఁడు నతనికి వారలెపుడు
సాక్ష్యములకేగుచుండెడిసరణిజూచి
యతనిసాక్ష్యపుయాదార్థ్యమరయుభార
మీారలేవహియింపుఁడో యిద్ధగుణులు! 169

సీ॥ పసిపూర్తిమాటాడిపలితెంచుటేతప్ప
సంతతాశ్రయణంబుసల్పఁబోను
తీరియున్నను నాదుద్వారసీమనెతప్ప
నురకవీధులఁగూరుచుండఁబోను
ఉండినయాదార్థ్యముచ్చరించుటెతప్పఁ
బహుప్రీతికినృతంబుఁబల్కఁబోను
రసికుఁడై వినఁగోరిరా వచించుటెతప్పఁ
జేరిమూర్ఖులకేప్డు చెప్పఁబోను
జుట్లజుట్లకుముడివెట్టిచూడఁబోను
నెతకిమెలికెయు(యభాండముల్) వేయబోను
అంచయునీకనెట్టులేలూరినరసయాహ్వా
యుఁడుమదిష్టప్రకారంబు నుడువఁగలఁడు

ఉ॥ కారణమేదొయుండవలెఁగాపునరావాసెరు "వీరిసాక్ష్యమీా
ధోరణిచున్న"దంచుఁగడుదూఁకుడుమైనధికారి, నేరమే
తీరునఁబోవనానో యదెతీరునఁబోయెనుసశ్చయాన, కే
ఘోరముచేయఁగాబడదు? కుంత్సితమైనధనాశ యున్నచోః 171

ఆ॥ "మాకులెక్కఁజూచి మైలేజిలిం"డంచు
నస్మదీయసాక్షులందఱపుడు
పోయియడిగిరతనిఁ బోలీసుకేసాట

నదరఁగొట్టిపంపె నతఁడువారి

ఉ॥ పూర్ణయగారిసన్నిధికిఁబోయి వకాల్తునొసంగిరంత, సం
పూర్ణకృపామతిం గదలిపోయి కలెక్టరుతోవచించె,నా
కర్ణనచేసియాఘనుఁడు గ్రక్కునవారిసెనుగ్రిందికోర్టు కా
దుర్ణయుఁడిన్నిమైనతుద దూఁకుడణంగి యిడెన్ వ్యయంబులన్

తే॥ కోర్టులో ధర్మశాస్త్రముల్ కొన్నినావి
దాఖలైయుండ నిప్పింపఁదలఁపఁడయ్యె
తిరిగితిరిగియు వేసారితిం దదర్థ
మింతకన్నను దౌర్భాగ్య మేమి కలదు 174

చ॥ జరిపియెటోయతండు గురిజాలవసించెడికాలమెల్ల శ్రీ
హరికరుణావిశేషమున నావలనేగుటసంభవించి స
త్పురుషుఁడొకండురాఁ జనినతోడ నెయిచ్చెను ధర్మశాస్త్రముల్
సరసుఁడతండు వైశ్యకులచంద్రుఁడు వెంకటరామసెట్టిసూ 175

ఉ॥ ఆవిధిఁగేసుకొట్టుపడి యామహనీయునిబారినుంచి నే
నేవిధిగానొతప్పుకొని యింటికిఁజేరుదు నూరిలోని మా
యావిదులాచరించుపరియాచక మెక్కువమైమదాననం
బీవలవెళ్లఁబెట్టుటకు బ్రేరజనియించె నిఁకేమిచేయుదున్ 176

ఉ॥ "మాయది బ్రాహ్మణత్వమన, మాది పవిత్రతయొసర్చుకార్యముల్
మాయది సృష్టికార్యము,సమస్తముమాయది"యన్ ప్రసంగముల్
చేయనుపక్రమించి పనిచేయుటమానిరి బ్రాహ్మణాళి, "క
య్యే" యని వార * లర్జియిడిరొక్కటిపై యధికారిసన్నిధిన్ 177

* మహారాజరాజశ్రీపల్నాడుతాలూకా తహశ్శీలు దార్లువారి సముఖమునకు.
తాలూకాయిలాకా జాగపాటికాపురస్తుడు జానపాటి రామయ్యవ్రాసుకున్న
మనవి.
అయ్యా

1 గ్రామంలో వ్యవసాయకులందరికి చక్కగాపనులుజరుగగలందులకు వడ్లక
మ్మర్లకు చాకిరియినాములుయేర్పడి యి96-81ట్లువున్నది, భుక్తపరుచుకుంటూ యిం
కా మామూలు మేరలుపుచ్చుకుంటూ వడ్రంగం కమ్మరం పనలుచేయుచున్నారు.

చ॥ ఇంకఁ బ్రతిదేవతావసతి నేము ప్రవేశముచేసి పూజనా
దిక మొనరింతు"మంచు"మమధిక్కృతియెవ్వరుచేతు"రంచునుర్
వికటపుభాషణంబులను వేమఱు పల్కఁగసాఁగిరెవ్వియో
యొకడనియావచింప నిటనుండుకలాదుల దుష్ప్రసంగముల్ 179

---

8 గ్రామములో అనాదిగనుండు పార్టి విరోధములచేత కర్ణం రంగయ్య ఆయన తమ్ములు, మున్సబు చినవీరయ్య మొదలగు ఇంకా కొందరు మాకిట్లాన్ను కూడా కొంతన ష్టముకలుగవలెనని యిబ్బందిపడవలెనని నావగయిరా బ్రాహ్మణులకు పనులుచాయవద్దని ప్రోత్సాహ పెట్టుచున్నారు.

9 వడ్లకంమ్మర్లు చాకిరియినాములు అనుభవింపుచు వ్యవసాయకులవల్ల మా మూలుగా వేరే మేరలుపుచ్చుకుంటూ యితరకార్యములమీద యిట్లా వ్యవసాయకుల యిబ్బందిపర్చడము చాలా అక్రమము.

10 యిప్పటిషుమారు 16 సంవత్సరంలక్రిందట రయితుల్లో కొందరిని యిబ్బంది పర్చగా వారపుడు కొత్తగా సదరునందిగామసుబ్బన్నను యేర్పరచుకొన్నారు. సదరు సుబ్బన్న వడ్లకంమ్మరపనులురెండున్ను చాయగలడు.

11 కాబట్టి వడ్లకమ్మరచాకిరి యినాములు అనుభవించుచు యింకా వేరే మేరలు చక్కఁగా పుచ్చుకొనుచు మధ్య మధ్య వ్యవసాయకుల వృధాగా ఆయాస పర్చుచున్నందుకు వడ్లకంమ్మర్లుఅయ్ని 1 శిరిపురపుభిక్షాపతి 2 నందిగామ చిన్నబ్రహ్మం 3 శిరిపురపు కోటయ్య 4 నందిగామ వీరయ్య 5 నందిగామ అంన్నమ్మతరపు ఆమె తమ్ముడు స్వర్ణాఅప్పయ్య 6 శిరపురపువీరయ్యలను విచారించి పింమ్మట వారిట్లాజరి గించుచున్నందుకు సాక్షులవిచారించి వారివద్దనుండి చాకిరీయినాము అంత్తగాని కొంత గాని తీసి గ్రామచాకిరియినాము అనుభవములేకుండా చాకిరిచేయుచున్న సుబ్బన్నకు గాని లేదా మరివకరికిగాని యిప్పించి వ్యవసాయకులకు పనిపాటలు చక్కఁగాజరుగు లాగు యేర్పరచగలందులకు తమ్మఘునమును మిక్కిలిప్రార్థిస్తూ వున్నాను. దివ్యచిత్తము నకు తేవలయును. ది 30-11-06 సం॥

జానపాటి రామయ్యవ్రాలు

ఉ॥ పాపయపాలెమందునొక పాడువివాదముసంభవించి ఘో
రాపదగల్గె బ్రాహ్మణుల కప్పుడె బత్తులమూలకంబుగా
నీపగిదిన్ వివాదయుగి నేర్పడఁగంజయమాత్మపక్షమం
దాపనశక్యమైచెలఁగెనక్కట వైరిజనప్రగల్భముల్ 180

చ॥ బలవదపాయహేతువగు పాపయపాలెపువార్తయేమనన్
గలదొకదేవళం బదియొక్కానొకబత్తుఁడుద్రవ్యమిచ్చి తాఁ
దొలుతసృజింపఁ జేసెనఁట, ధూర్వహులచ్చటభూమిదేవులున్
గలరు, తదర్చకుండుగ నొకానొకనంబి విధింపఁగాఁబడెన్ 181

క॥ గుడికట్టించినయాతని కొడుకునకున్ భూమిసురులకుం బడ కొక్క
ప్పుడు స్వామికి నైవేద్యము పడిపోయెడినంతస్థితియె పట్టెనఁటచటన్ ॥

చ॥ భయపడకక్కలాదుఁ డటుపైని రమేశుగుడిం బ్రవిష్టుఁడై
స్వయమనివేదనాదికముసల్పుచు నందొకధర్మకర్త తా
న్రయముననేగిచార్జియిడ నాది తదాలయమంచుఁ జెప్పుచున్
జయమునుగాంచె వర్థకి ప్రసన్నుఁడుకా నధికారి యెట్టులో 183

ఆ॥ అంతవారిమీఁద నాయూరిబ్రాహ్మణుల్
దండి వైరమూని యుండనయ్యె
దిటముచెడక యతఁడు దేవతాకార్యంబు
లను క్రమముగ జరుపుకొనుచునుండె 184

క॥ జరుగగనిటుకొన్నిదినా లరుదెంచెనునుట్లపండు వపుడాకరణాల్
మఱియొకదేవునియుత్సవ మురుతరముగనాచరించి రూరంతటనున్

చ॥ ఒనఁగుచుహారతుల్ మనుజు లుండిరిస్వామినిజుట్టుముట్టియ
ట్టిసమయమందుబత్తులును ఠీవిమెయిం దమదేవునుత్సవ
మ్మునసలుప వీథిఁదీయుచు సమూహముగాఁబదిమందికూడి రే
ఠసికుఁడుకూడ సన్నిధికిరాఁ దగస్తాలెలదేవుఁడంచ ఘో

చ॥ జనులుతమంతఁదామయుట సన్నిధికేగకయున్న బత్తుతో
చని శరగోపమిచ్చుటకు సాహసముంబొనరించిరంట,అ
ట్లొనరించుచేరికిష్టమయియుండక దెబ్బలుకొట్టిరంట, వా
రినినటుకొట్టుటం ద్విజులప్రేరణయున్నదియంట పూర్తిగన్ 187

క॥ అంతటఁబోనీయకద్విజు లంతఃక్రోధమ్ములతోడనరిగితదోకః
ప్రాంతంబున కచటిగరు త్మంతునివాహనముదెచ్చి తమగుడిలోనన్

ఉ॥ పెట్టి స్వకీయదార్ఢ్యమున భీతిలఁజేయఁగలాదవర్యు నా
దట్టఁడుపోయిచార్జియిడె, ధర్మసభాపతి "యద్దిచౌర్య" మన్
పట్టుదలం గరంబుచలపట్టివిధించెనుశిక్షవారికిన్
రట్టడికార్యముల్ సలుపరా దెవరైననునేమి యావిధిన్ 189

ఆ॥ వడినపీలుచేసి వారుతర్వాతను
విగతదోషులనుచు విలసిలినను
కర్మవశత ముందు కారాగృహంబునఁ
గుండవలసివచ్చెఁ గొన్నినాళ్లు 190

క॥ ఇవియిటులగుటనెబత్తుల యవినయసంభాషణంబు లధికంబయ్యెన్
దవిలియవివిన్నకొలఁదిననసిసురుల్ క్రోధమూర్ఛనందిరి పెలుచన్

క॥ కోపముముదిరినకొలఁదిని బాపలుచనుదెంచి నాదుపాలికఁబెక్కం
"డ్రేపగాగింపఁగవలెనీ పాపిష్ఠుల" కనుచునేమొ పరిపరిగతులన్ 192

తే॥ ఎంతయోనాకురోషమెక్కించువారు
"సివిలునకుఁబోవలె" నంచుఁజెప్పువారు
"చేతురందఱుదీనికింజేతనైన
యంతవఱకుసహాయ" మంచనెడివారు 193

శా॥ ఐరి ట్లందఱిపేళ్లు విస్మృతములేయైపోయె, కొల్వాసిశ్రీ
సూరయ్యాఖ్యుఁడుమాత్ర మిప్పటికెదర్ శోభించుచున్నాఁడు, మా
యూరన్ వైశ్యులకాయిబాను, ద్రవిణంబుంగాన్ విశేషంబుగా
నారూప్యంబులనీయఁజేతుఁబడి "యంచంపెన్ ఘనోదంతమున్ 194

ఉ॥ ఈనుడివిన్నమీఁదనె మఱింతయెడందకునూతచిక్క నే
బూనితివ్యాజ్యమాడఁగను, పూని మొదల్ జమచేయఁగావలెన్
గానఁదదర్థమావ్యయము కామితముం బ్రతివానిఁగూర్చియున్
నేనువచింపఁజాలక యనింద్యపుమార్గమొకండు త్రొక్కితిన్ 195

చ॥ (a) ప్రకటనపత్రికాశతముపంచుచు యీ యనవద్యమార్గమా
నొకరునువానిఁజూచి యిడియుండినవారలు లేరు రూకయే
నీఁకమనసూరయాహ్వయున కేనె స్వయంబుగఁ బత్రమీయఁగా
సకలముపాఠమున్ సలిపి సన్నుతిచేసెను బెక్కుభంగులన్ 196

---

(a) శ్రీరామాయనమః

సుజనులారా!

బ్రహ్మ క్షత్రియ వైశ్య శూద్ర వర్ణములు ప్రధానవర్ణములనియును తదితరములయిన సర్వవర్ణములును సంకరములనియును నెల్లరులకుం దెల్లమేకదా. అందులో, అగసాలెవాండ్రును వడ్ల కమ్మర కంచర కాసెవాండ్రును సంకీర్ణసంకరులగు రథకారజాతివారైయున్నారు. వారు తమలోఁ దమరెంత యెక్కువజాతివారమని యనుకొనుచున్నను నితరు లందఱిచేతను హీనజాతిసన్మానము నే వడయుచున్నారు. ఇట్లుండఁ గర్విష్ఠులయి మాయూరఁ గొందఱుచతుర్థులు బ్రాహ్మణప్రతిష్ఠితములఁ బూజించు నధికారము తమకులేదనియో యేమొ వీరిచే గ్రామదేవతలకుఁబునస్సంప్రోక్షణఁ జేయించిరి. అందుమీఁదఁ దద్రథకార చతుర్థసముదాయముపై గుడుజాల సబుమేజస్ట్రీటుకోర్టులో నేను ఫిర్యాదుచేయగాఁ గోర్టువారు క్రమముగా విచారించి కేసు చార్జిచేయుటయు ముద్దయిలకు భారముతోఁచి పైవెచ్చములుకాకయే జుట్టుకు రు 30 ల చొప్పునఁ జందావేసికొని రు 300 లు కృష్ణార్పణము చేసినందునఁ గేసు త్రోసివేయఁబడినది. ఈకేసు సివిలునూటనుకారణముచేఁగొట్టువడుటయు సత్తెనపల్లితాలూకా పాపయపాలె

ఉ॥ అంతియెకాని దమ్మిడియు నాతఁడొసంగినకిల్బిషానఁబో
ద్రొంతటఁబోయినన్ వరమె యాఱునెలల్ కొనిమాసపత్రికన్
సుంతయుఁ జీయకే యెదియొశుష్కహితంబులు చెప్పిపుచ్చె,యీ
ప్రాంతమునంగలారె యిటువంటివదాన్యులు పుణ్యమూర్తులున్ 197

---

ముందుండెడి బంగారు వెంకటప్ప యను నగసాలె తెచ్చినచార్జీలోఁ దరువాత నపీలులో నిర్దోషులయినను ప్రథమమందాయూరినియోగి బాలకులు కొందఱు మ॥ సత్తెనపల్లి సబుమేజస్ట్రీటు కోర్టువారిచే శిక్షితులగుటయు నీరెండుకారణములనుబట్టి రథకారులీయిరువురు మేజస్ట్రీటులు తమకు బ్రహ్మత్వమును స్థిరీకరింపజేసిరను నుల్లాసముతో నుల్లాకెక్కుచున్నవారు. ఇట్లుల్లాకెక్కి యగ్రకులముంగూర్చి దుష్ప్రసంగములు చేయుచున్న యీహీనజాతివిషయమై యుపేక్షించి యూరకొంట యుచితంబుకాదని కొందఱుబుద్ధిమంతులప్పుడప్పు డెచ్చరించుచుండుటచేత నేమి ప్రకృత మేను దెనుగించుచున్న శంకరవిజయమం దీలాగుననే ప్రబలించిన దుర్మతములను బూర్వము శంకరాచార్య ప్రభృతులు పోకార్చిన గాథలయుద్బోధవల్ల నేమి నాకీజాతిపైనున్న క్రోధము కించదవశిష్టమై నశించినప్పటికి మరల యథాపూర్వమై యీవ్యవహార మింతటితోఁ బోనీయక ధర్మాధికారుల ప్రోల సాధ్యమయినంతవఱకు పెనగులాడఁ బ్రేరేపించుచున్నయది. క్రిమినల్ చర్యలోఁ గనుక రు 20 లు ఖర్చుపెట్టు ముద్దయిలకు రు 400 లు వదలించితినిగాని సివిల్ చర్యలోఁ దరువాతిసంగతి యేమొకాని మొదలు చేతినుంచి ఖర్చుపెట్టుచుండవలెఁగదా వ్యాజ్యవృత్తము వేయుటకే రు 25 లగుచు నేనుశ్రీమంతుఁడఁగాని హేతువుచే నిందువిషయమై కొంతచందాధనము పోగుచేయుట యావశ్యకమైయున్నయది. గొప్పగొప్పస్థలములలోనే యస్మద్విద్యాతిశయముంజూపి బహుమతులందు సామర్థ్యమీశ్వరుఁ డిచ్చియున్నందున నీనెపముతోనే నందిగామ కాశీపతి వగయిరాలవలె విత్తమార్జించి కుటుంబభరణము చేసికొనవలసిన యవసర మెంతమాత్రమునులేదు. ముందుముందీ వ్యాజ్యపుఖర్చులిష్టుకూడఁ బ్రచురింపఁబడఁగలదు. కావున బుద్ధిమంతులగు రథకారేతర సర్వవర్ణజనులును నగ్రవర్ణోచితములగు షట్కర్మలలో నంతర్భూతమగు యాజనమందీ హీనజాతి కధికారములేదను నంశమును స్థిరపఱచుటకు నాకు సహాయులయి చందాదారులుగాఁ జేరుచుండురుగాత.

ఇట్లు,
జానపాటి పట్టాభిరామశాస్త్రి,
జానపాడు, పల్నాడు తాలూకా, గుంటూరుజిల్లా,

7—5—07

ఆ॥ అటులరేచ్చఁబెట్టి యావ్యాజ్యేపుంగోతి
కనిపి రెండటోమహానుభావు
"లురుకుమురుకు"మనెడి నరులెకానిధరిత్రిఁ
గూడనురుకునట్టికొడుకుగలఁడె 198

క॥ కరపత్రములంగొల్లగఁ।దొరతోరనూరారఁబంచితోఁకముడియుటల్
పరువనిపింపకదిగితిని।జిరకాలమునకును దెగని చెడువ్యాజ్యమునన్॥

తే॥ ఎవరొచేసిరిసాహాయ్య మింతొ యంతొ
చాలుఁజాలును నదె నూఱువేలునాకు
పరులపిల్లల బావిలోపలనుదిఁపి
యిటుతమాషా లెచూతురా యెల్ల వారు॥ 200

చ॥ అరిగితినర్సరాట్పురికినంతట, పూర్ణయగారు శ్రద్ధమై
సరిగలిఖించి (*a*) ప్లైంటు తనసన్నిధికంపఁగ నంజసేయశా

---

(*a*) అ-నెం 984-07 రు

మహారాజరాజశ్రీ నరసరావుపేట డిస్ట్రిక్టుమునసబు
కోర్టువారిసముఖమునకు.

వాది-జానపాటి పట్టాభిరామశాస్త్రి-ప్రతివాదులు-వోలేటిలక్ష్మయ్య॥ వ సివిల్ ప్రొ॥ 50 శెక్షన్ ప్రకారము వాదితరఫు దాఖల్ చేయఁబడిన ప్లెయింటు-

8. పల్నాడు తాలూకా జానపాడుగ్రామములోఁ బ్రోలేలమ్మ పాతపాటమ్మల యాలయములు రెండున్నవి. ఆయాలయములలో మూలవిగ్రహములు చిరకాలము క్రింద బ్రాహ్మణులచేఁ బ్రతిష్ఠింపఁబడి తత్కారణముచే నన్ని వర్ణములవారిచేతను సేవించుటకు యోగ్యములై యట్లు సేవింపఁ బడుచుండెను. తద్విగ్రహములు శిథిలములై పూజానర్హములై యుండఁగానిప్పటికి షుమారు 4 యేండ్లక్రిందట వాదివగయిరా బ్రాహ్మణులును వైశ్యాదులును దదాలయములలో శాస్త్రప్రకారముగాఁ దిరిగి విగ్రహముల బ్రాహ్మణులచేఁ బ్రతిష్ఠింపఁజేసియున్నారు. అందువలనఁజతుర్వర్ణముల వారిచేతను సేవింపఁబడుచుండెను. ఐతే 1906 సంవత్సరము జూలై 22 వ తేదీని ప్రతివాదులుకొందఱుఁ జతుర్థాదులను దోడ్పాటు చేసికొని తదాలయములోని దేవతలకుఁ దిరిగి సంప్రోక్షణలను నెపముతో నమాంగల్యములుజరిపి యిందుమూలముగా బ్రా క్షత్రియ వైశ్యవర్ణములకుఁ దదాలయము లసేవ్యములుగాఁజేసి సదరు 8 కిని నష్టముగలిగించిరి.

స్త్రీ రహిని దిద్దుఁబాటులను జేసిమరల్చెను, అందుమీఁదట్
మఱియొకప్లీడరుంగనె, క్రమంబుగ దాఖలుచేయఁగాఁబడెఁ ॥ 201

4. అటుపైని వాదిగ్రామములోని బ్రాహ్మణబృందముతరఫున గురిజాల స్టేషనరి సబ్ మేజస్ట్రీటుకోర్టులోఁ బ్రతివాదులు వగయిరాలమీఁదఁ జార్జీదాఖలు చేయఁగాఁ జార్జిచేయఁబడి కొన్నికారణములచే సివిల్ తగాదాయని ముద్దయిలు విడుదలచేయబడిరి.

5. ప్రతివాదులు ద్విజాతులలోఁజేరని యగసాల వడ్రకంచర కమ్మర కాసె వృత్తులు గలవారిలోని వారు. సంకీర్ణ సంకరజాతివారైనందున యాజనాది కర్మల కధికారములేదు. ప్రతివాదులు జరిపిన యశాస్త్రీయచర్యవలనఁగలిగిన నష్టమును నివర్తి చేయుటకుఁ బరిహారముఁ బొందుటకు దావా తేఁబడినది.

6. వ్యాజ్యకారణము. ప్రతివాదులు సంప్రోక్షణఁజేయుటమూలముగా బ్రాహ్మణాదులు సదరు దేవాలయములయందుఁ బూజలు బోనములు చేయకుండఁ జెల్లించకుండ Profane చేయఁబడిన 1906 వ సం॥జులయి 22 వ తేదీని సదరు దేవాలయములును 2-3-4-5 ప్రతివాదులును నుండిన తమకోర్టిలాకా జానపాటిలోఁగలిగినది.

7. దావావివరము ప్రతివాదులక్రమముగాజరిగించిన 4వ పేరాదాఖలా చర్య వలన వాదివగయిరాలకయిన నష్టము(అనఁగాఁదిరిగి 2 ఆలయములయందుఁ బ్రతిష్టనకగు ఖర్చులు) రు 190-0-0 లును దావా దేవాలయములలోఁ బ్రతివాదులు సంప్రోక్షణ వగయిరాలు తాముగాని తమజాతివారితోఁగాని చేయించకుండ శాశ్వతమయిన యింజక్షన్ పరిహారమునకుఁ గిమ్మతు రు10-0-0లును వెరసి 200-0-0లు సదరు రు200-0-0 లకుఁ గ్రమమైన స్టాంపుడ్యూటి దాఖలుచేయఁబడినది.

కాఁబట్టివిమర్శించి

(a) దావా దేవాలయములయందు విగ్రహ ప్రతిష్ఠాదులకు వాదివగయిరా బ్రాహ్మణులకే హక్కు గలదని నిర్ధారణఁజేయించుటకును ప్రతివాదులు తాముగాని తమజాతివారితోఁగాని ప్రతిష్టలు చేయించుటకు హక్కుగలవారుకారని తీర్మానించుచు వాదికి 8వపేరా దాఖలాయయినసష్టము రు 190-0-0 లు ప్రతివాదులనుండి వాదికిప్పించుటకును దావా దేవాలయములలోఁ బ్రతివాదులు సంప్రోక్షణ వగయిరాలు తాముగాని తమజాతివారితోఁగాని చేయించకుండ శాశ్వతమైన యింజక్షన్ దయచేయించుటకును.

(b) ఈదావాఖర్చులిప్పించుటకును

(c) ఇంకనుగోర్టువారికి యుక్తమనియును న్యాయమనియునుదోచెడి సకలేతర పరిహారములుం దయచేయించుటకును సదరుప్రకారము వాదికి బ్రతివాదులమీఁద డిక్రి దయచేయించవలయునని వాది మిక్కిలి ప్రార్థించుచున్నాఁడు.

మరా:—గ్రామములోని బ్రాహ్మణ బృందము తరఫున వాది యొక్కఁడే యీదావా తెచ్చుటకు బర్మిషన్ పిటీషన్ దీనితో దాఖలుచేయుటయైనది. 24-9-07

తే॥ +"జానపాటిని వసియించు సకలవిప్ర
జనులతరఫున దావానుసలుపనయ్యెఁ
గాన నుండిన నాక్షేపకారణములు
చెప్పఁదగు"నంచుఁ బ్రచురమ్ముసేయఁబడియె ॥ 202

ఆ॥ చేయఁబడకమున్నె శ్రీవిరూపాక్షపీ
ఠాధిపతులచెంత కరిగినేను
ఆఱునెలలదాఁక నానిజాందేశంబు
నంద తిరుగుచుంటి నచ్చటచట ॥ 203

ఉ॥ మున్ను జిలాగెజెట్టునను ముద్రితముంబొనరింపఁ గర్చుకా
నున్నది యెంతయో తెలియకుండుటఁజేసి యొకండొ రెండొ యీ
నన్నతలంపుతోడ నపు డంతయె నేనిడి వెళ్ళిపోయితిన్
జన్న యనంతరంబునను జాలకపోయెను రెండురాప్యముల్ ॥ 204

---

+గుంటూరు డిస్ట్రిక్టు గెజెట్ 1908 సం॥ జనవరినెల 2 తేది గురువారము
నోటీసు. ఆరై నెం. 984/1907.

వాది జానపాటి పట్టాభిరామశాస్త్రిగ్లు. ప్రతివాదులు వోలేటిలత్కుమయ్య వగైరా.
పల్నాడుతాలూకా జానపాటిలో పోలేరమ్మ, పాతపాటమ్మ అను దేవతల విగ్రహములప్రతిష్ఠాదులకు తానువగైరా బ్రాహ్మణులకే హక్కు కలదనియు, బ్రతివాదులకు తాముగాని తమజాతివారితోగాని ప్రతిష్టలుచేయించుటకు హక్కు లేదనియు, తీర్మానించుటకును తనకు పునస్సంప్రోక్షణమూల్యము రు 190 లు యిప్పించుటకును దదాలయములలో బ్రతివాదులు సంప్రోక్షణాదికమును దాముగాని తమ జాతివారితోగానిచేయించకుండశాశ్వతమైన యింజెక్షన్ జేయించుటకును +ఉండుటచే నిట్టివాఱందరితరఫున ధానొక్కడే దావా తెచ్చుటకు బర్మిషనిప్పించుచుదని యీవాదిచే పిటిషన్ దాఖల్ చేయబడెగాన జానపాటిలోని బ్రహ్మ క్షత్రియ, వైశ్య, శూద్రుల కాక్షేపణములున్న యెడల ది 14-12-07 తేదినాటికి వర్సారావుపేటడిస్ట్రిక్టుమునసబ్ కోర్టులో ఖుద్దునగాని క్రమమైన యధికారముపొందినవారిద్వారాగాని యట్టియాక్షేపణములు తెలియపర్చుకొనవచ్చునని యేతన్మూలముగా తెలియజేయడమైనది.

పులిపాక పూర్ణయ్యగారు.
కొండుభొట్ల గోపాలకృష్ణయ్యగారు.
తాడేపల్లి ఆంజనేయశాస్త్రిగారు.

చ॥ A "ఇరువదియొక్కరౌప్యముల నిందుకుఁ గర్చువిధించి"రంచు ను
త్తరములువచ్చె, పంపితిని, తద్ద్రవిణంబటఁ జేరి దానిలో
న్సరిగఁ బ్రకాశితంబగు దినంబునకుం గతియించి వాయిదా
మరలఁ బ్రకాశ్యమయ్యెనఁట మామకవార్త జిలాగెజెట్టునన్॥ 205
సీ॥ B "క్రమ్మఱ గెజెటునం బ్రచురంబు సేయ ని
ర్వదియొక్క రూపికల్ పనుపు"మనుచు
C "బత్తులు నీపైని ప్రబలమౌ పిర్యాదు
నాచరింపఁగ సిద్ధమైరి"యనుచు

---

జానపాటి వెంకటప్పయ్య ఆశీర్వచనములు. 12-12-07

A...దేశాభిమానిలోను, జిల్లా గెజిటిలోను,ఇంకా ప్రచురముచాయలేదు, అందుకు రు 21 లు అగునట, పంపుమన్నారు. యెవరు పంపలేదు. "లంజబిడ్డకు తండ్రియెవ"డన్నట్టు వున్నది...ఇదట్లుండగా క్రిమినల్ చార్జి నీమీద దాఖలుకాబోవుచున్నది. నీవు నాకు పైకముపంపిస్తాననికూడా పంపలేదు. మ॥ పూర్ణయ్యపంతులు గారికి కర్చులనిమిత్తం పయికము పంపుతామని పంపలేదు. కర్చులు పెట్టేవారు యిక్కడ యెవరు లేరు. గనుక తక్షణం మ॥ పూర్ణయ్యపంతులు గారి పేరగాని, గోపాలకృష్ణయ్యగారి పేరగాని ఖర్చు దేశాభిమాని జిల్లా గెజిటినిమిత్తం 25 రూపాయలు పంపవలసినది. జరూరు. మేజస్త్రీటుసమక్ష అక్కడికేవచ్చునట, యింతేవిశేషాలు, గ్రహించవలెను.

B వి. పేళ్ళచెర్వు కామయ్య నమస్కారములు......

మీదావాలో 1-5 ప్రతివాదులకు తిరిగి నోటీసుకు వుత్తర్వుచేస్తానన్నూ, దేశాభిమాని, జిల్లా గెజిటీలలో వేయుటకున్నూ, ది 17-3-1908 తేదికి వాయిదా వేసినారు. ఇదివరలో వేయించినది వకవాయిదాకు సొమ్ముపంపవలశినది. వాయిదాగతించినపిమ్మట పంపబడినది. అందువల్ల అదిపనికిరాలేదు. తిరిగివేయించమని వుత్తరువుఅయినది. సొమ్ముపంపవలెను......పూర్ణయ్యగారికిపంపిన పైకము ముట్టినది.

సహోదరా? ది 19-12-07 మల్లవోలు.

C...యింతేగాక నీమీద నర్సారావుపేట హెడ్డశిస్టాంటు కలెక్టరువారివద్ద కాశిపతివగైరాలు చార్జిదాఖలుచేసినట్టు యీరోజు విన్నాను. నిన్న పేటలో వెంకటప్పయ్య కనుపించినాడుగాని నాతో చప్పలేదు. ఆయనకు తెలిసినయడల తప్పీలుసంగతు

+ "ఎన్ని కార్యములున్న నిప్డీవు రాకున్న
దావా నిజంబుగం బోవు"ననుచు
"ఇంతపర్యంతంబు నితరదేశంబున
నివసించు టది యేటి నీతి"యనుచు
నన్నుఁ గూర్చియిట్టు లెన్ని యో యుత్తరాల్
బంధుజనులఁ జేతఁ బంపఁబడఁగ
నెట్టకేలకప్పు డే నిర్గతుండనై
వచ్చితిఁ మదీయవసతిఁ జేర॥ 206

తే॥ వచ్చి క్రమ్మఱ వృథగ నిర్వాదియొకండు
రాప్యముల్ వెట్టి గెజెటునఁ బ్రచురపఱుప
శక్తిచాలకయుంటచే జానపాటి
బ్రాహ్మణుల యభిడవెటులం బడయనెంచి॥ 207

---

లు మీకు వ్రాస్తాడని తలుస్తాను. ...మీరు ఇంతకాలవిరామంగా వుత్తరం వ్రాసినందుకు చాలా విచారపడుతూయికముందిట్లు చేయకుండుటకు వేడితాను...జానపాటి చెరువ్వక్రింద సాగుచేస్తున్నారు. రాత్రి జానపాడు వెళ్లినాను. మీమాగాణీవిషయము యియేమియేర్పాటు చేసితిరో తెలియదు. తు॥ సూర్యనారాయణ.

+ మీదావాసంగతులు ఇంతవరకు గెజటీలో అచ్చుకాలేదు. అందునిమిత్తం సొమ్ముదాఖలు చేయుటకు యిదివరకు రెండువాయిదాలు గతించినవి. తిరిగి 28-4-1908 తేది వాయిదా అయివున్నది. గనుక యీవుత్తరం అందినవెంటనే బయలుదేరివచ్చి పనులు జరిగించుకోవలెను. లేనియెడల యికను వాయిదాయివ్వరు. దావాపోతుంది. అపవాద వచ్చును. పయికంసహాబయలుదేరి రావలెను. రానియెడల నష్టం కల్గును. మీకుమాత్ర జానపాటిలోనేవున్నది....మీరువస్తారనే యింతకాలం అక్కడవుంచినాము. యీవుత్తరం అందినవెంటనే కార్యములమాటఅవున్న వ్యవహారవిషయములో తప్పకరావలెను. రానియెడల దావాపోతుంది. గనుక తెలియపరుచుచున్నాను. చిత్తగించవలెను.

నర్సారావుపేట 7-4-08 కామయ్యవ్రాలు

క॥ ఒక్కొకరి మ్రోలకరిగిన,
బెక్కండ్రటదస్కతులను బెట్టిరికానీ
వెక్కసమున నొకయిర్వురు,
చిక్కులుకడుఁబెట్టిరకట చేయకవ్రాళ్లన్॥

క॥ అన్యులు గార్వారలుమఱి,
మాన్యులునా కైననేమి మతిశూన్యులు త
ద్ధన్యులనామంబులు సా
మాన్యముగా బైటఁబెట్టి మనుటశ్రమంబా॥

సీ॥ అభిడవెట్లనువ్రాళ్ల నాచరింపక చిక్కు
లొందఁజేసినవారు నొరులుకారు
వ్యవహారమునదింపి "వాఁడె చచ్చుత"మంచు
నూరకుండినవారు నొరులుకారు
సాక్ష్యంబురానైన సాహసింపఁగలేక
యరిభీతి మనువారు నొరులుకారు
కమసాలపక్షంపుఁ గమ్మపౌరోహిత్య
ముడుఁగకుండినవారు నొరులుకారు
అందఱునుమామకీనులే, యైననేమి
అక్కరకువచ్చువా రొక్కరైనలేరు
ఎవరికో యొక్కరికిఁదప్ప నిట్టిపట్ల
స్వాభిమానమ్మునున్న మాయయ్యలందు॥

ఆ॥ అట్టు లభిడవెట్ల నెట్టెట్లొ యార్జించి
సివిలు కోర్టులోనఁజేర్ప నచట
"దస్కతులు నిజముగఁ దత్తదాఖ్యాకుల
వంచు నెట్లునమ్మనా"నటంచు॥

క॥ పడవేసియుంచి తుదకీ,
"బెడిదపువ్యాజ్యంబునందుఁ బెక్కుఱుకాకా

క్కఁడుకూడ నర్హుఁడగు"నని,
వడిమునిసిఫుగారు వ్రాసిరి వైచెఁ బిటీషన్॥ 212
చ॥ ఇటులొకవత్సరంబువఱకీయకపర్మిష నుంచియుంచి య
ప్పటికి "విమర్శచేతు"నని పైలునఁ దద్వ్యవహార్తవేసెఁదా
నెటులనొ, అంతరుణ్మునుపె యేయనృతంబులొనింపి పూర్తిగా
నటఁ బ్రతివాదులందఱును +నాన్సరుదాఖలుచేసి రుద్ధతిన్॥ 213

+ ఆన్సరు.

సివిల్ ప్రొ॥ కో॥ 110 సె॥ ప్రకారం ప్రతివాదులుదాఖలుచేసిన స్టేటుమెంటు.

1. దావాంశములలోఁ గొన్ని కల్పితములు- దావాశాస్త్రప్రకారము నిలువఁజాలదు.

2. జానపాటిగ్రామములోని బ్రాహ్మణులందఱికి నీ దావాతో సామాన్యసంబంధ భోక్యములు (Same interest) లేవు. అట్టిచో వారందఱినిమిత్తము వాదియొక్కఁడే దావాతెచ్చుట కర్హుఁడుకాఁడు.

3. పోలేలమ్మ పాతపాటమ్మలు బ్రాహ్మణార్చ్యములుకావు. ఆ దేవతలకు నిత్య నైవేద్య దీపారాధనలులేవు. కొలుపులయందుమాత్రము శూద్రులాదేవతల నమంత్రకము గ నర్చింతురు. దావాయాలయములయందలి దేవతలకు సంప్రోక్షణచేయులేదు. విగ్రహములు శిథిలమగుటచే గ్రామస్థులకోరిక ననుసరించి ప్రతివాదులు నూతనవిగ్రహములను బ్రతిష్ఠించిరి. వానిని ప్రజలు యథాప్రకారము సేవించుచున్నారు.

4. విగ్రహప్రతిష్ఠగాని తక్కిన యాజనాదికర్మలుగాని చేయుటకు బ్రతివాదులకు సంపూర్ణమయినహక్కుగలదు. ఇందుఁగూర్చి ప్లయింటు 5వ పేరాలో వాదివ్రాసిచ్చిన నీచవచనముల నిందు ఖండించుట యప్రస్తుతముగావున విస్తరించలేదు.

5. దేవాలయములయందుఁ దిరిగి ప్రతిష్ఠలజరుప నవసరములేదు. అవసరమున్నట్లు కోర్టువారభిప్రాయపడినను నందుకు రు 190 లు ఖర్చుకాదు.

6. వాదికిఁగాని తక్కినబ్రాహ్మణులకుఁగాని లేశమయిననునష్టముకలుగలేదు. వాది కోరిన యింజంక్షన్ గాని యేయితరపరిహారముఁగాని వాదిపొందఁ దగఁడు.

కాబట్టి వాదిదావాఖర్చులు పరిహరింపవలయునని ప్రతివాదులు ప్రార్థించుచున్నారు.

ప్రతివాదుల సంతకములున్నవి.

చ॥ ఇదియిటులుండ మొట్టమొద లేఁ బ్రచురించిన యట్టిపత్రికన్
జదివి సువర్ణఘాతుకులు చాలనమర్షమువూని యెవ్వియో
వదరెడివారు లేఖలను+వ్రాసెడివారును బంధుబూతులన్
బదఁపడితిట్టువారునయి పైత్యవిశిష్టతనుండి రెల్లెడన్॥ 214

---

\+ (ఇంగ్లీషునకలు)

పొన్నప్పసెట్టివీధి- సావుకారుపేట
మదరాసు- 20 వ జనవరి 1908

...... విశ్వబ్రాహ్మణులని సాధారణముగాఁ బిలువఁబడుచున్న శిల్పశాస్త్రజ్ఞుల స్వాభిమానసూచకములగుతలంపులను భంగపఱచుటకై మీచేఁబ్రచురింపఁబడినకరపత్రము గుంటూరునివాసులగు బ్రహ్మశ్రీ వడ్డెపాటి కోటయ్యాచార్యులు మొదలగువారిచే నాకందింపఁబడియె, దానియం దసురసింహునివలె మీరును "రథకార" యనుదానినిగుఱించివ్రాసినది చూచితిని, రథకారశబ్దవిషయమైన యసురసింహునభిప్రాయమెంతమాత్రము సరియైనదికాదు. ఏలయన? తలిదండ్రులైన కరణీమాహిష్యులశరీరములలో విశ్వబ్రాహ్మణరక్త మెంతమాత్రము మిళితముకాలేదు. "వర్షాసురథకారోగ్నీనాదధీత" అను ప్రఖ్యాతుఁడగు జైమినిమహామునివ్రాసినశాస్త్రమున బహుశః మీ కాదరభావముండకపోవచ్చును. ప్రస్తుతపు స్వదేశీయకష్టములలో జాతీయము నిలుపఁజాలినవారనియు నేకగ్రీవముగాఁ బ్రజలచే నమ్మఁబడిన విశ్వబ్రాహ్మణుల యసంతృప్తి కేలపాలయితిరి? ఈరాజధానిలో నుత్తరమున వేమనచేతను దక్షిణమునఁ గపిలునిచేతను నిష్పక్షపాతముగా విశదీకరింపఁబడినసంగతులుచూచిన సిగ్గుగలుగదా?

ద్విజులైనమీరు "గాజుఇండ్లలోనివసించువారు పరులమీఁద రాళ్ళు వేయఁగూడ" దనుసామెతను ముఖ్యముగా జ్ఞాపకముంచుకోవలెనుగనుక మీరు జనులముందరఁ బెట్టఁదలఁచినటువంటియు నసంభావ్యమైనటువంటియుఁ గరపత్రములోవలెఁగాక శాంతము నెలకొల్పఁగలరని నమ్ముచున్నాను. నేనుజెప్పినసంగతులు నిజమనుటకుఁ బ్రమాణము లనేకములుగలవుకాని ముఖ్యముగా బ్రహ్మాండపురాణము దైవజ్ఞస్మృతి స్కాందపురాణముసాగరఖండములలోని కొన్నిప్రమాణముల నీక్రింద వివరించుచున్నాను.

బ్రహ్మాండపురాణము.

బ్రహ్మణోవదనాజ్జాతో బ్రాహ్మణః పరికీర్తితః। బ్రహ్మణోనిర్మితశ్చైవ బ్రాహ్మణో బ్రహ్మకర్మణః॥ బ్రహ్మవంశో బ్రాహ్మణశ్చ నాన్యథా బ్రాహ్మణోభవేత్॥

ఉ॥ అందుకె చాగ్జియిచ్చుటకునై ప్రయత్నించిరి మాదుమండలం
బందలివారుకొందఱు, (A) "ప్రయాసమెకాని ఫలంబులే"దటం
చెందఱొప్లీడరుల్ నుడువ నేమియొనర్పఁగఁదోఁపకాత్మలన్
మందమనీషనుండిరి స్వమందిరసీమలఁ దిట్టిపోయుచున్ ॥ 215

ఉ॥ వీరలకన్ననించుక వివేకముగల్గినవారలొటచేఁ
దూరుపునాటివారలకుఁ దోఁచెను బత్రికయొండునిల్పి త
ద్ద్వారమునన్ శపించుటకు, దానఁబ్రధానుఁడు దుగ్గిరాలలోఁ
జేరి నిరంజనాఖ్య (B) నిరసింపఁగసాఁగెను భూమిదేవులన్ ॥ 216

---

దైవజ్ఞస్మృతి.

ప్రథమం సృష్టికర్మాణి ద్వితీయం లౌక్యమేవచ। సదాచారం తృతీయంచ బ్రాహ్మణస్యవిధిట్టాస్మృతః స్కాందపురాణము.

ఏకఃపంచాననో విశ్వకర్మాజజ్ఞే షడాననః। ముఖేభ్యస్తస్యపంచభ్యః కుమారాః పంచజజ్ఞిరే॥వదనేభ్యోభవంస్తేషాం పంచపంచకుమారకాః।శతంచవింశతిఃపంచ వంశజావిశ్వకర్మణః॥ మనుర్మయస్తథాత్వష్టా శిల్పీవిశ్వజ్ఞఏవచ। పంచైతేదేవఋషయో విశ్వకర్మముఖోద్భవాః॥

ఇట్లు
మీ ద్వేషరహితమైనజాబునకై నిరీక్షించు
యమ్. అప్పకణ్వాచారి.

ది 8-8-08. జానపాడు.

(A)......రథకారకులు నీమీద క్రిమినల్ చర్యజర్గించటం లాభంలేక మానుకున్నట్లు సూచించుచున్నది...... జానపాటి వెంకటప్పయ్యవ్రాలు.

(B) 1907 వసం॥ అగష్టు, సెంప్టెబరు, నవంబరు నెలల ప్రబోధినినుండి

క॥ బనగానిపల్లెనానొక । యనవద్యంపైననగర మలరు నదియు స
జ్జనశోభితమై కడుదు । గ్జనదూరీకృతమై యపారశాస్తి వెలుంగున్ ॥ 3

ఉ॥ ఆపురమందుఁ గాపురము నర్మిలిఁజేయును తత్వబోధనా
జ్ఞాపరతంత్రుఁ డూర్జితసనాథుఁ డహంకరణేతరక్రియుం
డై పటువేదసారపు రహస్యము శిష్యులఁగూర్చి చెప్పుచున్
దీపితభంగి వీరవరదేశికనామముతోడ నెమ్మెయిన్ ॥ 6

క॥ ఆ పరమగురుపదాంబుజ । మేపట్టున హృదయసీమ నిమిడిచి శిష్య
త్వాపాదుండయి యొకతఁడు ప్రాపుగ సిద్ధాఖ్యుఁడొకఁడు భక్తిఁ జెలఁగె౯ ॥ 12

క॥ అతులమతి నతని విశ్వా । సతఁగని పింజారియనక ఛాత్రత నంగీ
కృతమొనరించియు శిష్యుల । తతిలో నెల్లఱులకు౯ బ్రధాను౯ జేసె౯ ॥ 13

శా॥ ఆ పింజారితనూభవుం డతులవేదాంతప్రచారాది వి
ద్యాపారుండయి నిర్మలాత్ముఁడయి యుద్యత్తత్వబోధాధురీ
ణాపాదుండయి దేశికాంఘ్రియుగళి౯ స్వాత్మ౯ సదా నిల్పి స
ద్వ్యాపారుండయి సర్వదేశములఁ బ్రోద్యద్భక్తిఁ బూజింపగ౯ 14

చ॥ తిఱుఁగుచుఁ బెద్దల౯గని విధేయతతోడ సపర్యజేయుచు౯
దురితజనాళిద్రోయుచును దుష్పథవృత్తులఁ దూలనాడుచు౯
బరిపరిరీతుల౯ దనదుభావము మిత్రులతోడఁజెప్పుచు౯
గురుతరభక్తి సద్గురునిగూర్చితలంచుచు నిశ్చలాత్ముఁడై॥ 15

వ॥ పోయిపోయి పుష్పగిరియను నొకయగ్రహారగ్రామంబుజేరుతఱి॥ 33

క॥ వెనువెంటఁదవులుశిష్యుల ఘనతరనిగమార్థసారకల్పులఁజేయ౯
గని యోర్వలేక పల్లియజనులందఱువచ్చి చలముసాధింపంగ౯ 54

వ॥ సిద్ధప్రముఖాంతేవాసుల౯జూచి 55

శా॥ ఓరీ! మ్లేచ్ఛకుమార! నీవిటుల నోహో! సాహసంబూని ని
స్సారంబొందఁగ వేదశాస్త్రము లనాచారంబు గాఁబాడఁ గా
నారా! నీగురువైన నియ్యది యసాధ్యంబంచు నూహింపలే
దే? రాణింపదు రోరి వాకొనకు సందేహమ్ములే కెమ్మెయి౯॥ 56

సీ॥ బ్రాహ్మణక్షత్రియవైశ్యశూద్రులటంచుఁ గులచతుష్టయము పేర్కొనఁగఁ దనరు
నందులో నాదిత్రయంబువారికి వేదపఠనాధికారంబు పరగుచుండు
వెఱవారికెప్పుడు వేదపాఠనమును గూడదంచార్యులు వాడుకొంద్రు
చిత్తవిభ్రమమునఁ జెడిశూద్రుఁడెవ్వఁడు సదువఁగబూను నజ్జడునిఁగూర్చి

గీ॥ జిహ్వకనుగోసి వినెనేని చెవులనిండ సీసముఁగఱఁగిపోయఁగఁ జెల్లుననుచు
స్మృతులువచియింప నవియెల్లఁగ్రందుజేసి యకట! వేదముజదువనౌనటర! మీరు॥

చ॥ అనియిటులాడి పుష్పగిరియందువసించెడి విప్రసంఘముల్
గినుకపడంగఁజూచియును గేవలమందులువీరటంచు న
జ్ఞుల జడాంతరంగముల శాస్త్రియొనర్పఁదలంచి సిద్ధుఁడి
ట్లనియె గభీరవాక్యముల నందఱు సందియమందుచుండఁగ౯॥ 62

కొన్నిదినంబులీవిధిని గొండొకఛద్మలిఖించి యంతట౯॥

---

బ్రహ్మక్షత్రియవైశ్యశూద్రులను నీ వర్గంబులన్నాల్గిటి౯
బ్రాహ్మీయంబగు సృష్టి కాద్యమని యార్భాటంబుగాఁజెప్పుచు౯
బ్రహ్మక్షత్రియవైశ్యశూద్రవిధుల౯ వర్ణింపఁగాలేని మీ
బ్రహ్మత్వం బభిధేయహీనమయి శూద్రప్రక్రియ౯ గన్పడె౯॥ 80
ఆదిజగన్మయుండగు మహాయతతత్వమున౯ సమస్తలో
కోదయమైనకాలమునుండియు భిన్నపథంబుఁద్రొక్కకే
ప్రోదిదనర్చి బ్రహ్మకులపుత్రులుగాఁదనరారుచున్న యా
యాదికులస్థులెవ్వరని యాత్మ దలంచకపోతి రెమ్మెయి౯॥
నిగమాధీనులు నిర్మలాత్ములు జగన్నిర్మాణచాతుర్యధు
ర్యగరిష్ఠుల్ స్వకులానురంజనల సద్వ్యాపారధౌరేయు లీ
జగతి౯ బ్రహ్మకులస్థులెవ్వరన విశ్వబ్రాహ్మణుల్ గారె నే
బొగడంగాబనియేమి మాగురుని దాభూర్యన్వయంబేకదా॥ 82
వాదభేదమొదవ వసుమతిఁగొందఱు। బ్రాహ్మణాఖ్య విదితపరపుచుండ
బ్రథమజాతి చూడ్కివగడఁగ విశ్వ। బ్రాహ్మణాఖ్యఁజెందె వీరియన్వయంబు॥ 83
॥ మీకు౯ మాకు జగంబునందతికి సామీచీన్యమై యుత్తమ
శ్లోకంబై తగునన్వయం బిదికదా చూపట్టదేమీకు నీ
రాకాచంద్రికవోలుకీర్తిఁగల వీరబ్రహ్మము౯ జూడరే
మీకు౯ సజ్జనభావము౯ గలుగదే మేలౌనె యిట్లాడఁగ౯॥ 84
॥ చదివినందుకు నుత్తమజ్ఞానవృత్తిఁ గూర్ప లేకిట్టులాడుటకును మదీయ
మానసాబ్జము చింతతోఁ గ్రుఁదుచుండెఁ జెనటిమార్గంబు నెపు డభ్యసించినారొ॥ 85
॥ అజ్ఞుల్ మీరలు త్వద్వచఃప్రకరదృష్టాంతంబెకన్పట్టె మీ
యాజ్ఞాశీలురు మీరలు౯ గలిసియేకాంతంబుగ౯ సత్కళా
ప్రజ్ఞాసింధువు నిర్మలాత్ముఁడగు వీరబ్రహ్మము౯ జేరి స
ద్విజ్ఞప్తి౯బొనరించిరేని సుగమాభిజ్ఞానము౯ బెంపగు౯॥ 86

వ రా:—ఇట్లు కల్యాంధకౌముదిపేర నొకగ్రంథమే వ్రాయఁబ
నది. దీన నింకను దురుసుగా బ్రాహ్మణనిందఁ జేయఁబడియున్నది.

నన్నుగుఱించి వ్రాసెను మనంబుననుండిన క్రోధమంతయున్
దిన్నగ వెళ్లఁగ్రక్కుచోక? తిట్టులవ్యాసము న్యాయవాదిపే

---

? 1908 సంవత్సరం, ఏప్రియల్, ప్రబోధిని

వితండపువాది; విరుద్ధపువ్యాజ్యము

......... నిరర్థక వాచాటుఁడును విద్యాగర్వదురహంకారియు నగు నొక మహాపురుషుఁడు గుంటూరుజిల్లా పల్నాడుతాలూకా జానపాటిగ్రామమున నేతద్గ్రామనామమే గృహనామమేర్పఱచుకొని పట్టాభిరామశాస్త్రినామమునఁ బ్రబలి యేవేవో కొన్నిచదువులుచదువుకొని తానుచదివినచదువునకుఁ బ్రయోజనము బ్రహ్మకులదూషణచేయుటయే సార్థకంబుగా నూహించి లోకనిందితకార్య మొకటి తలపెట్టెను. అదియెద్దియన జానపాటిగ్రామములో గ్రామదేవతలుకొన్ని కలవు. వానినిబ్రతిష్ఠించుటకు నేతచ్ఛాస్త్రివంశీయులచే ముందుగ యాజకత్వమొనర్చుకొని తరువాత వారిని సంకీర్ణసంకరజాతీయులని తెలుసుకొనికాఁబోలు నాగ్రామవాసులు విగ్రహములకు మూర్తిమత్త్వము రాకున్నదని పూర్వయాజకుల యాజనాధికారమున కనర్హులగాఁ బరిత్యజించి, సకలదేవతాప్రతిష్ఠాపనార్హులును, వైదికబోధితులును, బ్రహ్మకులసంభూతులగు కొందఱువిశ్వబ్రాహ్మణులచేఁ బునస్సంప్రోక్షణచేయించి యథావిధిగా వారినిగౌరవించిరి. అదిచూచి యాశాస్త్రిగారోర్వలేక తాను సర్వకాలసర్వావస్థలయందు హైతుకజీవికుఁడును బరద్రవ్యాపేక్షకుఁడు నగుటచేఁ బ్రథమసంప్రోక్షణావపహరించినద్రవ్యమువలె ద్వితీయసంప్రోక్షణయందుఁగూడ తనసంఘమునకు ద్రవ్యార్జన లభించలేదని విచారపడి ద్వితీయసంప్రోక్షణకర్తలగు విశ్వబ్రాహ్మణుల నిందితులని కొందఱికి దుర్బోధలొనర్చి వశపఱచుకొని గురిజాలసబుమేజస్ట్రీటుకోర్టులో వ్యాజ్యము తెచ్చెను. కాని తాను తెచ్చినయాక్షేపణములను దుదకు తానే పశాస్త్రీయముగ ధృవపఱచలేక, విదేశీయులగు శ్వేతముఖులనాకారమును బొందవలసివచ్చెను. తజ్ఞులగు నాకోర్టువారును వ్యాజ్యమునుద్రోసివేసిరి. ప్రతివాదులైన విశ్వబ్రాహ్మణులును నిర్హేతుకవ్యాజ్యముఁదెచ్చిన యావ్యర్థవాదశాస్త్రిగారినిమాత్రము దయదలచి తమకైన మానసష్టమునకు దిరుగవ్యాజ్యము దేక యంతటితో విడచిపెట్టిరి. ఆవిడచిపెట్టినకతమ్మున నాశాస్త్రిగారల్లాకెక్కుచుఁదనపాండిత్య ప్రకర్షనంతయు బ్రహ్మకులదూషణచేఁ బరిణమింపజేసుకొనవలెనని, యత్నించి ప్రకటనపత్రిక నొకటి ప్రచురముచేసెను. దానివలననే యావ్యర్థవాది పాండిత్యమున సర్వోత్కృష్టుఁడనని దురహంకారమూనినట్లు తోఁచఁగలదు.

రన్నిజవర్ణ్యులంద "అవురా"యనియాత్మలఁ బొంగిపొర్లఁగ॥ 217

---

కులీనులగువిశ్వబ్రాహ్మణుల నగ్రజాతీయులుకారనియు, యాజనాధికారమున కనర్హులనియు వారినిబోకార్ప దుర్మతములబోకార్ప శంకరాచార్యులవతరించినట్లు తానవతరించెననియు, తనకెన్నాళ్ళనుండియో ఈవర్ణముమీఁద ద్వేషమునుండెననియు, ఏమేమో వినరాని కొన్నిదుష్ప్రసంగములఁ బ్రచురింపుచుఁ దుదకు నీవ్యాజ్యమునకు ద్రవ్యసహాయమొనర్పవలెనని తనకు పారంపరికము గావచ్చు భైక్షుకాచారమునకుఁదగినట్లు లోకులను వేఁడుకొనెను. అదియు బాగుగానేయున్నది. ఏదోయొక మిషవలన ద్రవ్యమార్జింపవలెనుగాని ప్రతిదినముజచ్చువారి కెవ్వరేడ్చెదరను లోకోక్తిననుసరించి ప్రతిదినముయాచించు పరపీడాధురంధరుల నెవ్వరుభరించెదరు? పాప మా వ్యర్థవాదశాస్త్రిగారు పసితనమునుండి యభ్యసించిన విద్యాగరిష్ఠతచే లోకుల ననేకుల నాశ్రయించి ద్రవ్యమార్జించియు, గుక్షింభరత్వమునకుఁజాలమిచే నెవ్వియోకొన్ని వితండపువాదములుప్రచురించిన నగ్రకులమునుగూర్చి యసూయపడుమానవులు కొందఱైననుండరాయనియు నీమిషచేతఁ గొందఱయినద్రవ్యమొసంగరాయనియు నూహించెనుగాని, తానుజేయుమోసమునకు లోకు లెన్నాళ్లులోఁగెదరు? అయినను తుదకుఁ బ్రతిజ్ఞాభంగముకచ్చునని కాఁబోలు నీమధ్యకాలమున నర్సారావుపేటడిస్ట్రిక్టుకోర్టులోఁ బునస్సంప్రోక్షణవ్యయమునకు వ్యాజ్యమొకటిదెచ్చెను. ఇదియె వితండపువాదితెచ్చిన విరుద్ధపువ్యాజ్యము. ప్రస్తుతము విచారణలోనున్నది. విచారణనంతయు సక్రమముగా ముందుఁబ్రచురించుచున్నాము. వ్యాజ్యవిధానమెట్లుండినను వ్యాజ్యకర్తనుగూర్చి మాత్రము మేము ప్రశంసింప నుద్యమించితిమి. తమవిద్యావైభవమునంతయు వ్యర్థవాదములచేతను, బరనిందలచేతను, వెళ్ళబుచ్చు నోపట్టాభిరామశాస్త్రిగారూ! బాల్యాదారభ్య విద్యాభ్యాసమొనర్చిన ప్రతిఫల మిట్లుపరిణమించినదా? లేక సమాజనిర్ధమా? వేదవేదాంగబోధితులై సానగాదిపంచవింశత్యుత్తరశతబ్రహ్మర్షిగోత్రజులగు విశ్వబ్రాహ్మణులనా తమరు నిరాకరించుట, పూర్వమునిరాకరించిన కుంభసంభవామరసింహాదులేమైరో స్మృహకుఁదెచ్చుకొనుడు. పండితజనైకవేద్యములగు వేదములఁబరికింపుడు. సర్వజనోపకారములగు నుపకరణములరచించి నాస్తికులనిరాకరించి, వేదశాస్త్రశిల్పాగమములచే నిర్ధారణచేయఁబడిన దేవతావిగ్రహనిర్మాణములనొనర్చి సమస్తమానవులకు నైహికాముష్మికములొసంగు మహాకులీనులకా యాజనాధికారములేదనుట.

తే॥ ఆ విరుద్ధపువ్యాసంబుతో విరాజి
లెడి ప్రబోధిని నాకంటబడియె నొకట
వ్యాజ్యెపుంబనిమీఁదనే యరిగినేను
నరసరాయనిపేటలోఁ దిరుగునపుఁడు॥ 218

తే॥ అదికనుంగొనినంత మదంతరంగ
బబ్జినీదళగతజలంబట్టులగుచు
ననుభవించుదుఃఖావంబు నధికముగను
గొంతవడి నేదితోఁపకే కూరుచుండి॥ 219

చ॥ పటుమతులైన ప్లీడరులపాలికిఁబోయి పఠించివ్యాసమే
నట "డిభ మేషనుండునొకో" యంచడుగన్ విని "యుండు లేదటం"
చటునిటు కానివా...గ నందులకుత్తరమిచ్చి యింకనొ
క్కటి యుపదేశముల్ సలుపఁగాఁ బ్రయతించిరివార లీవిధిన్ ॥ 220

ఉ॥ "హీనులతోడివాదముల కేఁగఁగరాదు భవాదృగుత్తముల్
దాన యశంబు వారలకె తప్పక చేకుఱు, మీఁదుకీర్తికిన్
హానిఘటిల్లు నెల్లపుడు వ్యాజ్యములాడుచు సంచరించుచో
మానముఁబూని యుండుటయ మంచిదియియ్యెడనంచుఁ దోఁచె
[డిన్ ॥ 221

ఉ॥ పేపరులో నెతిట్టిరని పేరలుకన్ వహియింపఁబోకుఁడీ

సరే, కానిమ్ము తమపూర్వోత్తరముల దామేకనిపెట్టవలెను. ఆచరిత్రలన్నియు మాకుఁదెలియదనిమాత్ర మనుకొనకుఁడు. అమ్మపుట్టినిల్లు మేనమామయొద్దనా పొగడుకొనుట! నీవువిద్యాధికుడవుకావచ్చునుకాని, ఈశాస్త్ర నేనూయాదులవర్జించి, సత్యాసత్యము లెఱిగించెడి జ్ఞానమొకటిమాత్రము తమకుశూన్యమని చెప్పఁదగియున్నది. పాపము "నూదిపోయినదని సోదెకుబోతే ప్రాతఅంకులు బైటపడెన"న్నట్లు వ్యాజ్యఫలితమెట్లు పరిణమించునోకాని, తమపూర్వవృత్తాంతముమాత్రము వెల్లడికాగలదని మాత్రము నమ్ముడు. (అంతయు ముందుసంచికయందుఁ బ్రచురించుచున్నాము.)

(న్యాయవాది.)

పాపులు పెద్దపెద్దలనె పల్కులు తిట్టిలిఖించుచుందు రీ
శాపము లేమిచేసెడిని,సత్యమెఱుంగనివారు లేరు,సం
తాపమునొందకీక్రియకుఁ దాల్మివహించుటయుక్తమారయన్"॥

ఉ॥ ఈకరణిన్ వచించునుడు లేవిని కార్యము నిర్ణయించుకో
లేకవసించుచుండుతఱి లీలమెయిం బులిపాకపూర్ణయా
ఖ్యాకునియింట రాయసమునన్వయమందునఁబుట్టినట్టి సు
శ్లోకుఁడు రంగయాహ్వయుఁడు చూచివచించెను నీవిధంబునన్ ॥

సీ॥ "పత్రికారాజంబె పరమతంబులనెల్లఁ
దూఱుపాఱఁగఁబట్టఁదోడుపడెడు
పత్రికారాజంబె బహుదేశములనుండు
సంగతుల్ దెలుపంగ సాయపడెడు
పత్రికారాజంబె ప్రాచీనపుస్తక
ప్రకటనార్థంబయి పాటుపడెడు
పత్రికారాజంబె భాషాప్రపంచాభి
వృద్ధిగావింపంగ వీలుపడెడు
పత్రికారాజమిప్పట్లఁ బ్రజకుఁజాల
నుపకృతుల్ సేయఁగలదియై యుండెఁగాన
మీరునొకపత్రికంబెట్టి వారువ్రాయు
ప్రల్లదములెల్లనణఁచుట భావ్యమగును" ॥ 224

ఉ॥ నావిని పత్రికార్జనమునం దిగుకోర్కి జనించియప్డునా
కీవిధమంతయుం దెలుప హెచ్చుముదంబునఁ బూర్ణయాఖ్యుతోఁ
"గేవల మీసదుద్యమము కీర్తికరంబగు"నంచు నా యశః
ప్రావరణుండు వల్కుటయుఁ బత్రికఁబెట్టఁగ నిశ్చయించితిన్ ॥ 225

ఉ॥ ఈవిధిమాసపత్రికగ నేఁబ్రచురింపను నిశ్చయించుకొం
చేవిరియు నాదు గ్రంథములనే ప్రకటించుచునందు ముందుగాఁ

కేవల మీ కలాదజనకీర్తినె వెల్లడిచేయునట్టిదై
భావగభీరతన్ వెలయు? వ్యాసముకూడ నొకండు చేర్చితిన్ ॥ 226

---

? 1908 సం॥ జూను, అభినవసరస్వతి.

భరతఖండంబున రానురాను నాగరికతబలిసి పెక్కుఱుమానవులు తత్తద్విద్యాకౌశల్యముంబడసి మహోన్నతపదము నధిష్ఠించుచు నిజకీర్తివిశదీకృతదిగంతరాళులై వర్తిల్లుచున్నవారు. ఇట్లు మనదేశమంతయు విద్వద్భూయిష్టమై విలసిల్లుచుండినను గించిజ్ఞుఁడనగు నేన మహాపండితసాధ్యమగు నొకకార్యభరము నాదలఁ దాల్పవలసివచ్చె తదుదంతమంతయు యథాక్రమంబుగ నెల్లరులకుం దెలుప నుపక్రమించుచున్న వాఁడను............దుగ్గిరాలాయనయొకఁడు బయలుదేరి స్వకులజులనే కొందఱ సహాయుల నేర్పరచుకొని "ప్రబోధిని" యను పేర నొక మాసపత్రికం బ్రకటింపసాఁగె. లోకములో నెందఱెన్ని పత్రికలఁ బ్రచురించుచుండలేదు? అవిఅన్నియును గొన్ని కేవల ప్రబంధప్రాచుర్యముతో నొప్పునవియును, గొన్ని ప్రవృత్తినివేదకములును గొన్ని ధర్మోపన్యాసబహుళములును నై సకలజనులచేతను గౌరవింపఁబడుచున్నయవి. ఈనూతనసృష్టయగు ప్రబోధినియైతేఁ గేవల స్వర్ణకారమాననీయయును రథకారస్తుతిపరయును నిందితభూదేవయును నై తదఘుశాలేతరుల కేరికిం జదువ ననర్హయగుటయేకాక యనవసరముగాఁ దనకు మామూలులేని యకృత్యమునకుం జొరఁబడి యస్మదాదుల కొకకొంత నష్టముగలిగించినందుకై వ్యవహరించుచుండెడి నా దూషణములతో నిండియు నుండజొచ్చె.........యస్మద్విరచిత సంస్కృతాంధ్ర ప్రబంధముల నేమి, ప్రాచీనకవిప్రణీతముల నేమి, పురాణస్థములగు తత్తత్సర్వజనావశ్యంభావ్యవిషయముల నేమి, ప్రచురించుచుండుటకయి యొకపత్రికను నిర్మింప యోజించుచున్న వాఁడనుగానఁ దత్పత్రికయందే ఏతద్రథకారవిషయమైకూడఁ గొంతకాలమువఱ కొకకొంత వ్రాయనిచ్చగించి ప్రకృతము చాలినంతపోషకసమూహ మేర్పడకుండినను నన్ను స్వాస్థానవిద్వత్కవినిగా ననుగ్రహించిన శ్రీ శ్రీ జగద్గురు విరూపాక్షస్వాములవారి యాశ్రయపుబలముచేతను, బండితపక్షపాతులును, సత్కార్యనిర్వాహకులును, నత్యుదారులును, నర్సరావుపేట డిస్ట్రిక్టుమునసఫ్ కోర్టు ప్లీడరులును, నాకు బాల్యస్నేహితులు, నగు మహారాజశ్రీ పులిపాక పూర్ణయ్యపంతులు గారు యగ్రిమముగా

ఉ॥ ప్రాథమికంపు సంచిక యపారముదం బొడఁగూర్ప నెందఱో
మాధురి కిచ్చ మెచ్చి బహుమానముగా లిఖియించి *యుత్తరాల్

దమమిత్రులనేమి పార్టీలనేమి సహాయులఁగాను జందాదారులఁగాను జేయఁగ లనని వాగ్దానముఁజేసి కొంత ప్రోత్సాహపఱచుటచేతను ప్రబంధప్రకటనాభిలాషంగాని ఫలాభిమానముతోఁ బాటుపడుచు మోయలేనిబరువునెత్తికొంటినను దయాళుతంగాని కొందఱు బ్రహ్మక్షత్రియవైశ్యశూద్రు [illegible]లస్మత్పత్రికాబాలికప్రవృద్ధికై తోడుప డుదురనునమ్మకముచేతను మాపత్రిక కీనెలలోనే ......"యభినవసరస్వతి"యను నామకరణము జేసితిమి.

---

* ప్రియమిత్రుడా! కంభంపాడు.
15-8-08

......తమచే బ్రచురింపబడుచున్న "అభినవసరస్వతి"యను మాసపత్రిక ముట్టినది. అపరిమితానందభరితుడనైతి......బ్రహ్మద్వేషులైన వడ్లకమ్మరబత్తులపై మీరు దెచ్చినదావాను మిగులసంతసించినాడ......యీసంకరకులముయొక్క ప్రగల్భాలు యణచుటకు మీరుప్రయత్నించుచున్నారు గాన యిక్కడ నాస్నేహితులవల్ల కొంత చందాదారులుపర్చి తమకుపంపుటకు ప్రయత్నించుచున్నాను......

మంచిళ్ల నారాయణరావు.

---

మిత్రరత్నమా! తుమ్మకోట
17-8-08

మీరుపంపిన "యభినవసరస్వతి"యను మాసపత్రిక నాకు చేరినది. దానిని కృతజ్ఞతాభివందనములతో నందుకొంటిని......మీరుచేయబూనిన యనన్యసామాన్యవిద్యా కార్యనిర్వహణంబునకుం దోడ్పడ నేనెంతయు నసమర్థుండనయ్యు మీకు నాయెడల గల స్నేహవాత్సల్యంబును, నాకుమీయందుగల గౌరవాతిశయమును మీరుయుద్యమించిన కార్యభారంబును దలంచి మీమాసపత్రికకు నేను నొకచందాదారుగా నుండగోరుచున్నాడను.

సాధుత వెల్లడించుకొనసాఁగిరి, † తాండ్రనృసింహశాస్త్రి యెం
తే ధనలాభమాపనివిధించి గడించె యశంబు మెండుగన్ ॥ 227

సీ॥ స్వగ్రామమునయందు సభకూర్చి తొల్దొల్తఁ
జందాల్ వసూల్ చేసి స్వయమపంపె
అందందుఁగల సుహృద్బృందంబునకుఁజెప్పి
తగినచందాదారులుగనొనర్చె

---

మూర్ఖజనాళికాటపట్టనియెంచబడుచున్న మనపల్నాటిసీమయందుసహితము మీవంటిపండితోత్తములుండుటయు నిట్టివార్తాపత్రికలుబయలువెడలుటయు దేశాభిమానము, మతాభిమానము, వృద్ధిబొందుటయు చూచుటవలన నేను సంతోషసంభరితహృదయారవిందుండనైతి, మీ క్షేమంబుదెలుపగోరెద.

ఇట్లు, ప్రియమిత్రుడు, శా॥ కృష్ణారావు.

† అయ్యా! దుగ్గిరాల. 5-8-08.

యిప్పటికి షుమారు పదిమాసములనుండి మాగ్రామకాపురస్తుడు......అగు వడ్డెపాటి నిరంజనం......ప్రబోధినిఅనుపేర నొకమాసపత్రిక ప్రకటనచేయను దానిలో నంతర్లాపికా బ్రాహ్మణదూషణ యుండియుండె......యీపత్రికలోనినింద్యార్థము తెలిసియు చేయునదిలేక తెలియనివానివలె నూరకుంటిని. నేటికి......భవత్ విరచితపత్రికాలోకనమువలన మాగ్రామవిలేజిమునసపుగారగు 1 జంపాల వెంకటసుబ్బారాయుడుగారున్ను 2 వెనిగండ్ల వెంకటసుబ్బయ్యగారున్ను 3 జంపాల సంగయ్యగారి అప్పయ్యగారున్ను 4 మాగ్రామకరణంగారగు మ॥రా॥ చైనం రామమూర్తిపంతులుగారున్ను అస్మదాదులము మరికొంతమందిన్ని, అపరిమితానందభరితులమయినాము......యభినవసరస్వతికి నాయోపినకొలది అచ్చటచ్చట చందాదార్ల నునిర్ణయించెద......అవకాశమున్నయెడల యొకపర్యాయము మాదుగ్గిరాలకు తాముविజయంచేసి తమవ్యక్తినికనుపరచి భవదీయవాక్మృదుమధురకవితాలాపంబుల మమ్ముల సామ్మసిలచేయవలయునని ప్రార్థించెద......

భవన్మిత్రుడు,
తాండ్ర నృసింహశాస్త్రి.

నన్ను దోడ్కొనిపోయి మన్ననల్ గావించి
గూర్చెసహాయులం గొంతమంది
తానెఱింగినయట్టి ధన్యాత్ములకు నెల్ల
బోధచేసిమరల్చె బుద్ధినిందు

---

......నేను సంగం జాగర్లమూడి అనేగ్రామము వెళ్లినాను......ఆగ్రామములోని బ్రాహ్మణబృందమునందఱిని నొకచోటికిరప్పించి ప్రస్తుత మఠశాలలుచేయుచున్న నిందయును దానికి తాముచేయుచున్న నిశ్చయప్రయత్నమున్ను ఒకగంట వెలువడించినాడ. తమప్రయత్నమునుగూర్చి యందఱు అనేకవిధముల కొనియాడిరి......దద్రవ్యసహాయమును చేయబూనిరి......త్వరకాలములోనే వారొసరించెదరు సహాయద్రవ్యమును తమకు పంపించెదను. యింతియేకాక యీ తేదీననే మాగ్రామములోనుండెడు బ్రాహ్మణబృందమునందఱినిచేర్చి ప్రస్తుతము తమయుద్యమమునుగూర్చి వారితోముచ్చటించగా వారందఱు అపరిమితానందమునొంది తమయుద్యమమును కొనసాగునట్లు వివిధముల ప్రార్థించుటయేగాక వారు తమపత్రికకు చందాదారులుగాచేరుట కియ్యకొనిరి.

దుగ్గిరాల 13-9-08 } తాండ్ర నృసింహశాస్త్రి వ్రాలు

......చాలామంది......యేతీరుననయినను ఒకపర్యాయము యీదుగ్గిరాలకువచ్చి తమ స్వరూపస్వభావమును కనుపరచి వెళ్లవలయుననిన్ని కోరుచున్నాను......యీ అయిదుగురు చందాదార్లకు గతించిన రెండుమాసముల పత్రికలున్ను కట్టియుంటునకళ్లు సన్న వీ, పీ, గాపంపిస్తే వెంటనే తమచందాధనము నంపెదమని నిన్నటిదినమున మంచికలపూడిగ్రామములో నాయెదుట కంఠరవేణా చెప్పినారు......తాము యెప్పుడు యీదుగ్గిరాలకు దయచేయుదురదిన్ని ముందుగా ఒకవుత్తరముద్వారా నాకు తెలుపవలెను......కొద్దిలో కొంతచందాధనము పోగుచేసి పంపుచున్నాను......

18-9-08 తాండ్ర నృసింహశాస్త్రి వ్రాలు

......తాండ్ర నృసింహశాస్త్రి...... ............ది 8-10-08

......యీపదిమందియొక్క చందాధనము ముందుగా తమకార్యస్థానమునకు......పంపుచున్నాను.

......మహారాజశ్రీ సంగంజాగర్లమూడి కాపురస్తులగు క్రొత్త శివలింగయ్యగారిపేర వారంరోజుల్లక్రిందట నేను వ్రాసినవుత్తరములో పోషకులుగాగాని సహాయులుగాగాని యుండవలసినదనిన్ని యీ అభినవసరస్వతికి తమరండగానుండుడనిన్ని వ్రాసినాను.........

సలిపెనింకను నెన్నియో సాయములను
శ్రీకరుండగు తాండ్రనృసింహశాస్త్రి
చాలనఱ కభినవసరస్వతికి మున్ను
ఖ్యాతిగలిగించినటువంటి యనఘుఁ డితఁడె. 228

క॥ ఈరీతి మొదటిసంచిక, సూరిజనస్తోమమునకు స్తుతిపాత్రంబై
మీఱుచునుండఁ బ్రబోధిని, బ్రారంభము చేసె?దూఱ నత్యంతముగన్

తే॥ ఆప్రబోధినితిట్లకు నవలి నెలల
*నుత్తరంబిడెనాపేప రుచితరీతి

---

? 1908 సం॥ జూన్, జులై, ప్రబోధిని,
(అభినవసరస్వతి)

అవాచ్యప్రసంగములతో నీపత్రిక యభినవముగ బుట్టినది. పురిటిలోనుండి యు నాఘ్రేయములగు నశుద్ధవాసనల జిమ్ముచున్నది చెడుగవులుతో. నెలకొనిన యీపసి కూనను పెద్దపురిటిలోనే వెన్నెమ్మ తన్నుకబోవునేమోయని సంశయించుచున్నాము కాని తాను చెప్పరాని వాని చేపట్టినను వెన్నెమ్మ యీపసిబిడ్డ తండ్రికి బెద్దాడుపడు చట! దయదలచునని తండ్రి యూఱుచున్నాఁడు! పాలకుమాత్రము దేవులాడుకొను చున్నాఁడు. అయినను పసిబిడ్డలపాలిటి పెనిమిత్తియగు నీవెన్నెమ్మ మిన్నకుండునా? అయ్యో! పాపము పాలులేనియీపసిబాలయెవని పాలఁబడునోకదా! ఉగ్గుపాలతో నేనొం తుపూడ వరిగింజవేయఁగలము గాని శిశుహత్యను వెఱచి కొన్ని దినవారములవఱకు సైరిం చుచున్నాము. కష్టపడి కన్నతండ్రి జాగ్రత్తతో బోషించుకొనును గాక!

* 1908 సం॥ అక్టోబరు, అభినవసరస్వతి,

అయ్యలారా! ప్రబోధినీకారుఁ డీపత్రిక 1వ సంచికపై నాక్షేపించి వ్రాసినమాట వింటిరా? పసిబిడ్డలపాలిటి పెనుమిత్తియై వెన్నెమ్మయని యొకరత యున్నదఁట! అది నెలబాలయైన యీయభినవసరస్వతిని దన్నుకొనిపోఁజూచుచున్నదఁట. ఆవెన్నెమ్మ తాను జెప్పరానివానిఁ జేపట్టినను నీపసిబిడ్డతండ్రియైన నాకుఁ బెద్దాడుపడుచఁట. అం దువలన దయదలచునని నేనూరుచున్నానట...... తాను బ్రాగ్దేశీయుఁడౌటఁ గడు నాగరికుఁడవనియు, బుద్ధిశాలిననియు, నిందలియర్థము నందఱును గనుగొనలేరనియుఁ నిట్లు వ్రాసినాఁడు.

ఎన్నాళ్ళనుండియో తనమనసునన్న కక్కసుమంతయు వెళ్ళిపోను నీముక్క వ్రాసినాఁడు. కానిండు, ఆచెప్పరానివానిమాట ముందు యోజింతము. జగముపుట్టఁగాఁ బుట్టి చతుర్ముఖునకిల్లాలయి సకలదేవతా పూజనీయయయిన జగన్మాతయే నిరశనవ్రతుఁడనై శరత్త్రియ మొనరించ్చిన తపమునకు మెచ్చివచ్చి మాయింట నవతరించెఁగానివారిచిన్నదినలె నెన్నఁడెవ్వరిచే వినబడనిదై యొక్క వారికిమాత్రమే మాననీయయగు సామాన్యకాదు. అట్టిదానిపయికి, దన్నుకొనిపో నొకవేళ శత్రుప్రేరితయయి వెన్నెమ్మవచ్చినను గంసప్రేరితయయి భగవదవతారమయినవెన్నునికిఁ జన్నియవచ్చినచెన్నమ్మగతియేపట్టును. ఇదియునుంగాక యభినవసరస్వతి పురిటిలోనే యవాచ్యప్రసంగములతో నశుద్ధములగు దుర్వాసనలతో బయలుదేరినదనియు నేను బాలను దేవులాడుచున్నాననియు వ్రాసిరి. మాకుఁ బదిదినములవఱకే పురుడుండుమర్యాదగాని పదిదినములు గఁడచి నామకరణమయినతర్వాతఁగూడ నుండునదిలేదు......ఒకచెంప నభినవసరస్వతియని యుచ్చరించుచు మరలఁ బురుడనియనుట వారిబుద్ధికౌశల్యమునకేతగు, పురిటిలోమాత్రము లోకముతోపాటు మాపిల్లలకు దుర్వాసనయుండుమాట సత్యమే. వారంతేఁ ప్రజాపతులుఁగానఁ బురిటిలోఁగూడ వారిపిల్లల కత్తరువాసనయే పెట్టుకొనిరి. ఆ ఘుమఘుమాయింపులు మాపిల్లల కెప్పటికినిలేదు. ఉన్నప్పటినుండి పరపురుషులువచ్చి పయినఁబడుచుందురు. ఉగ్గుబాలతోనే గొంతుపూడ వరిగింజవేయగలిగియుఁ బ్రకృతము శిశుహత్యకు వెలిచి కొన్నిదినములయినతుద స్త్రీహత్యగావింతురఁట......సాధ్యమైనచో శిశుహత్యకు వెలివకపోవచ్చును, స్త్రీహత్యకు వెలివకపోవచ్చును, గోహత్యకు వెలివకపోవచ్చునుగాని, యభావమందు విరక్తిలేకున్నదెట్లు? గరుడధ్వజుఁడు కడుపునఁబడ్డదాదియే కంసుఁడు కసిమసంగి కాపలసినన్ని కొనిపోనిఁచేతలు గావించెగాని కడకుఁ గాలుపురికి గమనముకట్టుట తనపాలేయైనది......మాసరస్వతి బాలయేయగుఁగాక, రాళ్లఁబొడచినను జావులేదు. అందఱును బాలలకు బాలకయియే దేవులాడుదురుగాని పాపాల కెవ్వరును దేవులాడరు. మాపత్రికయందలి ప్రసంగములు సత్కులప్రసూతులకును రాజమార్గప్రవర్తకులకును వాచ్యములుకాని నాస్తికులకు......నవాచ్యములే, పదిదినములవఱకు పాలివారినే యశుద్ధులఁజేసెడి పసిపాప నశుద్ధవాసనల జిమ్ముట కాక్షేపించినయవివేకిని మరలనాక్షేపించుటకన్న నవివేకమే లేదని యిప్పటికింతటితో విరమింతును.

---

1908 సం॥ అక్టోబరు ప్రబోధిని,

(అభినవసరస్వతి)

నీతిరహితములగు తుచ్ఛప్రసంగములే ప్రధానవ్యాసములుగాఁగలది యీపత్రిక యొక్కటియె పల్లెనాఁటిలోఁబుట్టి ప్రబలినది. ఇందలి యసంగతప్రసంగములకుఁ బ్రత్యుత్తరమిచ్చుటకు నించుకయయిన మాకవసరము గానుపించదు. ప్రపంచమునం దెన్నియో వార్తాపత్రికలు కలవు. అవియన్నియు నొకసంఘమునుగూర్చియో, యొకమతమునుగూర్చియో, యొకవిద్యనుగూర్చియో, యొకభాషనుగూర్చియో, యొకదేశమునుగూర్చియో, లేక యన్నిటిగూర్చియో, అభివృద్ధినిగోరి పాటుపడుచుఁ దమముఖ్యోద్దేశము ప్రధానవ్యాసములయందు వెల్లడించుచు నెట్లయినఁ బ్రజలనుద్ధతికిఁదెచ్చుట స్వాభావికమంయున్నది. యీయభినవసరస్వతియో ప్రత్యేక మొకసంఘమునుదూషించుటయే ప్రధానోద్దేశముగ గానుపించుచు దుదకు గన్నుగానక దన్నుదాఁ దిట్టుకొనుచున్నది. ఇట్టియున్మత్తప్రలాపముల కొకవేళఁ బ్రత్యుత్తరమివ్వ నుద్యమించితిమేని త్రాఁగుబోతువానిఁ బలుకరించినట్లగును......మురికినీటిగుంటను కదిలించినకొలఁదిని దుర్వాసన హెచ్చుచుండును గాన నీతుచ్ఛపువ్రాతల ఖండింపఁబూనుట యనర్థగ్రంథములకుఁ బ్రబలహేతువని విడిచెదము. అనేకులు స్వకులస్థులు చివాట్లుపెట్టి సవరింపఁబూని శ్రమపడి నిరర్థకమనివిడిచిన నట్టిదానితోడ మాకేమిప్రమేయము? వారిమాటల విని బుద్ధితెచ్చుకొనిన తెచ్చుకొననిండు లేకున్న తనదుర్మార్గముననే పడియుండనిండు ఏతద్విమర్శము.

1908 సం॥ నవంబరు డిశంబరు (అభినవసరస్వతి)

ప్రపంచమునఁ బ్రచురింపఁబడుపత్రికలు బహుజనసమ్మతములయి పలువిషయములఁ బ్రశంసించుచుండ నందుఁ బ్రబోధినిమాత్ర మొక్కకంసాలులయభివృద్ధిగోరియే వెలువడుచున్నయది... ఈప్రబోధిని వెలువడినను వెలువడకుండినను లోకమున నానాఁటికి నాగరికతబలియుచుండుటచేఁ గమసాలులు కళావంతులగుదురనుటకుమాత్ర మించుకంతయు సంశయముండదు.ఒక్క కులాధిపులు కారనియే నాయాశయముకాని తక్కినవిషయములలో «తుష్యతుదుర్జనః» అను న్యాయమున వృద్ధికివచ్చినవత్తురు గాక నూఱుకల్లలాడి యొకయిల్లుజేయుమునినరీతి విద్యాదూరులయియున్న స్వకులజుల నుద్ధరించుటకై...చేసెడి యుద్యమముమాత్రము శ్లాఘ్యతమమే.

కులాధిక్యతంగూర్చి ...... పడెడిపాటుమాత్రము చివరకు జడమనీషుఁడగు చంటివాఁడు చందమామనుబట్టుటకై శయములుచాచుక్రియ ననుకరింపక పోదు. శ్లో॥ "స్వగృహేపూజ్యతేమూర్ఖః" అను న్యాయమున మూర్ఖుఁడితరస్థలములలో వాఙ్మాత్రముచేనైన సంభావింపఁబడకున్నను నింటమాత్రము పెండ్లముబిడ్డల నేడ్పించుకొనితినును. అటులనే ముఖ్యవర్ణులముచ్చటయటుండఁ హీనవర్ణులచేనైన నించుకంతపూజవడయనికమసాలులు తమలోఁదమ్మ రోహో మీరు పెద్దలన్న మీరు పెద్దలని పరస్పర గౌరవములుసలుపుకొనుచు సంతోషపడినను నాలుగుముక్కలు చదువుకొని మనపూర్వులు కొండమీఁదనుండి క్రిందఁబడిరనియు, మనపూర్వులు కడుపునిండ నన్నముఁదినిరనియు, మనపూర్వులు కొయ్యలు లెస్సఁ జెక్కఁగలిగిరనియు, వ్రాసికొనుచు మూర్ఖతముల మూడుభుజాలుగాఁ బొంగింపఁగలిగినను నెవ్వరిసొమ్మేమియుఁ గర్చుగాలేదు. తండ్రి కొడుకు నెత్తికొని ముద్దాడునపుడు బంగారుఁపుకొండనియు, నన్నేలెడిదొరయనియు, నాపాలిటివేల్పనియు, నెన్నియోపలుకులు పలికి యాత్మను సంతృప్తిపఱచుకొనుఁగాని యాకొమరుఁ డెన్నటికిని నితరులకడమాత్రము పైశబ్దములచే వాచ్యుఁడుకాఁబోఁడు. ......సీ॥ "జనియించితిమి సర్వజనవందనీయ సద్బ్రహ్మాన్వయపుఁ బయోరాశియందు" అనివ్రాసికొనుటకు సాహసించిన కమసాలి యెట్టియకృత్యమునకైన సాహసించును......బత్తులా! నా......అఖిలవేదశాస్త్రములును నాకాకుదిరుగవేసి యఱువది హాయనములు పరిశోధించినను విశ్వబ్రాహ్మణశబ్దముకాని, తదర్థవాచ్యులుమీరనికాని, తద్వాచ్యులకీయధికారముకలదనికాని, తేలదు. అట్లు తేల్చెడివిద్వాంసులు మీజాతినున్నవరుసకు విశ్వబ్రాహ్మణపౌరుషేయశబ్దములకు సరియైనవ్యుత్పత్తిఁజెప్పి సశాస్త్రముగ సయుక్తికముగ మీయందు సార్థకతపఱచి ముందునెలపత్రికలోఁ బ్రచురించునటులఁజేయుఁడు. ఇదియునుఁగాక పూర్వముమీరు దేవునకేమి దేవునకుందేవుఁడగు భూదేవునకేమి భక్తులరై వర్తిలినకతమ్మునఁ దచ్ఛబ్దతద్భవముగ బత్తులను ప్రతీతి వడసితిరి. "పోదుసుమీ కీర్తికాంత పొందినపిదపన్" అనునీతికనుగుణముగ మధ్యమధ్య మీలోఁగొందఱు వివేకదూరులై దురహంకారమున వర్తించినను బత్తులన్న పేరుమాత్రము మాయలేదు......నిజాముదేశమందంతటను కగసాలులు బ్రాహ్మణులకుఁ బూజానమస్కారములుజరుపుచు విధేయులైయుండుట కనులారఁజూచుచున్నారము. అచ్చటియగసాలులోక బ్రాహ్మణులకేగాక శూద్రాదులకు సైతము భృత్యప్రాయులై వారిచే హీనసంబోధనచేసిపిలువఁబడుచును ప్రసిద్ధముగమద్యపానాదిక్రియలనాచరించుచుండుట ప్ర

త్యతము. అట్టి త్రాగుఁబోతులను నాత్మీయుల కగ్రవర్ణులమనుచు,, మనియాసఁగొల్పుచు నసత్యాలాపములచేఁబత్రిక నింపెడివానివి త్రాగుఁబోతుకూఁతలో లేక నావి త్రాగుబోతుఁ కూతలో వేఱ చెప్పఁకొనవలసినపనిలేదు. పత్రికలే వ్రాయ మొదలిడి పండితుఁడనని పేరు బెట్టుకొన్నవాఁడు ప్రతిపక్షులవ్రాతలు శాస్త్రీయములగుయుక్తులచే ఖండింపఁబూనుగాని, "కూడనురుకలేక నాచుట్టుబలాదూరు,, అన్నట్టు లిందలియసంగతప్రసంగములకుఁ బ్రత్యుత్తరమిచ్చుట మాకనవసరమని యెన్నటికిని వ్రాయఁడు. ఇందుకేకాబోలు "కసిబోనియమ్మ మసిబూసుకొనె,, నన్నసామెత పుట్టినది. శ్లో॥ "విభూషణంమౌన మపండితానాం,, అవిద్వాంసులకు మౌనధారణమే భూషణము......ఐతే ప్రబోధినియొక్క జాతిని వృద్ధికిఁదేఁ బ్రచురింపఁబడ నొకజాతిని దూషింప మాపత్రికవెడలెననిక దాయాతఁడన్నది. కులములన్నియు నీశ్వరశంకితములై కలిగినవికలిగినట్లె తత్తదుచితగౌరవములనందుచుండినవిగాని మధ్య వృద్ధికిఁదేఁబడునవికావు. ఇపుడు వృద్ధికి రావలసిన కులము నకిదివఱకు వృద్ధిలేవట్లేకదా. ఇకఁ గులాభివృద్ధికై నీచకులస్థులందఱు నొకపత్రికప్రచురించుకొనవలసినదే. వేదవేదాంగబోధితులై తాము బ్రహ్మకులసంభూతులైయున్నప్పుడు మనమిట్టివారమని యొకరికొకరు దెలుపుకొనుచు బత్రికలేల వ్రాయవలె. బ్రహ్మక్షత్రియవైశ్యశూద్రులును, దదితరులును, తమకులాధిక్యముఁ దెలుపుకొనుచు బత్రికలు ప్రచురించుచుండుటఁ గానము. అట్టిపత్రిక వైశ్యయొకటియున్నదన్నను నది లోకమున నీచముగా వ్యవహరింపఁబడుకులమున కుత్కృష్టతఁ దేవెడలినది మఱియుకాదు మూడవవర్ణమై యేకారణముననో జనులు లుప్తనిజధర్ములయివర్తిల్లుటచే యజనాధ్యయనదానాదులు మనకు స్మృతిసిద్ధములయియున్నవి కావునఁ దదాచరణ మర్హమని దానబోధింపఁబడుచున్నది. అట్టు లగసాలులును బ్రథమవర్ణులై ప్రప్రథమున శాస్త్రవిహితములగు సకలకర్మలును గలవారై క్షత్రియవైశ్యాదులచేఁగూడ వందితులై యున్నను మధ్యకాలమున నదియంతయు నంతరించి హీనస్థితికివచ్చినందున మరల మేము బుద్ధిమంతులమై తదున్నతస్థితికిఁదే నీపత్రికఁ బ్రకటించుచున్నారమని యన్నచో శ్లో॥ "సంధ్యాతిక్రమణంయస్య సప్తరాత్రమపిచ్యుతం, ఉన్మత్తదోషయుక్తో వాపునస్సంస్కారమర్హతి"॥ అను శౌనకోక్తి యేడుదినము లున్మత్తుఁడై సంధ్యావార్చకున్నను మగుడ నుపనయనార్హుఁడగుననియుండ నెన్నివేలయేండ్లక్రిందనో యన్నికర్మలను నడుగంటి ప్రథమవర్ణులని యెవ్వరికిఁ దెలియబడకయుండ మరలఁ దద్బ్రహ్మత్వముఁ సాధించుకొనవారు మొదలే ప్రాయశ్చిత్తముచే శుద్ధులుకావలెనో యొకటివిమర్శింపవలె.

అంత?గామా-క్షి ప్రత్యక్షమయ్యేవారి,

---

ఒకమనుజుఁడు తనజీవితములోఁ గొన్ని దినములు దోషియైయున్నఁ బ్రాయశ్చిత్తశుద్ధుఁడగుఁగాని వంశములకువంశములే దోషపూరితములైయున్నఁ బ్రాయశ్చిత్త మే ధర్మశాస్త్రమందును విధింపఁబడియుండదు. దోషికిఁ బ్రాయశ్చిత్తమువినా శుద్ధిలేదు. కావున నీపత్రికమూలమున నగసాలులకుఁ గులాధిక్యమువచ్చుట గొడ్రాలికిఁ గొడుకు బుట్టుటవంటిదే కాని వేఱుకాదు. నిజమున కట్టియుత్కృష్టతవచ్చినను రాకున్నను దద్వర్ణులను మసిఁబూసి మారేడుగాయఁజేయు నేదియోయొక యంత్రమునుబన్నినవాఁడు స్వకులాధిక్యపువ్రాఁతలేవ్రాసికొనక మరలబ్రాహ్మణులచే రేలయెత్తవలె ఇరువర్ణముల వారును బ్రాహ్మణులగుట యసంగతమని బ్రాహ్మణుల నబ్రాహ్మణులఁజేసినఁగాని తాముబ్రాహ్మణులముకామనియా?సరే శాస్త్రచర్చయటులుంచి లోకానుభవమే మాత్రము. ఒకనిగృహక్షేత్రారామాదులు మఱియొకనియనుభవములో 12 వత్సరములున్నంతనే ప్రథమునికి వానివిషయమయినహక్కు దొలఁగిపోవుచుండ వేలవత్సరములనుండి వీరి యధీనమయియున్న బ్రహ్మత్వము మరలఁదమ కేరీతిలభింపనున్నదో యోజింపుడు.... మాపత్రికయొకసంఘమును దూషింపనే వెడలుగాఁక. ఒకసంఘమును భూషింపవెడలిన యాపత్రిక బ్రాహ్మణసంఘమునేమి సంఘకార్యమున సమర్పితసర్వస్వుఁడనైన నన్నేమి, మరల దూషింపదొరకొనుట చేటుకాలమువచ్చికాదా? ఇట్టియెడ నభినవసరస్వతితత్సంఘదూషణకై వెడలినను నొకతప్పుగాదు. ఐనను మత్పత్రిక యుక్తియుక్తముగను, శాస్త్రసమ్మతముగను, బ్రబోధినిని బూర్వపక్షముఁ జేయుచున్నది కాని...... తిట్టుటలేదు........యెవరికులస్థు లెవరిఁ జీవాట్లుపెట్టి సవరింపఁబూనివిడిచినది గుంటూరువాణీప్రెస్సులోఁ బ్రచురింపించిన తగాదానోటీసులుసంపాదించిచూచినవారికిఁ దెలియఁగలదు.

---

? 1908 సం॥ అక్టోబరు ప్రబోధిని,

కామాక్షి

(అభయవచనములు)

మద్భక్తిశీలురగు విశ్వబ్రాహ్మణులారా! అభయనిహితములగు మదుక్తులాలకింపుఁ డాలకింపుఁడు!! మీసంస్కరణోద్రేక మభివృద్ధిసేయుఁడు! మీయుత్సాహాలఁ బెనుపుఁడు! మీయుద్దేశముల నేకీభవింపుఁడు!

మీ యవ్యాజకులభక్తి నపారముగ నొనర్పుఁడు! మీవిద్యాతేజస్సులఁ దేజరిల్లఁజేయుఁడు! మీవిముఖులకు భీతిలకుఁడు! మీకపటసుముఖులతోఁ గలియకుఁడు! ప్రస్తుతము మీసంఘమునందుఁ గొందఱికొంత మనస్తాప ముదయమైనది. అందులో దాని నగ్గలపఱచి మొగ్గరమునకుఁదే నూహించుచున్నారు. ఈయుద్దేశము వలదువలదు. ఎవ్వఁడో యొకమూర్ఖుఁడు త్రాగుబోతుకూతలతో నోటికివచ్చినట్లు విచ్చలవిడిగాఁ గూసినంతమాత్రమున మీకు హెచ్చుదగ్గునా? మీకులాధిక్యత కొలఁదియగునా? కించిద్గుణాగుణ మెఱింగినసభ్యులెవ్వరును మి మ్మనాదరణసేయరు, ఆ బాలిశాధము గౌరవింపరు. అతఁ డాక్షేపించినకొలఁది మీయంతరంగములఁ బ్రజ్వలింపుఁడు. ఆతఁ డధికప్రసంగముల కాలవాలము. అతఁ డున్మాదుఁడై కన్నుగానక తన్నుఁదాఁ దిట్టుకొనుచున్నాఁడు; క్రొత్తబిచ్చగాడనని కొట్టుకొనుచున్నాఁడు. జాతినీతిలేని యాకూతలకు భీతివడి యాతని కదలించుట భావ్యమా? దురభిమానులెవ్వరో వానిమాటలువినియు, వానిచేష్టలుచూచియు, సంతసించి మేనువెంచి మనశ్చంచలురై తిరుగుచుండినమాత్రమున మీకేమితొందర? వాఁ డెన్నియో వేషములువేయఁగలఁడు, వేసినయన్నిటిని తెలిసి యూఱకొనుఁడు! ఇటీవల నామూర్ఖుఁడు గూఢాకారంబున మీసంఘకార్యస్థానమునకు రాలేదా? వచ్చి తనపేరు వెళ్లఁబెట్టెనా? లేదులేదు. మాఱుపేరుపెట్టికొని తన యనామకత్వమే స్థిరపఱచెఁగదా! సామకుల కనామకునితోఁ బనియేమి? మీరభివృద్ధికి వచ్చుట యతనికులమున కనర్థదాయకమఁట! మీశోభ యతనికి రోగమఁట! వేయేల మీరెంత వైభవముతో విఱ్ఱవీగెదరో, అతఁ డంత కండ్లకుఁ గంపఁగొట్టుకొనునట! మీరు మనఃపూర్వకముగ శత్రుత్వముఁదీర్చుకొనఁగోరితిరేని విద్యాసంపదఁ బూర్వరీతి నభివృద్ధిసేయుఁడు. ఓర్వలేక కుళ్లికుళ్లి యతఁ డంతటితో నశించును, సత్యముగ నామాట నమ్ముఁడు! సంశయింపకుఁడు!! ధీరస్వాంతులుకండు!!!

కల్లో? మీనాక్షి ప్రత్యక్షమయ్యె మాకు॥ 230

## 1908 సం॥ నవంబరు, డిశంబరు (అభినవసరస్వతి)

## మీనాక్షి (హితవచనములు)

ధర్మశీలురగు నుర్వీగీర్వాణులారా! ప్రబోధినీదుర్భాషాశ్రవణమున నిరుత్సాహులు కాకుఁడు. అది మొదలే యఘశాలప్రబోధిని. అట్టికిల్బిషాలయముల మేల్కొలుప వచ్చినది యేమి మొఱుఁగ కెట్లూరకుండు? మొఱిగి మొఱిగి నోరు నొప్పిలేచి యదియే యూరకుండు. అంతియేకాని సంతతనిద్రాణులగు స్వర్ణకారుల మేల్కొలుపునని యనుకొనకుఁడు. ఒకవేళ మేల్కొలుపు నేచూడుఁడు, మేల్కొని వారుచేయునది యేమి? కులాధిపులగుదురనియా? కుక్కతోఁక చక్కఁగనిలిచినఁగదా కులాధిపులు వీరలగుట? వాండ్రను గామాక్షి యభయమిచ్చిప్రోచుననియా? కళవళమందుచున్న వారు. లేదులేదు; వట్టిమాట. వాండ్రల్పసంతోషులుగాన నట్టి హాస్యాస్పదములగు మాటలు వ్రాసికొనిరి. కామాక్షియన నుద్భిన్నగాదు. భక్తవత్సలనగు నేన బహురూపధారిణినై యనేకదివ్యస్థలముల ననేకనామములతో వెలసియుందును. అట్లు కామాక్షి నుద్భిన్నురాలై యా వైశ్యులకు వరప్రదాత్రియేయగువరుసకుఁ బ్రసిద్ధదైవాలయములై తద్వ్యక్తిం బూజింపరానిందు. వీరిగతి గనఁబడును......ఆ కలాదుఁ డెట్టును వేసి చేపనుగుంజినలాగు ప్రబోధినీమూలమునఁ జల్లనిమాటలుచెప్పి బత్తుల సర్వస్వముఁ హరించుచున్నవాఁడు. తన్మూర్ఖశిరోమణుల కిప్పుడు జ్ఞానమురాదు. "తడిసికొని గుడిసెఁగప్పరు" "పెరుఁగుటవిఱుగుటకొఱకే" యని వాండ్రయూహలు. పెరిఁగినకొలఁది కడగాఁబోయెడిది మీఁదవేసికొని చివరకుఁజెడిపోవుటయేకాని లాభమేమియులేదు. చావుతెలివి లావుపుట్టునని వీండ్రు మీకుభీతిలక తిరుగఁబడుటయెల్ల ననర్థసంప్రాప్తికే కాని వేఱుకాదు. సూర్యోదయప్రభృతి సుత్తెదెబ్బ కిరవగు పనిదుకాణములే వాఁడ్రె సంఘకార్యస్థానములఁట, అచటికి మనవాఁ డెందుకో యరిగెనఁట, అంతమాత్రమునఁనే వాండ్రముల్లెయంతయుఁ గర్చాయెనఁట, ఒకవేళఁ దాఁ బైనుండివచ్చునెడ మార్గమధ్యమునఁ దటస్థించినను మనవాఁడాయిల్లు "దుష్టందూరేవివర్జయేత్" అని తొలఁగ వేసియే రావలసినదికాని శ్లో॥ "ఆన్వీక్షికీం చాత్మవిద్యాం వార్తారంభాంశ్చలోకతః। ఇంద్రియాణాంజయేయోగం సమాతిష్ఠే ద్దివా నిశం"॥ అనునార్యోక్తి॥జ్ఞప్తికివచ్చి వార్తాభిజ్ఞానమునకై లోపలం బ్రవేశించె. ప్రవేశించి తనపనిఁ దాఁ జక్కఁబెట్టుకొనెఁగాని తనపూర్వోత్తరము లడిగి తెలిసికొనకుండ నాయింటియొడయని నోరేమైనఁ గట్టివేసెనా? లేదు.

అట్టిచో నది గూఢాకారమెట్లగును. ఐతే నావిద్వద్భూసురుఁజూచినంతనే వెలవెలఁబోయికాబోలుఁ బాపమాగృహస్థుఁ డొక్కమాటయైన నడుగఁజాలఁడాయె. ఏదియడుగఁదోఁచకున్నను నొక్కపేరుమాత్ర మడుగఁదోఁచెఁగాఁబోలు. అడిగిన నుడువకుండుటకు మనవాఁ డెంతయు భయపడువాఁడుకాఁడు. భయపడువాఁడు పలుమందికమసాలులతో బద్ధవైరమేలపెట్టుకొను? పేరడిగినఁ బురుషోత్తముఁడని చెప్పెఁగాని మాఱుపేరుఁబెట్టుకొనలేదు. ఆపృచ్ఛకుఁ డితరసంగతులెవ్వియు నడుగకున్కిచే నన్నిటికిం గొలికిపూసవలె బహ్వర్థదాయకమగు నొక్కటేమాట జవాబుఁజెప్పెను. అర్థజ్ఞానశూన్యులగు నగసాలు లదిగనఁగొనలేక యభిధానము దాచెననియభిప్రాయపడిరి. ఐనను నామనీషి యది భవనమని యంతఃప్రవిష్టుఁడయ్యెఁగాని నిజమున కట్లు పోఁగూడనిదే. శ్లో॥ "యన్మనీషిపదాంభోజరజఃకణపవిత్రితం తదేవభవనం నోచే ద్భకార స్తత్ర లుప్యతే"॥ పండితులపదధూళిపడి పవిత్రతమైనదే భవనముగాని లేనిచో నది భకార శూన్యంబగు. ఈపండితుఁడువచ్చినందు కింతకండ్లుమండి యిట్టిపిచ్చివ్రాఁతలువ్రాసికొన్నవాండ్రు మఱియొకపండితునిరాకమాత్ర మభిలషింతురా! పండితాగమములేని దానికి భవనత్వసిద్ధియెట్లగు? ఐతే నది కమసాలపండితులకే గమ్యముకాని యన్యులకుఁ గాదుకాబోలు నిజమునిజము. ప్రబోధినిలోఁ దమసభల కన్యులు రాఁగూడదనికూడ నొకచో వ్రాసికొనిరి. అన్యులరుదెంచినఁ దమగుట్టుబైటబడుననియో, లేక పరిహాసముఁ జేతురనియో, యెద్దియో పెద్దయనుమానమొక్క టున్నయది. ఎప్పటికిని గళంకులు వివిక్తస్థానమే వెదకుచుందురు. పోనిండు, మనవాఁడు గూఢాకారముననే యండేగె నందము. అట్లేగినను దప్పుకాదు. పూర్వము సుప్రశిద్ధనామములగు పండితులును ప్రభువులును గూఢచారులై వర్తిలుచుంట సుప్రసిద్ధము. ఆధునికులగు నిజాం మొదలగు నవనీశులయందును దదాచారము గనుపట్టుచున్నయది. ఇతరవిషయములు వ్రాయునపుడు క్రిందఁ దమపేరులు ప్రచురించుకొనుచుఁ బరదూషణము వ్రాయునపుడు ప్రచురింపభయంపడువాండ్ర నామకులగుదురుకాని యింతమాత్రమున కాధీరుఁ డనామకుఁడగునా? రేనుల్లెగ్రామంబునఁ దమకుఁ దాంబూలప్రదానం బొనరింప నీయని విశిష్టాద్వైతవిద్వాంసునిపై వ్రాసినయాక్షేపమందేమి వితండపువాది విరుద్ధపువ్యాజ్యంబని వ్రాసినవిషయమందేమి మఱికొన్ని దూషణవ్యాసములయందేమి యేరిపేరులైన వెల్లఁబెట్టిరేమోచూడుఁడు.

చ॥ మతిచెడి కొన్నిమాసములుమాత్ర మెవ్వో లిఖియించి యంతటన్
బ్రతిపదఖండనల్ గలిగి భాసిలుచుండిన నాదువ్రాఁతకున్
బ్రతిలిఖియింపలేకొ, పెరభావమెకల్గియొ, తత్ప్రబోధనీ
పతి ననుగూర్చి యొక్కటియువ్రాయఁడుపాపము, తిట్టువ్యాసమున్॥
శా॥ ఈశ్వర్యంఘ్రిసమర్చనాదరమతిన్ హేరాళమాధారలో

---

అందుపైవచ్చుపూర్వపక్షముల సమర్థించుకొనఁగలిగినగదా వెళ్లబెట్టుటకు? ఎవరితగాదా యేమిలేని స్వభలో ద్రేకపువ్రాఁతలలోమాత్రము యల్లయాచార్యులనియుఁ, బుల్లయాచార్యులనియు నెవ్వియో వ్యర్థాభిఖ్యలు వ్రాసికొనిరి. మనసరస్వతిలో నెప్పుడయిన వ్యాసకర్తలపేర్లు దాచఁబడెనా? ......ఈప్రకార మనామకత్వము తమయందే స్థిరపడుచుండ మరల మనవాని ననామకుఁడనుటకంటె యున్మత్తప్రలాప మేమున్నది. ఉన్మత్తునుజూచి మంచివాండ్రందఱునవ్వ మంచివాండ్రనుజూచి యున్మత్తుఁడు నవ్వును. వీండ్రకు వాఁడున్మత్తుఁడు గాఁగనఁబడ వానికి వీండ్రున్మత్తులు గాఁగనఁబడుదురు. నీచవర్ణులకు బ్రాహ్మణ్యధర్మములవడుట దేశమునకు క్షేమంకరము గావునకి మనవాఁడు మద్రాజ్ఞచేఁ దద్ధర్వనిర్వాపణముకై కంకణముగట్టినాఁడు. తొల్లి నొక శూద్రుని తపశ్చర్యవలనఁ బ్రాహ్మణసూనున కకాలమరణము సంప్రాప్తముకా దాశరథి యాతనితలదునిమి బాలుని సజీవితుం జేసియుండఁడా? "విధవముండకు దండముఁబెట్టిన నన్నుఁబోలిబరితుకు" మన్నట్లు వీండ్రకు విద్యాసంపదలు పూర్వముండినఁగదా యిప్పుడభివృద్ధియగుట. ఆహా! యిదిచూడ గగనారవిందమున సురభిత్వమున్ సాధించినట్లయున్నది. మీరలెల్ల నాస్తికబుద్ధిచే స్వధర్మపరులగుచుఁ బరతత్వముంభజించుచుండుడు. అందుపై మీ కీదృగ్దుర్మార్గజయం బఱచేతిలోని యుసిరికాయయై యుండు. వెంటనే వీండ్రఁపాడ వడచివైవం జాలియు నీపొంగిపాటింకనెంతవఱకో చూతమని మిన్నకుంటిని. పొంగికాని క్రుంగదు. ఈజాల్ములు మేమయెక్కువని వాఁగినమాత్రమున మన కేమిలోటని మీలోఁ గొంద ఱుపేక్ష సేయుచున్నట్లున్నారు. అట్లుచేయవలదు. ఉత్కృష్టవర్ణు లపకృష్టవర్ణధర్ములైనను నపకృష్టవర్ణు లుత్కృష్టవర్ణధర్ములైనను దేశమునకుఁ జేటువాటిల్లును. కావున నావిషయమున దిగి పనిజేయుచున్న మనవానికిఁ బదుగురును సహాయులైవర్తిలుచు జయమునకునిరీక్షించుఁడు. పట్టినపట్టువీఁడఁడు. భగవన్నామమున్ మఱువకుఁడు.

? విశ్వబ్రాహ్మణశబ్దఖండనమనర్ వేఱొక్క గ్రంథంబుపా

---

? 1909 సం॥ జనవరి, ఫిబ్రవరి, (అభినవసరస్వతి)

విశ్వబ్రాహ్మణఖండనం.

శ్లో॥ నటరాజమహం నత్వా భక్తానాం పరిపాలకం ।
సర్వేవాది విలాసార్థం విశ్వబ్రాహ్మణ ఖండనం॥

విశ్వబ్రాహ్మణఇత్యత్ర విశ్వశ్చాసౌబ్రాహ్మణశ్చ విశ్వబ్రాహ్మణఇతివా విశ్వం ప్రతిబ్రాహ్మణః విశ్వబ్రాహ్మణఇతివా విశ్వేనబ్రాహ్మణః విశ్వబ్రాహ్మణఇతివా విశ్వస్మైబ్రాహ్మణః విశ్వబ్రాహ్మణఇతివా విశ్వస్మాద్బ్రాహ్మణః విశ్వబ్రాహ్మణఇతి వా విశ్వస్య బ్రాహ్మణః విశ్వబ్రాహ్మణఇతివా విశ్వస్మిన్ బ్రాహ్మణః విశ్వబ్రాహ్మణ ఇతివా- నాద్యః కర్మధారయసమాసేన సమస్యమానయోః పదార్థయోరభేదసంసర్గ నియమస్య నీలోత్పలమిత్యాదౌదృష్టత్వాత్ ప్రకృతే తద్రీత్యాబోధస్య బాధితత్వేన బాధితార్థ విషయకజ్ఞానజనకత్వా ద్విశ్వబ్రాహ్మణ ఇత్యస్యాప్రామాణ్యాపత్తేః. నద్వితీయః ప్రతిశబ్దసమభివ్యాహృతద్వితీయార్థీభూతకర్మత్వస్య షష్ఠ్యర్థసమానయోగక్షేమతయాషష్ఠీతత్పురుషే దాస్యమాన సమాధాన కత్వాత్ -నతృతీయః తృతీయా యాస్త్రయోఽర్థాః- "కర్తృకరణయోస్తృతీయా, ప్రకృత్యాదిభ్య ఉపసంఖ్యానం" మితిసూత్రవార్తికాభ్యాం కర్తృత్వం కరణత్వమభేదఇతి- ఏతేషాం మధ్యే కోఽర్థో యుష్మదభిమతః కర్తృత్వం వాకరణత్వం వాఽభేదోవా- నాద్యః విశ్వకర్తృకత్వస్య బ్రాహ్మణేబాధితత్వేన బాధితార్థవిషయకజ్ఞానజనకత్వాద్విశ్వబ్రాహ్మణ ఇతస్యాప్రామాణ్యాపత్తేః నద్వితీయః పూర్వోక్తయుక్తేః నతృతీయః కర్మధారయస్థలీయ సమాధానే నైవదత్తోత్తరత్వాత్- నచతుర్థః సూ॥ చతుర్థీతదర్థార్థబలిహితసుఖరక్షితైః రితిసూత్రోపాత్త పదాతిరిక్త పదానాం చతుర్థ్యాసమాసె కుండలాయాష్టాపదం కుండలాష్టాపదమితివ తత్ప్రకృతివికారస్యకారణత్వేన ప్రకృతే ప్రకతి వికారాభావాదశ్వఘాసాదిస్థలఇవాత్రాపి చతుర్థీ సమాసస్యైవానుచితత్వాత్ నాపిపంచమః పంచమ్యా॥ జన్యత్వార్థకత్వేన విశ్వజన్యత్వస్య బ్రాహ్మణేబాధితత్వాత్పూర్వోక్తరీత్యావిశ్వబ్రాహ్మణఇత్యస్యైవా ప్రామాణ్యాపత్తేః నషష్ఠోపి, షష్ఠ్యర్థాః "కర్తృకర్మణోఃకృతికృత్యానాం కర్తరివాషష్ఠీ శేషషష్ఠీ"సూత్రత్రయేణాగతాః కర్తృత్వం కర్మత్వం సంబంధసామాన్యం తేషాంమధ్యే కర్తృత్వంవా సంబంధసామాన్యంవా కర్మత్వంవా భవదభిమతః

త్త శ్వశ్రేయస్సుఙ్గైన పప్పు పెదసీతారామశాస్త్ర్యాఖ్యచే

---

సాద్యః విశ్వకర్తృక త్వస్యబ్రాహ్మణే బాధితత్వేన పూర్వోక్తయుక్త్యా విశ్వ
బ్రాహ్మణఇత్యస్యైవా ప్రామాణ్యాపత్తేః కించ తవ్యతవ్యానీయప్రత్యయయోగే కృద్యో
గేవా కర్తర్యర్థే షష్ఠీవిధానేన షష్ఠీసమాసస్యై వానుచితత్వాచ్చనద్వితీయః - సంబంధ
సామాన్యమథ్యేజనకత్వంవా జన్యత్వంవా సంయోగోవా సమవాయోవా స్వరూపోవా
ఽవ్యాప్యత్వంవా కాలికోవా స్వాంతర్గతబ్రాహ్మణవృత్తి బ్రాహ్మణత్వాభావవత్వంవా-
నాద్యఃవిశ్వజనకత్వస్య బ్రహ్మభిన్న పదార్థేఽవిద్యమానత్వేన బాధితత్వాత్పూర్వోక్త
త్వాఽప్రామాణ్యాపత్తేః- నద్వితీయః పూర్వోక్తయుక్తేః- యదివిశ్వమస్యాస్తీతి పరి
పాల్యత్వేన విశ్వఃబ్రహ్మ, అర్శఆద్యజితిమత్వర్థీయోఽచ్ప్రత్యయఃతజ్జన్యత్వస్యబ్రాహ్మణే
బాధితత్వా భావాన్నాప్రామాణ్య మిత్యుచ్యతే తదా ఇతరబ్రాహ్మణవ్యావృత్యర్థం
విశ్వేత్యుపరిస్థాప్య విశ్వబ్రాహ్మణ ఇతి ప్రయోక్తుస్తవకోవాలాభ ఇతిస్వయమేవ విభా
వయ, ఇతరేష్వపితజ్జన్యత్వస్య-సత్వాత్ నతృతీయః పూర్వవద్వ్యావృత్త్యసిద్ధేః ఇతరేష్వపి
విశ్వసంయోగస్యసత్వాత్ - నచతుర్థః "శ్లో॥ ఘటాదీనాంకపాలాదౌ ద్రవ్యేషు గుణ
కర్మణోః తేషుజాతేశ్చసంబంధ స్సమవాయః ప్రకీర్తిత" ఇత్యనేనావయవావయవినో
ర్గుణగుణినోః క్రియాక్రియావతో ర్జాతివ్యక్త్యోర్విశేషనిత్యద్రవ్యయోశ్చ సమవాయ
ఇత్యుక్తత్వేనసమవాయస్యవిశ్వాంతర్గత పదార్థప్రతియోగికత్వేపి యావద్విశ్వప్రతి
యోగిక సమవాయస్యైవా ప్రసిద్ధత్వాత్ - నాపిపంచమః అభావాదిస్థలఏవ తస్యనియ
మాత్ -నచషష్ఠోపి విశ్వత్వస్య కేవలాన్వయితయా విశ్వత్వావచ్ఛిన్న ప్రతియోగితా
కాభావస్యైవా ప్రసిద్ధేః-యది విశ్వనిష్ఠప్రతియోగితా కాభావవద్వృత్తిత్వ మేవసంబంధ
స్తథాచనా ప్రసిద్ధిరిత్యుచ్యతే తదానకోపిలాభస్తవ పూర్వవద్వ్యావృత్త్యసిద్ధేః-వచసప్త
మః బ్రాహ్మణస్యజీవాత్మత్వేన నిత్యేషుకాలికాయోగాదితి న్యాయేన కాలికసంబంధేన
విశ్వవిశిష్టత్వస్యబ్రాహ్మణేఽ విద్యమానత్వేన పూర్వవదప్రామాణ్యాపత్తేః- నచబ్రా
హ్మణఇత్యనేన బ్రాహ్మణత్వ రూపజాతివిశిష్టస్యైవబోధనా బ్రాహ్మణత్వమనుష్యత్వా
దీనాం శరీరనిష్ఠత్వా చ్ఛరీరస్యానిత్య త్వేనకాలికసంబంధేన విశ్వవిశిష్టత్వస్య బ్రాహ్మ
ణేబాధితత్వా భావాన్నా ప్రామాణ్యమితివాచ్యం జన్యమాత్రస్య కాలోపాధిత్వమిత్య
స్యైకదేశిమతత్వాత్ - కించ- తాదృశరీత్యా విశ్వవిశిష్టత్వస్య శరీరేవిద్యమానత్వేపి
తవనకోపిలాభః

నాశ్వారంభితమై ముగింపఁబడె శాస్త్రార్థస్వరూపంబునన్ 232

అపిచ, బ్రాహ్మణఇతివాక్యస్య హి సమవాయసంబంధేన బ్రాహ్మణత్వాశ్రయబోధః-కింతు-స్వాశ్రయసుఖదుఃఖావచ్ఛేదకతాసంబంధేన తద్విశిష్టబోధః- అన్యధా బ్రాహ్మణస్యశరీరంబ్రాహ్మణస్యగృహమిత్యాదిప్రయోగాణామప్రమాణ్యాపత్తిస్తధాచ పూర్వోక్తరీత్యావిశ్వబ్రాహ్మణఇత్యస్యైవా ప్రామాణ్యాపత్తేః-నాప్యష్టమఃప్రకారః భవత్సుబ్రాహ్మణత్వంసాధయితుంప్రవృత్తానాంభవతామనిష్టత్వాత్ - యదియుష్మాసువిద్యమానంషట్కర్మనిరతత్వాదిరూపబ్రాహ్మణ్యంనాస్మాభిస్సాధ్యతే, కింత్వపూర్వమేవ, తత్రదేవాస్మాభిః ప్రబోధినీపత్రికాయాం యూయంయాచ్ఞాజీవినోవయంకష్టజీవిన ఇత్యనేనైవజ్ఞాపితం, తస్మాత్స్వాంతర్గతబ్రాహ్మణవృత్తిబ్రాహ్మణత్వాభావవత్వస్యాస్మాసువిద్యమానత్వే నాస్మాకమిష్టమేవేత్యుచ్యతే, తదాప్రీహిస్థతండులసదృశయుష్మదభిప్రాయానుసారేణ కష్టజీవినాం కులాలాదీనాం యాదృశంబ్రాహ్మణ్యం తాదృశమస్మాభిరంగీక్రియతఏవ-కిమర్థమయం కోలాహలః-తథాచైతాదృశ విశ్వబ్రాహ్మణశబ్దవాచ్యత్వస్య యుష్మాసువిద్యమానత్వేపి నాస్మాకంహానిః-నతృతీయః కర్తృకర్మణోః కృతీతిసూత్రే కృద్యోగ ఏవకర్మణి షష్ఠీవిధానాత్ప్రకృతేకృద్యోగాభావాత్ కర్మణిషష్ఠ్యావివానుచితత్వాత్-నచసప్తమః సప్తమ్యాఅధికరణత్వార్థకత్వేన విశ్వాధికరణకత్వస్య బ్రాహ్మణేవిద్యమానత్వేపి విశ్వేత్యస్యావ్యావర్తకత్వాపత్తేః-నాపి వయఃపక్షిణః శ్వానశ్శునకాః వయశ్చశ్వానశ్చవిశ్వానః విశ్వానశ్చబ్రాహ్మణాశ్చ విశ్వబ్రాహ్మణా ఇతిద్వంద్వః-అల్పాచ్తర మితిసూత్రేణ విశ్వశబ్దస్య పూర్వనిపాతేపి తాపసపర్వతాతిత్యాకారకస్థలే దోషవారణాయప్రవృత్తేనాభ్యర్హితంచేతి విశేషశాస్త్రేణ బ్రాహ్మణశబ్దస్యైవ పూర్వనిపాతే బ్రాహ్మణవిశ్వాన ఇతిరూపాపత్తేః-యద్యస్మాస్వభ్యర్హితత్వం నాస్తి, కింతు, తేష్వేవాభ్యర్హితత్వం, తస్మాన్న బ్రాహ్మణశబ్దస్య పూర్వనిపాత ఇతి బ్రాహ్మణవిశ్వాన ఇతి రూపాపత్తిర్నాస్తీత్యుచ్యతే, తదా శునకపత్న్యపేక్షయా న్యూనత్వస్యైవ యుష్మాసువిశ్వబ్రాహ్మణ ఇతిశబ్దప్రయోగాత్పర్యవసితత్వాపత్తేః-నాపి విశ్వబ్రహ్మణోపత్యంపుమానితి తద్ధితవృత్తిః-తథాసతి వైశ్వబ్రాహ్మణ ఇత్యేవస్యాన్నతు విశ్వబ్రాహ్మణఇతి-తథాచ భవత్సుతాదృశవ్యవహారాభావాపత్తేః-యూయంయాచ్ఞాజీవినో వయంకష్టజీవిన ఇతిలేఖనకర్తుస్తవ వయంబ్రాహ్మణాఃకష్టజీవిత్వాద్యూయమబ్రాహ్మణాః యాచ్ఞాజీవిత్వాదితిఖల్వభిప్రాయ స్సూచనసంభవతి

తే॥ బ్రాహ్మణంమన్యులై యొక బ్రాహ్మణాగ్ర్యుఁ
ప్రతిఘటించిన కమసాలబత్తుచరిత
మళ్లియాచార్యవిజయాఖ్య నలరునటుల
వ్రాసిప్రచురించితిని నంత వచనఫణితి॥ 233

తే॥ మఱియుఁ బెల్లముకొండ రామాయసుకవి
సలిపె * బ్రాహ్మణశబ్దవిచారమునఁగ

---

ప్రథమానుమానే కష్టజీవిత్వాదితిహేతోస్సాధ్యీభూత బ్రాహ్మణత్వాభావవత్కులాలాదివృత్తిత్వేన వ్యభిచారః-సాధ్యీభూత బ్రాహ్మణత్వాధికరణావృత్తిత్వేన సాధ్యసామానాధికరణ్యరూపవిరోధశ్చాపరోదోషః-సాధ్యీభూత బ్రాహ్మణత్వవ్యాపకీభూతాభావ ప్రతియోగిత్వ రూపాసాధారణ్యంచాన్యోదోషః- “వర్షాసురథకారోఽగ్నిమాదధీ” తేతిశ్రుతిమూలక “వచనాద్రథకారస్యాధానేస్యసర్వశేషత్వా”దిత్యాది సూత్రవ్యాఖ్యానావసరే భగవతాభాష్యకారేణైతాదృశశ్రుతౌ విద్యమానరథకారశబ్దవాచ్యస్త్రైవర్ణికోవాఽన్యోవేతివిచార్య నబ్రాహ్మణః నక్షత్రియః నాపివైశ్యః నాపిశూద్ర ఇతిస్పష్టముక్తత్వేన సంకీర్ణసంకరజాతీయేషు రథకారేషు బ్రాహ్మణత్వరూపసాధ్యస్యావిద్యమానత్వేన బాధోఽపి-కించ-రథకారా అబ్రాహ్మణాః బ్రాహ్మణత్వవ్యాప్యషట్కర్మనిరతత్వాదిశూన్యత్వాదితి వక్తుంశక్యత్వేన సత్ప్రతిపక్షశ్చ-నచాస్మాకమపి షట్కర్మాణివర్తంతే తస్మాస్మదుక్తబ్రాహణత్వాభావ సాధకహేతోస్స్వరూపాసిద్ధత్వేన నాయంసత్ప్రతిపక్ష ఇతివాచ్యం-యూయంయాచ్ఞాజీవినఇతి భవతాలిఖితత్వేన యాచ్ఞాప్రతిగ్రహయో ర్భేదాభావాత్ప్రతిగ్రహస్య షట్కర్మాంతర్గతత్వేన యుష్మదుక్తస్యైవాపలాపాపత్తేః-ద్వితీయానుమానే ప్యేవమేవబోధ్యం-యదిప్రజ్ఞావానస్యస్మదీయానప్రష్ట్వాసమాధానంధేయం.

ఇతి ధూళిపాళ సూర్యనారాయణశాస్త్రిణామంతేవాసినా పప్పు సీతారామశాస్త్రిణాకృతం విశ్వబ్రాహ్మణశబ్దఖండనం.

---

* 1910 సం॥ ఏప్రిల్, మే, (అభినవసరస్వతి)

బ్రాహ్మణశబ్దవిచారము.

బ్రాహ్మణశబ్దవిచారము.

శ్లో॥ జాతిం క్రియాం గుణం సంజ్ఞాంవా ప్రవృత్తినిమిత్తీకృత్య ప్రతిపాద్యప్రతిపాదకభావసంబంధేన శబ్దా అర్థేషువర్తంతఇతి స్థితం-యథా-గౌరశ్వ ఇతిజాత్యా

పాచకః పాఠక ఇతిక్రియయా శుక్లోగుణఇతి గుణేన జయ్యటః కైయట ఇతిసంజ్ఞయాచ ప్రవృత్తిః-ఏవంస్థితే బ్రాహ్మణశబ్దః కింజాతివాచీ యద్వా క్రియావాచీ ఉతగుణవాచీ అథవాసంజ్ఞావాచీ ఇతి అయమంశ ఇహవిచార్యతే

నతావజ్జాతివాచీ బ్రాహ్మణత్వజాతే ర్దుర్నిరూపత్వాత్-కుతో దుర్నిరూపత్వమితిచేదుచ్యతే-కింబ్రహ్మముఖజత్వం బ్రాహ్మణత్వం యద్వాబ్రాహ్మణేన విధివదూఢాయాం బ్రాహ్మణ్యా ముత్పన్నత్వం యద్వాయజనాది షట్కర్మవత్వం అథవాబ్రహ్మజ్ఞానవత్వం- నతావదాద్యం ఇదానీం బ్రాహ్మణత్వే నవ్యవహ్రియమాణేషుబ్రహ్మముఖజత్వానుపపత్తేః-నద్వితీయం బ్రాహ్మణే నేతితృతీయాన్తశబ్దగత బ్రాహ్మణత్వస్య ప్రకృతస్య చైక్యేన ఆత్మాశ్రయాత్ - నతృతీయం అనుపనీతస్య అబ్రాహ్మణత్వాత్ శూద్రాదేరపి షట్కర్మాచరణేన బ్రాహ్మణత్వాపాతాచ్చ-నచతుర్థం బ్రహ్మజ్ఞానినాం జనకాదీనాం క్షత్రియాదీనామపి బ్రాహ్మణత్వాపత్తేః-ఏతస్మాన్న జాతివాచీ బ్రాహ్మణశబ్దః-నాపిక్రియావాచీ బ్రహ్మజ్ఞానస్యమానసిక క్రియాత్వేపి నబ్రహ్మజ్ఞానవాచీబ్రాహ్మణశబ్దః-బ్రాహ్మోఽజాతావితి వ్యాకరణ విరోధాత్ - అజాతౌహి బ్రాహ్మఇతి స్యాత్ - బ్రహ్మజ్ఞానిషుజనకాది క్షత్రియేష్వపి బ్రాహ్మణవ్యవహార ప్రసంగాచ్చ-నచేతఃప్రభృతితథావ్యవహారః స్యాదితివాచ్య మనాదివ్యవహార స్యైవగ్రాహ్యత్వాత్ నాపిగుణవాచీ శుక్లాదిగుణేష్వనంతర్భావా ద్బ్రాహ్మణత్వస్య - నాపిసంజ్ఞావాచీ, నహికస్యచిద్వ్యక్తివిశేషస్య బ్రాహ్మణఇతి నామకృతం-ఇతిపూర్వపక్షే ప్రాప్తేబ్రూమః జాతివాచీ బ్రాహ్మణశబ్దఇతి - బ్రాహ్మోఽజాతావిత్యనుశాసనాత్ బ్రాహ్మణోస్యముఖమాసీ దితిశ్రుతేశ్చ-నచశ్రుతావపి బ్రాహ్మణశబ్దోనజాతి వాచీతివాచ్యం బ్రాహ్మణః రాజన్యఃకృతఇత్యాదిక్షత్రియాదిపదసమభివ్యాహారసద్భావాత్ తర్హి కా బ్రాహ్మణత్వజాతిరితిచేదుచ్యతే బ్రాహ్మణేన విధివదూఢాయాం బ్రాహ్మణ్యాముత్పన్నత్వమితి-నాత్మాశ్రయః తద్గతబ్రాహ్మణత్వస్యా ప్యేవంవిధత్వాదనాదిత్వాచ్చ ప్రవాహవతీ-హంతతర్హి అబ్రాహ్మణా ఏవవ్యాసశుక శౌనకఋశ్యశృంగాదయ ఇతిచేన్నైవం లోకాతిగ ప్రాభవానాంస్వాతంత్ర్యేణను తచ్ఛిన్నిమిత్తాచ్ఛరీరపరిగ్రహణం కృతవతాం దేహాన్యాత్మవిదాం వ్యాసాదీనాం చరితస్యయుగాంతరవిషయ స్యేహానుదాహార్యత్వాత్ - నహీదానీమయోనేర్వి యోనేర్వాజాతో మనుష్య ఉపలభ్యతే ఉపపద్యతేవా - భవంతుతే వ్యాసాదయో మహాత్మానః తథాపి కథం తేషాం బ్రాహ్మణత్వమితిచేద్బ్రాహ్మణ బీజప్రభవత్వాద్బ్రాహ్మణేన విధివత్సంస్కృతత్వా దీశ్వరేణానుగృహీతత్వాచ్చ తేషాం బ్రాహ్మణత్వమితివిద్ధి - నచ యుగాంతరీయపురుషనిష్ఠమేవ బ్రాహ్మణత్వం కలియుగేప్యాశ్రయితవ్యమితి వాచ్యంయుగాంతరీయధర్మాణాంకలియుగధర్మాణాంచపార్థక్యాత్.

పూర్వయుగేషుహిగురుదారగమనగోవధ విధవోద్వాహాదయో మనుష్యాణాం ధర్మాఏవ కలియుగేత్వమీసుతరామధర్మాఏవయథా తథైవాయమపి- నహీదానీంబ్రాహ్మణ బీజాచ్ఛూద్రాది యోన్యాముద్భూతో బ్రాహ్మణఇతివ్యవహ్రియతే- వ్యవహారాశ్రయో హిబ్రాహ్మణత్వాదిః పరమార్థతోద్వైతస్యైవాభావాత్ - తస్మాత్కలియుగే బ్రాహ్మణేన విధివదూఢాయా ముత్పన్నఏవ బ్రాహ్మణః సఏవ షట్కర్మాచరణయోగ్యఇతిసిద్ధం -ననుజన్మనాజాయతేశూద్రః కర్మణాజాయతేద్విజః వేదపాఠేనవిప్రస్స్యాద్బ్రహ్మజ్ఞానేన బ్రాహ్మణఇతిస్మరణాత్ బ్రాహ్మణేనబ్రాహ్మణ్యాం విధివదూఢాయా ముత్పన్నోనబ్రాహ్మణః కింతు శూద్రఏవేతిచే న్మైవం - కింసర్వేమనుష్యాజన్మనా శూద్రాజాయంతఇతితవవాదః ఉతకతిచిత్ - నాద్యః చండాలాదీనామపి శూద్రత్వాపత్తేః - ద్వితీయేపి - కింశూద్రాయా ముత్పన్నాఏవశూద్రా యద్వాక్షత్రియస్త్ర్యాదిషు - ఆద్యేబ్రాహ్మణ్యాంజాతస్యనశూద్రత్వం - ద్వితీయేతు వ్యవహారవిరోధాదిః- నచైవంశూద్రాపుత్రశ్శూద్రఏవ బ్రహ్మజ్ఞానేన బ్రాహ్మణస్స్యాదితివాచ్యం-యదిశూద్రాపుత్రః కర్మణాద్విజస్స్యా ద్వేదపాఠేనచ విప్రస్స్యాత్తర్హి జ్ఞానేన బ్రాహ్మణోపిస్యాన్నతుతథా దృశ్యతే-కింతర్హి బ్రాహ్మణ్యా ముత్పన్నఏవ జన్మనా శూద్ర శ్శూద్రసమః కర్మాభావాత్, కర్మణాతు సఏవద్విజః తస్యైవకర్మాధికారా ర్హత్వాత్ - వేదపాఠేనచ సద్విజఏవవిప్రః, జ్ఞానేనతు సవిప్రఏవబ్రాహ్మణఇతికృత్వా బ్రహ్మజ్ఞానప్రయుక్తం బ్రాహ్మణత్వమపి బ్రాహ్మణ్యా ముత్పన్నస్య బ్రాహ్మణస్యైవ నాన్యస్య ద్విజత్వవిప్రత్వవదితిబోద్ధవ్యం - ననుయదిజన్మనైవ బ్రాహ్మణ్యాం బ్రాహ్మణా దుత్పన్నోబ్రాహ్మణ స్తర్హి కథంతస్యపునః బ్రహ్మజ్ఞానేన బ్రాహ్మణత్వం పిష్టపేషణవద్విరోధాదితిచేదుచ్యతే - పుంలింగో నపుంసకలింగశ్చేతి ద్వివిధస్తావ ద్బ్రహ్మశబ్దః - తత్రపుంలింగాద్బ్రహ్మ శబ్దాచ్చతుర్ముఖవాచకా జ్జాతౌవాచ్యాయాం బ్రాహ్మణశబ్దో నిష్పన్నః - సచదర్శితః - క్లీబాద్బ్రహ్మశబ్దాత్పరబ్రహ్మవాచకాత్ జ్ఞానేవాచ్యేనిష్పన్నో బ్రాహ్మణశబ్దోఽన్యః - నాత్రబ్రాహ్మోఽజాతావితిసూత్ర ప్రవృత్తిః పుంలింగబ్రహ్మశబ్దస్యైవ తత్రగ్రహణాత్ - సచ తావాన్వే దేషుసర్వేషుబ్రాహ్మణస్యవిజానత ఇతిగీతాభాష్యే శ్రీ శంకరాచార్యైర్దర్శితః బ్రాహ్మణస్సన్యాసీతి - విదుషఏవసన్యాసాధికారా త్సన్యస్తస్యైవబ్రహ్మజ్ఞానిత్వాచ్చ బ్రాహ్మణోబ్రహ్మజ్ఞానీ సన్యాసీత్యర్థః - నచక్షత్రియాదీనాం సన్యాసాద్బ్రహ్మజ్ఞానలాభే బ్రాహ్మణత్వం స్యాదితివాచ్యం బ్రాహ్మణోనిర్వేదమాయాదిత్యాదిశ్రుతే ర్బ్రాహ్మణస్యైవసన్యాసాధికారాత్ తస్మాత్, జాత్యాయో బ్రాహ్మణః సఏవకర్మాచరణాదినాద్విజత్వాదికంసంపాద్య జ్ఞానేనాపిబ్రాహ్మణోభవతి నత్వన్యఇతికృత్వానపిష్టపేషణవిరోధః - నాపిశూద్రాదీనాం జ్ఞానేనబ్రాహ్మణత్వాపాతః- వజ్రసూచ్యుపనిషత్తు క్రియావాచినంబ్రాహ్మణశబ్దంప్రగృహ్య బ్రాహ్మణత్వంనజాతిరిత్యుక్తవతి- నతుజాతివాచినం బ్రాహ్మణశబ్దం - తథాసతి శ్రుతిస్మృత్యాదిబహువిరోధేన వజ్రసూచ్యుపనిషదోఽప్రామాణ్యప్రసంగాత్ - తథాహి వేదవిద్బ్రా

ఎల్లరకుఁ జెల్లమారీతి నేనుదాని
* తెలుఁగుగ వ్రాసితి నితిహాసకలితముగను ॥ 234

హ్మణేవసంతి, బ్రాహ్మణోస్య ముఖమాసీత్ బ్రాహ్మణోనిర్వేదమాయా దిత్యాదిశ్రుతయః - గర్భాష్టమే బ్రాహ్మణముపనయీత, బ్రాహ్మణస్యధనం భైక్ష్యం, బ్రాహ్మణక్షత్రియవిశాం స్వభావప్రభవైర్గుణైః, ఇత్యాద్యాస్స్మృతయః పురాణాదీనిచే హానుసంధేయాని - వ్యవహారస్తు సార్వజనీనః ప్రత్యక్షఏవ బ్రాహ్మణోయం క్షత్రియోయం వైశ్యోయం శూద్రోయమిత్యాదిః - బ్రాహ్మణశబ్దో జాతివాచీహి సర్వలోకవిదితః క్షత్రియాదిశబ్దవత్ - జ్ఞానవాచీ బ్రాహ్మణశబ్దస్తువిద్వద్వ్యవహారమాత్రగోచరః నసార్వజనీనఇతి సర్వమవదాతం. ఇతి బెల్లంకొండ రామకవికృతిషు బ్రాహ్మణశబ్దవిచారః.

* 1910 సం॥, జూన్, (అభినవసరస్వతి)

## బ్రాహ్మణత్వవిచారము.

లోకమున జాతినో క్రియనో గుణమునో సంజ్ఞనో ప్రవృత్తికినిమిత్తముఁజేసికొని ప్రతిపాద్యప్రతిపాదకతాసంబంధముతో శబ్దము లర్థములందువర్తించునని యున్నది. అర్థము ప్రతిపాద్యము శబ్దము ప్రతిపాదకము. ప్రతిపాద్యతాసంబంధముతో నర్థము శబ్దమందుండుననియుఁ బ్రతిపాదకతాసంబంధముతో శబ్ద మర్థమందుండుననియు శాస్త్రనియమము. గోవను ప్రవృత్తికి గోత్వజాతి నిమిత్తము. పాచకుఁడను ప్రవృత్తికిఁ బచనరూపక్రియనిమిత్తము. నీలఘటమను ప్రవృత్తికి నీలరూపగుణము నిమిత్తము-రాముఁడు కృష్ణుఁడను ప్రవృత్తికి రామకృష్ణరూపసంజ్ఞ నిమిత్తము. ఇట్లుండఁగా బ్రాహ్మణశబ్దము జాతివాచియా లేక క్రియావాచియా మఱిసంజ్ఞావాచియా గుణవాచియా యనుసంశ మిచటవిచార్యము.

ఐతే బ్రాహ్మణజాతి యిట్టిదని నిరూపింపవీలులేనందున బ్రాహ్మణశబ్దము జాతివాచికాదని కొందఱందురు. ఎందుచేతవీలులేదన్న వారిట్లుచర్చింతురు. ఎట్లనఁగా బ్రహ్మముఖమునఁబుట్టినవాఁడు బ్రాహ్మణుఁడా? లేక బ్రాహ్మణుఁడు విధ్యుక్తముగఁ బెండ్లాడినబ్రాహ్మణ స్త్రీయందుఁబుట్టినవాఁడు బ్రాహ్మణుఁడా? యిఁక యజనాదిషట్కర్మలుగలవాఁడుబ్రాహ్మణుఁడా? బ్రహ్మజ్ఞాని బ్రాహ్మణుఁడా? ప్రకృతము బ్రాహ్మణులుగావ్యవహరింపఁ బడెడివారలలోసాక్షాత్తు బ్రహ్మముఖమునుండివుట్టినవాఁడొక్కండునులేమిని బ్రహ్మముఖమునఁబొడమినవాఁడు బ్రాహ్మణుఁడనుట యసంగతము. ఇఁక బ్రాహ్మణునకు వివాహితయగు స్వవర్ణస్త్రీయందుఁగలిగినవాఁడు బ్రాహ్మణుఁడనుటకుఁ బ్రథముని బ్రాహ్మణత్వమును బ్రకృతుని బ్రాహ్మణత్వమును నొక్కటేయగుటచే నాత్మాశ్రయంబనుదోషమాపాదించుచున్నది. ఆత్మాశ్రయమనగా స్వజ్ఞానాధీనజ్ఞానవిషయత్వము. మఱియజనాదిషట్కర్మలుగలవాఁడు బ్రాహ్మణుఁడనియందమా షట్కర్మాచరణాధికార

ములేని యనుపనీతుఁడు బ్రాహ్మణుఁడుగా వ్యవహరింపఁబడక పోవలసివచ్చును. అనుపనీతుఁడు బ్రాహ్మణుఁడుగా వాడఁబడుట లోకానుభవమే కాక "గర్భాష్టమే బ్రాహ్మణముపనయీత" ఇత్యాదిస్మృతులయందును సుప్రసిద్ధము. ఇదియునుంగాక షట్కర్మాచరణమున బ్రాహ్మణత్వము వచ్చెడిచో షట్కర్మలనాచరించిన శూద్రాదులును బ్రాహ్మణశబ్దవాచ్యులగుదురు. ఇఁక బ్రహ్మజ్ఞాని బ్రాహ్మణుఁడనుటకు బ్రహ్మజ్ఞానులయిన జనకుఁడు మొదలగు క్షత్రియులుగూడ బ్రాహ్మణులే కావలసియుండెనుగదా- కావున బ్రాహ్మణశబ్దము జాతివాచకమెంతయుం గానేరదు. "బ్రాహోఽజాతౌ" అను వ్యాకరణసూత్రమునకు వైయర్థ్యము సంభవించును గావున బ్రహ్మజ్ఞానమును మానసిక క్రియగా నొప్పుకొన్నను బ్రాహ్మణశబ్దము బ్రహ్మజ్ఞానరూప క్రియావాచియుం గాఁజాలదు. జాతివాచకముగానపుడు బ్రాహ్మయని కావలసియుండుఁగాని బ్రాహ్మణుఁడని కావీలులేదు. అట్లు బ్రహ్మజ్ఞానముగలవాఁడు బ్రాహ్మణుఁడయి బ్రాహ్మణశబ్దము క్రియావాచియైనచో బ్రహ్మజ్ఞానులగు జనకాదిక్షత్రియులయందును బ్రాహ్మణవ్యవహారప్రసంగ ముండనుండెను. ఇఁకనిప్పటినుండి బ్రహ్మజ్ఞానులను బ్రాహ్మణులుగా వ్యవహరింతమనుట కనాదివ్యవహారమునే గ్రహింపవలెను గాని యన్యముకాదు. మఱియు బ్రాహ్మణత్వము శుక్లాదిగుణములనంతర్భూతమయినది కాకునికి గుణవాచికూడఁ గాదు. ఎవ్వరికిని బ్రాహ్మణుఁడని పేరుండనందున బ్రాహ్మణశబ్దము సంజ్ఞావాచియుం గాదని పెక్కండ్రు బుద్ధిమంతులు చేసెడిపూర్వపక్షములపయి బ్రాహ్మణశబ్దము జాతివాచియే కాని వేఱుకాదని నొక్కి వక్కాణించుచున్నారము. "బ్రాహోఽజాతౌ" అను పాణినీయన్యాయమును "బ్రాహ్మణోఽస్యముఖమాసీ" త్తను శ్రుతియును నిందుకుఁ బ్రబలనిదానములు. ఈ "బ్రాహ్మణోఽస్య ముఖమాసీ" త్తను శ్రుతియందును బ్రాహ్మణశబ్దము జాతివాచి కాదని చెప్పఁగూడదు. అట్లు జాతివాచి కానిచో వెంటనే "బాహూ రాజన్యః కృతః" "ఊరూ తదస్య యద్వైశ్యః-" అని క్షత్రియవైశ్యజాతుల యుత్పత్తి చెప్పఁబడదు. ఐతే బ్రాహ్మణజాతి యేదియనిన బ్రాహ్మణునకు వివాహితయగు స్వవర్ణస్త్రీకిఁ గలిగినకుమారునిదే కాని యితరము కాదు. మొదటి బ్రాహ్మణుఁడును నీలాటివాఁడయి ప్రవాహరూపముచే ననాదిసిద్ధముగ వర్తిల్లుచున్నందున నాత్మాశ్రయరూపదోషముగూడ నాపాదింపదు. ఇందుమీఁదనే కొంద అవివేకిశిఖామణులు వ్యాసశుకశౌనకఋష్యశృంగాదిమహామును లబ్రాహ్మణులని వాపోవుచున్నారు. లోకాతిగప్రాభవులయి సర్వస్వాతంత్ర్యముఁ వహించి యేదియో యొకనిమిత్తమున శరీరపరిగ్రహాదికం బొనరించి దేహాన్యాత్రవిదులగు వ్యాసాదుల యుగాంతరీయ చరిత్రమును మనముదాహరణముఁ దెచ్చుకొనుటకంటె వేఱొండుమూర్ఖత్వముండఁబోదు. అట్లు కులమునకు వారిం బోల్చుకొనిన నన్నిటికిని బోల్చుకొనవలసియుండును. సద్యోగర్భమునఁ దపస్సిద్ధులైకాని మృగాదిమనుష్యేతరయోనులయందుఁగాని యయోనులయందుగాఁని జనించినవార లీక్రొత్తబ్రాహ్మణికము సంపాదింపఁజూచువారలయందుండిన నావ్యాసాదులతో సరిపోల్చుకొనవచ్చును. వ్యాసులు క్షత్రియుఁడగు నుపరిచర

వసు మహారాజువీర్యముచే మత్స్యగర్భమున జనియించి యోజనగంధినాఁబడి దాశరాజుచేఁ బెంపఁబడుచు నావగడపెడి సత్యవతి సద్యోగర్భమున వేదవిభాగపురస్సరంబుగ జగదుద్ధారం బొనరింప నవతరించిన శ్రీమహావిష్ణువుకాని వేఱుకాదు. ఓకకళంక లెన్నియైనది తెలియని తిష్ఠన్మాత్రులందఱును వ్యాసులయుత్పత్తి హేయమన్నట్లు ప్రలపించుచుందురు. ఎన్నిసంవత్సరములో మైధునముఁజేయఁజేయ యోనినిఁబడి నవమాసములపర్యంతము గర్భనరకమనుభవించి భూమికివచ్చినబహువత్సరములకు రెండు మూఁడు తొట్టిమొట్టికాఁతలు నేర్చుకొనినవైధవేయులు గ్రుడ్డువచ్చి పిల్లను వెక్కిరించిన రీతి వ్యాసులపై నాడిపోసికొనిన నామహానుభావుని యనూనప్రభావమున కేమిలోటు గలుగును. స్నానసమయమునఁగలిగిన యకస్మాన్మోహమునస్ఖలితమై సరఃపతితమగువిభాండకమునివీర్యముం బానముసేసినలేడికి లేడిపిల్లయేపుట్టక ఋష్యశృంగుఁడేలపుట్టవలె. మిత్రావరుణులు గంధర్వమిథునదర్శనముచేఁ స్ఖలితమైన స్వవీర్యమును గలశముననుంచిన మాత్రమున నందు మహాతపశ్శాలులగు వసిష్ఠాగస్త్యులు జనింపవలెనా? స్వతంత్రులుగానిచో వీరియుత్పత్తులీరీతివిచిత్రకరములై యుండవు. ఏవిషయమునఁగూడవీరిందులదూగని సామాన్యులువీరిజన్మలిట్టివగుటసంకరులనియుఁబ్రకృతముగౌరవభాజనులగు బ్రాహ్మణులేతద్గోత్రజాలగుటవారుగూడనట్టివారేయనియు వాపోయినఁబోవనిండు! వీరిజననాదులిట్టియాశ్చర్యకరములైనవియగుటచే వీరుమహాత్ములైతే నగుదురుగాక, బ్రాహ్మణులుమాత్రముకారని కొందఱభిప్రాయపడుదురేమో- బ్రహ్మబీజసంభూతులును బ్రాహ్మణునిచేవిధివత్తుగానుపనయనాదివిధులచే సంస్కరింపఁబడినవారలును నీశ్వరానుగ్రహము సంపూర్ణముగాఁబడసినవారలునగుటవలనవారుబ్రాహ్మణులగుటకించుకంతయు సంశయముండదు ప్రకృతము బ్రాహ్మణత్వమునకాసించెడిబ్రాహ్మణేతరు లొకవేళ మేమును బ్రాహ్మణబీజప్రభవులమేయనియనుకొన్నచౌర్యముననుదయించియుందురుగాని ప్రత్యక్షముగా నుదయించుటకు నన్యవర్ణస్త్రీవివాహములేని యీకలికాలమున సంభవింపదు. అట్టికులటాపుత్రులకుబ్రాహ్మణులుబహిరంగముగా నుపనయనాదిసంస్కారములఁ జేయఁజాలరనుటకునిస్సంశయము. ఇట్టిబ్రాహ్మణేతరులకు వేదములందుఁ జెప్పఁబడియున్నదని యజనాదికర్మలఁజేయింపఁజూచుట యయ్యవారినిజేయఁబోయినఁ గోఁతియైనచందముకాని వేఱుకాదు. వర్ణచతుష్టయమునకుఁగూడ యజనాధికారమున్నదని వేదములేచెప్పినచోఁ దద్విధజనకర్తయగు వ్యాసులతండ్రి పరాశరులు శ్లో॥ కపిలాక్షీరపానేన బ్రాహ్మణీ సంగమేనచ। వేదాక్షరవిచారేణ శూద్రశ్చండాలతాంవ్రజే, తని యేలచెప్పియుండును. శ్లో॥ కృతేతుమానవాధర్మా స్త్రేతాయాం గౌతమాస్మృతాః। ద్వాపరే శంఖలిఖితాః కలౌపారాశరాస్మృతాః, అని యున్నందునఁ గలియుగంబునకుఁ బరాశరస్మృతి ముఖ్యప్రమాణమైయున్నది. శ్లో॥ ధర్మంజిజ్ఞాసమానానాం ప్రమాణం ప్రథమం శ్రుతిః। ద్వితీయం ధర్మశాస్త్రంచ తృతీయం లోకసంగ్రహః॥ అను భారతవచనానుసరణిని ధర్మశాస్త్రములు ద్వితీయప్రమాణములై యున్నవి. ఈ భారతాదులలోఁ దమకనుకూలము

లగు స్థలములు ప్రమాణములుగా గ్రహించినపుడు సర్వముం గ్రహింపవలసియేయుండును గావున నందుకు బద్ధులయియే యుండవలయునుగదా. యుగాంతరీయపు రుపనిష్ఠమగు బ్రాహ్మణత్వమే కలియుగమందుఁగూడ నాశ్రయింపఁదగు ననుటకు నప్పటి ధర్మములకును నిప్పటిధర్మములకును జాలభేదముగనుపట్టెడు, పూర్వయుగముల గురుదారగమన గోవధవిధవోద్వాహాదులు ధర్మములై యున్నవి. కలియుగమందవి సుతరామధర్మములు ప్రకృతము బ్రాహ్మణబీజముచే శూద్రాదియోనులయందుఁబుట్టినవాఁడెవఁడును బ్రాహ్మణుఁడుగా వ్యవహరింపఁబడుటలేదు. బ్రాహ్మణ క్షత్రియాదిజాతులు వ్యవహారాశ్రయములుగదా. పరమార్థముతోఁ జూచిన ద్వైతమే యవసరములేక యిప్పటి మననవనాగరికుల యభిప్రాయముచొప్పున నగ్రజులు నంత్యజులు నేకమయియేయుండనగునుగావునఁ గలియుగమున బ్రాహ్మణునకు వివాహితస్త్రీయందుఁ గలిగినవాఁడే బ్రాహ్మణుడు. వాఁడే షట్కర్మాచరణ యోగ్యుఁడనుట సిద్ధము. శ్లో॥ జన్మనాజాయతే శూద్రః కర్మణాజాయతేద్విజః। వేదపాఠేనవిప్రస్స్యా ద్బ్రహ్మజ్ఞానేనబ్రాహ్మణః॥ అనుస్మరణమున బ్రాహ్మణునకువివాహితయగు బ్రాహ్మణియం దుదయించినవాఁడు శూద్రుఁడు కాని బ్రాహ్మణుఁడుకాడని కొందఱుబుద్ధిమంతులుచ్చరింతురు. ఐతే వారివాదము సమస్తమనుజులును జన్మచేశూద్రులనియో లేకకొందఱనియో? సమస్తమనుజులును జన్మచేశూద్రులనినఁ జండాలులుగూడ శూద్రులుకావలసివచ్చును. లేకకొందఱేశూద్రులనియనినచో వారిలో శూద్రస్త్రీకిజన్మించినవారే శూద్రులా? లేకక్షత్రియాదిస్త్రీలయందుఁగలిగినవారుకూడనా? శూద్రస్త్రీకిజన్మించినవారుమట్టుకేశూద్రులైన బ్రాహ్మణస్త్రీకిజన్మించినవారుకానేకారు- లేక క్షత్రియాదిస్త్రీలకుఁగలిగినవారుశూద్రులన్నఁ బ్రకృతవ్యవహారమునకు విరోధమువాటిల్లును. శూద్రాపుత్రుఁడు ప్రథముముశూద్రుఁడేయై బ్రహ్మజ్ఞానసంపాదనానంతరము బ్రాహ్మణుఁడగునని యనఁజెల్లదు. శూద్రాపుత్రుఁడు కర్మచేద్విజుఁడై వేదపాఠముచేవిప్రుఁడయ్యెడిచో బ్రహ్మజ్ఞానముచే బ్రాహ్మణుఁడుగూడ నగునుగాని యట్లెక్కడను గనఁబడుటలేదు. ఇఁక బ్రాహ్మణస్త్రీకుదయించినవాఁడే కర్మశూన్యుఁడగుటవలన జన్మచేశూద్రుఁడు అనఁగా శూద్రసముండును నాశూద్రసముఁడే కర్మాధికారముగలిగినపుడుద్విజుండును నట్టిద్విజుఁడే వేదపాఠానంతరము విప్రుండును నావిప్రుఁడే జ్ఞానానంతరముబ్రాహ్మణుండును నని బ్రహ్మజ్ఞానప్రయుక్తమగు బ్రాహ్మణత్వముగూడ ద్విజత్వవిప్రత్వములవలె బ్రాహ్మణికిజనించిన బ్రాహ్మణునకేకాని యన్యునకుఁగాదని యెఱుఁగునది. బ్రాహ్మణస్త్రీకి బ్రాహ్మణునివలనఁగలిగినవాఁడే బ్రాహ్మణుఁడగుచుండఁగా మరలనతనికి బ్రహ్మజ్ఞానముచేబ్రాహ్మణత్వము పిష్టపేషణమువలె విరుద్ధమైయున్నదనికూడ నాక్షేపింపవలసినయంశమే. అందుకు బ్రహ్మశబ్దము పుంలింగమనియు నపుంసకలింగమనియు ద్వివిధమైయున్నయది. అందొక బ్రాహ్మణశబ్దము జాతివివక్షకై చతుర్ముఖవాచకమగు పుంలింగబ్రహ్మశబ్దమువలన నిష్పన్నమైనది. రెండవది జ్ఞానవివక్షకై పరబ్రహ్మవాచకమగునపుంసకలింగబ్రహ్మశ

బ్దమువలననిష్పన్నమైనది, బ్రాహ్మోజాతావనుసూత్రముయొక్క ప్రవృత్తి పుంలింగ శబ్దమునకే గ్రహించినందున నీనపుంసకలింగబ్రహ్మశబ్దమునం దనవసరము. అటులే శ్లో॥ తావాన్ వేదేషుసర్వేషుబ్రాహ్మణస్యవిజానతః, అని గీతాభాష్యమున శ్రీ రాచార్యులు బ్రాహ్మణుఁడనఁగా సన్యాసియనిప్రదర్శించిరి. విద్వాంసునకే సనా ధికారమున్నందునను సన్యసించినవాఁడే బ్రహ్మజ్ఞానియగుటవలనను బ్రాహ్మణుఁ గా బ్రహ్మజ్ఞానియనియు బ్రహ్మజ్ఞానియనఁగా సన్యాసియనియు నర్థముంజెప్ప బ్రాహ్మణోనిర్వేదమాయాతను శ్రుతియందు బ్రాహ్మణునకే సన్యాసాధికారము దున క్షత్రియాదులు సన్యసించి బ్రహ్మజ్ఞానులై బ్రాహ్మణత్వముం బడయావీలులేద వున జాతిచేనెవఁడుబ్రాహ్మణుఁడో వాఁడే కర్మాచరణాదికముచే ద్విజత్వాదికవ సంపాదించి జ్ఞానముచేఁగూడ బ్రాహ్మణుఁడగుచున్నాడుకాని యన్యుఁడుకాడని షేపణవిరోధము పరిహరణీయము. శూద్రాదులకుఁగూడ జ్ఞానముచేబ్రాహ్మణత్వ ముకానేరదు. వజ్రసూచ్యుపనిషత్తుక్రియావాచియగుబ్రాహ్మణశబ్దముం గ్రహించి హ్మణత్వము జాతికాదని చెప్పినదికాని జాతివాచకమగు బ్రాహ్మణశబ్దముంగ్రహి కాదు. అట్లయినచోశ్రుతిస్మృత్యాదిబహువిరోధముచే వజ్రసూచ్యుపనిషత్తునకప్రా ణ్యప్రసంగమువచ్చును. వేదవిదిబ్రాహ్మణేవసంతి బ్రాహ్మణోస్యముఖమాసీత్. హ్మణో నిర్వేదమాయాత్. ఇత్యాదిశ్రుతులును గర్భాష్టమేబ్రాహ్మణముపనయీ బ్రాహ్మణస్యధనం భైక్ష్యం బ్రాహ్మణక్షత్రియ విశాంస్వభావప్రభవైర్గుణైః-ఇత స్మృతులును బురాణములును నిక్కడ ననుసంధేయములు బ్రాహ్మణుఁడనియు క్ష యుఁడనియు వైశ్యుఁడనియు శూద్రుఁడనియు నిత్యాదిసర్వజనవ్యవహారము ప్రత్య మే-క్షత్రియాదిశబ్దములవలె జాతివాచియగు బ్రాహ్మణశబ్దము సర్వలోకవిదితము. నవాచియగుబ్రాహ్మణశబ్దము విద్వద్వ్యవహారమాత్రగోచరము గాని సార్వజనీన కాదని సర్వముణ్ సమంజసము.

ఈబ్రాహ్మణత్వవిషయమైనె భారతీయమగుగాథయొక్క డిక్కడ వకా శింతుము.

## భారతము-అనుశాసనికసర్వము.

——:o:——

కం॥ అనినఁ బితామహుతోన। జ్జనపతి బ్రాహ్మణ్యమువలజాతులమాటన్। యించినవానికిదొరఁ। కొనునొకొ యతివిమలకర్మగుణయోగములన్॥ వ॥ అనియడి నతం డతనికిట్లనియె॥ తే॥ బ్రాహ్మణత్వంబు కడుదుర్లభం బనేక।జన్మములఁబొంది రుగంగసంభవించునపుడుగనునది, యున్నతమైనయప్ప।దంబు, విను మెటిఁగించెద ద తెలుఁగు॥వ॥ అది ఇంద్రమతంగసంవాదంబను నితిహాసంబాకర్ణించిననెఱుంగనగుంగా నక్కథయుపన్యసించెద. నొక్కవిప్రునికొడుకు మతంగుండనువాఁడు యజ్ఞార్థం పనికిఁ దండ్రిపనుపునం బోయిపోయి. క॥ మదమునఁబెలుచననొకగా।డిదకొదమం గ

గొలియడిచె నడిచిన నొవ్వొదవి తనతల్లి జేరఁగ। నదిచని నన్నీ తఁడడిచెనని చెప్పుటయుఁ
వ॥ ఆగార్ధభి తనకొదమతో వీఁడు చండాలుండు ప్రచండస్వభావుండు గాకుండునే యనిశం
బూర్వజన్మకర్మవిశేషంబునఁ దిర్యగ్జాతిభావావిఁండగుట నవ్విప్రపుత్రుం డప్పల్కులు
విని యిది దూషణంబు గాదు, నిరూపణాలాపంబయయ్యున్నది. యటుగావున మాలతనంబు
గలుగ నేర్చునని నిశ్చయించి యగ్గాడిదకడపంబోయి క॥ తనకుం జండాలత। వచ్చినకార
ణమడిగి దానిచేతం గందర్పునిచెద్ది మాంగలికిని నిజ। జననికిఁ బొందగుటవిని విషాదము
తోడన్॥ వ॥ తనపోయెడు పనికింబ్లోకమరలి సదనంబునకుంజని జననికత్తెఱంగెల్ల
నెఱింగించి యాతనితో శూద్రబీజంబున బ్రాహ్మణియందు జన్మించినవాఁడు చండాలుం
డగుటకు సందియంబేమి గార్ధభి శాపజాతగా నొప్పు నది యున్నరూపపలికె, బ్రాహ్మ
ణ్యంబు తపంబున సంపాదించెదం గాకయని పల్కి వీడ్కొని వనంబునకుంబోయి క॥ పర
మతపమాచరింపఁగ। సురపతి వొడచూపి యడుగు సువ్రత నీకున్। వరమిచ్చెదననిన
ధరా। మరత్వమిమ్మనియె నతఁడు మదిముద మొదవన్ చ॥ అనవుడు బ్రాహ్మణత్వము
మహాత్వమెఱుంగవ? యన్యజాతికందునెయది, యొండువేఁడు మదిఁదోఁచినమేలనియెన్
బలారి, వాఁడనితరసాధ్యమైనతపస్స్థలితంబుగఁ జేయుచుండెదన్, జనుము మహాత్మ నీవ
నిన సస్మితుండై యతఁడెగ నేగినన్॥ వ॥ మతంగుండేకపాదంబున నూఱేండ్లుతపంబు
చేసిన నింద్రుండు క్రమ్మఱవచ్చి సీ॥ ఏను వలదని చెప్పినమాన వెట్లు। పరమ దుర్లభపదమా
సపడికరంబు మేలితపమ్మాచరింతె చండాలుఁడిట్టి। దానవశియింఁచు నిదినీకుఁదగదువి
డువు వ॥ వినుమిత్తెఱంగు తపంబునకుఁ బదివమడుంగులుచేసి చండాలుండు శూద్రుండగు
నూఱుమడుంగులుచేసి శూద్రుండు వైశ్యుఁడగు, వేయిమడుంగులాచరించి వైశ్యుండు క్షత్రి
యుండగు నప్పుణ్యాచారంబునకుఁ బదివేలుమడుంగులు నిర్వర్తించి క్షత్రియుండుదు
ర్బ్రాహ్మణుండగు నానియమంబునకు లక్షమడుంగులుసల్పి శమదమసత్యాహింసల
నమాత్సర్యంబున నాగ్బ్రాహ్మణహృదయంబులు సదయంబులుగావించి దుర్బ్రాహ్మ
ణుండు సద్బ్రాహ్మణుండగు నిట్లు బ్రాహ్మణ్యం బలఁతులంబడయవచ్చునే? పడసియు
నదిచెడకుండ నడువశక్యంబగునే, యనేకజన్మంబుల నొకప్పుడు బ్రాహ్మణజన్మంబు
నొందియుఁ గొందఱుధనవాంఛావిషయలౌల్యాదులం దదాచారంబుదిగ విడిచిచెడుదు
రిట్టిమహాపదంబుఁగోరి నిన్ను నీవయేలవినాశంబునొందించుకొనియెదవు, నీతపోనిష్ఠచాలించి
తగునదియొక్క వరంబువేఁడుమనియె ననినవాఁడూరకున్న నాఖండలుండరిగె వెండియు
క॥ అంగుష్ఠమొకటిమోపి మ। తంగుడు నూఱేండ్లుచేసెఁ దపము నియతిమై। నంగములో
నస్థులతో। సంగతముగఁ నోఁపవెక్కసముగా నరముల్॥ ఆ॥ ఇట్లుచేసి శక్తియెల్లనుగడ
చన్న। నతఁడు నేలవ్రాలె నతిరయమున వచ్చియమరఁబట్టి వాసవుఁడకట। నీకు జెప్ప
నయ్య నెమ్మనేను॥ వ॥ క్షత్రియాదులచేతం బట్టువడని బ్రాహ్మణ్యంబసాధ్యంబు, బ్రా
హ్మణ్యంబను శార్దూలంబుతోడి మేలంబుదక్కుము, నీకు నొక్కవరంబిచ్చెదఁ గైకొ
నుమని పల్కుటయు నతండోడఁబడినఁ బరమానందంబున ఆ॥ చండదేవుఁడనఁ బ్రశస్తి

వహించి సు। స్త్రీలుపూజనంబు సేయఁ గామరూపధారివై నిరూపింపవిహగభా।వంబు
గల్గి పరిమదవర్తివగుము॥ క॥ అనివరమిచ్చిమహేంద్రుఁడు। చనియెననిశవిని యజాతశ
త్రుఁడు గాంగేయునితో బ్రాహ్మణ్యము వెలి। జనములకుంబొందఁగా నశక్యంబేనిన్॥

---

క॥ చిత్తూరుజిల్లాతీర్పను, పొత్తమునంగలిగినట్టి బూతులవ్రాఁతల్
దత్తోత్తరములు కాఁబడె, మత్తాత్కాలికపుగ్రంథమాహాత్మ్యమునన్

చ॥ ప్రకటనచేసిపీనినిటు ప్రప్రథమంబునఁగల్గినట్టి మా
మకరుప కొంత శాంతిలిన మానముదాలిచి పారకాళి కు
త్సుకమొనరించు గ్రంథములతోడనె పేపరునప్పుచుండుడున్
గకవికలేమిలేక యొకకైవడినేగెను మూడువత్సరాల్॥ 236

* గద్య *

ఇది శ్రీమజ్జగద్గురు గురుకరుణాకటాక్ష సంప్రాప్త కవితాసాహిత్య
నిధాన హారితసగోత్రోద్భవ లక్ష్మీనారాయణ పేరమాంబి
కా తనూభవ గర్భశుక్తిముక్తాయమాన విద్వత్సభా
విష్కృతావధానవిధాన జానపాటి పట్టాభి
రామాభిధాన విలిఖితంబగు
స్వర్ణకారవ్యవహారంబు నందుఁ
బ్రథమభాగము.

శ్రీ సోమేశ్వరాయనమః

# స్వర్ణకారవ్యవహారము.

## ద్వితీయభాగము.

తే॥ నరసరావ్ పేటకోర్టులో నాఁడు కేసు
పడి విచారణచేయంగఁబడక మూఁడు
వత్సరంబులవఱ కనివార్యమైన
యంతరాయపరంపర నట్లయుండె॥ 1

క॥ కడుఁ బెరిఁగి ఫైలిదంవిధి। వడివడిగవిమర్శగాక వర్తిలదావా
లడిపనలుకోర్టునా। నేర్పడియెఁ గుంటూరఁ బ్రజలభాగ్యపుగరిమన్

ఆ॥ అటకుఁ ట్రాన్స్ఫరగుడు నా కేస్ విమర్శకుఁ
దీసికొనిరి కొన్ని దివసములకు
దాఖలైనయట్టి దావాలయం దెష్టో
యేదొ తేల్పఁబడక యెట్టులుండు॥ 3

క॥ రంగావఝ్ఝులహనుమ। య్యం గా కాన్యన్వయాబ్ధి కబ్జుఁడనఁ ఖ్యా
తింగనిన పుండరీకా। క్షుం గుదిరిచికొనినవాఁడఁ జూ ప్లీడరులన్॥ 4

క॥ జరిగె విచారణ క్రమముగఁ
బఱతెంచిరి చుట్టుపట్ల బ్రాహ్మణజనముల్
గురుముఖ ఋషివృషభాంచిత
సురపతిసభఁబోలి కోర్టు చూడఁగనయ్యెన్॥ 5

సీ॥ బి య్యేబియల్లోనఁ బ్రథుకీర్తులైన కొం
దఱు జిల్లాకోర్టుప్లీడరులతోడ
హూణాంధ్రభాషల నూయాయనక వ్రాయఁ
జాలిన భలుగుమాస్తాలతోడఁ

గన్నన్న సకలకార్యాల్ తత్క్షణమ సల్పఁ
బార్శ్వస్థులైయుండు బంట్లతోడఁ
దమతమవ్యవహారతత్త్వముల్ గనిపెట్టు
హాళిఁ గూర్చుండు పార్టీలతోడ
నున్నతంపువేది నున్న యతలప్పట్లు
దిండ్లకుర్చిపైని దేజమెసఁగ
హేలఁగూరుచుండి యిల్లుమునీస్ఫ్ గారు
లలి సభాస్థలం బలంకరించె॥

చ॥ మతవిషయశ్రుతిస్మృతి విమర్శసమీక్షణభూరికౌతుకా
గతవివిధప్రజానికరకాంత మనంతదిగంతరాగతా
ద్భుతతరసుప్రమాణ పరిపూరితపుస్తకపేటికాసమం
చిత మగు నాఁటి తత్సభ విచిత్రతరంబయి చూడఁగాఁ దగెన్॥ 7

చ॥ వినయమమూర్తిదాల్చెనని విస్మయమందఁగఁ బ్రేక్షకాళి మె
ల్లనఁ దనహస్తమందలికలానఁ జెవిం గయిసేసి తీసిపై
ల్లైను మునిసీఫుముందరను కేవి నొకించుక లేచి బెంచిక్లా
ర్కనుపమ మస్మదీయమగు నావ్యవహారపుఁ గాకితంబుఁ గన్॥ 8

సీ॥ విద్యార్థులకుఁ దర్కవేదాంతశాస్త్రంబు
లెడఁద కెక్కెడిరీతి నుడివికొనుచు
విద్వద్గణంబుతో వేడుకలిగురొత్త
హేలాగతిన్ ముచ్చటించుకొనుచు
న్యాయవాదులతోడ నానాప్రకారపుం
జిత్రసంభాషణ చేసికొనుచు
బ్రాహ్మణాదిజనంబు భక్తినర్పించెడి
యభివందనంబుల నందికొనుచు
గాఢరుద్రాక్ష లలరింపఁ గంఠసీమ
సాలుపైఁగప్పి బ్రహ్మతేజంబుతోడ

రహిం నిజనుదెంచి * మల్లాది రామకృష్ణ
శాస్త్రియజ్వాయె ప్రథమంపుసాక్షియయ్యె॥ 9

... The 24th day of August 1911.

... * My name is మల్లాది రామకృష్ణసోమయాజులుగారు, father's name లక్ష్మీనారాయణగారు Age 46 years. Caste బ్రాహ్మణులు Profession వ్యవసాయం Residence అమరావతి. దేవాలయములలో ప్రాణప్రతిష్ట వగైరా కర్మలు జరుపుట కధికారము బ్రాహ్మణులకువున్నది. దీనివిషయమై మనుస్మృతి, యాజ్ఞ, వల్క్యస్మృతి పరాశరమాధవీయము నిర్ణయసింధు వగైరా పుస్తకములలో చెప్పబడియున్నది. ప్రాణప్రతిష్టఅనగా విగ్రహములు తనకు పూజకు పనికివచ్చేటట్టు యితరహిందూజాతులవారికందరికి పనికివచ్చేలాగు ప్రతిష్టచేయుట అని నాఅర్థము. మనుస్మృతి 10వ అధ్యాయము 75 శ్లోకము మొదలు 97 శ్లోకములవరకు యీవిషయమై చెప్పబడియున్నది. 1 యీమనుస్మృతిలో నేనుపైనచెప్పిన అధ్యాయములోని శ్లోకములలో 76,77,95,96 to 97శ్లోకములు ముఖ్యమైనవి. ప్రతిష్టకర్మ యాజనములో చేరుతుంది. బ్రాహ్మణికివున్న 6 కర్మలలో యాజనకర్మవున్నది. 77వ శ్లోకములో క్షత్రియులకు సహితము యాజనకర్మకు అధికారములేదని చెప్పబడియున్నది Q. బ్రాహ్మణులనగా యెవరు? Answer యెవరిని లోకమంతా బ్రాహ్మణులని పిలుస్తు

1 మనుస్మృతి 10వ యధ్యాయము.

శ్లో॥ షణ్ణాంతుకర్మణామస్య త్రీణికర్మాణిజీవికాః
యాజనాధ్యాపనే చైవ విశుద్ధాచ్చప్రతిగ్రహః॥ 76
త్రయోధర్మానివర్తంతే బ్రాహ్మణాత్ క్షత్రియంప్రతి
అధ్యాపనం యాజనంచ తృతీయశ్చప్రతిగ్రహః॥ 77
జీవేదేతేనరాజన్య స్సర్వేణాప్యనయంగతః
నత్వేవజ్యాయసీంవృత్తి మభిమన్యేతకర్హిచిత్॥ 95
యోలోభాదధమోజాత్యా జీవే దుత్కృష్టకర్మభిః
తంరాజా నిర్ధనంకృత్వా క్షిప్రమేవప్రవాసయేత్॥ 96
వరంస్వధర్మోవిగుణో నపారక్యస్స్వనుష్ఠితః
పరధర్మేణజీవన్ హి సద్యఃపతతి జాతితః॥ 97

క॥ వేదాంతశాస్త్రబోధన। మేదురయశముంగడించి మెలఁగిన వాఁడీ
భూదేవాగ్రణి, వహవా। యే దేశముఁజనిన గౌరవింత్రు మనీషుల్ 10

స్నారో యెవరిని బ్రాహ్మణులగా భావించినారో వారె బ్రాహ్మణులు. యజనము, యాజనము దానము ప్రతిగ్రహము అధ్యాపనము అధ్యయనము అను షట్కర్మలు యెవరికి అనుక్రమముగా పూర్వమునుంచి వచ్చుచున్నవో వారె బ్రాహ్మణులు. అధ్యాపనమనగా యితరులకు వేదము చెప్పుట. అధ్యయనమనగా తాను వేదము చదువుట. యజనము తాను యజ్ఞాదులను చేయుట. యాజనము యితరులచేత యజ్ఞాదికర్మలు చేయించుట. దానముఅనగా వకరికియిచ్చుట. పరిగ్రహమనగా వకరివద్దపుచ్చుకొనడము. 75 శ్లోకముకు క్రిందవ్రాశిన తెలుగు అర్థముసరిగా నేవున్నది. యీ 75 శ్లోకమునకు చర్చవ్రాసి యుండలేదు. యీఆరు కర్మలు. కర్మలలోయెవరైనా వకడుయేదైనా చేయకపోయినా వాడిపూర్వులలో యెవరైనా యీఆరుకర్మలు చేసినవారుండిరా అతనుఆసంతతివాడు గాన బ్రాహ్మణుడని పిలువబడుతాడు. మూడుతరములవారువరకు యీఆరు కర్మలలో యజ్ఞము చేయకపోతె బ్రాహ్మణునికి యజ్ఞాదికర్మలు చేయుటకు అధికారముండదు. అధికారమువచ్చుటకు ప్రాయశ్చిత్తము చేసుకోవలెను. బ్రాహ్మణుని సంతతివారైతె కర్మచేయకపోయినా బ్రాహ్మణుడని పిల్వబడుతాడు. 1 మనుస్మృతి1వ అధ్యాయములో 88వ శ్లోకములో బ్రాహ్మణునికొఱకు 6 కర్మలు చెప్పబడివున్నవి. 2 పరాశరమాధవీయములో ఆచారకాండలో 81 వ పేజిలో యాజనముకు అధికారము బ్రాహ్మణులకుమట్టుకు వున్నదని చెప్పబడివున్నది. Ex. C- 3 నిర్ణయశింధులో 192 వ

1 మనుస్మృతి 1 వ అధ్యాయము.

శ్లో॥ అధ్యాపనం చాధ్యయనం యజనం యాజనంతథా
దానం ప్రతిగ్రహశ్చైవ బ్రాహ్మణానామకల్పయత్ ॥ 88

2 పరాశరమాధవీయము-ఆచారకాండము 81వ పేజి.

శ్లో॥ యాజనాధ్యాపనేశుద్ధే తథా శుద్ధప్రతిగ్రహః
ఏషా సమ్యక్సమాఖ్యాతా త్రితయం తస్యజీవికా

3 నిర్ణయసింధువు 192వ పేజి.

శ్లో॥ యస్యాన్వవాయేర్చితంలింగం విష్ణుంవాప్రణమేన్నరః
తతస్యనిష్కృతిర్ధృష్టా ప్రాయశ్చిత్తశతైరపి

సీ॥ ఎంతటి ప్రాజ్ఞుండె యితఁడుగాకుండిన
సాక్ష్యముఁ వినమహాజనమురాదు

పేజిలో శూద్రుడుచేత ప్రతిష్టించబడిన విగ్రహామునకు పూజచేసిన అగ్రవర్ణములవారికి ప్రాయశ్చిత్తమునకు దోషముపోదు. విశ్వబ్రాహ్మణులనెజాతి ధర్మశాస్త్రములలో యెక్కడ చెప్పబడియుండలేదు. 10 జాతులబ్రాహ్మణ బేధములలోకూడా విశ్వబ్రాహ్మణజాతి చెప్పబడియుండలేదు. శాస్త్రములలో రధకారులకు యేర్పరచిన వృత్తులు యిప్పడుమన దేశములో యెవరుచేస్తున్నారో వారిని కంసాలులుఅని అంటారు. శిల్పవృత్తులచేత జీవించువారు రధకారకులు. యిప్పడు తెలుగుదేశములో కంసాలులు బత్తులు అనేవారు శిల్పవృత్తులతో జీవించుచున్నారు. యిప్పడు కంసాలీలు అనేవారు రధకారకులకు నియమింపబడిన వృత్తులతో జీవిస్తున్నారు. గనుక యీకంసాలీలను రధకారకులని చెప్పుచున్నారు. 1 జైమినీయ న్యాయమాలావిస్తరముఅనే గ్రంథములో జైమిని మహారుషిచే 310 పేజిలో రధకారులనేవారు బ్రహ్మక్షత్రియ వైశ్యశూద్రులు కాక వేరుజాతివారు అని వ్రాయబడివున్నది. 2 యాజ్ఞవల్క్యస్మృతిలో 15 పేజిలో రధకారకుడనగా మాహిష్యునికి కరణికిపుట్టినవాడని చెప్పబడియున్నది. మాహిష్యుడనగా వైశ్యస్త్రీయందు క్షత్రియునకు పుట్టినవాఁడు. కరణిఅనగా శూద్రస్త్రీకి వైశ్యపురుషునకు జనించినది. రధకారకులలో రెండుతరగతులువున్నట్టు 3 ఔశనసస్మృతిలో వున్నది. దానిలో 22 వ పేజిలో రధకారకుడనగా బ్రాహ్మణస్త్రీయందు దొంగతన

---

1 జైమినీయన్యాయమాలావిస్తరము 310వ పేజీ.

శ్లో॥ విప్రాదిరేవరథకృదన్యోవాదోస్తుయోగతః
రూఢేర్వర్ణాంతరం తస్యాధానే వర్షర్తురుచ్యతే

2 యాజ్ఞవల్క్యస్మృతి 15వ పేజి.

క్షత్రియేణ వైశ్యాయాముత్పాదితో మాహిష్యః-వైశ్యేన శూద్రాయాముత్పాదితా కరణీ-తస్యాం మాహిష్యేణోత్పాదితో రథకారో నామ జాత్యాభవతి.

3 ఔశనసస్మృతి 22 వ పేజి.

శ్లో॥ బ్రాహ్మణ్యాం క్షత్రియాచ్చౌర్యాద్రథకారః ప్రజాయతే
వృత్తంచ శూద్రవత్తస్య ద్విజత్వంప్రతిషిధ్యతే

ఎంతటిధీరుండో యితఁడుగాకుండిన
సతము దానిలిఖించి చదువుకొనరు

ముగా క్షత్రియునకు పుట్టినవాడు రథకారుడనిన్ని అతనివృత్తి శూద్రునితో సమానమైనవృత్తి అనిన్ని ద్విజత్వములేదని చెప్పబడివున్నది. సూచకునకు బ్రాహ్మణకన్యకయందు పుట్టినవాడికి తక్షకుడని పేరు. వానివృత్తులు శిల్పాదులు యిది 1 ఔశనసస్మృతిలో 23 వ పేజిలో చెప్పబడివున్నది. సూచకుడనగా శూద్రస్త్రీకి వైశ్యుడువిధివతుగా వివాహముచేసుకోగా పుట్టినవాఁడు. స్కాంధపురాణ 2సూతసంహిత 50 పేజిలో బ్రాహ్మణస్త్రీయందు క్షత్రియునికి పుట్టినవాఁడు సూతుడు. సూతునకు బ్రాహ్మణస్త్రీయందు దొంగతనముగా పుట్టినవాడు రథకారుడు అని చెప్పబడివున్నది. తక్షకుడని రథకారుడు లోహకారకుడని చర్మకారకుడని శిల్పి వర్ధకి అని వేరువిధములున్నట్టు చెప్పబడినవి.

... ... ॥5-8-II:—యాజనము చేయించుటకు బ్రాహ్మణులకే అధికారమువున్నదనె విషయములో 3 విష్ణుస్మృతిలో కూడావున్నది. దానిలో 10 పేజిలో చెప్పబడివున్నది. 4 మార్కండేయ పురాణము 58 వ పేజిలో యాజనము అధ్యాపనము ప్రతిగ్రహము యీమూడు బ్రాహ్మణకర్మలని చెప్పబడియున్నది. శిల్పాదులు శూద్ర

1 ఔశనసస్మృతి 23 వ పేజి.

శ్లో॥ సూచకాద్విప్రకన్యాయాం జాతస్తక్షక ఉచ్యతే
శిల్పకర్మాణి చాన్యాని ప్రాసాదలక్షణంతథా

2 సూతసంహిత 50 వ పేజి.

శ్లో॥ కరణాయాంతువిప్రేంద్రా! మాహిష్యాద్యోవిజాయతే
సతక్షారథకారశ్చప్రోక్తశ్శిల్పీచవర్ధకీ
లోహకారఃకర్మకారఇతి వేదార్థవేదిభి.

3 విష్ణుస్మృతి 10 పేజీ

సూ॥...బ్రాహ్మణస్యయాజనప్రతిగ్రహౌ

4 మార్కండేయపురాణము 58 వ పేజీ

శ్లో॥యాజనాధ్యాపనేశుద్ధస్తథా పుత్ర!ప్రతిగ్రహః
ఏతత్సమ్యక్సమాఖ్యాతంత్రితయంతస్యజీవికా
వ్యాఖ్యాతంశూద్రధర్మోపిజీవికాకారుకర్మభిః

ఎంతటిచతురుండె యితఁడుగాకుండిన
వంచింపక వకీల్లు వదలిపెట్ట

కర్మలని మార్కండేయ పురాణము 53 వ పేజీలోనె చెప్పబడివున్నది. 1 అమరనిఘంటులో 255 వ పేజీలో రధకారుడనగా యెట్టివాడో మాహిష్యుడనగా యెట్టివాడో కరణియెట్టిదో వ్రాశివున్నది. నేను పైనచెప్పినవిధముగానే వ్రాశివున్నది. Ex.K 2 నారదస్మృతిలో 62 వ పేజీలో యాజనము బ్రాహ్మణుని ధర్మమని చెప్పబడివున్నది. Ex. K. దీనిలో ఆపద వచ్చినప్పుడు తనకంటె తక్కువ కులవృత్తి ఆచరించమన్నాడు. 3మనుస్మృతిలో 10వ అధ్యాయములో 590వ పేజీలో 100 వ శ్లోకములో శిల్పాది వృత్తులు శూద్రుడికి యితర వృత్తులవల్ల జీవనము దొరకనప్పుడె ఆచరింప వలసినదిగా వ్రాయబడి వున్నది. 4 స్మృతిముక్తాఫలములో 52 వ పేజీలో రధకారుడనగా యెవరో చెప్పబడి వున్నది. తక్షు, శిల్పి, వర్ధకి, లోహకార, కర్మకారులు రధకారులని చెప్పబడివున్నది ఆ పేజీలోనే రధకారులకు వాస్తుశాస్త్రముచదువడము దేవాలయములప్రాకారములు తయారుచేయు

1 అమరనిఘంటువు 255 వ పేజీ

శ్లో॥ రధకారస్తుమాహిష్యాత్కరణ్యాంయస్యసంభవః

2 నారదస్మృతి 62 వ పేజీ

శ్లో॥ వైశేషికంధనంజ్ఞేయంబ్రాహ్మణస్యశుభంత్రిధా
ప్రతిగ్రహేణయల్లబ్ధంయాజ్యతశ్శిష్యతస్తధా
విపర్యయాదధగత్త్రస్యాన్యన్నచేదాపద్గరీయసి
ఆపత్స్వనంతరావృత్తిర్బ్రాహ్మణస్యవిధీయతే

3 మనుస్మృతి 10 వ అధ్యాయము 89[illegible] వ పేజీ.

శ్లో॥ అశక్నువంస్తుశుశ్రూషాంశూద్రః కర్తుంద్విజన్మనాం
పుత్రదారాత్యయంప్రాప్తోజీవేత్కారుకకర్మభిః

4 స్మృతిముక్తాఫలము 52వ పేజీ.

శ్లో॥ మాహిష్యాత్కరణాయాంతు రధకారఃప్రజాయతే
అథపర్యాయనామాని తక్షాశిల్పీచవర్ధకీ
లోహకారఃకర్మకారో ...

రెంతటివేత్తయ్యే యితఁడుగానుండిన
ముస్సేభు గూఢార్థములనునడుగఁ

---

డము నగలు వగైరాలుచేయడము నాగలి వగైరాపనులుచేయడము యజ్ఞపాత్రలు చేయడము వారివృత్తులుగా చెప్పబడివున్నది. 1వాచస్పత్యములో 4791 పేజీలో రథకారుడనగా మాహిష్యవలన కరణికి పుట్టినవాడని చెప్పబడివున్నది. Ex. M. విశ్వబ్రాహ్మణుల పదము అమరములోలేకపోవుటేకాక వాచస్పత్యములోకూడా లేదు. అమరము నిఘంటువుగా ప్రతిచరిత్రకారులు వప్పుకున్నారు. 4 వేదములలో నేనుచూచినంతవరకు గాని పురాణములలోగాని స్మృతిశృతులలోగాని విశ్వబ్రాహ్మణులని పదములేదు. నేను తర్కశాస్త్రము వేదాంతశాస్త్రము అలంకారశాస్త్రము చదివినాను. యజ్ఞము చేసినాను.

Cross Examination:—రథకారులకు యజ్ఞముఅధికారమున్నట్టు Ex. D.లో 307 పేజీలో చెప్పబడివున్నది. యాజనములోవారు ఆధానము నెకర్మ చేయుటకు మాత్రమె అధికారమున్నదిగాని తక్కినకర్మలుచేయుటకు వీలులేదు అని చెప్పబడివున్నది. రథకారుడు ఆధానకర్మ చేయవచ్చునని వేదములలో చెప్పబడివున్నది. ఆధానకర్మ బ్రహ్మ క్షత్రియ వైశ్యులు చేసేటప్పుడు వకమంత్రముతోను రథకారులు చేసేటప్పుడు వకమంత్రముతోను చేయవలసినదిగా చెప్పబడి వున్నది. యాజనమనగా యజ్ఞముచేయించుట అని సరిఅయిన అర్థము. యాజనమనగా యితరులచేత కర్మాదులు చేయించుట. దేవాలయప్రతిష్టలువగైరాలు యాజనములక్రిందికి వస్తుందని నాఅభిప్రాయము. దేవాలయప్రతిష్టలు యాజనములోకి వస్తుందని పురుషసూక్తము యిస్తే చూపించగలను. యాజనమనగా దేవాదులకు హవిస్సు యిచ్చుటకుగాను చేయించే కర్మ. హవిస్సు యిప్పించె అధికారములేనప్పుడు అట్టివారు చేయించిన కర్మ

---

వాస్తుశాస్త్రమధీయానః ప్రాసాదప్రతిమాదికం
యజ్ఞపాత్రం ద్విజాతీనాం హైమాన్యాభరణానిచ
కృష్యుపస్కరణంలేఖ్యం కర్మాణ్యన్యోదితానిచ

1వాచస్పత్యము 4791 వ పేజి.

రథకారః–పుం–రథంకరోతి–వర్ణసంకరభేదే
కరణ్యాం మాహిష్యాజ్జాతే

డరఁటిపండొల్చి చేఁబెట్టినటు సమస్త
శాస్త్రతత్త్వంబులం జెప్పి జనులచేత
సత్కృతుండగుచుండు నీశాస్త్రివర్యు
గరిమ యెంతని వర్ణింపఁగలను నేను॥ 11

చెల్లతగదు. ప్రతిష్ఠకున్నూ దేవాలయముకట్టుటకు విగ్రహాముచేయించుటకు యేమి సంబంధములేదు. దేవాలయముకట్టించిపెట్టుకొని విగ్రహాలుచేయించుకొని సిద్ధముగా వుంచుకొన్నతర్వాత ముహూర్తముపెట్టుకొని ఆముహూర్తసమయమును గణాధిపతి పూజతో ప్రతిష్ఠఆరంభించి చివర విగ్రహామును గుడిలోనిలిపి హారతియివ్వడముతో అంతమవుతుంది. గణాధిపతిపూజ ధాన్యాధివాసముకంటే జలాధివాసముకంటే ముందే ఆరంభమవుతుంది. ప్రాణప్రతిష్ఠ యీ అధివాసములదరిమిలా జరుగుతుంది. ప్రతిష్ఠకర్మచేయించే ఆచార్యుడు దేవాలయముగర్భగుడిలోనికి శిల్పకారుడిని తీసుకొని వెళ్లి అక్కడ విగ్రహాముచేసినందుకు అతనికి బహుమతియిచ్చిపంపించి అంకురార్పణ చేయవలసినది. ప్రతిష్ఠకర్మ యెట్లుచేయించవలసినది లీలావతిఅనేగ్రంథములో చెప్పబడియున్నది- ఆచార్యశబ్దమునకు ప్రపంచవ్యవహారములో ఇప్పుడు అయ్యాఅని అర్థము. దేవాలయముకట్టువిధము విగ్రహములనుచేయువిధము ఆగమములో ఉంటుంది. ఆ ఆగమములలో ప్రతిష్ఠవగైరాచేయించవలసినపద్ధతులు చెప్పబడియున్నవి. లీలావతి ఆగమములలోదే. గ్రామదేవతప్రతిష్ఠ శైవాగమములోచేరుతుంది. గ్రామదేవతలు తామసదేవతలని యెక్కడనైనా చూచినానేమో జ్ఞప్తిలేదు. శివార్చకులు బ్రాహ్మణులేకాని వారికి యాజనకర్మకధికారమున్నదేమో చూచిచెప్పవలెను. వారు బ్రాహ్మణకన్యకకు బ్రాహ్మణునికి పుట్టినవారు కనుక పంక్తిభోజనమునకు అర్హులుకారు. అని చెప్పబడియున్నది. వైష్ణవులకు మధ్వలకు వైఖానసులకు వైదికులకు నియోగులకు యాజనాధికారమున్నది. వాది బ్రాహ్మణులక్రిందికివస్తాడు. లోకులందరిచేత వాది బ్రాహ్మణుడని పిలువబడుచున్నాడుగనుక బ్రాహ్మణులని లోకులచేతపిలువబడే వారితో సంబంధబాంధవ్యమున్నది గనుక బ్రాహ్మణుడని చెప్పుతున్నాను. భోజనప్రతిభోజనములు లేకపోయినా బ్రాహ్మణుడైనయెడల ప్రతిష్ఠాధికారమున్నది. శూద్రుడు చేయదగినకర్మలు అతనిచేతచేయిస్తే బ్రాహ్మణునికి యేమీ తప్పలేదు. శూద్రుడు చేయగూడనికర్మలుచేయించితే అబ్రాహ్మణ్యమువస్తుంది. చేయదగినకర్మలైనా యెల్లప్పుడూ వృత్తిగాచేయించుతుంటే అబ్రాహ్మణుడుకాడుగాని ప్రాయశ్చిత్తముచేసు

ఉ॥ చెప్పినవాక్యముం మరలఁజెప్పక మూఁడుదినంబు లట్టులా
గొప్పబుధుండు సాక్ష్యము నకుంఠితశక్తి వచించె బ్రాహ్మణుల్
కుప్పలుకుప్పలై యచటఁ గోరికఁ దీరిచికూరుచుండి క
న్నెప్పలు వేయకేకనుచు నెకొ్కనుప్రేముడి నాలకింపఁగన్॥ 12

---

కొనవలెను. రథకారులకు షోడశకర్మాధికారమువున్నట్టు నేనుయెరిగినమట్టుకు యెక్కడా చెప్పబడియుండలేదు. విజ్ఞానేశ్వరీయములో రథకారులకు ఆధానమనేకర్మవున్నది గనుక వుపనయనములేనిది అదిచేయుటకువీలులేదుగనుక వుపనయనముచేసుకొనవచ్చునని చెప్పబడియున్నది. జ్ఞానమహిమచెప్పుతూ బ్రహ్మజ్ఞానముకలిగినవాడే బ్రాహ్మణుడని వుపనిషత్తులలో చెప్పబడివున్నదిగాని అది కులాచారసంబంధముకు పనికిరాదు. ప్రతిష్ఠలో బ్రహ్మజ్ఞానఅవసరములేదు. కులాచారమేకావలసియున్నది. యీప్రపంచములో బ్రాహ్మణులను బ్రహ్మజ్ఞానముంటేనేకాని బ్రాహ్మణుడుకాడని చెప్పనవసరములేదు......

......26-8-11. వేదములలో బ్రాహ్మణజాతి సగుణబ్రహ్మయొక్కముఖమునుండి పుట్టినట్లు చెప్పబడియున్నది. సగుణబహ్మయొక్కశరీరములో ముఖమునుంచి బ్రాహ్మణజాతిపుట్టినట్టు చెప్పబడివున్నది. పరమాత్మకు ముఖమేది అనేప్రశ్నకుజవాబుగా బ్రాహ్మణుడు పరమాత్మకు ముఖమని చెప్పబడివున్నది. ఆశ్లోకములోనే పరమాత్మకు పాదములుయేవి అనేప్రశ్నకుజవాబుగా పాదములయందు శూద్రులుపుట్టినారుఅని వున్నది గనుక యీజవాబునుపట్టి పైదికూడా బ్రాహ్మణులు పరమాత్మముఖమందుపుట్టినారని చెప్పవలసివున్నది. యీపురుషసూక్తభాష్యములో 15 పేజీలోను 14 పేజిలోను 12-13 శ్లోకములకు చెప్పినభాష్యము సరిఅయినభాష్యమే. ఇప్పటి బ్రాహ్మణులు పరబ్రహ్మముఖమందుపుట్టినబ్రాహ్మణ సంతతివారు. పోయిన మహాప్రళయముతరువాత యిప్పటివరకు ఆసంతతివస్తున్నది. ప్రథమమహాప్రళయము తరువాత తిరిగిసృష్టికి బ్రాహ్మణులు పరమాత్మముఖమునుండే పుడుతారు. ప్రతిమహాప్రళయము తరువాత యిట్లేజరుగుతుంది. కశ్యపప్రజాతిభార్య మనువుయందు నాలుగుజాతులవారు పుట్టినారని నేను యెక్కడ చదివినట్టుజ్ఞప్తిలేదు. కశ్యపప్రజాతికి 13 భార్యలువున్నారని యెక్కడనో చదివినానని జ్ఞాపకమువున్నదిగాని ఆపదముగ్గురిలో మనువున్నట్టు చెప్పలేను * అష్టోత్తరశతో పనిషత్తు 343 పేజీఐనవజ్రసూచిలో వర్ణశబ్దముకు రంగుఅని అర్థము. ఆపేజీలోనే శరీరముబ్రాహ్మణుడుకాడనివున్నది గాని శరీరమునుబట్టి బ్రా

---

* అష్టోత్తరశతోపనిషత్తు 343 వ పేజీ

బ్రాహ్మణో శ్వేతవర్ణః క్షత్రియో రక్తవర్ణః వైశ్యః పీతవర్ణః శూద్రః కృష్ణవర్ణ ఇతి నియమాభావాత్ ...తస్మాన్న దేహో బ్రాహ్మణఇతి.

శా॥ మత్పక్షంబున సాక్ష్యమున్నదువ ధీమచ్ఛ్రేష్ఠులై పెక్కురుక్
దత్పక్షంబున కేగుదెంచినిలువక్ దద్బ్రోజనాద్యర్థవి
త్తోత్పత్తింగనఁజాలకేను మదినెంతో చింతనొందంగ నే
తత్పూజ్యాంఘ్రులు దారిచేసిచనియెక్ దారిద్ర్యవిచ్ఛిత్తికై॥ 13

హ్మణుడు కాడు అని లేదు. యే బ్రహ్మముఖమునుంచి బ్రాహ్మణులు పుట్టినారో ఆ బ్రహ్మకు అనేక వేలముఖములు వున్నవని చెప్పబడివున్నవి. సగుణబ్రహ్మము శివుడైవున్నప్పుడు ఆయనకు 5 ముఖములు వున్నవని చెప్పబడివున్నది. బ్రాహ్మణులు త్రిమూర్తుల లోవున్న బ్రహ్మముఖమున పుట్టినవారు కారు. సగుణబ్రహ్మకు విశ్వకర్మ అని పేరు వర్తిస్తుంది. త్రిమూర్తులలో యెవరికైన ఆపేరు వర్తిస్తుంది. సగుణబ్రహ్మకు విశ్వకర్మ అనే పేరు వర్తిస్తున్నట్టు పురుషసూక్తమువల్ల కనుపడుతుంది. * కృష్ణయజుర్వేద తైత్తిరీయసంహిత 85 పేజీలో విశ్వకర్మశబ్దము పరమాత్మకు వర్తిస్తుందని చెప్పబడివున్నది. పురుషసూక్తభాష్యపు 19 పేజీలోకూడా యీసంగతి చెప్పబడివున్నది. బ్రహ్మముఖమందు మొదట పుట్టినవారికి పేర్లు పురుషసూక్తములో చెప్పబడివుండలేదు. యితర గ్రంథములలో వున్నదేమో చెప్పలేను. చతుర్ముఖబ్రహ్మవలనగూడా కొందరు మహాపురుషులు జన్మించినట్టు పురాణములలో వున్నది. సనకసనందనాదులు బ్రహ్మమానస పుత్రులని చెప్పబడివున్నది. నవబ్రహ్మలు చతుర్ముఖబ్రహ్మవలన పుట్టినట్టు చెప్పబడి వున్నది. వశిష్ఠుడు బ్రహ్మమానసపుత్రుడు. వజ్రసూచికోపనిషత్తునందు వశిష్ఠుడు ఊర్వశియందు పుట్టినట్టు చెప్పబడివున్నది. దేవతలసాని ఊర్వశి అని వకఆమె వున్నది. యీ వూర్వశికే వశిష్ఠుడు పుట్టినది లేనిది చెప్పలేను. వ్యాసులవారు కైవర్తకకన్యకకు

* కృష్ణయజుర్వేద తైత్తిరీయసంహిత 85 వ పేజీ

శ్రు॥ విశ్వకర్మా మనసా యద్విహాయా ధాతా విధాతా పరమోత సందృక్॥

భా॥ విశ్వవిషయాణికర్మాణి సృష్టిస్థితిసంహారరూపాణి యస్యాసౌ విశ్వకర్మా,తస్యచ తేషుకర్మసు సత్యత్వాదయఏవ సాధనం, సత్యసంకల్పత్వాత్, యద్యస్మాద్దయం మనసా సంకల్పమాత్రేణ విశ్వకర్మా తస్మాద్ధాతా విధాతా విహాయాఇతి చోచ్యతే, ధాతా ఉత్పాదకః విధాతా పోషకః విశేషేణజిహాతి పరిత్యజతీతి విహాయాః, సంహర్తేత్యర్థః ఉతాపిచాత్రఏవ పరమః సర్వేభ్యఉత్కృష్టః సమ్యక్పశ్యతీతిసందృక్ సర్వజ్ఞ ఇత్యర్థః॥

క॥ గుంటూర్పురసమమిపు డీ
వెంటంగానంగఁబడదు వేఱొక్కటి శ్రీ
యింటింటఁ విడియుచు నొక
కంటంగని పెట్టియున్న కతమున నార్యుల్॥ 14

పుట్టినట్టు * వజ్రసూచిలో చెప్పబడివున్నది.............వశిష్టుడు అక్షమాలఅనే తక్కువజాతి స్త్రీని పెండ్లిచేసుకున్నాడనిన్ని ఆయన పెండ్లిచేసికొనుటచేత అక్షమాల తక్కువజాతి స్త్రీ అయినా గౌరవము వచ్చినదని † మనుస్మృతి 487 పేజీలో చెప్పబడివున్నది. మొదట పరమాత్మముఖమందుపుట్టినవారు బ్రాహ్మణులనిపిలువబడినారు కనుక యిప్పుడు బ్రాహ్మణులని పిలువబడినవారు వారిసంతతివారని చెప్పుతున్నారు. అదిగాక యిప్పుడు బ్రాహ్మణులప్రవరలో పూర్వపువారి పేరులు చెప్పుచుండుటచేతను యిప్పటిబ్రాహ్మణులు పరమాత్మముఖమందు పుట్టినవారిసంతతి అని చెప్పుచున్నారు. పరాశరుడు గోత్రఋషి. ఆపస్తంబప్రవరకాండ అనేగ్రంథము ప్రమాణగ్రంథమే. శక్తిఅనేఆయన వశిష్టునికొమారుడు. వ్యాసుడు పరాశరుని కొమారుడు. వశిష్టుడు పరాశరుడు బ్రాహ్మణులగోత్రకర్తలే. వేదవ్యాసులజన్మవిషయములో సంస్కృతభారతము ప్రమాణమే. పూర్వయుగములలో బ్రాహ్మణులు క్షత్రియకన్యకను పెండ్లిచేసుకుంటే వారికిపుట్టినవాడు బ్రాహ్మణుడుగా పరిగణింపబడేదిగాని యిది కలియుగములో నిషిద్ధమని చెప్పబడివున్నది. అధమజాతిపురుషులు స్త్రీలు తపస్సుచేత వుత్తమజాతిపురుషులు, స్త్రీలు కావచ్చును అని గ్రంథములలో వున్నది. ఇది విశ్వామిత్రచరిత్రములో వున్నది. యిది కలియుగములో పనికిరాదు. కలియుగమునకు పరాశరస్మృతి ప్రమాణము. మనుస్మృతి పరాశరస్మృతితో అనుకూలించేవరకు ఆధారము. వ్యతిరేకించేచోట ప్రమాణముకాదు. ‡ మనుస్మృతి

* వజ్రసూచికోపనిషత్తు

వ్యాసః కైవర్తకన్యాయాం, శశపృష్ఠా ద్గౌతమః-వశిష్ఠ ఊర్వశ్యాం

† మనుస్మృతి 9 వ అధ్యాయము

శ్లో॥ అక్షమాలా వశిష్ఠేన సంయుక్తాధమయోనిజా
సారంగీ మందపాలేన జగమాభ్యర్హణీయతాం॥ 28

‡ మనుస్మృతి 581

శ్లో॥ శూద్రాయాం బ్రాహ్మణాజ్జాత శ్శ్రేయసాచే త్ప్రజాయతే
అశ్రేయాం శ్రేయసీంజాతిం గచ్ఛ త్యాసప్తమాద్యుగాత్॥ 64

సీ॥ లేక యేదేనొక ప్రాకటవ్యవహార
మెవరునుంగనుపట్ట రీపురమున

---

581 పేజీలో వక బ్రాహ్మణుడు శూద్రజాతి స్త్రీని పెండ్లిచేసుకుంటే వాడికి వక ఆడ
పిల్ల పుట్టి ఆపిల్ల బ్రాహ్మణునే పెండ్లిచేసుకొని యిట్లా యేడుతరములవరకు జరుగుతే
యేడోతరము పిల్లకు పుట్టినవాడు కులభేదములేక బ్రాహ్మణజాతివాడు అవుతాడు.
వాచస్పత్యములో వైదిక బ్రాహ్మణుడనిలేదు. సంకరవర్ణములులేకపూర్వము శిల్పా
దులు శూద్రజాతికి చెప్పబడివున్నవి. సంకీర్ణజాతులు యేర్పడినకొలదిని వారికి శిల్పా
దులువదలి శూద్రులు ద్విజశుశ్రూషమట్టుకు తాము వుంచుకోవుండవచ్చును. స్మృతు
లలో శూద్రులమట్టుకుమాత్రమే వివరించినచోట శిల్పాదులుశూద్రులకు చెప్పబడివున్నవి.
తప్సీలుగా సంకీర్ణవర్ణములు చెప్పినచోట శిల్పాదులు సంకీర్ణవర్ణధర్మములుగా చెప్పబడి
వున్నవి. శిల్పాదులు శూద్రులకు మనుస్మృతిలో ఆపద్ధర్మములుగా చెప్పబడివున్నవి.
దేవతలకు దేవలోకములో విశ్వకర్మఅని వక శిల్పకారుడు వున్నాడని చెప్పబడివున్నది
గాని ఆయన యేకులమువాడో నాకు తెలియదు. ద్విజేతరులైన యితరులకు వేదోక్త
కర్మలులేవు- ద్విజేతరులైన యితరులలో రథకారులకు ఆధానకర్మకు అధికారము
వున్నది- తక్కినజాతులవారికి వేదోక్తకర్మలు యెందుకులేవో యెక్కడ చెప్పబడివుం
డలేదు- భిక్షాటనము బ్రాహ్మణులకు వృత్తికాదు- వారికి పరిగ్రహఅధికారముమాత్ర
ము వున్నది- అమరుడు రథకారులను సంకీర్ణులలోచేర్చినాడుగాని శూద్రులలో చేర్చ
లేదు- మంగలవాండ్లు సంకీర్ణులు- యీశాస్త్రములన్ని భరతఖండమువారికే చెప్పబడి
వున్నవి- హిమాలయము మొదలు శేతువువరకును తూర్పుపశ్చిమసముద్రములకు మధ్య
వున్నప్రదేశము భరతఖండమనిపే. - అంబష్టుడు నిషాదుడు మాహిష్యుడు మొదలుగా
గలవారు- * స్మృతిముక్తాఫలము 52 పేజీలో అనులోమసంకరులని చెప్పబడివున్నని-
వీరికి సమంత్రకకర్మలు లేవు- సమంత్రకకర్మలు అనులోమసంకరులలో బ్రాహ్మణునకు

---

* స్మృతిముక్తాఫలము 52 వ పేజీ

శ్లో॥ బ్రాహ్మణా ద్వైశ్యకన్యాయా మంబష్టో నామజాయతే
నిషాద శ్శూద్రకన్యాయాం యః పారశవ ఏవవా
క్షత్రియా ద్వైశ్యకన్యాయాం మాహిష్యోంబష్ట ఇత్యసా॥

పోక యేదేనొక భూరిసభాస్థలి
కెవరునుంగనుపట్ట రీపురమున

---

క్షత్రియకన్యయందుపుట్టినవానికిమట్టుకు చెప్పబడివున్నట్టుజ్ఞాపకము- సంకీర్ణజాతులు తల్లికులముకంటే తక్కువవారు కారని చెప్పబడివున్నది- చార్యమునపుట్టినవారు తల్లిజాతికంటె తక్కువవారు అవుతారు- క్రమప్రకారము పెండ్లిచేసుకున్నదానికిపుట్టిన అనులోమసంకరులు తల్లిజాతికంటే తక్కువవారు కారు అనులోమసంకరులకంటే సంకీర్ణసంకరులు తక్కువవారు అనులోమసంకరులు కొంచెము హెచ్చుతగ్గుగా శూద్రులలో చేరుతారు రథకారుడనగా రథముచేసేవాడని యౌగికార్థము-ఆధానకర్మకు బ్రాహ్మణులకు రథకారులకు వేరువేరుమంత్రములు బ్రహ్మక్షత్రియవైశ్యులు చేసేఆధానకర్మ రథకారులుచేసే ఆధానకర్మ వకటే యీఆధానకర్మ పుణ్యముకొరకు చేస్తారుగాని బ్రాహ్మణాదిజాతులుచేసినప్పుడు రథకారులుచేసినప్పుడు క్రియాభేదము-బ్రాహ్మణజాతివారు ఆధానముచేసేటప్పుడు వకమంత్రము క్షత్రియుడుచేసినప్పుడు వకమంత్రము వైశ్యుడు...చేసేటప్పుడు వకమంత్రము రథకారుడు చేసేటప్పుడు వకమంత్రము చెప్పమని * కృష్ణయజుర్బ్రాహ్మణము 10 వ పేజీలో చెప్పబడివున్నది- షోడశకర్మలకు నియమింపబడిన మంత్రప్రశ్నములోని మంత్రములు ప్రతిష్టకర్మకు పనికిరావు-ప్రతిష్ఠాసంకల్పమునకు పూర్వము వేదమంత్రములు అవసరములేదు- దేవాలయము కట్టబొయ్యేముందు స్థలశుద్ధికి వేదమంత్రములుకలవు- ప్రతిష్ఠకుపూర్వము విగ్రహమునకుచేయవలసిన సంస్కారములు లేవు రథకారులను ఆంధ్రదేశములో రథకారులని వాడుటలేదు- కంసాలిబత్తుడు వడ్లబత్తుడు కమ్మర అని వాడుతారుగాని రథకారశబ్దము సంస్కృతముగనుక ఆంధ్రదేశములో వాడరు. మనుస్మృతి 22-23 పేజీలో విరాట్టువలన సృష్టిపుట్టినట్లు చెప్పబడివున్నది.

---

* కృష్ణయజుర్బ్రాహ్మణము 10 వ పేజీ

శ్రు॥ భృగుణాం త్వాంగిరసాం వ్రతపతే!వ్రతేనాదధామీతి భృగ్వంగిరసామాదధ్యాత్-ఆదిత్యానాంత్వా దేవానాం వ్రతపతే! వ్రతేనాధధామి త్యన్యాసాం బ్రాహ్మణీనాం ప్రజానాం-వరుణస్యత్వా రాజ్ఞో వ్రతపతే!వ్రతేనాదధామీతి రాజ్ఞః ఇంద్రస్య త్వేంద్రియేణ వ్రతపతే!వ్రతేనాదధామీతి రాజన్యస్య-మనోస్త్వా గ్రామణ్యో వ్రతపతే!వ్రతేనాదధామీతి వైశ్యస్య-ఋభూణాంత్వా దేవానాం వ్రతపతే! వ్రతేనాదధామీతి రథకారస్య-

రాక యేదేనొకవీక ధనము ధాన్య
మెవరునుంగనుపట్ట రీపురమున
ఈక యేదేనొక లోకోపకృతి విత్త
మెవరునుంగనుపట్ట రీపురమున

---

విరాటువలన పుట్టినవారిలో భేదములేనట్టు చెప్పబడివున్నది. విరాట్టు...ముఖబాహూరుపాదములనుండియే బ్రహ్మక్షత్రియులు వైశ్యశూద్రులు పుట్టినారు- 10-12 యేండ్ల క్రిందటివరకు కంసాలులయింట్లలో బ్రాహ్మణులు యాజనము చేయించేవి. వైశ్యులకు వేదోక్తమున్నది. వారియింట్లలో యేలాజరుగుతూవున్నది నాకు తెలియదు. విష్ణుపురాణము బ్రహ్మాండపురాణము బ్రహ్మవైవర్తనము స్కాందము 18 పురాణములలోవే. యిప్పుడువున్న బ్రాహ్మణులు పూర్వయుగ బ్రాహ్మణసంతతివారేఅని నాయభిప్రాయము. గతయుగములలో బ్రాహ్మణుడు పెండ్లిచేసుకున్న క్షత్రియస్త్రీకి పుట్టినవారికి తపస్సుచేసి ఆలోపము పోగొట్టుకుంటేనే గాని బ్రాహ్మణుడు గాడు. తండ్రి బ్రాహ్మణుడయితే తల్లి తక్కువజాతిదైనా తపస్సుచేత బ్రాహ్మణుడు అవుతాడు. వేదములలో చెప్పబడినఋషులు చెప్పబడనిఋషులకంటె యెక్కువకాదు.

(కోర్టుప్రశ్న) యాజనకర్మ ధనముఆర్జించుటకుపుట్టినకర్మ అయివున్నది. యిది యిహలోకకర్మగాని డబ్బుతీసుకోకుండాచేయిస్తే కొంతపుణ్యమువున్నది. ప్రతిష్ఠచేసెడివాడు పరలోకముకొరకు యిహలోకముకొరకు చేస్తాడు, చేయించెడివాడు తనవిధి కర్మగనుక చేయించుతాడు. ప్రతిష్ఠకర్మచేయించేవాడు పుట్టుక బ్రాహ్మణుడైమంత్రములువచ్చి శరీరపరిశుద్ధికలవాడై యుండవలెను. మంత్రములువచ్చిన బ్రాహ్మణుడు ఆ మంత్రములు వల్లించుతూ ప్రాణప్రతిష్ఠచేస్తే ప్రాణప్రతిష్ఠఅవుతుందిగాని మహాఋషులుచేసిన ప్రాణప్రతిష్ఠకు ఆధిక్యమువుండవచ్చును. తక్కువజాతివారు బ్రాహ్మణులు అయితే మార్పుపొందునది దేహము-ఆత్మ మారదు-మార్పుపొందినదేహమునుధరించిన ఆత్మ బ్రాహ్మణుడయినాడు. నేనుపైనచెప్పినశరీరము మార్పు. స్థూలశరీరమునకే జ్ఞానాతిశయముగలవారు వారివెనుకటిజన్మయొక్క స్థూలశరీరములోని అణువులను తరువాత జన్మకు తెచ్చుకుంటారు. కులాతిశయమునకు పుట్టుకే కారణము. బ్రాహ్మణులు పరాత్పరునిముఖమందుపుట్టినవారుగనుక వారికిఅతిశయమువచ్చినది. పుట్టుకచేతనే బ్రాహ్మణులకు ఆధిక్యతవచ్చినది. తక్కువజాతివారు బ్రాహ్మణకర్మఆచరించుటచేత ఆధిక్యతరాదు. మనుస్మృతి 37 పేజిలో 98 శ్లోకములో బ్రాహ్మణునికి జ్ఞానముచేత మోక్షము వస్తుందని చెప్పబడివున్నది. ముందు వర్ణములుయేర్పడి తరువాత వృత్తులు యేర్పడినవి. యెక్కువజాతివారు తక్కువజాతివారి వృత్తులు 7 పురుషాంతరములవరకు ఆచరించిన

గీ॥ తేక బలుకానుకల సుధీ లోకనతికి
నెవరునుం గనుపట్టర యీపురమున
కాకయుండిన నీరీతిగం బ్రసిద్ధి
కెక్కియేయుండ దీమాట నిక్కమరయ॥ 15

క॥ ఆపురి బ్రాహ్మణు లధిక। శ్రీపరిచితి వాక్ప్రయోధరీపరిచితియుక్
బ్రాపించియుండుటేకా।కోపినయంతక్, జనోపయోగులుకూడక్ ॥16

తే॥ అట్టివార్కొండ ఋసోమయాజినుడిని
వేదపుంముక్కలాగున విశ్వసింత్రు
యాయన కలామహత్త్వమే యాయనకటు
జనవశీకరణాత్మక శక్తినీయ॥ 17

---

యెడల తక్కువజాతివారవుతారు జ్ఞానముసంపాదించి మోక్షముపొందుటకు జాతి వృత్తులు అవసరములేదు. యేజాతివాడు వానికర్మలు చక్కగాజరువుతున్న యెడల మోక్షమునుపొందవచ్చును.

రిగ్రాసు—వజ్రసూచికోపనిషత్తు పరమాత్మజ్ఞానమహిమమును తెలుపుటకు పుట్టినది. స్మృతులన్ని దేవఋషులు బ్రహ్మఋషులు చేసినవే. పురాణములు వేదవ్యాసులవారు చేసినారు. బ్రాహ్మణుడు శ్వేతవర్ణుడని ప్రశ్నరూపములో వున్నది. బ్రహ్మజ్ఞానము హెచ్చుఅనిచెప్పుతూ చెప్పినాడు. వ్యాసునితల్లి క్షత్రియకన్యఅయినను దాశరాజు పెంచినాడు. దశవిధబ్రాహ్మణులలో విశ్వబ్రాహ్మణులులేరు. యాజనముచేయించే బ్రాహ్మణుడు డబ్బువుచ్చుకుంటే తప్పులేదు. నిషాదుడయిన ప్రభువు (బోయవాడు) వకయిష్టిచేయుటకు అధికారమువున్నది. నిషాదుడు సంకరజాతిలోవాడేచేయవచ్చునది * జైమినీయన్యాయమాలావిస్తరము 310 పేజీలో వున్నది.యీయిష్టిరుద్రుడనే దేవతకు హావిస్సుయిచ్చేకర్మ-శివాలయాదులలోకి ప్రాణప్రతిష్ఠచేసినతరువాత విగ్రహమునుచేసిన ఆయన గర్భగుడిలోనికి రాకూడదు. బ్రాహ్మణుడు జాతిభ్రష్టుడయితే జాతితోపాటు కర్మాధికారము పోతుంది

విశ్వానుసు, సరిగావున్నది

మల్లాది రామకృష్ణశాస్త్రిసోమయాజులువ్రాలు.

---

* జైమినీయన్యాయమాలావిస్తరము 310 వ పేజీ

శ్లో॥ కర్మధారయముఖ్యత్వా న్నిషాదో రౌద్రయాగకృత్॥

తే॥ అట్టిభూదేవసంతతియందుఁ బొలుచు
సీమసికులాంబునిధిపూర్ణసోముఁడైన
లక్ష్మినారాయణాఖ్యాక సూక్ష్మబుద్ధి
యుపకృతానేకవిద్యద్విజోత్తముండు॥ 18

క॥ ఆయనయున్ మతికొందఱు ధీయుతులుం దనదు దెసకు దిక్కారిన దా
నీయఘశాలావ్యవహృతి। యేయ్యనువున నుండెనొ యని యేతెంచుటయున్

ఆ॥ రామకృష్ణయజ్వ "రందు కూర్చుండుఁ"డ
టంచు వారి మిగుల నాదరించి
నేను గుడుచునట్టి నెవ్వగయంతయున్
దెలిపి యిట్టులనియె దివ్యఫణితి॥ 20

క॥ "ప్రకృతపువ్యవహారంబీ
యొకనితలనెయుండెననుట కొప్పదుచుఁడి త
ప్పక బ్రహ్మజాతికింతటి
కొకతీఱుభరంబె దీననున్నది యరయన్॥ 21

ఉ॥ ఈతనియింటికార్యమని యెంచఁగఁబోకుడి, యగ్రజన్మపుం
జాతికెపెట్టినారెసగుస్వర్ణహారుల్, కలగుండువెట్టకే
రీతినొవిడ్చినన్మసము రేపమరేశ్వరుచెంకికేని రాఁ
జూతురు, వ్రేలువెట్టగద చొన్నపునరావలఁ గాలుసైతమున్॥ 22

తే॥ ఇట్టిసందర్భమే లేనియెడల నే ని
టులవత్తును నాపనులెల్లవిడిచి
యూఱునూఱైన నూఱాఱునైనఁగాని
నుడువుదునెసాక్ష్యమేఁ గోర్టున నుమనిల్చి॥ 23

ఉ॥ మీఱలుకూడఁ జేయవలె మిక్కిలిసాయముదీన నిప్పు డే
తేరినసాక్షిసంతతికిఁ దిండికిసైతము త్రోవ లేమి న
వ్వారు స్వగేహసీమలను వ్రాలఁగఁ జూచుచునున్నవారు మీ
నేరిచినంతవట్టితని నెవ్వగదీర్చుటయుక్త మారయన్॥ 24

క॥ ఘనుఁడౌ రంగావఝ్ఝుల
హనుమయమాకింతగఁగ యర్చింపంగన్
జనియెడిదినములు, తక్కిన
జనములభుక్తికయియితఁడు శ్రమలంబడెడిన్॥ 2

క॥ ప్రతివాదులప్లీడరులటు
ప్రతిదినముఁగొనిధనంబు పనిసేయంగన్
మతిమంతుండై హనుమయ
యతనిగృహంబుననె మాకు సన్నంబిడెడిన్॥ 26

శా॥ అన్నంబొక్కటెకాదుచూ యరయఁగా నాధన్యసాహాయ్య మిం
కెన్నో రీతులనుండియున్నది, బలే! యీకేసునన్ వాది యీ
తెన్నంగాంచకయున్నచో నతనియాత్రిప్పుల్ వచింపంగలే
మన్నా! హనుమయ్యగారిగుణ మేనా యెన్నఁగన్ శక్తుఁడన్॥ 27

సీ॥ ప్రాతరాహ్నికముల భానూదయమునకే
తప్పకయొనరించు ధన్యతముఁడు
ఎన్నికార్యములున్న నేగికాలానకు
సాంధ్యకృత్యముతీర్చు సత్క్రియుండు
ప్రత్యహంబుస్వశక్తిఁ బదిమైనమందికి
మృష్టాన్నమిడునట్టి మేటిదాత
తఱచుగావచ్చువిద్వద్బ్రాహ్మణాళిని
దగురీతిఁబూజించు సుగుణరాశి
ఏండ్లకొలఁదిఁ దనదునింటవిద్యార్థుల
కన్నవస్త్రములిడు నార్ద్రహృదయుఁ
డై చెలంగునాతఁ డరయరంగావఝ్ఝు
లాన్వయుండు హనుమదాహ్వయుండు॥ 28

సీ॥ వ్యాజ్యమాదిగవచ్చువాదికింగడుఁబ్రీతి
నన్నాదికం బిచ్చుచున్నవాఁడు

తన్మూలముగవచ్చుమన్ముఖవిబుధాళి
కొనరవిందులఁ జేయుచున్నవాఁడు
మముఁదోడుకొనిరాను మాటికిఁ దనబండి
నుచితంబుగాఁ బంపుచున్నవాఁడు
ఫీజుగై కోకయే ప్లీడరుగానుండి
యున్నిష్టనుల్ చూచుచున్నవాఁడు
పుండరీకాక్షుఁడీతఁడుం బుణ్యమునకు
నేటుపడకున్న నీపాటికేమియగునొ
యితరసాహాయ్యములకై పెక్కుఁడుములంది
రహిఁదరిగియున్న పట్టాభిరామశాస్త్రి ॥ 29

ఉ॥ కుంపటికింతయంచుఁ బ్రతికొంపకు నేగివసూలుచేసి బల్
తెంపరులై కలాదు లోకదిక్కుననుంచిరకొంతయాధనం
బింపుదలిర్పలాయరున కిచ్చుచునుండిరి రోజుకొక్క నూ
రొంపఁజియుండెఁజాతియనిచూ యభిమానము వారికంతగన్ ॥ 30

తే॥ లేసిదానికెవారింతపూనియుండ
నున్నదానికిఁదగ దూరకుంటమనము
ఎవరొసంగరొచందాల నింకుఁజూత
మిప్డెపట్టీనిబెట్టుడిఁ కేలతడవు" ॥ 31

ఉ॥ ఇప్పగిదిన్ వచించుటయు నీమువవంశజముఖ్యభూసురుల్
చప్పునఁ బట్టుఁబట్టుమని శక్తికిమించినదానవైభవం
బుప్పతిలంగఁ గొంతధనమొక్కటఁజేర్చి సజ్జనాళికిన్
మెప్పుగభోజనంబిడిరి మేల్గృహమొక్కటిచూచి దానిలోన్ ॥ 32

శా॥ స్వవ్యాపారములెల్లమానిపురుషుల్ స్వస్త్రీలురావెంటఁ ద
న్నవ్యాస్మజ్జనభుక్తిమందిరమునన్ నానోపచారక్రియా
భవ్యాత్మీయకృతార్థతాజనితముత్పాథోధిదివ్యత్తరం
గవ్యూహంబున నోలలాడుచు మెలంగంజొచ్చి రారోజులన్ ॥ 33

ఉ॥ సాక్షులు చుట్టముల్ హితులు శాస్త్రులు యజ్వలు తద్విచారణా
వేక్షణకౌతుకాగతమహీసురులెందఱో యాస్థలంబునన్
గుక్షులు నిండఁ బ్రత్యహము కూరలు కాయలు పిండివంటలున్
భక్షణచేసి త్రేవనుచ పారముదంబును గాంచిరయ్యెడన్ ॥ 34
ఉ॥ కంపనుబడ్డశాకివలెఁ గందరగోళము నొందిళొంచు నే
చెంపనుగూడ సేనయయి చిత్తము స్థైర్యముదప్పి వర్తిలన్
దింపియొకింతమద్భర ముదీర్ణయశంబును గాంచిరట్లు స
సత్సంపదులైన గర్తపురిత్స్మాదివిజుల్ సదయాంతరంగులై ॥ 35
క॥ ఆపురి శిష్టాన్వయజని। శ్రీపూరితమందిరుండు సీతారామా [చుర్ ॥
ఖ్యోపేతుండైనుతిరియొక। బాపఁడువసియించు నూ్కలుపండితుఁడగు
తే॥ పాణినీయాదికంబులౌ బహుళకలలఁ
గడుఁ బ్రవీణతగన్నట్టిఘనుఁడతండు
పెక్కువిషయంబులెఱింగియుఁ బేరుమోసి
యున్నతులమన్నవల్ గాంచుచున్నవాఁడు 37
క॥ అఱువదియేఁడుల్ చనుటను
ద్విరసనపతిరచిత భాష్యవేత్తయగుటనో
మతి జ్ఞానంబతియగుటనో
ద్విరసనధర్మంబు తత్సుధీమణికబ్బెన్ ॥ 38
ఉ॥ ఈయొకదానికింజడిసియే మునుసాక్ష్యముగోరకున్న నే
నాయితరంబులన్ శ్రమసియజ్వ "ధృఢంబుగ దావలెంజుమీ
యాయసాక్షిగామనకు" నంచువచింపఁగనందుమీఁదటన్
జేయఁగఁ జేసితిన్ సమను, చేరఁగవచ్చెనుగోర్టుకాతఁడున్ ॥ 39
ఉ॥ చేరఁగవచ్చినన్ మొదటఁ జేరువఁ జేరి తదీయహృత్తతం
బారయ రామకృష్ణబుధయజ్వయె భిన్నపథంబుఁ ద్రొక్కనా
ధీరునిమానసంబు గడిదేఱినసూరి పరోక్తమార్గసం
చారము చేయఁగూడదని స్వాంతమునందతఁడెంచెనే మొకా॥ 40

ఉ॥ ఆఘనుహృద్గతంబెఱిగి యజ్వయు "నీతని సాక్ష్యమెంతయున్
లాఘవకారిగాని కనులాభము లే"దని పల్కునంతలో
వే ఘణఘణ్ఘణంఘణని వేయఁగ నయ్యెనుగంటలై దిఁకా
మోఘజవాశ్వమై గృహముముందరఁగన్పడె నొక్కసార్జనున్॥ 41

సీ॥ ధర్మాధిపతి లేచి తదుపర్యధిష్ఠితుం
డై చనె బాహ్యవిహారమునకు
బీగముల్ సంధించి పేటికాకోటికి,
క్లార్కులెల్లరును షికారుకరిగి
రాఫీసులెల్ల జనాభావతంజెంద
రాజకీయులు లేచిరాఁ గడఁగిరి
పరోక్షఁజూచిన నిచ్ఛావిహారార్థ
మేగు నుద్యోగులంతోఁ గనఁబడె
కాలమునసందెవార్చెడి కర్మఠులకు
వేశ్మములవంకనరుగంగ వేడుకయ్యె
స్కూలుపిల్లలు వీధులం గోలలెసఁగ
సమువఁదొడఁగిరి తమతమపిఖమాలకును॥ 42

చ॥ చదివినపెద్దమానుసులె సత్యముదప్పిన సాక్ష్యమీయఁగన్
మదినిదలంచుచుండిన యమంగళకారణమైనయట్టి యీ
యదనునఁ గర్మసాక్షికి ననర్హము వానముటంచునేగె నాఁ
దదవరసంబున దరశి దాటిచె నస్తమితత్వ మొయ్యనన్॥ 43

తే॥ స్తంభములపైకినిచ్చెనల్ చాపిరజకు
లందధిష్ఠించి లాంతర్లయద్దములను
దెఱచి యందలిచిమ్నీల సరిగఁదుడిచి
మునిసిపల్ లైట్లువెలిఁగింపఁగను గడఁగిరి॥ 44

క॥ మేమును మాపూర్వోక్తపుధామంబున కేగి తీర్చితత్త్క్రియలన్
బ్రామాణ్యంబులఁగూరిచి వేమఱుచర్చించుకొనుచు విలసిల్లుతఱిన్॥

తే॥ పూరివిస్త్రళ్ళలోఁ దుమ్మిపూలఁబోలు
నట్టిశాల్యోదనంబును వ్యంజనములు
వినయసంభ్రమితాంగులై వెలయునట్టి
వంటవార్లేచిచేయుదు వడ్డనములు॥ 46

ఉ॥ సమ్మతిఁ బెద్దపీటలను స్వాంతమురంజిలగూరుచుండి బల్
కమ్మనినేతిపోపుగల కందయునంటులునున్న శాకముల్
తెమ్మని తృప్తిగాను బలుతీరులముచ్చటలాడికొంచొగిన్
నెమ్మదిగన్ భుజించితిమి నేను మదీయులుగూడనయ్యెడన్॥ 47

తే॥ అట్లు భుజియించిలేచెను నంతలోన
మిగులవెలగల్గినటువంటి మేత్రివాచి
యాదిగాఁగలిగిన యనేకాస్తరణము
లచటఁబఱుపంగఁజేసిరయ్యవనిసురులు॥ 48

చ॥ గమమవాసనల్ వొలుచు క్రపువీడ్యములుంచినట్టి యు
త్తమరజతంపుఁబళ్ళెరముదండ సుఖస్థితిఁగూరుచుండి యం
దముగనొనర్చినారమటఁ దమ్ములమందఱ మప్పుడట్టిసా
ఖ్యమునకు హేతుభూతులగు గర్తపురీద్విజులన్ నుతింపుచున్॥ 49

సీ॥ అమలులోనున్న మావ్యవహారమందలి
గుణదోషచర్చతోఁ గొంతసేపు
రామకృష్ణమనీషి పాణిమాణ్యమతిఁజేయు
కుమతఖండనలతోఁ గొంతసేపు
తిరుపతివేంకటేశ్వరకవీట్కవనంపు
వింతపోకడలతోఁ గొంతసేపు
ఆసనమూలమై యప్పుడేర్పడియున్న
క్రొంపుగోడవతోఁ గొంతసేపు
అటులఁబ్రస్తావనాయాతమైనయట్టి
నవ్యలోకాభిరామాయణములతోడఁ

ప్రొద్దుచనిచని తాంబూలపుంప్రశంస
సరిగఁ బంప్రడెంపుగంటలసమయమయ్యె॥ 50

తే॥ ద్విజసమంచితమాహాదు దివ్యసభకుఁ
దానయగ్రాసనాధిపత్యమువహించె
ననఁగ ద్విజరాజు వెలుఁగొందె నభ్రమధ్య
మహితసద్గుణసంసేవ్యమాన్యుఁడగుచు॥ 51

ఉత్సాహము.

బొండుమల్లెపూలచేత భూమికప్పఁబడినటుల్
వెండితేరుతాపినటుల వెల్లవేయఁబడినటుల్
పిండియారఁబోసినటులఁ బృథ్వికచ్చినయినటుల్
పండువెన్నెలల్ రహించె బాగుగాజగంబునన్॥ 52

ఆ॥ ఊరుమాటుమణఁగె నుద్యన్మనోభవ
వికృతిఁ దద్విహారవివశులగుచుఁ
దరుణదంపతుల్ స్వధామసీమలలోన
గాఢనిద్రఁజెందఁ గడఁగిరపుడు॥ 53

క॥ తొరతొరగ లేచియంతట। నరిగియెవరిబసకువార మందఱమున్ మై
మఱచినిదురించినారము। మఱునాటివిమర్శఫక్కి మదిఁగలఁపంగన్॥

ఆ॥ ఒక్కసిదురవ్రాయి ప్రక్కకున్ మరలుచుఁ
జూడనయ్యెఁ బొడిచి శుక్రుఁడంత
ఎఱుకపడఁగమాకు నేకాక్షప్రథమంపు
దర్శనమున నాఁటిదండిఫలము 55

క॥ హరిహరినఖదళితతమః। కరికుంభవిముక్తరక్తఘనముక్తముల
క్లైఱుపు తెలుపువన్నెలతో। హరిహరిదగ్రమునఁ దారలయ్యెడనలరెన్॥

తే॥ పండితులుకూడనిప్పటి బ్రాహ్మణతను
వారివలెనేగణించుచున్నారిదేమి

పాపకాలంబటంచుఁదాఁ బరిహసించు
కరణిఁ బ్రాగ్దిక్కు తెల్లనై కానుపించె 57

సీ॥ విద్యార్థిబృందంబు వెసలేచియావృత్తి
సలుపఁజొచ్చెను గనుల్ నులిమికొనుచు
కర్మఠుల్ ప్రత్యూషకర్మల నెఱవేర్ప
స్నానము ల్సేయంగ సాఁగి రెలమి
వేళకుసరిగఁ గాఫీత్రావువారి ద్వా
రములనావులు సవత్సముగనిలిచె
సమ్మార్జనము చేయ సరవిదాసీప్రజ
చీపురుకట్టలఁ జేతఁబట్టె
ద్వారసీమలందు దంతధావనవిధుల్
జరుపఁగూరుచుండెఁ బురజనంబు
వడిఁగ చేరి కేగువారలు భుజియించు
పూటకూలిండ్లఁ బొగలువెళ్లె॥ 58

సీ॥ సురపతిదిక్సతి సుతునితొట్లకుఁగట్టు
ఘనతరవిద్రుమకందుకమన
ధనము బ్రతుకు కల్లయని చెప్పిపూరించు
జముఁడనుజంగంబు శంఖమనఁగ
భూతాయురురుధాన్య పుంజంబులనుగొల్చు
లలితకాంచనమయ కలశమనఁగ
వరుణదిగంగన మెఱుఁగులఁ జేయుచో
నొద్దనల్పిన నిల్వుటద్దమనఁగ
బటువుగువ్వల వేడిమి బాఱఁదోలఁ
జాలి వెలసెడు బలుమందుగోలియనఁగ
బారరూపుల వేలుపు ప్రాఙ్మహీధ్ర
శిఖరమందుననుదయించి చెలఁగెనంత॥ 59

ఆ॥ వేలమూరికోలపుఁ బాలసంద్రమునకు
శుభ్రకిరణుఁ డైన సుబ్బరావు
జెడ్జికోర్టులోనఁ జెలఁగుశిరస్థదా
ర్పదవినధిగమించి పరఁగుచుండె॥ 60

చ॥ అరితతిపట్ల భీమతయు నాప్తులపట్లను శంకరత్వముల్
సురుచిర రాజకీయసభఁజొచ్చెడిపట్లఁ దదష్టమూర్తితా
స్ఫురణయుఁ జర్చపట్ల రహిఁ జొప్పడి త్ర్యంబకతాప్రశస్తి యా
సరసు శిరస్థదారతను సార్థకముం బొనరించి మించెఁగా॥ 61

క॥ ప్రాతఃకృత్యము లెల్లను।నాతర్వాతన్ రయంబ యరిగితి నేత
త్ఖ్యాతునియింటికి,శిష్టా।సీతారామార్యుఁడు దయచేసెను నపుడే ॥62

క॥ దయచేసికూరుచుండుచు।నయభయములనొద్దఁ జేరున్ గని "త్వష్ట్రి
స్వయజులగోత్రములోకకొ।న్ని యెఱింగింపంగవలయునీ"వనియనుచున్॥

చ॥ సరియగుసాక్ష్యముల్ నుడువుచాడ్పున నేమియొ మాటలాడ సం
బరపడి నేనుబోయితిని,భక్షణచేసి తదార్యుఁడంతఁ జె
చ్చెరఁ బదిగంటలౌసరికిఁ జేరి కచే రధికారిరాకకై
త్వరపడుచుం దదాగమన తత్పరుఁడై వసియించె నాకిటన్॥ 64

క॥ ఏతెంచెను మున్సిఫ్ గార్
తేతెమ్మని మారికార్ద్రె తెప్పించెవెసన్
సీతారామబుధా! యని
స్ఫీతరవంబునజవాను పిలిచెన్ సమ్మాక్॥ 65

క॥ చెచ్చెరసాక్ష్యస్థానము
చొచ్చి*తదార్యుండు స్వేచ్ఛచొప్పునఁబలికెన్
వచ్చివకీల్ ప్రశ్నించిన
హెచ్చిన్ ధోరణిమెఱుఁగింత యేమని చెపుదున్॥ 66

---

...... The 29th day of August 1911.

* ....శిష్టా సీతారామశాస్త్రిగారు......గుంటూరు......

ఆ॥ *విశ్వకర్మయనఁగ వెలసి నవబ్రహ్మ
లందు నొక్కబ్రహ్మ యలరునంట
సృష్టికార్యమునకుఁ జేదోడుగావారు
బ్రహ్మచే సృజింపఁబడిరియంట॥ 67

తే॥ §విశ్వకర్మాహ్వయంబున వెలయునతఁడు
వసువులందొకఁడైన ప్రభాసుకొడుకు
క్రతుభుజులశిల్పిగానితాఁ గాఁడుబ్రహ్మ
‡బ్రహ్మలుమరీచిముఖ్యులౌ బ్రహ్మసుతులు॥ 68

ఆ॥ భారతాదికములఁబఠియించు సామాన్య
జనులుకూడనెఱుఁగుచరితమిట్టుల
మార్చి చెప్పునట్టి మహనీయుసాక్ష్యమం
దెంతసత్యముండ కేమియగును॥ 69

క॥ †కమసాలవాని గీర్వా
ణమునం బండితులువాడునామంబే యీ
సుమనీషి కెఱుక లేదఁట
క్రమమో యక్రమమొ దీనిఁగనుగొనుఁడుజనుల్!॥ 70

---

వేదములో విశ్వబ్రాహ్మణులు అనే పదము యెక్కడ లేదు_*విశ్వకర్మఅని నవబ్రహ్మలలో ఒకబ్రహ్మవున్నాడు. ఆయన దేవతలకు శిల్పిఅయివున్నాడు. పూర్వము కంసాలీలు వడ్లవారు కంచర్లు అనేవారిని యిప్పుడు విశ్వబ్రాహ్మణులని పిలుస్తున్నారు. †యీకంసాలి వడ్ల కంచర్లను సంస్కృతములో యేపేరుచేత పిలువవలసినది

---

పురాణనామచంద్రిక 180 వ పేజీ.

§విశ్వకర్మ:— ప్రభాసునకు యోగసిద్ధియందుపుట్టినకొడుకు. ఇతడు దేవశిల్పి

130 వ పేజి.

‡బ్రహ్మ:—త్రిమూర్తులలో ఒక్కడు...ఇతనివ్యాపారముసృష్టిచేయుట. తొలుతఇతనికి [illegible] మానసపుత్రులుకలిగిరి. వారిలో తొమ్మండుగురు ప్రజాసృష్టికి కారణభూతులు అయి నవబ్రహ్మలు లేక నవప్రజాపతులు అనబడిరి. వారు మరీచి, అత్రి, అంగిరసుఁడు, పులస్త్యుఁడు, పులహుఁడు, క్రతువు, భృగువు, వశిష్ఠుడు, దక్షుఁడు, అనువారు.

ఆ॥ చదివెనంట యూఱుశాస్త్రంబులందాను
అభినివేశమున్న దంటలెన్న
రామరామయితఁడు *రథకారశబ్దార్థ
మెఱుఁగఁడంట, యిద్ది యేటివింత॥ 71

క॥ మొదటఁ §షట్కర్మలలో
నిది కాదు ప్రతిష్ఠయని యనేఁ వెంట నెతా
నది యాజనమున నుండెడి
పదియారుకర్మలనొకటయి పరఁగెడునను మఁ॥ 72

---

నాకు తెలియదు. రథకారులని ఒకశబ్దము వున్నది. అది వారికి చెందదని వారు అంటున్నారు. నాశాస్త్రజ్ఞానమునుబట్టి యిప్పుడు విశ్వబ్రాహ్మణులని పిలువ బడేవారికి *రథకారశబ్దము వుపయోగిస్తుందేమో చెప్పలేను. ప్రతిష్ఠకర్మ బ్రాహ్మణులే చేయించవలెనని శాస్త్రములలో చెప్పబడివున్నది. యిది ఆగమములలో చెప్పబడివున్నది. ప్రాణప్రతిష్ఠ §షట్కర్మలలోనిది కాదు. షట్కర్మలలో యాజనము జీవనార్థము పుట్టినదే. ప్రాణప్రతిష్ఠ యాజనములో వున్న 16 కర్మలలో ఒకటి-యాజనములో ధ్యానము ఆవాహనము మొదలైనవి 16 వున్నవి. ప్రాణప్రతిష్ఠ ఆవాహనముక్రింద చేరుతుంది. యిది ఆవాహనముక్రిందికి వస్తుందని ఆగమములలో చెప్పబడివున్నది. కలియుగమునకు పరాశరస్మృతి నిర్ధారణమైనస్మృతి. అందులో 6 కర్మలు బ్రాహ్మణునకు చెప్పబడినవి. యాజనకర్మ పరాశరస్మృతివలన బ్రాహ్మణునికే చెప్పబడివున్నది. ప్రాణప్రతిష్ఠ యితర్లుచేయడం గలదు. యితరకులస్థులు ప్రాణప్రతిష్ఠచేస్తే అట్టిదేవాలయములు ప్రాణప్రతిష్ఠచేసిన కులమువారికి వారికంటె తక్కువ కులమువారికి పూజకు అర్హములుకాని వారికంటే యెక్కువకులము వారికి అర్హములు కావు. బ్రాహ్మణుడు ప్రాణప్రతిష్ఠచేస్తే అన్నికులములవారి పూజకు అర్హములు. విశ్వబ్రాహ్మణులు ప్రాణప్రతిష్ఠచేసినగుడి వున్నదేమో నాకు తెలియదు. నాయెరుక పట్లచేయలేదు. షుమారు 20, 30 యేండ్లక్రింద కంసాలికుటుంబము ఆనేఆయన ప్రాతగుంటూరులో ఒక దేవాలయమును కట్టించి వారిలో ప్రాణప్రతిష్ట చేసేవారున్నను బ్రాహ్మణులచేత ప్రాణప్రతిష్ఠచేయించినాడు. యిప్పుడు బ్రాహ్మణపూజారి అర్చకుడువున్నాడు. Cross. క్షత్రియరుషులు క్షత్రియగోత్రములకును వైశ్యరుషులు

క॥ అన్యాయ్యములగుటయెకా।గనోన్యవిరుద్ధధర్మములవడియుఁ స
న్మాన్యములుకానినుడులీ! ధన్యుం జేమనివచింపఁదలఁచెనొ మదిలోఁ॥

---

వైశ్యులకు మూలపురుషులుగా వున్నారు. బ్రహ్మరుషులు బ్రాహ్మణులకు మూలపురుషులుగావున్నారు. విశ్వామిత్రరుషిగోత్రము క్షత్రియులలోను బ్రాహ్మణులలోను వున్నది. లోకకర్తఅయిన ఆదినారాయణమూర్తికి హిరణ్యగర్భుడైన చతుర్ముఖబ్రహ్మ పుట్టినాడు. ఆయనముఖమునుంచి బ్రాహ్మణులు క్షత్రియులు భుజమునుంచి వైశ్యులు తొడలనుంచి శూద్రులు పాదములనుంచి పుట్టినారు. అప్పుడు ముఖమునుంచి పుట్టినబ్రాహ్మణులందరు రుషులయినారు. యిప్పుడుబ్రాహ్మణులందరు వారిసంతతివారు. బ్రహ్మకు ౫ ముఖములువుంటే ఒకముఖము సాంబమూర్తి తెగగొట్టినాడు. విశ్వకర్మఅని విరాటుకు పేరువున్నది. త్వష్ట నవబ్రహ్మలలో ఒకడైన విశ్వకర్మకుమారుడు. త్వష్టఅనగా చెక్కేవాడని అర్థము. శిల్పాదులచేసేవారందరు విశ్వకర్మసంతతివారు. చతుర్ముఖబ్రహ్మ తాను సృష్టించుట కష్టమని తనకు సహాయముచేయుటకు నవబ్రహ్మలను సృష్టించినాడు. బ్రహ్మక్షత్రియవైశ్యశూద్రులు హిరణ్యగర్భుడైన చతుర్ముఖబ్రహ్మవలన పుట్టినారు. అత్రి మరీచి విశ్వకర్మ అనిమొదలైనవి నవబ్రహ్మలపేర్లు. యీతొమ్మిమ్మిది బ్రహ్మలుకలిసి సృష్టిచేసినారుగాని వారిలో ప్రతివాడు వేరేవేరేజాతివారని సృష్టించలేదు. విశ్వకర్మసంతతివారు చతుర్ముఖబ్రహ్మవలన పుట్టినవారిలో చేరరు. విశ్వకర్మసంతతివారు చతుర్ముఖసంతతివారికంటే యెక్కువవారనిగాని వారికంటే వీరుయెక్కువవారనిగాని యెక్కడ లేదు. సానగ, సనాతన అహాభూన, ప్రత్నస, సుపర్ణ, యీ ౫ గురు వేదములోచెప్పబడినరుషులే. బ్రాహ్మణులకు చెప్పబడిన 8 మంది రుషులలో వారుచేరరు. విశ్వామిత్ర, జమదగ్ని, భారద్వాజ, గౌతమ, అత్రి, వశిష్ట, కశ్యప, అగస్త్య, యీ 8 మంది బ్రాహ్మణరుషులు. వీరు వీరిసంతతివారు మా బ్రాహ్మణప్రవరలోవస్తారు. యీరుషులు యజుర్వేదములోవున్నారు. యీరుషులు కృష్ణయజుర్వేదములోవున్నారు. నాది తైత్తిరీయశాఖ. విశ్వకర్మ రుషియేమో నాకు తెలియదు. ఆయన బ్రాహ్మణరుషులలోలేడు. బ్రాహ్మణులకు 49 గోత్రములు. యీ 49 గోత్రములవారు నేనుపైనచెప్పిన 8 బ్రాహ్మణరుషులసంతతిలోనివారు. క్షత్రియులకు బ్రాహ్మణులగోత్రములుకొన్ని వున్నవి. శ్రీరాములవారిగోత్రము వశిష్టగోత్రము. జనకులవారిది గౌతమసగోత్రం. ధర్మరాజులది ధౌమ్యసగోత్రము. క్షత్రియులు

ఆ॥ *ఆదికృతయుగమున నందఱుపురుషులే
స్త్రీలు లేరటంచుఁ జెప్పెసితఁడు
ఏతదాదికంబు లీశాస్త్రిగారి సా
క్ష్యమునఁగలవు బూటకములు కొన్ని॥ 74

---

వారిపౌరోహితులగోత్రమును కొంతమంది పెట్టుకున్నారు. *ఆదికృతయుగములోఅంతా పురుషులు. స్త్రీలు లేరు. వారంతా శ్వేతవర్ణులు గావుండేది. త్రేతాయుగముదగ్గరనుంచి స్త్రీవర్గము యేర్పరచినారు. ఆత్రేతాయుగమునుంచే పెండ్లిండ్లు కర్మలు ఆరంభమయినవి. ఆత్రేతవరకు వృత్తులులేవు. మొదటికృతయుగములో పనిపాటలవారిఅవసరము లేకపోయినది. వారు విశ్వకర్మసహాయమువలన అన్ని నిర్మించుకొనేదే. నేను పైన చెప్పిన49 గోత్రములలో ఒక గోత్రముకలిగి వారిప్రవరలో నేను చెప్పిన 8 మందిరుషులలో కొందరినిగలవారు యిప్పుడు బ్రాహ్మణులని చెప్పవలెనుగాని వానికర్మలచేతగాని గుణములచేతగాని విడదీయవీలులేదు. ఉపనిషత్తులు 10 ఉన్నవి. అందులో వజ్రసూచికోపనిషత్తు ఒకటికాదు. వజ్రసూచికోపనిషత్తులో ఆత్మనుబట్టిబ్రాహ్మణుడా దేహమునుబట్టిబ్రాహ్మణుడా అని ప్రశ్నవచ్చినది. అప్పుడు అది తత్వసంబంధమైనప్రశ్నకాదని కొట్టివేశినారు. జాతి లోకసంబంధమని చెప్పబడివున్నది. యీభరతఖండమునకుమట్టుకే యీజాతిభేదము. యెందుకు చెప్పినారో చెప్పవీలులేదు. ఆదికృతయుగములో నాలుగు జాతులులేకపోయినా కొద్దిభేదముండేది. అప్పటికి కర్మలులేవు. త్రేతరాగానే కర్మపుట్టినది. కృతయుగములో పూజయే వారివృత్తి. ఆదికృతయుగములో మనుస్మృతి లేదు. త్రేతాయుగములో మనుస్మృతిపుట్టినది. మనుస్మృతిభృగుప్రోక్తము మనువు ధర్మములుచెప్పితే ఆయనశిష్యుడైనభృగువు శ్లోకరూపేణా చెప్పినాడు. పరాశరస్మృతి మొన్నపోయినద్వాపరములోపుట్టినది లేక మొదటిద్వాపరములోపుట్టినది చెప్పుటకు వీలులేదు. దానిని ధారణపర్చుటకు సంస్కృతములో యేమి ఆధారములేదు. భారతము మట్టుకు వ్యాసులుచేసినారు. తక్కినపురాణములు యితరులుచేసి ఆయనకు చదివి వినుపించి ఆయనవల్ల ప్రోక్తములయినట్లు చేసినారు. భారతధర్మములు న్యాయప్రమాణములే అయివున్నవి. భారతము వ్యాసులవారు శ్లోకరూపముగ చెప్పినది యెట్లాచెప్పినది నిర్ధారణచేయుటకువీలులేదు. షట్కర్మలుద్విజేతరులకులేవు. ప్రాణప్రతిష్ఠకర్మ శ్రుతిస్మృతులలోను ఆగమములలోను చెప్పబడివున్నది. ప్రతిష్ఠాకల్పమని ఆగమములలో ఒక

అధ్యాయములోవున్నది. షోడశకర్మవిధానమునూత్రములలోవున్నది. గ్రామదేవతలలో బ్రాహ్మణులుపూజచేసేవికొన్నివున్నవి. కొన్నిపూజచేయనివివున్నవి. బ్రాహ్మణులు గ్రామదేవతలనుపూజించుటను మానుకున్నారు. మాలమాదిగలువచ్చి బలులు యిచ్చుటవలన అక్కడికి పోవీలులేక మానుకున్నారు. బ్రాహ్మణులు బలులుచేయగూడదుగాని తక్కినజాతులవారు చేయవచ్చును. గ్రామదేవతలకు చాకలివాఁడు అన్నమువండుకునివస్తాడు. కుమ్మరి నైవేద్యము పెడుతాడు. గ్రామదేవతల ప్రతిష్ఠకట్టుకు బ్రాహ్మడేచేయవలెను. వుండిసీమలో బ్రాహ్మణులుప్రతిష్ఠచేసిన గ్రామదేవతలువున్నవి. యీ సీమలో వున్నదేమో నాకు తెలియదు. నేను గుంటూరుతప్ప యితరవూళ్ళకు వెళ్ళలేదు. అంటువ్యాద్యములు వచ్చినప్పుడు ఆతూపచికిగాను కొబ్బరికాయ పెట్టిచేసేపూజలను బ్రాహ్మణులే పూజచేస్తారు. మాది రేపల్లె. మావూళ్లో కుమ్మరివాండ్లు చేస్తారు. విశ్వబ్రాహ్మణులలో యెవరు యాజనముచేయించగా చూడలేదు. పులివర్తి వీరయ్య షోడశకర్మలు వారియిండ్లలో చేయించేవాడు. ఆయనచేయించడం 25 యేండ్లనుంచి యెరుగుదును. యింకొక ఆయన పొతకమూరి సుబ్బారాయుడు చేయించేఆయనవున్నాడు. లింగప్రతిష్ఠచేయునపుడు లింగముకు సజ్జరసము వేసి బిగించకపూర్వము కొంతకర్మజరిగినా బిగించినతరువాత శుద్ధిచేసి మళ్లీ ప్రాణప్రతిష్ఠచేస్తారు. స్థలకర్షణముకు బ్రాహ్మణులకు యేమిసంబంధములేదు. స్థలకర్షణము అయినతర్వాత వాస్తుపూజ గణాధిపతిపూజ చేస్తారు. వాస్తుపూజ డబ్బుబియ్యం బ్రాహ్మణుడుపూజచేయించి వడ్లబత్తుడికి యిస్తాడు. గణాధిపతిపూజకువచ్చే డబ్బు బియ్యం బ్రాహ్మణుడు తీసుకుంటాడు. విగ్రహమును మూడు సం॥లు చేయవలెను. ఆగమశాస్త్రములలో 9 నెలలు విగ్రహముచేయవలెనని చెప్పబడివున్నవి. గర్భస్థమయినశిశువుకు 7 మాసములో ప్రాణివస్తుంది. అమరములో రథకారశబ్దము వడ్లవానికివర్తిస్తుంది. యీవిశ్వబ్రాహ్మణులకు రథకారశబ్దము వర్తిస్తుందని చెప్పలేను. లోహములపనిచేసేవారికి వేరువేరుపేట్లు చెప్పబడివున్నవి. త్వష్టఅని బ్రహ్మకుపేరువున్నది- లోహకారుడనగా గనులనుండిత్రవ్వియినుముచేసేవానికి చెప్పబడివున్నది. గ్రామపౌరోహితము చేసేవారు బ్రాహ్మణులలోచివరవారని మనుస్మృతిలో చెప్పబడివున్నది గాని వారుబ్రాహ్మణులే. వాది వైదికబ్రాహ్మణుడు. నేను వైదికబ్రాహ్మణుడనే. నేను వాదిని యెరుగను. అతనివృత్తియేమో నాకు తెలియదు. శిష్టీకరణాలని తూర్పున వున్నారు. అమరములో చెప్పబడిన సంకరజాతులు యిప్పుడు లోకములో యేజాతివారికి

క॥ చండాలి *యరుంధతియని ముండకొడుకు లెవ్వరేని మొఱగుతఁ
దానుద్దండుండని చెప్పందగు పండితుఁడైయిట్లు చెప్పఁబాల్పడెనర రే॥

క॥ ఘనకర్దమప్రజాపతి తనుజ §యరుంధతియనంగ,ధరఁ బ్రఖ్యాతిన్
గనినపతివ్రత,ఆమెనె మనసీతారామశాస్త్రి మాదిగదనియెన్॥

క॥ మాదిగలుం దత్సదృశులుః వాదించుచునుండి రింతవఱ కిద్దానిన్
భూదివిజుఁడయ్యునీతఁడు తాదిగె నివ్వాదమునకు,ధన్యుఁడుగాఁడే॥

---

వర్తించేది నాకు తెలియదు. కరణాలని చెప్పేవారు యితరులువున్నారు. కరణంఅనేమాటకుఅర్థము వ్రాసేవాడని, శిష్టికరణాలుగాక కరణాలనిచెప్పేవారు బ్రాహ్మణులలోలేరు. కరణముఅనేమాట దేశభాషలో గ్రామములోకరిణీకములెక్కలు వ్రాసేవానిని అంటారు. యెవరుకరిణీకపులెక్క-వ్రాస్తే వానిని కరణమంటారు. వశిష్టుని భార్య*అరుంధతి చండాలస్త్రీ.అరుంధతికుమారుడు శక్తి-శక్తికుమారుడు పరాశరుడు.

---

పురాణనామచంద్రిక 16 వ పేజీ

§అరుంధతి:— కర్దమునికూఁతురు. వశిష్ఠునిభార్య. మహాపతివ్రత. కనుక ఇప్పటికి పెండ్లినాటిరాత్రి ఔపాసనానంతరము నక్షత్రరూపమున ఉండునీమెను పాతివ్రత్య నిష్ఠకై పెండ్లికుమార్తెకు చూపుదురు.

41 వ పేజీ

కర్దమప్రజాపతి. బ్రహ్మచ్ఛాయయందు పుట్టినయతఁడు......

భాగవతము. తృతీయస్కంధము.

208 వ పేజీ

వ॥ అంతనా కర్దముండు కమలసంభవచోదితుండగుచు యథోచితంబుగా నాత్మీయ దుహితలవివాహంబు సేయఁదలంచి మరీచికిం గళయనుకన్యకను,నత్రికి ననసూయను, నంగిరసునకు శ్రద్ధను, బులస్త్యునకు హవిర్భువును, బులహునకు గతిని,గ్రతువునకుఁ గ్రియను, భృగునకు ఖ్యాతిని, వసిష్ఠునకు నరుంధతిని,నథర్వునకు శాంతినింగా నిజకులాచార, సరణిం బరిణయంబుగావించిన......

తే॥ *శక్తిభార్య యదృశ్యంతి స్పష్టముగను
తాఁ బ్రమాణంబనిన భారతంబునందె
యుండెనిటుల, శ్వపాకియంచుండదెచట
ఏమనివచించెనోయీతఁ డెఱుఁగ నేను॥ 78

---

*శక్తిభార్యపేరు శ్వపాకి-అనగా కుక్కమాంసముతినేది అని అర్థము-శ్వపాకిజాతి సంకీర్ణజాతులలో అధమాధమము. పరాశరుడికుమారుడు వ్యాసుడు- తపస్సేముఖ్యమని చెప్పుటకుగాను వ్యాసులవారు తన కులసంగతి చెప్పినాడు. వాల్మీకి బ్రాహ్మణుడు- యిప్పటిబ్రాహ్మణులు ఆసంతతివారే. నవబ్రహ్మలలో దక్షుడు బ్రహ్మఅంగుష్టమువల నపుట్టినాడు. జాతులునాలుగుసమానమే. హెచ్చుతగ్గులులేవు. సంకరజాతులుతక్కువవి- భాగవతము ద్వాదశస్కంధములో చెప్పబడివున్నది. వేదములలో వైదికులు నియోగులని వేరువేరుశాఖలు చెప్పబడియుండలేదు. క్షత్రియబ్రాహ్మలులేరు. శాస్త్రములో దశవిధబ్రాహ్మణులులేరు. వృత్తులు జాతులు వకసారేపుట్టినవి. వృత్తులు జాతికంటే ముందుపుట్టినవనియు చెప్పవచ్చును. ఆదిత్రేతాయుగముదగ్గరనుంచి వృత్తులు అమలులోకివచ్చినవి. ఆదికృతాయుగములో జనులకు క్షుత్పిపాసములులేవుగనుక వృత్తులులేవు. నాకు అభిమానశాస్త్రములేదు. నేనుసంస్కృతముచదువుకున్నాను. నేను చదువుకున్నవన్ని అభిమానశాస్త్రములే- నేనుషట్శాస్త్రములు చదువుకున్నాను. నేను ఆరుశాస్త్రములు పూర్తిగా చదివినాను.

రీక్రాను—విశ్వబ్రాహ్మణఅనేపేరు కంసాలీలు కంచర్లు వడ్లబత్తులు వారికివారు పెట్టుకున్నారుగనుక అట్లాపిలుస్తున్నారు. రథకారులలో రెండుజాతులున్నవి. ఒకటి దేవవాహనముచేసేవాడు రెండవది సంకరులలో రథకారులనివున్నారు. వారికి వృత్తి యేమి చెప్పబడివుండలేదు. గ్రామదేవతలప్రతిష్ఠమట్టుకు బ్రాహ్మడిదేగాని బ్రాహ్మణులుపూజవగైరా. మాలమాదిగలువాడడమువల్ల నేనుయెరిగినచోట్లమానుకున్నారు.

---

పురాణనామచంద్రిక 9 వ పేజి.

*అదృశ్యంతి......శక్తిభార్య. పరాశరునితల్లి.

భారతము, ఆదిపర్వము, సప్తమాశ్వాసము, 185 వ పేజీ

క॥ ......వసిష్ఠుండు నిజాశ్రమంబునకు వచ్చువాఁడు దనపిఱుందవచ్చుకోడలి నదృశ్యంతియనుదాని శక్తిభార్య నప్పుడెఱింగి...... 124

ఉ॥ కొందఱు దీనికిం గలదు కొండొక హేతువటంచు నేమియో
యందురు కాని నాదుమది కయ్యది నచ్చదు, స్వర్ణకృత్ప్రజా
బృందము మెచ్చుకోలుకయి పెప్పెపెలోఁబడి బ్రాహ్మణాళిచే
నిందితుఁడయ్యె నీబుధుఁడు నిశ్చయమియ్యది యెంచిచూచినన్॥ 79

సీ॥ చేసినాఁడుపకృతి చేతనైనంతలో
బ్రాహ్మణుల్ గాఁజూచు బత్తులకును
వేసినాఁడొకమాట వెలమాటముస్నిభు
"జాతులునాలుగున్ సమము"లనుచు
కోసినాఁడెన్నియేన్ గొప్పవాస్తారకాయ
"లాఱుశాస్త్రివ్యచ్చు"ననుచుఁదనకు
పోసినాఁడువిషంబు పోయుంగఁదగినంత
ఖలధికృత ద్విజకాండమునకు
సంస్తుతించెను గమసాలజనముతనను
సంతసించెనుమున్నిభు చాలమదిని
విశ్రుతంబయ్యె షట్ఛాస్త్రవిత్త్వమవని
ఏమి బ్రాహ్మణ్యంబుఁ గోఁబని యీయనకింక॥ 80

---

నేను గోదావరిజిల్లా యెరుగుదును. విశ్వబ్రాహ్మణులని యిప్పుడు పిల్వబడే వారిని కరణాలనిపిలవరు- మహానుభావులయిన ఋషులసంయోగముచేత చండాలజాతి వాండ్లయినా అరుంధతిశ్వపాకులదోషము పోయినది. వారితపోబలము అట్టిదిగనుక పోగొట్టినది. వ్యాసులు పుట్టుటలోనే ఋషిగాపుట్టినాడు- 7 గడియలలో పుట్టడం పెరగడం సకలవిద్యలు నేర్చుకోవడము జర్గినది. విశ్వబ్రాహ్మణులకు వైదికబ్రాహ్మలకు పంక్తిభోజనములేదు. వైదికులు నియోగులు పెడితే వారుతినరు. విశ్వబ్రాహ్మణుల అన్నము యేజాతివారు తినరు. వీరు యేజాతివారియన్నము తినరు. విశ్వబ్రాహ్మణుల అన్నము ఋంజలువాయించేవాండ్లు తింటారు. లింగబలిజాలు యితరజాతివారి యిండ్లలో భోజనముచేయరు. సాతానులు వైష్ణవులయిండ్లలో భోజనముచేస్తారు జంగాలు లింగధార్లయిండ్లలో భోజనముచేస్తారు. విశ్వబ్రాహ్మణులని పిలువబడేవారు అనాదినుండి బ్రాహ్మణులయిండ్లలో భోజనము చేయుటలేదు. లింగబలిజెల అన్నము సాతానులఅన్నము వారికంటె తక్కువజాతివారు పనిపాటలవాండ్లు అనగా చాకలి కుమ్మర మంగలివగైరావారు తింటారు- విన్నాను సరిగావున్నది......

క॥ తదనంతరసాక్షి జగ। ద్విదితుండగు†చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రిల్
పదుగురి(ప్రార్థనచేన। య్యదనున నటువచ్చియుండె నవధానముకై॥

*The 30th day of August 1911.*

† చళ్ళపిళ్ళ వెంకటశాస్త్రిగారు ... ... ... బందరు—

బ్రాహ్మణశబ్దము జాతివాచకము- బ్రహ్మజ్ఞానముగలవారిని ఔపచారిక బ్రాహ్మణులంటారు-విశ్వబ్రాహ్మణశబ్దము గ్రంథములలో కనుపడదు-గ్రంథములనగా ప్రామాణికగ్రంథములలోలేదని నాయభిప్రాయము-వ్యాకరణశాస్త్రప్రకారము విశ్వబ్రాహ్మణ అని వుండదు-వైశ్వబ్రాహ్మణ అని వుండవలెను-విశ్వబ్రహ్మ అనే శబ్దము సృష్టికర్త అయిన చతుర్ముఖబ్రహ్మను చెందదు-గోదావరిజిల్లాలో బంగారుపనిచేసే వారిని కంసాలి అని పిలుస్తారు- కొయ్యచెక్కడంపనిచేసేవారిని వడ్రంగులని యినుము పనిచేసేవారిని కమ్మరులని కంచుపనిచేసేవారిని కంచర్లని అంటారు-కంసాలీలను వడ్రంగులను కమ్మరులను కంచర్లను యీపేరులు వృత్తినిబట్టి జాతినిబట్టి వచ్చినవి-వారందరు కలిసి భోజనముచేస్తారు-ఒకరిపిల్లను ఒకరు చేసుకుంటారు-వృత్తిలోమట్టుకే భేదము-హిందూదేవాలయములయొక్క గర్భగుడులలోనికి కంసాలిజాతివారిని రానివ్వరు. గ్రామదేవతలగుడులలో కొన్ని బ్రాహ్మణులపూజచేసేవి వున్నవి-కొన్ని యితర జాతులవారుచేస్తారు-గ్రామదేవతలప్రతిష్ఠ షట్కర్మాధికారముగల బ్రాహ్మణులే చేయించవలెను- ప్రతిష్ఠకర్మ బ్రాహ్మణత్వముసాధించుకున్న ప్రతివాదు చేయవచ్చును బ్రాహ్మణగోత్రములోపుట్టి శాస్త్రప్రకారము బ్రాహ్మణకన్యను పెండ్లిచేసుకోగా పుట్టినవాడు బ్రాహ్మణుడు- బ్రాహ్మణజాతితెగలలో కంసాలీలుచేరరు. బ్రాహ్మణులకు కంసాలీలకు పెండ్లిండ్లుగాని పంక్తిభోజనములుగాని నాఅనుభవజ్ఞానములో యెక్కడ లేదు-కంసాలీలఅన్నము చండాలుడీదగ్గరనుంచి తినరు-మేముతినమని యితరజాతుల వారు అంటారు-మేముపెట్టమని కంసాలీలు అంటారు-నేను శ్రుతులు చదువుకున్నాను-వ్యాకరణశాస్త్రముచదువుకున్నాను-వేదములో 4 అష్టములుచెప్పుకున్నాను. తర్కశాస్త్రము ప్రకరణములుచదువుకున్నాను.

చ॥ గురుతరపాండితీకలిత కోవిదనుత్యకవిత్వలౌచుఁ ద
త్పురిప్రజ‡విల్వ వచ్చి కడుఁబూన్కి- వధానములాచరించు శ్రీ

Cross—సృష్టిఆదియందే జాతులన్నివున్నవని కొన్నిపురాణములలో ఆదియందు అంతా బ్రాహ్మణులుగాపుట్టి కర్మభ్రష్టతచేత వేరువేరుజాతులవారయినారని కొన్నిపుస్తకములలోను మొదట అంతా శూద్రులుగాపుట్టిరనియు క్రమేణ తపస్సంపన్నతచేత బ్రహ్మక్షత్రియవైశ్యశూద్రులుగామారి కొంతకాలమైనతరువాత అదినిలుపుకున్నారని కొన్నిపుస్తకములలోను చెప్పబడివున్నది. యెక్కువజాతులవారు తక్కువజాతులలోకి మారినకాలముగాని తక్కువజాతులవారు యెక్కువజాతులలోకి మారినకాలముగాని నిర్ణయించుటకువీలులేదు. యెక్కువగ్రంథములలో జాతులసృష్టి ఆదియందేవున్నదని చెప్పబడివున్నది. యికముందు తక్కువజాతివారిని యెక్కువజాతిలోనికి రానివ్వకూడదని నిలుపుకున్నదియేకాలమందో నిర్ణయింపవీలులేదు-కలియుగములో యితరయుగములవలె యితరజాతులవారు బ్రాహ్మణులౌటకువీలులేదు.యెక్కువజాతివారు తక్కువజాతివారగుటకు కలియుగములో వీలువున్నది. తక్కువజాతివారు ఎక్కువజాతివారగుటకు వీలులేదు-బ్రహ్మక్షత్రియవైశ్యులకుతప్ప యితరజాతులవారికి వుపనయనాది కర్మాధికారములేదు-బ్రాహ్మణులుసహితము కృషిశిల్పాదులు ఆపద్ధర్మముగా అంగీకరించినా తరువాత ప్రాయశ్చిత్తముచేసుకుంటే మళ్ళీ బ్రాహ్మణత్వము నిలుస్తుంది. అట్లాచేసుకుంటే బ్రాహ్మణత్వమువస్తుందని యాజ్ఞవల్క్యస్మృతి ప్రాయశ్చిత్తకాండ 36 వ శ్లోకములో చెప్పబడివున్నది *Ex V.* ప్రతిష్టకర్మముకు మంత్రములు వేదములలోనుండి తీసుకునవలెను-కర్మవిధానము ఆగమములలోవుంటుంది. షోడశకర్మల

గుంటూరు ది **12—8—11**

‡బ్ర॥...పట్టాభిరామశాస్త్రిలుగారికి......నమస్కారములు......బ్ర॥తిర్పతి వేంకటేశ్వరశాస్త్రిలుంగార్ల యొక్క......శతావధానసభ రేపటి **19, 20,** తేదీలలో జరుగున ట్లిచ్చటిపెద్దలచే నిన్న నే ధృవపఱుపఁబడినది. రేపు బ్ర॥ శతావధానులుగార్లకు నాహ్వానపత్రికపోవును. తప్పకసభజరుగును. సందియములేదు......దయచేయుఁడు...

శిష్ట్లా హనుమచ్ఛాస్త్రి.

తిరుపతి వెంకటేశ్వర సుధీమణులం దొకరైనయట్టి యా
విరచితసత్ప్రబంధు ఘను వెంకటశాస్త్రిని నేను వేడినన్॥ 82

కూడా మంత్రములు వేదములోచేరుతుంది. ప్రతిష్ట యోజనములో చేరుతుంది గనుక ప్రతిష్ట బ్రాహ్మణుడే చేయించవలెనని చెప్పినాను. బ్రాహ్మణులకుమట్టుకే షట్కర్మాధికారమువున్నది. దేవాలయ ప్రతిష్టకు బ్రాహ్మణునికిమాత్రమే అధికారమువున్నది: నేను గ్రామదేవతలప్రతిష్ట యెన్నడు చూడలేదు. నియోగిబ్రాహ్మణులని వైదికబ్రాహ్మణులని మధ్యపుట్టినవిగనుక యివి శాస్త్రములలోలేవు. కొన్నిచోట్ల కరణాలు అని మూఢత్వముచేత బ్రాహ్మణులలో వకశాఖగాచెప్పుతుంటారు-బ్రాహ్మణులుగానికరణాలు శ్రీష్టికరణాలని వున్నారు-కరణమునగా చేయువాడనిఅర్థము-వృత్తినిబట్టి జాతి పుట్టలేదు-ఆదిపురుషునికి బ్రాహ్మణుడు ముఖమున్ను క్షత్రియులు బాహువులు వైశ్యులు తొడలు శూద్రులు పాదములై వున్నారని కొందరి అభిప్రాయము-బ్రాహ్మణులకు గోత్రములు వారి పూర్వరుషులను బట్టి వచ్చినది-వైశ్యులుకూడా వైశ్యరుషులసంతతివారే- వేదములోచెప్పబడిన రుషులంతా బ్రహ్మరుషులుకారు-వేదములో బ్రహ్మరుషులనిచెప్పబడినవారే బ్రహ్మరుషులు-నాలుగువేదములుచదువనినేను వేదములలో యేమిచెప్పివున్నది చెప్పజాలను. శాస్త్రములలో యెక్కడ కంసాలియిండ్లలో భోజనముచేయగూడదని చెప్పబడివుండలేదు. నేను ఆగమము చదువుకోలేదు- శిల్పశాస్త్రములు చదువుకోలేదు- పురాణములన్ని సూత్రప్రాయముగా వేదములలో యిమిడివున్నవి- భాగవతము కలియుగములో పుట్టినది. విష్ణుపురాణములో కురుపాండవులను మౌర్యవంశరాజులను యెత్తినారుగాని అది భారతయుద్ధమునకు పూర్వమే పుట్టినది. 18 పురాణాలు భారతమునకుపూర్వమే పుట్టినవి. వేదములునాలుగు-అవి అనాదిఅయివున్నవి-నేను కంసలివారియిండ్లలో పెండ్లిండ్లకు యెన్నడువెళ్ళలేదు- ఉపనయనముచేసుకుంటే వేగాని బ్రహ్మత్వమురాదు- ఉపనయనము బ్రాహ్మణుడయినవాడేచేయవలెను- స్త్రీకూడా బ్రాహ్మణునిభార్య అవుటవల్ల బ్రాహ్మణిఅని చెప్పబడుతున్నది-మనువువల్ల మానవులు కద్రువవల్ల నాగులు వినతవల్ల

ఉ॥ సాక్షిగవచ్చితానుడివె శాస్త్రపథంబునుదొల్గకుండ మ
త్పక్షమునందు, దానిని నపహ్నుతిసేసి యథేచ్ఛఁ గొప్రపుం
బక్షపువారు వ్రాసిరిక్రియవాచ్యపువ్రాఁతలు కొంతమంది రూ

అనూరుడు గరుత్మంతుడు పుట్టినారుఅని చెప్పబడివున్నది. ఉపనిషత్తులు 10 ప్రమాణములు- శంకరాచార్యులవారు 10 వుపనిషత్తులమట్టుకే భాష్యములుచేసి తక్కినవి వదలినారుగనుక వాటిని గణనలోకితీసుకోరు. అష్టోత్తరశతోపనిషత్తులో 748, 749 పేజీలలో చెప్పబడిన 5 పేర్లు శివపరముగా చెప్పబడినవని నాఅభిప్రాయము. యీ 5పేర్లు శివునిముఖములపేర్లకు వర్తింపవు-పంచబ్రహ్మఅనగా 5గురు బ్రహ్మలని చెప్పవచ్చును. విస్తరించినబ్రహ్మలని చెప్పవచ్చును. వానిలో విషయమునుబట్టి అర్ధనిర్ణయముచేసుకోవలసివుంటుంది. నేను వేదములోవుండే అర్ధముమరిచిపోలేదుగాని కంఠోపాఠము మరిచిపోయినాను. శరీరమును దహనముచేస్తేనేగాని కర్మపుట్టదు. శవమునుపాతిపెట్టేవారిని కర్మభ్రష్టులని ఆక్షేపించుతాము- లింగధారులు మహమ్మదీయులు క్రయిస్తవులు ఖననముచేస్తారు. కంసాలీలు ఖననముచేస్తారు. కరణశబ్దము యోగరూఢము-నియోగులలో కరణశబ్దమునకు వేరేవుత్పత్తిచెప్పవలెను- బ్రాహ్మణులకు నియమింపబడిన షట్కర్మలు చేయకపోయినంతమాత్రముచేత బ్రాహ్మణుడుకాకపోడుగాని నామమాత్రబ్రాహ్మణుడవుతాడు- షట్కర్మలుచేసేవాడయితే ఆధిక్యతవస్తుంది- నామమాత్రబ్రాహ్మణునికి మంత్రములురావుగనుక చేయించవీలులేదు- వస్తేచేయించవచ్చును- గ్రామపౌరోహితం చేయించేవారు ప్రాయశ్చిత్తములేకుండా ప్రాణప్రతిష్టచేయించవచ్చును- వ్యవసాయమేవృత్తిగావున్నా చేయించగలశక్తివుంటే బ్రాహ్మణుడు ప్రతిష్టాదియాజనకర్మలు చేయించవచ్చును-కంసాలీలుఅనేశబ్దము వేదములలో తెనుగవుట లేదు.

చెళ్లపిళ్ల వెంకటశాస్త్రి, శతావధాని...

§ నవంబరు 16 వ తేది 1912 సం॥ (దర్బారు)

సీ॥ ...... నెలకొని మీవిరోధులమీది వ్యాజ్యెమ్మనను సాక్ష్యమునొసంగినారటంచు
తే॥గీ॥ తారుమారైన వారి గుంటూరుశిలవ, ధానమును మీరు పక్షపాతమ్ముచేత

క్షేత్రజులౌచు వారిపయి నిందున నాకభిమానమం చరో॥ 83

క॥ భువనశ్లాఘ్యంబగు స
త్కవితాప్రాశస్త్యమునను గాలేడి యేత
త్కవివరుల పేరులెప్పుడు
చెవిఁబడె నభిమానమపుడె చిత్తమునఁబడెన్॥ 84

ఉ॥ పదమూడేడుల క్రిందట। నెదియో సందర్భమందు నేనుడివినయ
ట్టిది గలవొక్కటి*పద్యం। బది చెప్పెడి వారిమీఁది యభిమానంబున్

తే॥ ప్రీతిఁ బత్రిక మొదలిడి రెండు నెలలు
చనిన శోడనె వ్రాసిన ఘనతరంపు
†వ్యాసమే చెప్పఁజాలెడి వారిపైని
నాకుఁగల యభిమానంబు ప్రాకటముగ॥ 86

---

నెంతనుతియించినను నుతియింపవచ్చు, గాని నమ్మెడువారు లోకమునలేరు॥ 15
....................పోచిరాజు సీతారామయ్య, మన్నవ నరసింహము.

(హితకారిణి) 1913 సం॥ డిశంబరునెల 14 తేది,

...... కే, గంగరాజు గారికిఁ బ్రత్యుత్తరము...... యభినవసరస్వతిని ...... జాన పాటి పట్టాభిరామశాస్త్రి యొక్క యనవసరపుఁగేసులోఁ దనపక్షమునఁ గోర్టునందు సాక్ష్యము చెప్పినది మొదలు చెల్లపిళ్ల వెంకటశాస్త్రిగారిపక్షమై తద్విరోధులైన సోదర కవులను దిట్టుటకే యుపయోగించుచుండెను ......

పోతరాజు లక్ష్మీనరసింహము.

*శుభకృత్సంవత్సరమున, ఏకాగోపయ్యగారు నాచేఁ జేయించిన ప్రబంధము
క॥ తిరుపతి వెంకటకవికృత, వరశ్రవణానందపాకవైఖరి నాకే
ధర దుర్లభమనితలఁపను, మరయఁగ నెవ్వారికేని యది దుర్లభమా॥
†(అభినవసరస్వతి) 1908 సం॥ సెప్టెంబరుసంచిక, స్వవిషయము

.......తమరొనరించు గ్రంథములఁ దత్క్షణము ప్రచురించుటకు సరస్వతీ ద్యుత్తమ పత్రికలె యుండినను శతావధానులగు తిరుపతి వెంకటకవులు తమకృపమఁబాత్రుఁడఁగా నుపాయనపూర్వకంబుగఁ దమసమ్ముఖమునకుఁబంపుకొను నీసంచికల ననుగ్రహ దృష్టిచేఁగైకొనుచు ననన్యకవిసామాన్యమై మృదుమధురశైలిలోఁగనుపట్టు స్వకృతప్రబంధ మేదయిన దయచేసి యభినవసరస్వతికి వన్నెఁదే సంప్రార్థితులగుచున్నవారు.

క॥ భారతనాటకములనుఁ, వారక నాకనుపుమనుచు వ్రాసిన ¶ జాబే
యారూఢిఁజెప్పఁగల ద। వ్వారలపై నెంతగౌరవం బున్నదియుఁ॥

చక్కని శైలిఁగల పెక్కుప్రబంధములుప్రచురింపించి సరస్వతిని గర మలంకరింపఁజేసిన మహాకవులు తత్కనిష్ఠయగు నభినవసరస్వతియెడలమాత్రముదయాళువులేలకాకుందురు?

---

జానపాడు. 29—7—10

¶ శ్లో॥ నమశ్శ్రీవెంకటాఖ్యాక విద్వదంఘ్ర్యంబుజన్మనే
వ్యాప్తరాజోత్తమాంగస్థ కిరీటమణిరోచిషే॥ 1

శ్లో॥ ఆరూఢః కవితారథం ఝడితి సర్వాశాసు సంచార్యచ
విద్వద్రాజసభాః ప్రవిశ్య నిజసద్విద్యాః ప్రదర్శ్యాధికం
హేలానిర్జితమర్త్యపశ్చ దనఘో యః ప్రాప కీర్తింస్థిరాం
తం శ్రీవెంకటశాస్త్రిణం ప్రతి నమస్సాన్య చెళ్లపిళ్లాన్వయం॥ 2

శ్లో॥ వక్త్రాన్నిర్గదశేషవాక్యనిచయే పద్యాత్మనావర్తతి
హ్యగ్రింథేషు భృశం లసత్సు బహుశో యుష్మత్ప్రణీతేషువై
లేఖాః ప్రాహిణు మోస్మదాదయ ఇమే పద్యాత్మకా వః ప్రతి
నిర్లజ్జాయ మశేషలోక ఉతభో నీకాశరాహిత్యవాన్!॥ 8

శ్లో॥ విముఖాభవంతు భూమౌ విద్యావంతో భవంతు దాతారః
ఆగత్యభిక్షుకజనో పభ్రంశానేవ సర్వదాపతతి॥ 4

శ్లో॥ తిరుపతి వెంకటకవ్యో ర్వాణ్యాః పురుషావతారయో ర్భవతోః
ఖ్యాతిర్బహుకాలాదపి కర్ణపథం ప్రాప్య వర్తతేస్మాకం॥ 5

శ్లో॥ పఠితశ్శ్రీవణానందో పశ్చా చ్ఛ్రీబుద్ధచరితమపి దృష్టం
పాండవవిజయప్రముఖా బహుసద్గ్రంథాశ్చ బాఢముద్గీతాః॥ 6

శ్లో॥ కాంశ్చిదదృష్ట్వా గ్రంథాన్ గతసామ్యాద్దేతు శ్రీనుదభ్యాశం
పత్రే లిఖితేస్మాభిః పాణిగృహీతాది ప్రేషితం ఖలు భో॥ 7

శ్లో॥ క్వాయం భారతీరూపాః క్వాహ మల్పకలాయుతః
తథాపి వీక్ష్యమల్లేఖాం ప్రేషితం పుస్తకత్రయం॥ 8

శ్లో॥ లేఖాంవిలిఖ్యసుచిరాదపి నేతుమిచ్ఛన్ త్వన్నిధిం త్వదుపరిస్థితగౌరవేణ
ఈదృఙ్మహాత్త్వకలితో బతమాదృశాంచ ప్రత్యుత్తరం నలిఖతీతి విశంకితోస్మి॥ 9

ఆ॥ రామకృష్ణకవుల రవ్వ రూరంభమౌ
సమయమందు వారిసమ్ముఖమున
కనివినట్టిశ్రీలేఖయును వచియుంచెడి
వారిమీఁదనాకు వరలుభక్తి॥ 33

శ్లో॥ అభినవసరస్వతీమహా మారభ్య ప్రేషయన్ త్వదభ్యాశం
యంకంవాత్వద్గ్రంథం ప్రకటీకర్తుంహి కాంక్షమాణోస్మి॥ 10

శ్లో॥ అముద్రితగ్రంథవిహాపితాయ శ్రీమానసుత్పన్నఘృణోపి బాఢం
సుముద్రితాన్ప్రేష్య సదాత్రదేశే సమస్తలోకైః పరిగీయసేభోః॥ 11

శ్లో॥ అపభ్రంశపద్యాన్ లిఖిత్వాస్మదాద్యైర్జనైఃప్రేష్యమాణే ఘనగ్రంథదాతా
భవంతంవినాకః ప్రకాశేతభూమ్యాం నిగర్వో దయావాన్ భవాన్ సత్పుమాంశ్చ॥

శ్లో॥ ప్రకృతంకవివర! దయయా పాండవజననాది చాశ్వమేధాంతం
శ్రీమత్కృతయోఽనేయా భో మత్సామీప్య మస్మదీయఇతి॥ 13

శ్లో॥ మత్ప్రీచుర్క్రియమాణే మతవిషయే వ్యాసరూపవాచోవా
నహిదేయాఃకింశ్రీమన్! నానారసగుంభితాస్త్వదీయాభోః॥ 14

శ్లో॥ భవతిస్థితయాభక్త్యా పద్యానలిఖం కవీశ్వరత్వాన్న
తత్క్షంతవ్యాదోషాస్త్వత్పదపద్మం నమస్కరోమ్యార్య!॥ 15

---

జానపాడు 6—10—10

క॥ నిండుకృపన్ మీరనిచిన, పాండవవిజయాదికముల బహుభక్తిని నిం
దుండి పఠింపుచునుంటిమి, పండితజనవినతపాదపంకజయుగళా!॥ 1

తే॥ గ్రంథములఁబంపుటయెకాక కరుణతోడ, "వ్యాసము విమర్శమో వ్రాసిపంపుఁడ"నని
వ్రాసినటువంటి యాయక్షరములపంక్తిఁ, జదివిపలుమారు సంతోషజలధిఁబడితి॥ 2

ఉ॥ నమ్ముఁడు నమ్మకుండుఁ డధునాతనసత్కవులందె గాక పూ
ర్వమ్మున మేటిగ్రంథములవ్రాసినవారలలోనఁగూడ ని
క్కమ్ముగఁ ద్వత్సమానులిలఁ గానఁగరారని నాదునిశ్చయం
బమ్మకచెల్ల యిట్లనియనంచువచించినఁగాని కాకవుల్॥ 3

తే॥ భారతాదుల సరసపుంబద్యరచన యసలెతేదనికాదచ్చటచటఁ గొన్ని
పద్యములుకానఁబడుచుండ, త్వత్ప్రబంధములను సన్నియు రసవంతములెపఠింప॥ 4

చ॥ విడఁబడియేవొపద్యముల వేవచియించుచ పాండితీప్రభన్
గడబిడపెట్టు సత్యవిముఖప్రజపొంతకు నేగఁగాని వే
ర్వడసి సుపర్వభాష ఋతవర్తనగల్గినవిజ్ఞకోటి కే
నడుగులనొత్తుచుంట జననాదిగనున్నదె, యేలవిస్తృతిన్॥

ఉ॥ ఎన్నొదినాలనుండియును నేనిటు తిర్పతివెంకటేశులన్
సన్నుతిచేయుచుండఁగను శాఖకు గౌరవమున్ గడించుకో
నున్నయశస్వులెల్లరును యోజనచేసి చుదుత్తమాంగమం
దున్నెలకొల్ప రొక్కమొగిఁ దోఁచినలాగపవాద లెన్నియేన్॥

---

ఉత్సాహము॥ తేనెఁబో సికలిపినట్టి తెల్లబియ్యపన్నమున్
మానకారగించినట్లు మంచిమీప్రబంధముల్
పూనిచదువునప్పుడుండుఁబో కవీంద్ర! యేరికిన్
నే నిఁకేమినుతియొనర్ప నేర్తు మీదుకైతమున్॥ 5

కం॥ అవతారపురుషులీరని। కవివర! నాకాశయంబుగల, ందున నే
భవదీయ నామమెపుడున్। శివనామమువలె బ్రసంశచేయుచునుండున్। 6

ఆ॥ ఇంచుకైన మీరలిడినజవాబు నా। తోడ శౌరి మాటలాడు టరయ
భాగ్యమునలభించు భగవత్ప్రసాదంబు। కరుణమీరలను ప్రగ్రంధసమితి॥ 7

తే॥ భగవదవతారములఁడేనఁ బ్రజ లనూయ। పడకయున్నాగ లన్నైౖ మీపయిననూయ
పడుచునుందురు మూర్ఖులిప్పట్లు। దాన నేమికాఁబోవుచున్నది యీరలకును॥ 8

కం॥ తిరుపతిశాస్త్రిలవారికి। మతివెంకటరామకవికి మరలనిపుడు వా 9
గ్వైరసత యేర్పడుటం జే।పరులం పఠియించుచుంటి బహుళంబుగ నే॥

ఉ॥ కావున వీరికిర్వురకుఁ గల్గినయట్టి వచోవివాదము
న్మీవలనన్ సకృత్స్నముగ నేవిని పేపరునన్ లిఖింపఁగన్
భావముగల్గియున్నయది, పంపుఁడనుగ్రహముంచియాక్రమం
బో విబుధాగ్రగణ్య! యదెయొక్క ప్రబంధముగా గ్రహించెదన్॥ 10

కం॥ సిగ్గిలక సుకవిరాజుల। దగ్గరకైనంగరంబు తార్మ్యముగ నా
పగ్గెబయల్పడవ్రాసితి। నెగ్గుగమదినెంచువార లీరలుగామిన్॥ 11

బ్ర॥ పట్టాభిరామశాస్త్రి.

ఉ॥ నైల్యముమోపియీవిధిని నన్ జెడఁదిట్టెడివారిబోధలన్
బాల్యమునుండిమిత్రులయి భాసిలుచుండినవారు సైతము
న్నైల్యముఁబూని నేఁ బ్రమరణంబొనరించెడి పేప"రొల్ల"మన్
కల్యనుకూలలేఖల నెకాయెకిఁబంపి రిఁకేమిచెప్పుదున్॥

క॥ పులిపాకపూర్ణయాఖ్యుఁడు
తొలుతం బత్రికకుఁ జాలఁదోడ్పడి పదిము
ద్రదలనొసఁగుచుండియుం దుద
"నిలుపుఁడు పంపక" యటంచు నేర్పునవ్రాసెన్॥

---

Narasaraopeta
**2-10-11**

అయ్యా!

ఇప్పటినుంచి తమఅభినవసరస్వతికి చందాదారుగా వుండుటకు కొన్నియిబ్బందులవలన వీలుకలుగలేదు-కనుక పేరుతీసి వేయవలెను.

చిత్తగించవలెను.
రూ॥ హనుమంతరావు.

Narasaraopeta
**2-10-11**

అయ్యా!

ఇప్పటినుంచి తమయభినవసరస్వతికి చందాదారుగానుండుటకు కొన్నియిబ్బందులవలన వీలుకలుగలేదుగాన పేరుతీసివేయించవలెను.

చిత్తగించవలెను.
బెల్లంకొండ రామచంద్రరావువ్రాలు.

Dear friend,

Narasaraopeta.
**2-10-11**

ఇప్పటిసందర్భములనుబట్టి నేను మీయభినవసరస్వతికి పోషకుడుగానుండుటకు వీలుపడదు కాబట్టి దయచేసి నా పేరును తీసివేయించకోరినాను-నేను చందాదారుగానైననుండుట కిష్టపడను-కావుననీసంగతి తెలియపరుచుచున్నాను-ఇంతేనమస్కారములు.

చిత్తగించవలెను,
వి॥ పులిపాక పూర్ణయ్యవ్రాలు.

షరా:—ఇత్యాదులనేకములు.

క॥ పూర్ణయ్యగారిచరిత ము। దీర్ణప్రాభవముగలిగి దిగ్గజయానా
కర్ణావతంసమైనది। వర్ణింపఁగఁదగిన దతనివర్తన యరయన్॥
సీ॥ భూసురుఁబొడఁగన్నఁ బుచ్చునే యతఁడొక్క
యహమేని తనపంక్తి నన్నమిడక
విద్వాంసుఁబొడఁగన్న విడుచునే యతఁడొక్క
నెలయేని తనయింట నిలుపుకొనక
యాచకుఁబొడఁగన్న ననుపునే యతఁడొక్క
మాసంపుబత్తెమేఁ జేసియీక
ఆర్తునిఁబొడఁగన్న నరుగునే యతఁడొక్క
యడుగేని యాతని నరసికొనక
అన్నదాత విద్వదాదృతిశీలుండు
అర్థికల్పశాఖి యార్తిహరుఁడు
పూర్ణయాభిధానుఁ బుడమి నేతన్మాత్రుఁ
డనుచుఁజెప్ప నెవరికాడు నోరు॥

---

31st Day of August 1911 ...జానపాటి పట్టాభిరామశాస్త్రి-వాది.

ఈదావాలో నేను వాదిని. మాగ్రామములో పోలేరమ్మ పాతపాటమ్మ గుడులువున్నవి. యీగుడులు యిదివరకు బ్రాహ్మణప్రతిష్టఅయివుంటే గ్రామంలో పెద్దకాపు మునసభు బ్రాహ్మణులకుసరిపడక వారికి అవమానముకలుగచేయవలెనని ప్రతివాదులచే ప్రతిష్టచేయించినారు. కంసాలులుప్రతిష్టచేసినగుడులలోకి బ్రాహ్మణులు పూజచేయుటకు వెళ్లరు. నిర్ణయసింధులో*బ్రాహ్మణేతరులుప్రతిష్టచేసినగుడులలో బ్రాహ్మణులు పూజచేయగూడదని చెప్పబడివున్నది. కంసాలీలయిండ్లలో తక్కినజాతులవారు భోజనము చేయరు. యీప్రోలేలమ్మ పాతపాటమ్మదేవాలయములలోకి కంసాలీలు ఎప్పుడు పూజకురాలేదు. ప్రతివాదులుప్రతిష్టచేయుటకుముందు 2,3 యేండ్లక్రింద బ్రాహ్మణులు దావాగుళ్లలో ప్రతిష్టచేసినారు. బంగారపుపనిచేసేవారిని వడ్రంగంపనిచేసేవారినికమ్మ

---

* నిర్ణయసింధువు 192 వ పేజీ.

శ్లో॥ యశ్శూద్రసంస్కృతంలింగంవిష్ణుంవాపినమేన్నరః
ఇహైవాత్యంతదుఃఖానిపశ్యత్యాముష్మికేకిము॥

సీ॥ బాల్యమిత్రుఁడటంచుఁ బ్రతివానికిం జెప్ప
నాఁటి యాస్నేహ మెచ్చోటఁజనెనో
వేడ్క మదుద్వాహవిధికివచ్చి సుభాష
లిడునాఁటియాదార్య మేడఁజనెను
మేనల్లునింటికేఁ బోనీక బలవంత
పెట్టునాఁటియపేక్ష యెట్టుచనెను
పత్రికవిషయమై పట్టినభారంబు
గొనునాఁటిగురుత యేపనికిఁజనెను
కాని శాఖాభిమానులగణముఁ జేరి
నేఁటికిట్లు వ్రాఁతవ్రాసె నన్ను తివిదుఁడు
ఇన్నిటికిమూలభూతమై యొసఁగిన దెది
యనినఁ గొప్రంపువారి యానవపుఁ జర్చ॥

---

రంపనిచేసేవారిని కంసాలీలుఅని అంటారు. ప్రతివాదులుముగ్గురు నేను పైన చెప్పినవృత్తులలో తలావకవృత్తి చేసేవారు వున్నారు. దావా దేవాలయములలోతిరిగి ప్రతిష్టచేయవలెనంటేహీనపక్షము రు200-0-0లు కావలెను. స్మృతిముక్తాఫలములో రథకారశబ్దమునకు తక్షు, శిల్పి, వర్ధకి, లోహకార, కర్మకార, అని పర్యాయపదములువున్నవి. ప్రతివాదుల కులమునకు కమ్మరవారుఅనికూడా పేరువున్నది. బ్రౌన్ Dictionary లో విశ్వబ్రాహ్మణశబ్దములేదు. నూతసంహితలో* శివమహాత్మ్యఖండములో 44 పేజీలో సృష్టిచేయుటలో తనకుసహాయముచేయుటకు 9 మంది ఋషులను సృజించినట్టు చెప్పబడివున్నది.

---

* నూతసంహిత 10వ అధ్యాయము-44 వ పేజీ.

శ్లో॥ సృష్ట్వా వేదవిదాంముఖ్యాన్ సాధకానసృజత్పునః
మరీచినంస్య నేత్రాభ్యాం హృదయాద్భృగు మేవచ
శిరస్యాంగీరసం చైవ తథోదానాద్ద్విజోత్తమాః!
పులస్త్యంపులహం వ్యానాద పానాత్క్రతుమీశ్వరః
దక్షంప్రాణాత్తథైవాత్రిం శ్రోత్రాభ్యాంమునిపుంగవాః
సమానాచ్చవసిష్ఠాఖ్యం సంకల్పాద్ధర్మసంజ్ఞితం
ఏవమేవాసృజచ్ఛ్రీమాన సృజత్సాధకోత్తమాః

క॥ వీరందఱు వలదన్నను। నేరో మత్ప్రతికం గ్రహించుచునున్నా
రీరోజుదాఁక నేలో। టారయఁగానంగరాదు హరికృపకలిమిన్॥
క॥ ప్రస్తావమువచ్చుటచే। వాస్తవముందెలుపఁదలచి వ్రాక్రుచ్చితినే
ప్రస్తుతవిషయముగామిని। విస్తారంబేల యవల వెళ్లుదునింకన్॥

విశ్వకర్మ అష్టవసువులలో వకడయిన విభావసునికుమారుడని భారతము * ఆదిపర్వము 60 పేజీలో చెప్పబడివున్నది.

Cross. యీకేసుఆరంభించినది మొదలు నాసాక్షులనువిచారించేటప్పుడు నేను కోర్టులోవున్నాను. అభినవసరస్వతిపత్రికాధిపతిని నేను. ఆపత్రికస్థాపించి 8 యేండ్లుఅయినది. నా ప్రతిపత్రికలో ప్రతివాదులకులమువారినిగురించి వ్రాసినాను-నేను దావా దాఖలుచేసినతరువాత ప్రతివాదులకులమువారు ప్రభోధినిఅని ఒకపత్రికప్రచురించి దానిలో యీవ్యాజ్యమునుగురించివ్రాస్తే నేనుదానికి ఖండనగా అభినవసరస్వతిలో వ్రాశినాను-ప్రభోధినిని ప్రతివాదులు ప్రచురించలేదు. నేనుపెట్టినక్రిమినలుకేసులో ప్రతివాదులను మావూరిపెద్దకాపును మునసభును ముద్దాయిలనుగా చేర్చినాను-దావాదేవాలయములకు యీనాములుగాని ధర్మకర్తలుగాని లేరు-గ్రామమునసభు పెద్దకాపుప్రతివాదులు ప్రతిష్టచేయుటకు కుమ్మక్కుచేసినారుకనుక వారిని ముద్దాయిలుగాచేర్చినాను-22-7-1906 సంవత్సరము నేనుమావూరయినజానపాడులో వున్నాను- ప్రతివాదులలో 1 ప్రతివాది ప్రతిష్టకర్మజరిపినాడు. ప్రతిష్టకర్మచేయిస్తుండగా నేనుచూడలేదు-వూరిలో వూరేగిస్తుండగా చూచినాను- 1 ప్రతివాది నందిగామతాలూకావాడు- 1 ప్రతివాది చనిపోయినాడు-కాటూరి నారాయుడు జుజ్జూరు మల్లయ్య 1 ప్రతివాదినిపిలిపించినారు. కంసాలిఅనేపదముకు వుత్పత్త్యర్థము చెప్పజాలను- బ్రాహ్మణుడుఅనగా బ్రహ్మయొక్కసంతానమని ఒకఅర్థము-బ్రాహ్మ అనే పదములో సంతానముఅని అర్థములేదు-నేనువేదము చదువలేదు-కంసాలులు యితరులయిండ్లలోభోజనముచేయడము నేనుచూడలేదు-కంసాలులు బ్రాహ్మణులయిండ్లలో నీళ్లుత్రాగరు-మాయింటికి దావాదేవాలయములకు ఫర్లాంగుదూరమువున్నది. దావాదేవాలయము పట్టాభూమో పోరం

* భారతము, ఆదిపర్వము 60 వ పేజీ.

వ॥ ప్రభాసుండను వసువునకు బృహస్పతి చెలియ్యైన యోగసక్తకు విశ్వకర్మపుట్టె

కం॥ ఆవిశ్వకర్మనిర్మిత। దేవవిమానుండు నిఖిలదివ్యాభరణ
శ్రీవిరచనపరితోషిత। దేవుఁడుశిల్పప్రజాపతియునైనెగడెన్॥

క॥ తదనంతరసాక్షిగనై। యెదిరోవచియించినాఁడ నేఁగూడనటఁ
ఒదవెడిసీతారామా। భిథబుధునుడిఖండనంబు పెల్లుగ దానఁ॥

---

బోళ్లో నాకు తెలియదు-నేను సంప్రోక్షణసంగతి ఏగ్రంధములోవున్నది చెప్పలేను-లీలావతిగ్రంధములో వున్నది. లీలావతి ఆగమశాస్త్రము. స్మృతిముక్తాఫలము 1882 సంవత్సరములో అచ్చుపడినది- అంతకుముందు యిట్టిది అచ్చుపుస్తకము వున్నదేమో చెప్పజాలను-విశ్వకర్మశబ్దము పరాత్పరునకువర్తిస్తుంది-వేదములలో విశ్వకర్మశబ్దముపరాత్పరునికి చెప్పబడినది-దేవతలశిల్పి విశ్వకర్మ. ఒకటికాదు-నాది కృష్ణయజుర్వేదము-నాది హారితసగోత్రము-మాకు ఆంగీరస, అంబరీష,యౌవనాశ్వ అని ముగ్గురుఋషులు-నవబ్రహ్మలుఅనేది 9 మందిఋషులు-మాప్రవరలోనిఋషులు బ్రాహ్మణులే-ఋషులంతా బ్రాహ్మణులే-దావాప్రోలేలమ్మదేవాలయము నేనుఎరిగినప్పటినుండి వున్నది-పాతపాటమ్మగుడి నేనుఎరుగకమునుపునుంచి వున్నదిగాని 7,8 యేండ్లక్రింద ఆదివరకువాగుఅవతలవుంటే వూళ్లోగుడికట్టి అక్కడ సంప్రోక్షణచేసినారు-వూళ్లోవాగరితా చందాలువేసుకొనిప్రతిష్టచేసినారు-నేనుఎరుగకమునుపు ఆగుళ్లు ఎవరుకట్టినది నాకు తెలియదు. 5,6 ఏండ్లక్రింద । బ్రాహ్మణులుప్రతిష్టచేసినప్పుడు ముదిగొండవీరభద్రయ్య చేయించినాడు-ఆవీరభద్రయ్య ఆరాధ్యుడు-నాతరఫుసాక్షులలో ఆరాధ్యులు వైఖానసులు లేరు-దావాకుపూర్వము యీగుంటూరుజిల్లాలో వైదికులుప్రతిష్టచేయించగా చూడలేదు-నైజాముయిలాకాలో చూచినాను-నేను అనేకపర్యాయములు యీదేవతలకు బోనము చెల్లించినాను-ఎప్పుడెప్పుడు చెల్లించినది చెప్పలేను-కూరపాటి వెంకన్న గొబ్బినాగన్న వగైరా చూచినారు-గుడికట్టినప్పుడుబ్రాహ్మణులుచందాయిచ్చే ఆచారములేదుగనుక నేను చందాలుయివ్వలేదు-కొల్పులరోజులలో దేవతకుతీసుకొనిపోయినబోనము నైవేద్యముపెట్టికుమ్మరవాడికియిస్తారు-నిరుడుదావాదేవాలయములోకొల్పులుజరిగినవి-అప్పుడు బ్రాహ్మణులుయెవరు పోలేదు-గ్రామకరణము పోలేదు-దావాదేవాలయములు గ్రామకంఠములోనేవున్నవి-దానిప్రక్కన వున్నంరామయ్యయిల్లువున్నది- గుడిపట్టుస్థలము వున్నమురామయ్య పట్టాభూమో కాదో నాకు తెలియదు- పాతపాటమ్మ యిప్పటిశిలకొత్తది తెచ్చినారు.దానిని దుర్గిలో కొనితెచ్చినారు-ఎంతకుతెచ్చినది నాకుజ్ఞప్తిలేదు. పాతపాటమ్మఅనేపేరు గ్రంధములలోలేదు-ప్రోలేలమ్మఅనేపదము లేదు-5 సంవత్సరములక్రింద ప్రాణప్రతిష్టచేసిన బ్రాహ్మణులమీద విరోధముచేత ప్రతిష్టచేయించినారుగాని బంగారురేకుపోయి సరిగానిలవకపోతే కాదు-ప్రతివాదులకు నాకు స్వయముగా ప

క॥ సామాన్యులుకొందఱు మ
ద్గ్రామనివాసులునుగూడఁ దత్తద్విషయా

---

రోధములేదు-నాకు యవరితోటి విరోధములేదు. ప్రోలేలమ్మ అనే పేరునే సామాన్య జనులు పోలేరమ్మఅని వాడుకుంటారు-స్మృతులు నేను ప్రత్యేకముగా కంఠోపాఠముగా చదువలేదు-నేను పురాణములైనా స్మృతులయినా అవసరముబడ్డప్పుడుచూచుకోవలసినదే-మనుస్మృతిలో ప్రజాసృష్టికిసహాయకారులు 10 మందిగాచెప్పబడివున్నది-మాతండ్రి పౌరోహితముచేసేది. మేము అన్నదమ్ములము చేయడములేదు-నాకు పొలమువున్నది-అది పాలికియిచ్చి నేను అష్టావధానముచేస్తానుగనుక సభలుచేసి జీవిస్తాను...జానపాటి పట్టాభిరామశాస్త్రీ(వ్రాలు...

The 31 st day of August 1911...జానపాటి చినఅప్పయ్య...
జానపాడు...

మావూరిలో ప్రోలేలమ్మ పాతపాటమ్మ దేవాలయములువున్నవి. ఆగుళ్లలోను మారు 3,4 సంవత్సరములక్రింద కంసలబత్తులు ప్రతిష్టచేసినారు-అదివరకు యీదేవాలయములలో బ్రాహ్మణులుప్రతిష్టచేసినారు-కంసాలీలుప్రతిష్టచేయకపూర్వము 2,3 యేండ్లక్రింద ఆగుడులకు బ్రాహ్మణులుప్రతిష్టచేసినారు-పోలేరమ్మగుడిలో చెట్టుపెరిగి గాలికి ఆచెట్టుపడి శిలపగిలి గుడిపడితే క్రొత్తిగా గుడికట్టిన్ని పాతపాటమ్మగుడి వాగుఅవతలవుంటే అక్కడినుంచి తెచ్చికట్టి సంప్రోక్షణచేయించినారు-ప్రోలేలమ్మపాతపాటమ్మకు మాదిగె మాల తురకలు లింగధారులు కంసాలీలు తప్ప కడమవర్ణములవారు బోనములుచెల్లిస్తారు-కంసాలీలుసంప్రోక్షణచేసినదరిమిలా కొల్పులుజరిగినవి-అప్పుడుబ్రాహ్మణులు కోమట్లు కొందరుశూద్రులు బోనాలుతీసుకపోలేదు. కంసాలీలుప్రతిష్టచేసినదేవత మాకుపూజార్హములుకావని తీసుకపోవడములేదు. అదివరకు మేముబ్రాహ్మణులము బోనములుతీసుకపోయేదే. కంసాలీలయిండ్లలో యేజాతివారు భోజనముచేయరు. వెనుక బ్రాహ్మణప్రతిష్టజరిగినప్పుడు నేను రాయిడివీరయ్య తోండపినుంచి వీరభద్రయ్యను తీసుకవచ్చి చేయించినాము. Cross. వాడి నా పెత్తండ్రికుమారుడు. వాడితాలూకుపౌరోహితము నేనుచేయడంలేదు. మాకు పౌరోహితంయీనాములేదు. మావూళ్ళో శూద్రులయిండ్లలో పౌరోహితం నేను యితర్లుచేస్తాము. స్ఫోటకముదేవతఎవరో నాకుతెలియదు. మావూళ్ళో జాడ్యములుయేవివచ్చినా యీపోలేలమ్మపాతపాటమ్మలకు కొలుపులుచేస్తారు. పాతపాటమ్మగుడిపట్టుస్థలము యవరిదో నాకుతెలియదు. అది పట్టాభూమిలోవున్నది గ్రామకంఠములోవున్నది చెప్పలేను. పాతపాటమ్మను అక్కడ ఎ

లేమరక చెప్పవచ్చిరి
యీ మన రథకృత్ప్రతిష్ఠ యిష్టముగామిక్ ॥

---

స్థాపించి పెట్టినది నాకు తెలియదు. నేనుఎరిగినతరువాత కంసాలీలుచేసినప్రతిష్టకుపూర్వము
4,8యేండ్లక్రిందజరిగినది. అంతకుపూర్వము అక్కడ వూరికే శిలలు పెట్టినారో ప్రాణ
ప్రతిష్ఠచేసి పెట్టినారో నాకు తెలియదు. ప్రతివాదులనుపిలుపించకపూర్వము వారినిపిలు
పించి సంప్రోక్షణచేస్తామని చెప్పలేదు. సంప్రోక్షణరోజు బ్రాహ్మణులందరము వద్దని చే
యకూడదని చెప్పినాము. కరణము కొందరుకాపులు మేము చేయిస్తామన్నారు. అంత
టమేమువచ్చినాము. ప్రతిష్ఠజరుగబోయేముందు వాది కొందరుబ్రాహ్మణులతో ముం
దువెళ్లినాడు. దరిమిలా నేను వెళ్లినాను. ప్రతిష్టజరిగేటప్పుడు నాకు తెలియదు. ప్రతి
వాదులుప్రతిష్ట చేయించినరోజే ప్రతిష్టచేయిస్తారని తెలిసినది. నేను మేజస్ట్రేటుకోర్టులో
సాక్షినిగాను. ప్రతివాదులుచేసినప్రాణప్రతిష్టకు గ్రామములో అంతా చందావేసుకు
న్నారేమో స్వయముగా తెలియదు. యీచందాలలో మేము యేమిజోక్యము కలుగచే
సుకోలేదు. తిరుగ ఎందుకుప్రతిష్టచేయించవలసివచ్చినది నాకు తెలియదు. ప్రతివాదు
లుప్రతిష్టచేసినదరిమిలా 2,3సార్లు కొల్పులుజరిగినవి. మొదట 7,8యేండ్లక్రిందట బ్రా
హ్మణులుకొల్పులుచేసినతరువాత ఒకసారికొల్పులుచేసినట్టు జ్ఞాపకము. ప్రతివాదులప్ర
తిష్టకుముందు 5,6మాసములక్రింద కొల్పుజరిగినట్టుజ్ఞాపకము. ప్రతివాదులుప్రతిష్టచేయక
ముందు ప్రతికొలుపుకు మేము భోనముచెల్లించేది. దరిమిలా చెల్లించుటలేదు. మేముభో
నముచెల్లించుటలేదు.గనుక దేవాలయములదగ్గరకు వెళ్లుటలేదు. అప్పుడు ఎవరెవరుభో
నముచెల్లించినది చూడలేదు. విశ్వబ్రాహ్మణులు తక్కినజాతులవారియిండ్లలో భోజన
ముచేయరు. మొదటిసంప్రోక్షణకుకూడా నేనుతిరిగి చందాలువసూలుచేయలేదు. మే
మెప్పుడు చందాలుయిచ్చేదిలేదు. శివాలయములలోకి కంసలబత్తులు రారు......జా
నపాటిచినఅప్పయ్యవ్రాలు.

The 1st day of September 1911 కూరపాటి వెంకయ్య

వాది జానపాడు. మావూళ్లో పోలేరమ్మ పాతపాటమ్మగుడులువున్నవి. వా
టిలో కంసలబత్తులచేత షుమారు 4 యేండ్లక్రిందప్రతిష్టచేయించినారు. మావూరిబత్తులు
2,3 ప్రతివాదులు 1 ప్రతివాదినితెచ్చి ప్రతిష్ఠలుచేయించినారు. మునసపు కరణము
కూడా కుమ్మక్కుచేసినారుఅదివరకు లింగధారిఆయనవచ్చి చేయించినాడు. వెనుకకొ
ల్పులకు బ్రాహ్మలు కరణాలు కోమట్లు సంసార్లు అంతాకొల్చినారు. కంసలబత్తులు
రాలేదు. బత్తులుప్రతిష్ఠచేసినతరువాత కొల్పులుజరిగినవి. ఆకొల్పులకు నేను వెళ్ళలేదు.

బ్రాహ్మణులు కోమట్లు వెళ్ళలేదు. కంసలబత్తులచేత ప్రతిష్టచేయించినారని వెళ్ళలేదు. నేను కమ్మకులస్థుడను. కంసలబత్తుల అన్నముతురకలుతప్ప యెవరు తినరు. ఆరాధ్యుని తెచ్చి ప్రతిష్టచేయించినప్పుడు అరకరు రు 1-0-0, రు 0-8-0 లు వేసికొని రు 200-0-0 లు ఖర్చుఅయినది. కంసలివారు ప్రతిష్టచేసినప్పుడు ఖర్చు మునసభ్ పెద్దకాపు పెట్టుకున్నారు. నేను యేమి యివ్వలేదు. ప్రతివాదులను, కంసలబత్తులు వడ్లబత్తులు, కమ్మరబత్తులు అని పిలుస్తాము.

క్రాసు—జానపాటి వెంకటప్పయ్య వాదిఅన్న, వాదిఅన్న మీదవచ్చిన సత్తు రూపాయల కేసులో నేను ఆయనతరపు సాక్ష్యముపలకలేదు. నాకు, నామామకు, జరిగిన వ్యాజ్యములో వెంకటప్పయ్య నాతరపున పనిచేయలేదు. ఆయనకు నేను పాలము యివ్వలేదు. రావెల రామచంద్రయ్య వెంకటప్పయ్యమీద తెచ్చిన ఫోర్జరికేసులో నేను సాక్ష్యము చెప్పలేదు. వడ్లమూడి కోటయ్యకు వెంకటప్పయ్యకు జరిగినక్రిమినల్ కేసులో సాక్ష్యముపలుకలేదు. 2 వ ప్రతిష్టకు యెట్లావైకము వసూలుచేసినది నాకు తెలియదు. ప్రతిష్టచేసినకోటికి తోలుమారి పోయినాను. రెండవసారి పోలేదు. ప్రతిష్టచేయపోతే వద్దనిచెప్పటమునకు పోయినాను. మేముచేయించేది అంతే అంటే వెళ్ళివచ్చినాము. నేనువెళ్ళినది పాతపాటమ్మ దేవాలయము దగ్గరకు ప్రతిష్టచేయకముందు 10 రోజులక్రింద వీరిని తెచ్చి ప్రతిష్టచేస్తారని తెలిసినది. స్ఫోటకపుదేవతను మేము పోలేరమ్మ పోసినదని చెప్పతాము. నేను మొదటిసారి వెళ్లివచ్చేవరకు విగ్రహములను బావిలో స్నానముచేయిస్తున్నారు. బత్తులు చేయించేటప్పుడు బ్రాహ్మణులు చేసినదేగదా. మళ్లియెందుకుచేయించవలసివచ్చినదనిఅంటే బ్రాహ్మణులుచేయడంబాగాలేదు. బత్తులచేతచేయిస్తాము అని అన్నారు. దేవతక్రిందవేసిన బంగారుబిళ్ళవిషయమై యేమి తగాదాలురాలేదు.కుమ్మరవాడు ఒకడు గుడ్లోవుంటాడు.గొల్లవాడు అలంకారములు చేసి పూజచేస్తాడు. బోనాలు తీసుకపోయి నైవేద్యములు పెట్టి అక్కడపెట్టితే పనిపాటలవాండ్లు తీసుకుంటారు. మొదటికొల్పులు అయినతర్వాత తిరిగిప్రతివాదులుచేసే వరకు మధ్యసంప్రోక్షణజరుగలేదు. మామూలుగా పోలేరమ్మగుడికి పాతపాటమ్మగుడికి గొల్లవాడు పూజచేయడం అలంకారముచేయడం.

మొదటికొల్పులకు బ్రాహ్మణులు నైవేద్యాలుతెచ్చి దణ్ణములుపెట్టి పనిపాటలవాండ్ల గుడ్డలలో వేస్తారు. ఒక్కొక్క తెగవారు ఒక్కొక్కమారు నైవేద్యం తీసుకొనిపోతారు. కంసాలీలయిండ్లలో యేజాతివారు భోజనముచేయగా నేను చూడలేదు.

మావూళ్ళో జానపాటి పురుషోత్తం, చినప్పయ్య, సుబ్బయ్య, పౌరోహితం చేస్తారు. చాకలి, మంగలి, కుమ్మరి యిండ్లలో యీ బ్రాహ్మలే చేయించడం. చేయించినందుకు నేను రెండు పైసలు యిస్తాము. వాడితండ్రి మా యిండ్లలో పౌరోహిత్యం చేయించేది. ప్రతివాదులు మాయిండ్లలో భోజనముచేయరు.....కూరపాటి పెదవెంకయ్య నిశాని...

......1-9-1911......కొత్త కోటయ్య...జానపాడు.

నేను కోమటిని. నేను ప్రతివాదులను యెరుగుదును. వారిని మేము కంసలబత్తులు అని పిలుస్తాము. కంసాలియిండ్లలో మాకులమువారము భోజనముచేయము.

క్రాసు. బ్రాహ్మణయిండ్లలోను కరణములయిండ్లలోను తప్ప మాకులమువారము యితరయిండ్లలో భోజనముచేయము. కంసలయిండ్లలో మాకులములో యెవరైనభోజనముచేస్తే మేము మాయింటికి రానియ్యము. కరణాలుఅనగా నియ్యోగులు.........

కొత్త కోటయ్య వ్రాలు...

...1-9-1911.. తాడువాయి కోటయ్య, తెలగ, జానపాడు.

ప్రతివాదులు కంసలకులస్తులు. ప్రతివాదుల కులస్తులయిండ్లలో భోజనము చేయము. అట్లా భోజనము యెవరైనా చేస్తే మేము వారిని మాకులములోనికి రానివ్వము.

క్రాసు. ప్రతివాదులు మాయిండ్లలో భోజనము చేయరు. మంచినీళ్లుతాగరు. యితరవూళ్ళసంగతి నాకు తెలియదు...తాడువాయి కోటయ్యనిశాని...

...1-9-1911...గొబ్బి నాగన్న...యర్రగొల్ల, జానపాడు.

ప్రతివాదులు కంసాలివారు. మేము వారియిండ్లలో భోజనముచేయము. నీళ్లు తాగము. మాకులములో యెవరైన వారికులములో భోజనముచేస్తే మాకులములోకి రానివ్వము.

క్రాసు. యితరవూళ్ళ మామూలుసంగతి నాకుతెలియదు. కంసాలీలలోమాలో యెవరికివారమే యెక్కువ...గొబ్బి నాగన్న నిశాని...

...1-9-1911...బొమ్మిరెడ్డి వీరాస్వామి...చాకలి...(మున్సిఫుగారి) నౌకరి ...గుంటూరు.

నేను చాకలివాడను. ప్రతివాదులు కంసాలీలు. మేము కంసాలీలయిండ్లలో భోజనముచేయము. ప్రతివాదుల కులమువారియిండ్లలో యెవరయినా భోజనముచేస్తే మాకులములోనికి రానివ్వము- క్రాసు,—మేము చాకలిజాతికిపుట్టినవాండ్లము. మాలో కంసాలివారిలో యెవరికులమునకు వారికియెక్కువ. మాకంటె బ్రాహ్మణులు యెక్కువ. కంసాలీలు మాకంటె యెక్కువజాతిఅనిచెప్పలేను...బొమ్మిరెడ్డి వీరాస్వామి నిశాని...

తే॥ కాని పైసాత్మ్యమునకె నాగ్లేనుదినము
లగుచు విసుగెత్తియుంట ధర్మాధికారి
హెచ్చువిషయంబులడుగుట కిష్టపడక
తొందరించెను మాకేటు తోఁపకుండ॥ 100

ఉ॥ ఈవిధిఁ దొందరించుటను నేవు కళాదులయిండ్ల భూజనుల్
జీవన మన్నముఖ్ గ్రహణసేయని యావిషయంబెవచ్చెఁగా
నీ విదితంబుకాదుకదు నేఁ మఱికొందఱు సప్రతిష్ఠలన్
వావిరినడ్డగించుటయుఁ బాపలుగొల్చుటయుం దదర్చులఁ. 101

క॥ రథకారుల యన్నమునీ
శృధముఃలునుంగొనని యట్టి యవ్విషయంబా
* యధికారి సేవకాదులు
ప్రధితంబుగఁ జెప్పిరంతఁ బ్రశ్నముసేయఁ॥ 102

---

*...1-9-1911...కావూరి సుబ్బడు,...యానాది...(మున్సిఫుగారి) గుర్రపు నవుకరు...నెల్లూరు. పోలుమకాం గుంటూరు.

నేను కంసాలిజాతినియెరుగుదును. వారు వడ్లపని కమ్మరపని బంగారపుపని చేస్తారు. కంసాలివారియిండ్లలో మేము భోజనముచేయము. మాలో యెవరయినా కంసాలివారియిండ్లలో భోజనముచేస్తే వారిని మాకులములోనికి రానివ్వము.

క్రాసు—డక్కలవాడు మాలవాడు మేము యితరజాతివాండ్లను పెండ్లిచేసుకోము. మేము యానాదులకు పుట్టినవాండ్లమే డక్కలివాండ్లు బ్రాహ్మణ యిండ్లలో తినరు...కావూరు సుబ్బడు నిశాని...

...1-9-1911...అన్నంగి నారాయుడు...మంగలి...అంకిరెడ్డిపాలెము.

నేను కంసాలిజాతిని యెరుగుదును వారు బంగారపుపనినాగళ్ళుచేస్తారు. మేము వారిఅన్నము తినము మాజాతిలో యెవరైన కంసాలజాతిఅన్నముతింటే మాజాతిలోనికి రానివ్వము.

క్రాసు—మాకులము మొదట యెట్లాపుట్టినది చెప్పలేను. నేనుయెరిగినంతలెక్క మంగలీలు కంసాలీలయిండ్లలో భోజనము చేయరు...అన్నంగి నారాయుడు నిశాని...

ఆ॥ దివసమట్కమిట్లు తవిలి విచారించి
వాయిదావిధించె న్యాయకర్త
అది కలాదజనుల కనుకూలమయ్యెఁబో
పెక్కుపనులు చక్కఁబెట్టుకొనఁగ॥ 103

గద్య

దిఇ శ్రీమజ్జగద్గురు గురుకరుణాకటాక్షసంప్రాప్తకవితాసాహిత్య నిధా
నహరితసగోత్రోద్భవ లక్ష్మీనారాయణ పేరమాంబికాతనూభవ
గర్భశుక్తిముక్తాయమాన విద్వత్సభావిష్కృతావధా
నవిధాన జానపాటిపట్టాభిరామాభిధానవిలిఖితం
బగు స్వర్ణకార వ్యవహారమందుఁ
ద్వితీయభాగము.

---

☞ షరా:—ఇంతవఱకు ప్రచురింపఁబడిన సాక్ష్యములు తెనుఁగున వ్రాయఁబడియుండుటచేఁ గోర్టులోని నకళ్లననుసరించి ప్రచురింపఁబడినవి. వ్యాకరణశుద్ధములు కాకుండుట కిదియే కారణము, ఇఁక మీఁదవచ్చెడిసాక్ష్యము లింగ్లీషున వ్రాయఁబడి యుండుటచే వానిఁ దెనుఁగుచేసికొని వ్యాకరణశుద్ధముగాఁ బ్రచురింపఁబడుచుండును.

...6-11-1911...ఇంకొల్లు రంగనాయికి...బోగముది...గుంటూరు.

నేను గమసాలవలము నెఱుఁగుదును. వాండ్రునగలుచేతురు. కొంతమంది వడ్రంగము కొంతమంది కమ్మరముచేతురు. వాండ్రయిండ్లలో మేము భోజనముచేయము.

క్రాసు—నాకు భూములున్నవి. నేను వైదికుల నెఱుఁగుదును వాండ్రుమాయిండ్లకువచ్చి తద్దినములప్పుడు సంభావనతీసుకొందురు. నేనెఱిఁగినంతవఱకు మాకులస్థులు కమసాలవాండ్రయిండ్లలో భోజనముచేయరు...

...6-11-1911...గొట్టిముక్కల ముత్తాయ...మాల...గుంటూరు.

నేను గమసాల కమ్మర వడ్రంగుల నెఱుఁగుదును. వారియిండ్లలో మాకులస్థులు భోజనముచేయరు ఎవరైన వారియిండ్లలో భోజనముచేసినట్లయితే మాకులమునుండి వెలివేతుము.

క్రాసు—దక్కలవాండ్రు మాదిగలకంటె హీనజాతివారు. వాండ్రు బ్రాహ్మణుల గృహములందు భోజనముచేయునది లేనిది నాకుఁదెలియదు...

శ్రీపరమేశ్వరాయనమః.

# స్వర్ణకారవ్యవహారము.

## తృతీయభాగము.



శ్లో॥ కావేరీవిరజాతోయం వైకుంఠంరంగమందిరం
సవాసుదేవోరంగేశః ప్రత్యక్షంపరమంపదమ్

కం॥ శ్రీరంగనాయకులపద। మారూఢిగనాకసేవ్యమగుఁబూర్వమునం
దారంగనివలన మదీ। యారంభోద్వర్తనంబు లైయుండవొకో 1

ఆ॥ ఆలకించి పై వ్యయప్రయాసములెల్లఁ
గొంతవఱకు ధనముగూర్చి నాకుఁ
బంపియుండినట్టి బ్రాహ్మణకోడూరి
బ్రాహ్మణులకుఁ జేతుఁ బ్రణతిశతము 2

కం॥ అల్లే సాయమొనర్చిరి ముట్లూరుచమళ్లమూడిమొదలగు నాయా
చోట్లవసించెడిద్విజులును। సెట్లును, నవ్వారికెల్ల శ్రీ వర్ధిలుతన్ 3

కం॥ పడరానిపాట్లుపడి యొ।
క్కడకోచని యేమొచేసి కడు మొనగాండ్రం
గడియించిరిసాక్ష్యము కై।
నడిగని ప్రతివాదులైన స్వర్ణాపహరుల్॥ 4

కం॥ మేమూదినివాక్రుచ్చిన। యామాటలకెల్ల ఖండనాంశంబులఁదా
మేమేమోకుదిరిచికొని। వేమా అద్దాసి వల్లెవేసిరి సరిగన్ 5

ఆ॥ మంచివైదినాలు మాసంబువాయిదా
న్యాయకర్తచేత నీయఁబడఁగ
కమ్మరెడ్డి వెలమ కమసాలి మాలలన్
సంఘటించుకొనిరి సాక్ష్యమునకు 6

తే॥ వచ్చెఁ గ్రమముగ వాయిదా,చొచ్చిరపుడు
ధర్మసభ వారలంద అధర్మమూని

అది మూడవప్రతివాదియైన నంది
గామ • కాశీపతికి బోను ధామమయ్యె 7

కం॥ అందఱుప్రతివాదులలో ముందరఁజెప్పఁగొనఁదగిన మొనగాఁడీతం
డందునఁగాదె వకీల్మొదలం దజ్జను నే గ్రహించె లలిసాక్ష్యముకై 8

తే॥ అనిన ననకున్న నితరులు తనను బ్రాహ్మ
ణుండటంచును ననుకొనె నోటినిండ
§నేను బ్రాహ్మణుఁడ నటంచు నేర్పరియయి
స్వకుచమర్దనసామ్యంబు సార్థకముగ 9

కం॥ జననముకమసాలిగ,ము
ధ్యను విశ్వబ్రాహ్మణుఁడుగ నయ్యెను,ప్రకృతం
బున బ్రాహ్మణుఁడుగమాఱెను
కన ముందిఁక నెవ్వరగునొకా యూతఁ డహహో 10

---

...1911వసంవత్సరము 6వనవంబరు...ప్రతివాది తరఫు 1వసాక్షి......

నా పేరు నందిగామ • కాశీపతి (2వప్రతివాది) §నేను బ్రాహ్మణుఁడను-మాకు యాజనకర్మమున్నది. మాకులములో యాజ్ఞికముచేయిఁపఁగలవా రున్నారు. వారు మాయిండ్లలో యాజ్ఞికముచేయింతురు. మాకు షోడశకర్మను లున్నవి. వారి వైదికుఁడు. వైదికులవృత్తి బిచ్చమెత్తుట. ఇతరకులమువారుకొందఱు మాయిండ్లలో భోజనముచేతురు. మాగ్రామములోఁ బాతపాటమ్మ పోలేరమ్మ యను గ్రామదేవతలున్నవి. మాకులమువారె యీదేవతలకుఁ బ్రతిష్ఠచేసినట్టు చెప్పుదురు. పోలేరమ్మను మాగ్రామములోఁ గ్రొత్తగాఁ బ్రతిష్ఠచేసినారు- నందిగామతాలూకా వోలేటిలక్ష్మయ్యయనువతఁడు ప్రతిష్ఠచేసినాఁడు. నాకు మంత్రములురావు- నేను ప్రాణప్రతిష్ఠ చేయలేదు. గ్రామదేవతలకు బ్రాహ్మణులు బోనములు చెల్లింపరు. వైదికులుకూడ బోనములు చెల్లించుటకై వెళ్ళరు. గ్రామదేవతలయుత్సవములకు శూద్రులయొద్ద నుంచి చందాలు వసూలుచేతురు. అర్చకులు కుమ్మరలు గొల్లలు. 1వప్రతివాది ప్రతిష్ఠచేసిన తర్వాత గ్రామములో శూద్రులందఱు దేవతలకు బోనములుచెల్లించుచున్నారు. వాదియెన్నఁడు బోనముచెల్లింపలేదు.

కం॥ ♦వైదికులఁట సంకరులఁట
§భూదేవులొ యింకనెవరొ పుడమి నియోగుల్
తాఁ దెలిసికొనఁగ లేదఁట
ఈధోరణి బాగుగ వినుఁడీ సుజ్ఞజనుల్! 11

చం॥ ఇతని స్వభావసిద్ధమయి యేర్పడుధోరణికా దిదంతయున్
ఋతుమతికిన్ వితంతువున్న కేలవివాహము సేయరాదటం
చతిశయవాదముల్సలుపు చంబుధియానము సేసి పర్ణపుం
జ్యుతినొసరించు ప్రాజ్ఞుఁడగు నొక్క నియోగివకీలు బోధయా 12

తే॥ వారికంతగబోధించి వైదికులను
సంకరులఁగను జేయనే చాలెఁగాని
మఱినియోగులనేని బ్రాహ్మణులఁ జేయఁ
జాలకయుపోయెఁ బాపమా చతురతముఁడు 13

ఉ॥ పుట్టిననాఁటినుండియును బూర్తిగ నొక్కయూరనుండి యి
ప్పట్టున నాత్మపక్షమున బాగుగ సాక్ష్యము చెప్పవచ్చుచు
న్నట్టిఁడు *రంగయాహ్వయుఁడు,నాతఁడు బ్రాహ్మణుఁడౌనొకాదొయా
దట్టుఁ డెఱుంగఁడంట, మతిదార్ఢ్యమటన్న సిటుండనాఁగదా 14

ఆ॥ ఏవమనక ‡శూద్రులే తెంచి భుజియింతు
రంట తనదునింట నన్నమిడిన

---

క్రాను - పూజచేయుటకు నే నాదేవతల యాలయములకుఁ బోను - ♦వైదికులు బ్రాహ్మణులుకారు - వారు సంకరులని నేనువిన్నాను - వైదికులుగాక యితరు లెవరు బ్రాహ్మణులు గాఁబిలువఁబడుదురో చెప్పలేను. §నియోగులు బ్రాహ్మణులగుదురో కారో నాకుఁదెలియదు - మాకరణము *రంగయ్య బ్రాహ్మణుఁడగునో కాదో నాకుఁదెలియదు - వైదికులు కరణములు మాయిండ్లలో భోజనముచేయరు. క్షత్రియులు మాయిండ్లలో భోజనముచేయుదురేమో నాకుఁదెలియదు - వైశ్యులు మాయిండ్లలో భోజనముచేయరు ‡శూద్రులు మాయిండ్లలో భోజనముచేతురు. శూద్రులలోఁ దెగభేదము నేను చెప్పలేను - నెన్నా కృష్ణయ్యయనురెడ్డి మాయింటిలో భోజనముచేయును - అతఁడు నా సా

కాని జననమాదిగా నొక్క రెడ్డికే
పెట్టఁగలిగెనంట బీదయగుట॥ 15

తే॥ వైదికుల్ బ్రాహ్మణులుగారు, వారివృత్తి
ముష్టియెత్తుట యనిపించి మురిసినట్టి
వారిచాతుర్యమే కడు వర్ణ్యమగును
గాని యింత తెగింపంగఁగలఁడె యిత్తఁడు॥ 16

---

1. గాఁడు. అతఁడు గాక మఱియే శూద్రుఁడును మాయింటిలో భోజనముచేయుట నేను జూచుట తటస్థింపలేదు. మాకులపువారిలో నికను నే యితరులయిండ్లలోను శూద్రులు భోజనముచేయఁగా నేనుఁజూడలేదు, నేను స్థితిగతులుగలవాఁడను గాకపోవుటచే శూద్రులకంటెఁ దక్కువజాతివారి కెన్నడును నన్నము పెట్టలేదు-పందిటివారిపాలెములోఁ గొందఱు కమ్మరులును జాకలులును మాజాతివారియింటిలో భోజనముచేయఁగాఁ జూచినాను-వారి పేరులు చెప్పలేను. 2,3 సంవత్సరములక్రిందట మాబావమఱదియింటిలో వివాహములోఁ జూచినాను-మావృత్తి శిల్పము-మేము విగ్రహములఁజేతుము. ముహూర్తములు పెట్టి యిండ్లుకట్టుదుము, బంగారపుఁబని చేతుము-కొందఱు చదువుకొన్నవారు పౌరోహిత్యముచేతురు. శాస్త్రములలో మాకులమును గూర్చి పండితులవల్ల నేమిగాఁజెప్పఁబడినది నాకుఁదెలియదు. మాకుల మంతయు నొకటే. మాకులములోఁ దెగలులేవు. నేను వ్రాసిన దస్తావేజులలో విశ్వబ్రాహ్మణుఁడనని వ్రాసికొన్నాను. మాకులమువారందఱు ప్రతిష్ఠలుచేయించుచున్నారుకాఁబట్టి మాకుఁ బ్రతిష్ఠాధికారముకలదని చెప్పుచున్నాను. మాకులములోఁ గొందఱికి దహనకర్మముకలదు. మాగ్రామములో నెవరును మాకులములో దహన కర్మముచేయరు. వైదికులు బిచ్చమెత్తుట చూచుచున్నానుగాఁబట్టి వారు భిక్షాటనముచేత జీవింతురని చెప్పుచున్నాను, ఇతరకులమువారుకూడబిచ్చమెత్తుటచూచినాను. మాగ్రామదేవతల మొదట నెవరుప్రతిష్ఠించినారో నాకెవరును జెప్పలేదు. అనఁగాఁ జెప్పలేదని యర్థము-మేము-చేసిన ప్రతిష్ఠకుఁబూర్వము వైదికులవల్లఁ బ్రతిష్ఠజరిగినది. 1వప్రతివాది ప్రతిష్ఠచేసినప్పు డాలయములో నేను లేను-1వప్రతివాది యేమిచేయించినది నాకుఁదెలియదు. సిరిపురపు, ఓంకారమనునతనిని నేనెఱుఁగుదును. అ

మ॥ *ప్రవర చెప్పఁగ లేకపోయెను బ్రాహ్మణుండను నేనటం
చెవరునే వనరాదు, మున్నిపు హేళనం బొనరించిన
ట్లవని దేవులలోనె యెందఱో యట్టివార్కల గొక్కలౌ
దివసమేర్పడగ సంధ్యవార్చిన దేలెడిం బ్రవరాదులున్॥ 17

సీ॥ ఆచమనంజేని యాచరింపక హేలఁ
గూర్చుండి తినువారు కొంతమంది
చొక్కాలువిడువకే యెక్కడో కూర్చుండి
కుడిచియే గెడువారు కొంతమంది
బూట్సుకాళులతోనె సీట్సుపైదయచేసి
కోరి మిల్గ్లోనువారు కొంతమంది
అదియిది యేమంచు నన్యజాతులయిండ్లఁ
గూడ మెసవువారు కొంతమంది
గాఁగ సర్వమున్ జగన్నాథమైపోవఁ
జొచ్చెఁ గలిమహత్త్వ మెచ్చియిపుడు
ఇల్లుగాలుపట్ల నెగిరి వాసాల్దూయు
లలిని సంధ్యమాట దలఁపనేల 18

ఆ॥ కడుపుచించికొనినఁ గాళ్లపైఁబడఁగల
దేలదీసి గూర్చి యిపుడుచర్చ
ఎత్తికొన్నదాని నెక్కించవలె గడ్డ
కనెడి సూక్తి చెవుదు నవలికథను 19

---

తినిది మాపలమే. శాస్త్రములలో వైదిక ఆర్వ్యశిసంతతివాగని చెప్పఁబడినట్లు నేను విన్నాను ఆంజనేయశాస్త్రి నాకుఁ జెప్పినాఁడు- అట్లే గ్రంథములలోఁ జెప్పఁబడియు న్నదో యతఁడు నాకుఁ జెప్పలేదు. నాది సుపర్ణసగోత్రము-మాగోత్రములు ఋషుల ద్వారమునవచ్చినవే. మాపూర్వీకులు విశ్వావసు తార్క్ష్యక సుపర్ణులనువారివలన వచ్చి నారు. *మాగోత్రప్రవర చెప్పలేను-సంధ్యావందనమంత్రములు నాకు రావు. నాకుఁ నేర వకామములు వచ్చును.

తే॥ ♦కేశవాది చతుర్వింశ కృష్ణనామ
ములనె చెప్పంగలేని యీ ముగ్ధసఖుని
వదలి చవిచూపుదును బ్రతివాదికులవు
టొల్లమాలినవండితు సూక్తిసరణి 20

కం॥ *నానార్థరత్నమాలం। దానును నకోర్టులోన దాఖలుచేసెన్
దాన రథకారశబ్దం। బేనుడివిన నీచజాతినే వివరించున్ 21

తే॥ ఏమియుపయోగకారియో యెఱుఁగనేను
తమ కులౌన్నత్యముం దెల్పఁ దన్నిఘంటు
వదియెదొరకెను మునుమున్న యాతనికిని
ప్రథమకబళాన మక్షికాపాతమటుల 22

కం॥ ¶రథకారాహ్వయపూరుష। కథకం బైయుంచునట్టి కౌముదినుడి కీ
రథకారుఁ డౌకఁడుదక్కన్ పృథివీసురార్థంబు చెప్ప బేలలుగలరే

---

♦24 నామములలో నన్నియు నాకురావు. నాయుపనయనమప్పుడు నరసింగుచంద్రశేఖరయ్యయను మావలపు బ్రాహ్మణుఁడు యాజ్ఞికము చేయించినాఁడు.

శీక్రాను-నేను శైవుండను. శైవులందఱు చనిపోయినవారిని బాతిపెతురు... నందిగామ కాశీపతిప్రాలు......

...1911 వ సంవత్సరము 6 వ నవంబరు... 2 వ సాక్షి... నావేరు వెలవర్తి ర్యయాంజనేయశాస్త్రి... రథకారశబ్దమునకు రథముచేయువాఁడని యర్థము-ఈగ్రంథము

*నానార్థరత్నమాల-ఇది నిఘంటువు-దీనినందఱును సాధారణముగా నుపయోగించుచుందురు. 246వ పేజీ 118 వ శ్లోకము. సిద్ధాంతకౌముది పాణినికృతమగు వ్యాకరణము-దీని 826 వ పేజీలో ¶రథకారశబ్దమున కర్థము బ్రాహ్మణుఁడని చెప్పఁబడియున్నది.

---

*నానార్థరత్నమాల 246వపేజీ

శ్లో॥ రథకార స్తక్షణిస్యా న్మాహిష్యా త్కరణీభవే

సిద్ధాంతకౌముది 826వపేజి

సంజ్ఞాయాంచ ౬॥౨॥౭౭॥అణం తేపరే తంతువాయోనామ క్రిమిః- అక్షఛాత్యైవ- ¶రథకారోనామ బ్రాహ్మణః॥

గుంటూరు టవున్ హాయిస్కూలు తెలుఁగుపండితులగు శిష్ట్లా హనుమచ్ఛాస్త్రి

క॥ శ్రీవిశ్వబ్రాహ్మణశబ్దము। విశ్వంబున బ్రాహ్మణులకె వినియోగింత్రెం
టీశ్వరముఖజుల్! మీరిక। విశ్వబ్రాహ్మణపదంబె వెట్టికొనుండీ 24

తే॥ వైదికుల్ బ్రాహ్మణులుకారు వసుధ ననుచు
కాశిపతి యూరకే చెప్పఁగాని యితఁడు
♦శాస్త్రములనుండె నట్లనె,చదువుఁడింక
వరవి వైదికులార! తచ్ఛాస్త్రములను 25

ఉ॥ భోగముదంట యూర్వశియు,పుట్టినవాఁడఁట యవ్వశిష్ఠుఁ డా
భోగిని కీప్రకారముగఁ బూర్వమునందున *వజ్రసూచిలో

నేను 2వ ప్రతివాది తెలుఁగుదును. అతఁడు బ్రాహ్మణుఁడు. సామాన్యముగా శ్రీవిశ్వబ్రాహ్మణశబ్దము బ్రాహ్మణుల కుపయోగింతురు. వాదికులము నాకుఁ దెలియదు.- వైదికులను నేనెఱుఁగుదును- కొన్ని♦శాస్త్రములలో వైదికులు బ్రాహ్మణులుకారని వ్రాయఁబడియున్నది- *వజ్రసూచికోపనిషత్తులో వశిష్ఠుఁ డూర్వశికుమారుఁడని చెప్పఁబడి యున్నది. ఈయూర్వశి సంకరజాతీయురాలైన భోగస్త్రీ వైదికులందఱికిని వశిష్ఠుని

గారి యభిప్రాయము.

మొత్తమున సంజ్ఞయేలుచుండఁగా ఉత్తరపదము, అణ్ణంతమైనదగుచునుండఁగా మొదటిపదము, ఆద్యుదాత్తస్వరముకలదియగును. పరముగానున్న అణ్ణుకృఞ్ ధాతువు మీఁదఁజేసినదికాకుండవలయును.తంతువాయః, అనునదికృఞ్ ధాతువుపైఁజేసిన అణ్ణంతము పరముగాఁగలదికాదుగావున ఆద్యుదాత్తమై "సాలెవురుగు" అనుసంజ్ఞార్థకమయ్యెను-రథకారశబ్దముకిర్యావిశేషనియుక్త బ్రాహ్మణునకు సంజ్ఞయైనను, కృఞ్ ధాతువుపైఁజేసిన అణ్‌విశిష్టరూపము (కార) పరముగాఁగలదిగాన, ఆద్యుదాత్తముకాదని భావము- సంజ్ఞాయాంచ, అనుసూత్రముచే రథకారశబ్దము వ్యక్తివిశేషమునకు సంజ్ఞయగుచుండఁగా జాతివాచకరథకారశబ్దమని భ్రమించుట యొప్పదు. గోబ్రాహ్మణప్రముఖపదములు జాతివాచకములు-ఇవి సంజ్ఞావాచకములు। కావు-కామధేనువు, కృష్ణశర్మ, ఇత్యాదికములు సంజ్ఞలుగనుక,ఇచ్చట రథకారశబ్దము సంజ్ఞయేకాని జాతికాదు. సముదాయఫలవాచి జాతియగుంగాని సంజ్ఞకాదు.కనుక జాతివాచకరథకారుం డీతండనుట శోచనీయము.

శాయుఁ జెప్పఁబడ్డదఁట, •వైదికులెల్లరు తద్వశిష్ఠ గో
త్రాగతులై చెలంగిరట, అందునఁ గారఁట వారు బ్రాహ్మణుల్

ఆ॥ అవ్వశిష్ఠవరాని యల యూర్వశీపుత్రుఁ
డగుట యట్టులుండ గీనతని భార్య
చాల హీనజాతిసతి యక్షమాలయం
చుండెనఁట మనూక్తి ఖండితముగ. 27

శా॥ ఏతాదృశసతీపతుల్గనిన వాఁడే కాన తచ్ఛక్తి త
జ్జాతుండైన పరాశరుండు మఱి తజ్జాతుండు వ్యాసుండు తా
మేటిర్జా చినకాని బ్రాహ్మణులుగా నెన్నంబడంబోరఁట
ఖ్యాతిన్ వారలగోత్రముల్గలుగువార్కారంట భూదేవతల్

శా॥ ఏతద్గోత్రజు లొక్క వైదికులెయుం జీతండు న్యాయుచ్ఛైనో
ద్యోతారాధ్యని యోగివైష్ణవముఖుల్! తద్గోత్రముల్ వీడఁడీ
క్రీతిన్ స్వాదకయున్న మీరలును ధాత్రి బ్రాహ్మణుల్గాక యే
మాతో పాటుగ నొచు సంకరులు మీ మానంబు గోల్పోయెదర్

తే॥ బ్రహ్మకొడుకై వశిష్ఠుండు ప్రథమమందు
*చాలకాలమునకు నిమిశాపనిహతి
నూర్వశీదర్శనస్ఖలితోరు వాని
తేజమునఁ జేసి కలశానఁ దిరుగఁబుట్టె. 30

యొక్కయు వశిష్ఠసంతతివారియొక్కయు గోత్రములైయున్నవి కాఁబట్టి •వైదికులు బ్రాహ్మణులు కారని నేను జెప్పుచున్నాను-†వశిష్ఠుని భార్య చాలహీనజాతిది. †ఈసంగతి మనుస్మృతి 9వ యధ్యాయము 23వ శ్లోకమందున్నది. ఆమెపేరక్షమాల. శక్తి పరా

* మత్స్యపురాణము- గోత్రానువర్ణనము, 201వ అధ్యా- శ్లో॥ వశిష్ఠస్తు మహాతేజా నిమేః పూర్వపురోహితః॥౧॥...తంగత్వా పార్థివశ్రేష్ఠో నిమిర్వచనమబ్రవీత్॥ ౨॥ భగవన్! యష్టుమిచ్ఛామి తన్మాం యాజయ మాచిరం। తమువాచ మహాతేజా వశిష్ఠః! పార్థివోత్తమం॥౩॥ కంచిత్కాలం ప్రతీక్షస్వ తవ యజ్ఞైస్సుసత్తమైః। శ్రాంతోస్మి రాజన్ విశ్రమ్య యాజయిష్యామి తే నృప!॥౪॥ ఏవముక్తః ప్రత్యువాచ వశిష్ఠం నృపసత్తమః ...స్తోహం సంభృతసంభారో భవన్మూలముపాగతః॥౧౨॥ న చేద్యాజయసే మాం త్వం అన్యం యాస్యామి యాజకం। ఏవముక్తస్తదా తేన నిమినా బ్రాహ్మణోత్తమః॥౧౩॥ శశాపతం నిమిం

క్రోధా ద్విదేహ స్త్వంభవిష్యసి...నిమి స్తం ప్రత్యువాచాథ ధర్మకార్యరతస్యమే॥౧౫॥ విఘ్నంకరోషి నాన్యేన యాజనంచ తథేచ్ఛసి। శాపందదామియస్మాత్త్వం విదేహోథ భవిష్యసి ॥౧౬॥ ఏవముక్తౌతుతౌజాతౌ విదేహౌ ద్విజపార్థివౌ... ఏతస్మిన్నేవకాలేతు మిత్రశ్చ వరుణస్తథా॥౨౩॥ బదర్యాశ్రమమాసాద్య తపస్తేపతు రవ్యయం।తపస్యతో స్తయోరేవం కదాచిన్మాధవేఋతౌ ॥౨౪॥...ఊర్వశీతువరారోహా కుర్వతీ కుసుమోచ్చయం॥౨౫॥ సుసూక్ష్మరక్తవసనా తయోర్దృష్టిపథంగతా। తాందృష్ట్వేందుముఖీంసుభ్రూం నీలనీరజలోచనాం ॥౨౬॥ ఉభౌతు చుక్షుభుర్దేవౌ తద్రూపపరిమోహితౌ।తపస్యతో స్తయోర్వీర్య మస్ఖలచ్చ మృగాసనే॥౨౭॥ స్కన్నంరేత స్తతోదృష్ట్వా శాపభీతౌపరస్పరం।చక్రతుఃకలశేశుక్రం తోయపూర్ణేమనోరమే॥౨౮॥ తస్మాదృషివరౌజాతౌ తేజసాప్రతిమౌభువి।వశిష్ఠశ్చాప్యగస్త్యశ్చ మిత్రావరుణయో ర్ద్వయోః॥౨౯

దేవీభాగవతము షష్ఠస్కంధము.

క॥ అమలతరవర్తనుం డుత్తముఁడిక్ష్వాకుతనూజుండు ధర్మాత్ముఁడుభూ।రమణశిరోభూషణమన। నిమియనునొకచక్రవర్తియెగడు నృపాలా॥౩౭౯॥... వ॥ పదంపడి యొక్కయెడనానృపతివరుండు దీర్ఘకాలంబగు నొకజన్నంబు సేయఁదలంచి...కుల గురుండగు వశిష్ఠుంగాంచి యిట్లనియె ॥౩౮౦॥ తే॥ ఐదువేలవత్సరములయ్యంబనర్థి।గుఱిచి జన్నంబొనర్చెదగురువరేణ్య!సకలయజ్ఞసంభారంబుసంగ్రహించి।వాఁడఁజేయింపుమనన్న పుడుకతఁడనియె ॥౩౮౧॥ వ॥ అంబామఖంబొనర్ప నుద్యుక్తుండై పాకశాసనుండింతకు మున్న నీవలెనన్నుం బ్రార్థించె నాజన్నంబును బంచశతివర్షాత్మకంబదాని నొనర్చి పిదపనీజన్నంబున కరుదెంచువాఁడ నంతదనుకఁ దాళుమనుడునిమి యిట్లను ॥౩౮౨॥ కం॥ మునులంబిలిచితిజన్న।మ్మునకుఁ సంభారమెల్లఁబూరించితిమా యినకులమునకున్ గురుఁడవు।ననువంచనచేసి యరుగన్యాయమెనీకుఁ ॥౩౮౩॥ వ॥ ధన లోభమ్మునం జేసినీవిట్లొనరింపఁ దగదనిమాటిమాటికినివారితుండయ్యు వశిష్ఠుండు గణి యింపకసురపతి మఖమ్మునకుంజనియె ॥౩౮౪॥ ఉ॥ పిమ్మట వైమనస్యమున వేగమెలర్చ నిమిప్రభుండు స।త్సమ్మతుగౌతముంగురు పదమ్మునిల్పితు సారభూధ్రపా।ర్శ్వమ్మున దీక్షఁ మిగులసమ్మతి గాఁగమఖంబొనర్చి।ప్రే।మమ్మునసెల్లఋత్విజాలమాన్యులఁజేసెన పారదక్షిణఁ॥ ౩౮౫ ॥వ॥ ఇంతకుమున్న వశిష్ఠుండింద్రమఖంబు సంపూర్ణంబొనరించి తత్పూర్త పూజలందనిసి యజ్ఞదీక్షామధ్యమ్మున నిమింగనవచ్చిన నిద్రావశుండై

ఆ॥ వజ్రిసూచినుండు వాక్యంబుమాదిరి। నుండె॰ భాగవతపు టుక్తిగూడ
ఎల్లవ్రాసినారొ యీక్షించుఁడొకమాఱు। దానికర్థముచటఁదద్జ్ఞనులు

చ॥ శ్రీమనువువసిష్ఠసంగతిని మాన్యతనొందెను నక్షమాలయం
చనియెనుగాని హీనయగు నామెనుగూడి యశుద్ధుఁడయ్యె నా
యనయని పల్కియుండఁ, డదియర్థముగామినొ నైమె దురూహనో
మన కమసాలిపండితుఁడు మాటికి వాదములాడఁజొచ్చెఁదుర్ ॥34

చ॥ ఇతఁడనురీతి హీనతమయే యగుఁగాక తదక్షమాల, యా
యతివకుఁగాదు శక్తి యుదయంబుయుంట, యతండరుంధతీ
సుతుఁడనుచుం బురాణములఁ జూపకు, నామెయె యీమెయంచు నే
కృతియు వచించియుండ, దిఁక నెవ్విధిసంకరుఁ డాతఁ డయ్యెడిన్ ॥35

చ॥ ఒదవునుగాక యవ్విధిని యూర్వశియందు వసిష్ఠుజన్మ, మ
య్యదియు ద్వితీయమయ్యెడిని, నంతకుముందు ప్రథమంపుజన్మమం
దుదయమునొందె శక్తి యన నొప్పదె, యందుల కెద్దియేనియున్
గుదిరెడిచో విరోధ మదికూడ వచింతురుగాక తక్షకుల్॥ 36

తే॥ అపుడు విప్రుఁడెకదశక్తి యతనిపుత్రుఁ
డౌ పరాశరుఁ డాతనియాత్మజుండు

---

ధర్మవర్తినే॥ తవాపిపతతాందేహో లోభా ద్ధర్మమజానతః॥౫॥ఇత్యుత్సృజ్య స్వం దేహం నిమి రధ్యాత్మకోవిదః। మిత్రావరుణయోర్జజ్ఞే॰ హ్యూర్వశ్యాం ప్రపితామహః॥౬॥

శ్రీధరీయవ్యాఖ్య

ఇతీతి॥ ఊర్వశీదర్శనాత్ స్కన్నం రేత స్తాభ్యాం కుంభే నిక్షిప్తం, తస్మాత్ప్రపితామహో వసిష్ఠః జజ్ఞేత దాహ మిత్రావరుణయోరితి...

శ్రీమనుస్మృతి 9వయధ్యాయము

శ్లో॥ అక్షమాలా వశిష్ఠేన సంయుక్తాధమయోనిజా। సారంగీ మందపాలేన జగామాభ్యర్హణీయతాం॥ ౨౩॥

తా॥ వసిష్ఠపరిణీతయై నికృష్టయోనిజాతయగు నక్షమాలాఖ్యయు మందపాలుఁడను బుషినిఁగూడుకొని చటకయు పూజ్యతనుబొందిరి.

మత్స్యపురాణము 201వఅధ్యాయము

శ్లో॥ వసిష్ఠస్తాపయేమేధ.., అరుంధతీం వరారోహాంతస్యాం శక్తిమజీజనత్ ॥80॥

వ్యాసుఁడును, గాన వారలయన్వయజు లిఁ
కేల విప్రులుగారంచు నెంచఁగవలె 37

తే॥ అరయ వాసిష్ఠగోత్రముల్ ధరణి నియోగి
శైవ వైష్ణవ మధ్వాది సకలమహిసు
రులకునుండెడుఁ బ్రకృతంబు రూఢముగను
వైదికుల కొక్కరికె యంచు వదర నేల 38

చం॥ మఱియును నూర్వశీరమణి మాన్యయె దైవతకాంతయాటచే
సురలకు జాతిభేదములు చూపడ వెచ్చటనేని, యూర్వశీ
దరగళ వేశ్యయైన మఱి తక్కిన యా పురుహూతముఖ్యు లె
వ్వరొ వచియింపఁగాఁగలమె వాస్తవమున్మన మెంచిచూచినన్ 39

కం॥ లేవు జరామరణంబులు। లేవీవర్ణాశ్రమములు లే వికనెన్నన్
కావునఁ బావనతములౌ। దేవతలకు వంక లెన్నఁ దేలునె మనకున్

---

ఆంధ్రకవులచరిత్రము- 2వభాగము 108వపేజీ

శా॥ శ్రీలన్మించి సమస్తధీకలనచేఁ జెన్నొందు నార్వేలవం
శాలంకారకవుల్ వశిష్ఠమునిగోత్రాంకుల్ బుధుల్ దీనర
క్షాలీలం బొగడొంది, రందు వెలసెన్ సన్మాని భావప్ప ది
గ్జాలోద్వేలవిశాలకీర్తుల సుధీసందోహమందారమై

130పేజీ_ రాజలింగకవి

ఈకవి శైవుఁడగుట స్పష్టమగుచున్నది- ఇతఁడు వశిష్ఠగోత్రుఁడు...

3వభాగము 147వపేజీ.

గణపవరపు వెంకటకవి___ఇతఁడు...నియోగిబ్రాహ్మణుఁడు...వశిష్ఠగోత్రుఁడు

204వపేజీ-కానాలనరసింహకవి

ఈతఁడు...నందవరీక నియోగిబ్రాహ్మణుఁడు వాశిష్ఠగోత్రుఁడు,

శ్రీభగవద్గీత - చతుర్థాధ్యాయము.

శ్లో॥ క్షిప్రం హి మానుషేలోకే సిద్ధిర్భవతి కర్మజా॥ ॥౧౨॥ చాతుర్వర్ణ్యం మయాసృ
ష్టం గుణకర్మవిభాగశః...

టీ॥ భా॥ హి యస్మాత్ మానుషేలోకే. మనుష్యలోకే... వర్ణాశ్రమాది క
ర్మాధికారా ఇతి విశేషః తేషాం వర్ణాశ్రమాద్యధికారిణాం కర్మణాం ఫలసిద్ధిః క్షిప్రం

కం॥ పతినియమము లేకుండిన
యతివలగుట వేశ్యలనుదు రంతియెకాని
క్షితిఁగల వేశ్యలవలెఁ ద
త్సతులను హీనలని చెప్పఁజాలరు విబుధుల్ 41

కం॥ వేశ్యాసంభోగంబును।గాశ్యపిఁ గలుషప్రదంబు గాఁజూచుజనం
బీశ్యంఘ్రిఁగొల్చి యాస్వ।ర్వేశ్యాసంభోగమునకు వెడలదె దివికిన్
కం॥ ఉర్వి న్స్వేశ్యాజనముల।పేర్వినిన న్గారమేగు పెదపెద్దలు తార్
సర్వక్రతువు లొనర్చియు।నూర్వశ్యాద్యప్సరసల నొందన్జనరే 43
కం॥ ♦ నారాయణుఁడనుఋషివరు।నూరువునంజననమందెనూర్వశి, తాదృ
క్స్వారవరాత్మజదొసఁగుల నేరంగం గలదె శక్తి యెవ్వారలకిన్ 44
క॥ సర్వంసహ వేశ్యారతి
గుర్వఘమును గతఁలకును గూర్చుచునుండున్
స్వర్వేశ్య పుణ్యకార్యపు
నిర్వాహము లేక దొరక నేరదు సరిగన్॥ 45
క॥ దేవరహస్యములవి మన
మేవిధిగం జెప్పలేము హేయములనుచున్
గావున దుర్వాదంబులఁ
బోవిడుచుచు సత్పథంబుఁ బూనుఁడు కుమతుల్, 46

---

భవతి,కర్మజా కర్మణా జాతా ॥౧౨॥ మానుష ఏవలోకే వర్ణాశ్రమాదికర్మాధికారో నాన్యేషులోకేష్వితినియమః కింనిమిత్తఇతి...చాతుర్వర్ణ్యమితి" చత్వారఏవవర్ణాః చాతుర్వర్ణ్యం మయేశ్వరేణ సృష్టముత్పాదితం, గుణకర్మవిభాగశః గుణవిభాగశః కర్మవిభాగశశ్చ... తచ్చేదం చాతుర్వర్ణ్యం నాన్యేషులోకేషు- అతోమానుషేలోక ఇతి విశేషణం......

భాగవతము-ద్వితీయస్కంధము.

కం॥ ♦ నారాయణుఁ డప్పుడుదవ।యూరువు వెసఁజీర నందు,నుదయించెను చెం
పారంగ నూర్వశీముఖ। నారీజనకోటి దివిజనారులు మెచ్చన్॥ 181
కం॥ ఊరువులందు జనించిన। కారణమున నూర్వశియని ఘనతకు నెక్కెన్
నారల రూపవిలాసవి।హారములకు నోడిరంత నమరీజనముల్॥ 182

సీ॥ మొదట • బ్రహ్మప్రాణమునఁబుట్టి § బ్రహ్మర్షి
వర్యుఁడై జగమున వన్నెకెక్కె
కాలాంతరమునఁదా ఘటమునం బ్రభవించి
* యిక్ష్వాకు కులగురుండే యయి మని
విష్ణ్వవతారమై వెలసిన శ్రీరాము
బహుళార్చనములకుఁ బాత్రుఁడయ్యె
@ బ్రహ్మాదులీలేని బ్రహ్మర్షిపట్టాను
గృపను విశ్వామిత్రఋషి. కొసంగె॥

---

భాగవతము -తృతీయస్కంధము.

సీ॥ • అరవిందసంభవు నంగుష్ఠమునదక్షుఁ డూరువుగలనను నారదుండు
నాభిఁ బులహుఁడు గర్ణములఁ బులస్త్యుఁడు త్వక్కున భృగువు హస్తమునఁ గ్రతువు
నాస్యంబువలన నయ్యంగిరసుఁడు ప్రాణమున వశిష్ఠుఁడు మనమున మరీచి
గన్నుల నత్రియుఁ గాఁ బుత్రదశకంబు గలిగిరి,

§ భాస్కరరామాయణము-బాలకాండము.

వ॥ ...వశిష్ఠమునివరుండు బ్రహ్మతేజోమూర్తి వెలుఁగు నపుడు కెరలి విశ్వామిత్రుండు బ్రహ్మాస్త్రంబుసంధించి...

కం॥ బ్రహ్మాదులు మదిఁబొగడఁగ । బ్రహ్మాండము విస్ఫులింగపంక్తులనిగుడన్
బ్రహ్మర్షి వరునిమీఁదను బ్రహ్మాస్త్రముమంట లెగయ బలువడినేసెన్

మ॥ అటులేయంగఁ జటచ్చటప్రకటఘోషాభీలకీలచ్ఛటా
స్ఫుటధూమావళ విస్ఫులింగచయవిస్ఫూర్తుల్వెలుంగన్ వికం
కటవేగంబున బ్రహ్మదండమును వీఁకం దాటిరాఁ బట్టి యు
ద్భటరోషంబునఁజేర్చిమ్రింగె ముని యా బ్రహ్మాస్త్రముఁ వీఁకన్ ॥

కం॥ * మాకులగురుఁడువసిష్ఠుఁడు । గైకొని కావింప నెల్లకార్యంబులకున్
మాకుంగలవాఁ డనవుడుఁ । గాకుత్స్థునిమాటకలలెఁ గౌశికుఁ రెలమిన్ ॥

వ॥ అప్పుడు జనకుంజూచి దశరథు నన్వయక్రమంబు వసిష్ఠుండు చెప్పనిట్లను ?

కం॥ @ । సురలునుగంధర్వులు మునివరులుం బరమేష్ఠి కడకు వంచింజని యా
సరసిజసంభవునకు నా । దరమునఁ బ్రణమిల్లి యాపితామహుతోడన్

శా॥ బ్రహ్మంబైనతపంబు కౌశికుఁ డొనర్పంజొచ్చె, నమ్మౌనికిన్ బ్రహ్మర్షిత్వము నైన

గీ॥ నిజతపోదీప్తి నెదియేని నిర్వహింప
శక్తుఁడై బ్రాహ్మ్యమాహాత్మ్యసరణిఁ జూపె
అట్టి లోకాతిగప్రభావాఢ్యుఁడౌ వ
శిష్ఠునిం దోషియంటి విసీ కలాద! 47

సీ॥ వర్ణాశ్రమాచారవర్తనల్ దిగఁద్రొవు
కలియుగాధీశుఁడై క్రాలనయ్యె
ధర్మసూక్ష్మంబును దగ గ్రహింపఁగ లేని
ధీరులు ధర్మాధికారులైరి
పాశ్చాత్యనృపవేష భాషావలంబులై
వర్తించువా దేశవాసులైరి
స్వకులాభిమానమ్ము చాలినంతగ లేక
వెనుకంజ వేయువా ర్విప్రులైరి॥

గీ॥ కాన నేమన్న సాఁగెడికాలమయ్యె
స్వర్ణకృచ్చర్మకృన్ముఖ్య జనుల కెల్ల
ఏల సంకరులనరు మరింక వారు
బ్రాహ్మణులమనిమిడికెడి వైదికులను 48

తే॥ బ్రాహ్మ్యమన్నను దలనొప్పి బ్రాహ్మణులకు
నొందఁ జూచు మనుష్యనా రొరులు దాని

---

బ్రహ్మపదమైన స్వర్గ నీకుండినన్ బ్రహ్మాండంబులు తత్తపోగ్నిశిఖలన్ భస్మంబులౌ నాపుడున్ బ్రాహ్మణ్యుండగు బ్రహ్మ సంయమినిలింప స్తోమముల్గొల్వఁగన్

మ॥ చన నేతెంచి భవత్తపోమహిమ విశ్వామిత్ర! బ్రహ్మర్షివై తనిశంబుం దపమింక సేలయన బ్రహ్మంబాచి బ్రాహ్మత్మజుండును బ్రహ్మర్షియు నైన పుణ్యుఁడు వసిష్ఠుం డిచ్చు నిక్కంబు గాను బ్రహ్మర్షి పదుండవైతనక నే నమ్మన్ జగద్రక్షకా!

మ॥ అనుడున్ బ్రహ్మయు సర్వదేవతలుఁ గామ్యంబొంద రప్పింపఁ జయ్యన నేతెంచి తపోమహత్త్వము నవంధ్యంబొంద బ్రహర్షివై తనుమానింపకు మన్నఁ గౌశికుఁడు సౌఖ్యంబొప్ప భక్తిన్ వసిష్ఠుని బూజించెఁ బ్రియంబుతోఁ జనిరి తోడ్తో నంత బృందారకుల్

బ్రాహ్మణుండయిపుట్టుచే ప్రథమకష్ట
మందు వైదికుఁడై పుట్టుటధమమిపుడు 49

ఆ॥ ♦ హరితుఁ డంబరీషుఁ డా యౌవనాశ్వుండు
క్షత్రియాన్వవాయజాతులంట
హారితగోత్రమంద యావిర్భవించుట
వలనఁగానఁ జేను బ్రాహ్మణుండ

తే॥ అవనియం దుండెదరుగాక యంబరీష
యౌవనాశ్వాదు లా క్షత్రియాన్వయముల
బ్రాహ్మణులలోన నాపేళ్లఁబరఁగువార
లెందుకనియుండఁగూడదో యిద్దిచెపుఁడు 51

ఆ॥ § హారితగోత్రమునకు నాంగిరసుండెయాఁ
బ్రథమఋషియతండు బ్రాహ్మణుండు [redacted]
ఒక్కగోత్రమునకు నుభయకులస్థులు
నెట్లుప్రవరులౌదు రిదియుఁజెపుఁడు 52

ఆ॥ హారితాంబరీష యౌవనాశ్వాదులకరయ నాదిపురుషుఁడాంగిరసుఁడు
క్షేత్ర మొక్క వేళ క్షాత్రంబ యైనను బ్రహ్మఋషులెవారుపరిగణింప 53

క॥ * క్షత్రస్త్రీగర్భజులౌపుత్రులెపెక్కండ్రుఋషులుపూర్వయుగముల&

---

♦ర వ్యాస, ♦ అంబరీష యౌవనాశ్వులు బ్రాహ్మణులకుఁబుట్టలేదు- వైదికులగోత్రమునీ
ఋషులసంతతిలోనుంచి వచ్చినవికాఁబట్టి యెంతమాత్రము బ్రాహ్మణులు కారు.

---

§ ఆశ్వలాయనశ్రౌతసూత్రే, ఉత్తరషట్కే షష్ఠాధ్యాయే, ఏకాదశీకండికా,
హారితకుత్స పింగ శంఖ దర్భ హైమ గవానాం. ఆంగిరసాంబరీషయౌవనాశ్వేతి'।
నిర్ణయసింధౌ గోత్రప్రవరనిర్ణయః 287వ పేజీ
అథ కేవలాంగిరసః- హారితానాం ఆంగిర సాంబరీష యౌవనాశ్వేతి,

* భాగవతము - నవమస్కంధము.

వ॥ విను మయ్యంబరీషునకు విరూపుండును కేతుమంతుండును శంభుండును ననువారు ముగ్గురుకొడుకులందుఁ గేతుమంతుండును శంభుండును ననువారు హరింగూర్చి తపంబుసేయువారై వనంబునకుంజనిరి. విరూపునికిఁ బృషదశ్వుండును బృషదశ్వునకు రథీతరుండును గలిగి రమ్మహాత్మునికి సంతతిలేకున్న నంగిరసుఁడను మునీంద్రుం డతనిభార్యయందు బ్రహ్మతేజోనిధులయిన కొడుకులంగలిగించె వారలు

క్షత్త్రబ్రాహ్మణులవుడే! మాత్రముభిద లేకయున్న మాటనిజంబా॥

తే॥ * జహ్నుమునివంశమందెతా జననమంది
గాధి రాజర్షిభావంబు గాంచినాఁడు
కలిగి యాగాధితనుజాతిగర్భమందె
అల్లజమదగ్ని బ్రహ్మర్షియైనవాఁడు॥ 55

ఆ॥ † అట్టిగాధితనయుఁడయ్యె విశ్వామిత్రుఁ
డయ్యె బ్రహ్మఋషిగ నహహా!వినుఁడు
మునివచఃప్రభావ మొగిని బ్రాహ్మణుఁ జేసె
వీతహవ్యనామ భూతలేశు॥ 56

తే॥ సూర్యచంద్రాన్వయులెకద చూచుకొనినఁ
బుడమి క్షత్రియు లందఱుఁ బూర్వమందు

---

ఆపస్తంబ శ్రౌతసూత్రము ౨౪౦ పుటలో రథకారుఁడు వర్షాకాలమం దాధాన ముచేయవలసినట్టు చెప్పఁబడియున్నది. హారితఋషి క్షత్రియకులస్థుఁడు. వాదిది హారితసగోత్రము. హారితుఁడు క్షత్రియుఁడన్న సంగతి యేగ్రంథములోనున్నది చెప్పఁజాలను.

---

రథీతరగోత్రులు నాంగిరసులను బ్రాహ్మణులు నై యితరులందుముఖ్యులయి ప్రవర్తిల్లి రని చెప్పి శుమండిట్లనియె, 54

* భారతము, అనుశాసనిక పర్వము.

సీ॥ జాహ్నవీదేవికి జనకుఁడై వెలసిన జహ్నునికులమున సంభవించె
గాధినాఁ బ్రకటభూకాంతుఁ, డాతనిపుత్త్రియగుసత్యవతి దన కాలి గాఁగ
నిమ్మనియర్థించె నమ్మహీశ్వరు రుచికుండనుముని భృగుకులవర్యుఁడు

......గీ॥ గాధి యమ్మునిపుత్త్రు శీఘ్రమునఁ బెండ్లిచేసి...... వ॥ సత్యవతీపుత్త్రపౌత్త్రులైన జమదగ్నిపరశురాములు .........

† వ॥ ......గాధిభార్యకుజనియించి విశ్వామిత్రుండు, కం॥ నరనాథుండై యుండియు ......సద్బ్రాహ్మణతాస్ఫురణంబుఁబడసె,......గీ॥ వీతహవ్యుఁడును మహాతపస్సందీప్తుఁ డైన యమ్మునీందు్రి నప్రతర్క్యభంగిభావణముల బ్రాహ్మణుండై కృత్స్నమదసమాఖ్యుఁ గాంచె మహితయశుని॥ వ॥ తత్పుత్రపౌత్రక్రమంబున......మహాద్విజాలుజనిర్మించి రిట్లు విద్యామహాకశ్రీణివంతంబగు మునివంశంబునకు మూలంబై యవ్వీతహవ్యుండు భవ్యకీర్తివడసె॥ ......

* ఎవ్వరానూర్యచంద్రము లెంచిచూడ
కశ్యపాత్రిమునీశ్వరుల్ గన్నసుతులె॥ 57

ఆ॥ బ్రహ్మబీజమునకుఁ బ్రభవించికొందఱు
నురుతపోమహత్తునుండి కొంద
ఱట్లు పలుదెఱంగుల నైరి బ్రాహ్మణులుగాఁ
బూర్వమందుఋషులు భూతలమున॥ 58

కం॥ † పుట్టిరి తిర్యగ్యోనుల
పుట్టి రయోనులనుగూడ, పుట్టుకతోనే
దిట్టలయి కొట్టిరఘముల
నిట్టివియని చెప్పఁగలమె ఋషిచరితంబుల్॥ 59

ఉ॥ కాన యుగాంతరీయమగు గాథకుదింపినఁ దేలది ప్ర్రవా
జ్మానసగోచరంబది, యమానుషమైనమహత్తుకల్మి వా
ర్మానులుగాఁగమాఱుటకు మంచిపథంబొకడుండెనప్డు, త
ద్దీసిధివంశజుల్ ధరణిదేవులుగారన నోరెటాడెడిన్॥ 60

తే॥ ‡ అంగిరోగోత్రజాతుల నాగమంబె
బ్రాహ్మణప్రజలోపలంబరి గణించె
కేవలాంగిరసులమైన మావిభూతి
కెవ్వరేమేని మొఱఁగనిం డేమిలోటు॥ 61

---

* భాగవతము నవమస్కంధము.

సీ॥ ఆకశ్యపునికి దక్షాత్మజ యదితికిఁ గొమరుఁడై చీఁకటిగొంగవాఁడను
......సీ॥ ...అత్రి కడగంటిచూడ్కులఁ గలువలఱంగడీఁడుదయించి...

† అష్టోత్తరశతోపనిషత్తులు 384వ పేజి.

......ఋష్యశృంగో మృగ్యాః, కౌశికః కుశాత్, జాంబుకో జంబుకాత్ వాల్మీకో వల్మీకాత్, ...శశపృష్ఠా ద్గౌతమః......

‡ కృష్ణయజుర్బ్రాహ్మణము 10వపుట.

బ్రా॥ భృగూణాంత్వాంగిరసాంవ్రత పతే, వ్రతేనాదధామీతి భృగ్వంగిరసా మాద
ధ్యాత్, ఆదిత్యానాంత్వా దేవానాం వ్రతపతే! వ్రతేనాదధామీ త్యన్యాసాం

ఆ॥ హారితగోత్రమందు నావిర్భవంబాది।యుర్వి నేనయొకఁడ నుండలేదు
అగుదు నేనుగూడనందఱతో పాటు।బ్రాహ్మణుఁడనో లేక పంచముఁడనొ॥

కం॥ * సానగసనాతనాదులు మానులటంచ నెడినూ క్తి మాకిష్టమెయా
మానము లేదెటఁ దత్సం।తానము వీరలదియనుచుఁ దథ్యముగాఁగన్।

* సానగ సనాత నాహభూన ప్రత్న సుపర్ణులను ఏగురు ఋషులు-ప్రతివాదులజాతికిఁ బూర్వికులు-వీరు బ్రాహ్మణులు-మాగోత్రఋషులందఱును వీరిసాంప్రదాయము. ఈఏగురు పంచముఖబ్రహ్మ ఏముఖములనుండి పుట్టినారు. ఈసంగతి నాగరఖండము 114వపుటలోనున్నది. ఈనాగరఖండము స్కాందపురాణములో నొకభాగము. దీని 88వపుటలో సానగుఁడు మనువని చెప్పఁబడియున్నది. (కోర్టువారి రిమార్కు) (ఈపుస్తకము తాటియాకులదైనందున నాక్షేపించుచున్నారు. నాగరఖండము స్కాందములో నొకభాగమని యుభయవాదులు నొప్పుకొన్నందున నిజమైననాగరఖండము నిప్పుడు దాఖల్ చేసినపుస్తకము నొక్కటేయని రుజువుచేయుపరకుమీద నొప్పుకొనుచున్నాను)

బ్రాహ్మణీనాం ప్రజానాం,

వి॥భా॥ ......హే వ్రతపతే! కర్మస్వామిన్! అగ్నే భృగూణా మంగిరసాంచ సంబంధినాం వ్రతేన కర్మవిశేషేణ నిమిత్తభూతేన త్వామాదధా మీహేయత నేస్థాపయామీతి మంతార్థః ......గోత్రాంతరగతానాంబ్రాహ్మణానా మాదిత్యా ఏవ దేవతాః......

నాగరఖండము

శ్లో॥ * మనుః పూర్వముఖోద్భూతం మనో యామ్యముఖోద్భవం।
పశ్చిమాముద్భవంత్వష్టా శిల్పికా శోచిత్తరాననే॥
ఊర్ధ్వంచ తతఃసంభూతంపంచగర్భమునీశ్వరం।
పరశిపేవిశ్వకర్మా పుత్రస్తత్రైవమీశ్వరం॥
తద్విదామహానామానా కుమార్యవిశ్వకర్మణః।
మను ర్మయశ్చ త్వష్టాచ శిల్పీ త్వష్టా తథైవచ॥

శ్లో॥ ఏతేసాంగోత్రమాచక్షే శ్రుణుషణ్ముఖ! తత్వతః।
మనో సానగగోత్రస్య మయా స్సనాతనగోత్రకం॥
త్వష్టా భువనసగోత్రస్య శిల్పి ప్రత్నసగోత్రరో నః।
తక్షా సుపర్ణసగోత్రస్తు పంచగోత్ర ప్రకీర్తితః॥

కం॥ తామెవ్వరు బ్రాహ్మణులుగాఁ
బ్రేమించిరో యప్పుడుకూడి పెట్టుకొనినవౌ
నీమానులగోత్రంబులు
భూమీసురగోత్రయుతులై పూర్వము వీరల్॥ 64

శా॥ ఆధానాంతముకర్మమున్న యటులా యామ్నాయరాజంబునన్
బోధింపంబడియుండెఁగానఁ దొలుతన్ భూదేవులాత్మీయగో
త్రాధానంబొనరించి వీరలకుఁ దామార్త్విజ్యముల్సేయఁగన్
మేధాయుక్తిమెలంగఁజొచ్చిరిలపై మిన్నాగుల ట్లెంతయున్॥ 65

తే॥ ఆశ్వలాయన బోధాయనాదిసూత్ర
ప్రవరఖండంబులం దొక్క బ్రాహ్మణులను
గూర్చియే చెప్పఁబడియుండె గోత్రములు,త
దితరగోత్రంబు లట విపరింపఁబడవు 66

కం॥ * కాని పురోహితగోత్రాల్
పూనందగు క్షత్రవైశ్యపూరుషులనుచున్
గానంగఁబడెడిఁ దత్త
న్మౌనీశప్రోక్తములగు మతగ్రంథముల్. 67

ఆ॥ అగువశిష్ఠగోత్రుఁడల్ల శ్రీరాముండు
ధౌమ్యగోత్రుఁడగును ధర్మరాజు
గౌతమర్షిగోత్రకలితుండు జనకుండు
గర్గగోత్రుఁడరయఁ గంసహరుఁడు 68

ఉ॥ వర్తిలుచుండె నీక్రమమె వైశ్యులకున్ మును, పెందువల్లనో
వర్తనమందుఁ బ్రస్తుతము వారలకుం గనుపట్టదద్ది, యే
యార్తికొ పాలుపడ్డయవు దద్దియు వైదికకర్మమట్టులన్
బూర్తిగ మాఱియుండెననఁబోలెడి యోజన చేసిచూడఁగన్ 69

* నిర్ణయసింధువు తృతీయపరిచ్ఛేదము గోత్రప్రవరనిర్ణయము
క్షత్రియవైశ్యయోస్తు పురోహితగోత్రప్రవరావేవేతి సర్వసిద్ధాంత.

ఉ॥ క్షత్రియవైశ్యజాతులకుఁ జక్కవిధించిరి భూమిదేవతా
గోత్రము లార్యు లట్టుమను,కొంచెపుజాతియటంచు నాత్మ నే
మాత్రముఁ లెక్కలేకొ యెటొ మానిరి వీరికిఁ జెప్ప కేదియున్
ధాత్రి ననంత రార్యతతి తత్క్రమమేకొనె వీరిపట్లనున్ 70

తే॥ బ్రాహ్మణక్షత్రవిట్శూద్రవర్ణజనులు
కద క్రమాభ్యర్చనీయులుగాఁగనుంద్రు
వారితరువాతసంకరుల్, వారిపిదప
వరుస సంకీర్ణసంకరవర్ణజనులు 71

తే॥ ఉండెసంకరవర్ణంబు లుర్విమీఁద
నెన్నియో వానిప్రస్తావమేలయిపుడు
మన కలాదులవర్ణంబుమాత్ర మరయ
సత్యముఁగ నగుసంకీర్ణసంకరంబు 72

శా॥ తాంబూలాదికమిచ్చుపట్లసభలం దత్పక్కికైకొంచు లో
కం బాదిన్ ద్విజుగౌరవించుచును నిక్కర్మారు నంత్యుంగఁజే
యం బుట్టెం గలహంబు, లప్డు ద్విజులే యాథార్థ్యనిర్ణాయకుల్
గం బేరీర్ష్యజనించెవీరలకు వీరిన్ బ్రాహ్మణశ్రేణిపై॥ 73

తే॥ అటులనీర్ష్యజనించుచు నందుమీఁద
విశ్వకర్మకుఁ దమకును వెలయునట్టి
శిల్పసామ్యంబుగైకొని క్షితిని విశ్వ
కర్మకులజులమని చెప్పఁగాఁగడఁగుచు 74

తే॥ భువిఁ బ్రచారములోనున్న పూర్వధర్మ
ములకు వ్యతిరేకముగ నేమొ మొదలువెట్టి
జగడముల్ పెంపుచేసిరి సక్రమముగ
బ్రాహ్మణాదులతోడ నీ బత్తు లకట॥ 75

సీ॥ విశ్వసృష్టిస్థితివిలయకృత్తగు పరా
త్పరుఁడు మావిశ్వకర్మయెయటంచు

ఆవిశ్వకర్మాఖ్యుఁడౌ విరాట్పురుషుండు
వదనపంచకమున వరలుననుచు
మనుమయత్వష్ట్రాది ఘనులు తన్ముఖపంచ
కమునుండి యుత్పత్తిగాంచిరనుచు
సానగాద్యభిధానులైన మునీంద్రులు
మనుమయత్వష్ట్రాదిఘనులెయనుచు
వారె గోత్రర్షులెమాకు మీఱిరనుచు
అందువలనను మేము బ్రాహ్మణులమనుచు
వివదమానులుతామయి వేగఁదప్పు
తడకలల్లిరి యెన్నియో కడకువారు॥ 76

తే॥ అట్టితడకలలోనిదే యరసిచూడ
వీరినాగరఖండ మోవిజ్ఞులార!
కల్లగానట్టినాగరఖండమిపుడు
వేఱ నాగరలిపి నచ్చువేయఁబడియె॥ 77

శా॥ దానన్ వీరలుచూపుశ్లోక మొకటేన్ దైవాఱ దాగ్రంథమే
మానంబయ్యెడిఁగాని తప్పుతడకల్ మానంబుగా వెంతయున్
నేనెవ్వేనియుఁ దెన్నుఁజేసి మృదువాణిం దత్పురాణస్థితా
ఖ్యానంబుం బ్రకటింతు వీరినుడువుల్ కల్లగ్గనెంచన్ జనుల్॥ 78

శా॥ * లోపంబేర్పడివృత్తియందు రథములన్నాత్నంబుగంజేయు నా
బాపల్ మున్నగుమానుజాతులజనుల్ వర్షర్తులంజేయనాఁ
బాపారణ్యకుశారమాచుమిగుల్ భాసిల్లునాధానమం
చాపస్తంబుఁడుచెప్పియుంటనిజమే మా శ్రౌతసూత్రంబులన్॥ 79

* ఆపస్తంబశ్రౌతసూత్రము 240వపుటలో మొదటిమూడుకులములలో రథముచే
యువారియాధానమునకు మఱియొకలకమని చెప్పఁబడియున్నది.

* ఆపస్తంబశ్రౌతసూత్రము, అష్టమపటలము.

సూ॥ వసంతో బ్రాహ్మణస్య.....వర్షారథకారస్య,

తే॥ వసుధ సంకీర్ణసంకరవర్ణజాతు
లైనరథకారజనుల కాధానమందు
నేని యధికార మొసఁగుట కిష్టపడక
యమ్మునీశుండు వ్రాఁకుచ్చె నవ్విధమున॥ 80

కం సంకీర్ణసంకరంబగు।పంకపురథకారకులమె వర్షర్తులలో
సంకల్పింపందగు నిశ్శంకగనాధానమనుచు శబరునిమతమా॥ 81

తే॥ శబరుఁడన్నను సామాన్యజనుఁడు కాఁడు
శంకరాచార్యులే తానుసలిపినట్టి
సూత్రభాష్యంబునందుఁ దత్సూరినుడిని
గ్రహణచేసెఁ బ్రమాణంబుగాఁగమున్ను॥ 82

---

వ్యా॥ ఆధానకాలఇతి శేషః-కిమత్రరథకారఇతి ద్విజాతిభ్యోన్యజాతీయ స్యాంతరప్రభవ స్యగ్రహణం నేత్యాహ,

సూ॥ యేత్రయాణాంవర్ణానా మేతత్కర్మకుర్యు స్తేషా మేషకాలః,

వ్యా॥ త్రిషువర్ణే ష్వంతర్భూతాఏవ స్వవృత్తికర్మతా యే రథంకుర్వంతి తేషా మయ మాధానకాలః,

* మీమాంసాదర్శనె షష్ఠాధ్యాయే ప్రథమపాదే చాతుర్వర్ణాతిరిక్తస్య రథకార స్యాధానే ధికారాధికరణం

సూ॥ వచనాద్రథకార స్యాధానేస్య సర్వశేషత్వాత్

శాబరభాష్యం॥। ఆధానేశ్రూయతే వర్షాసురథకార ఆదధీతఇతి, తత్రసందేహః కిం త్రైవర్ణికానా మన్యతమో రథకారః, ఆహో స్విత్, అత్రైవర్ణికఇతి, కింప్రాప్తం?రథకార స్యాత్రైవర్ణిక స్యాధానమేతత్ ......నాస్తిత్రైవర్ణికో రథకారః,ప్రతిషిద్ధంహి తస్య శిల్పోపజీవిత్వం

సూ॥ సౌధన్వనాస్తు హీనత్వాత్, మంత్రవర్ణాన్ప్రతీయేరన్

శా॥భా॥ నతు సర్వఏ వాత్రైవర్ణికో రథకారః,సౌధన్వనాఇత్యేష జాతివచన శ్శబ్దః సౌధన్వనామ జాతి రభిధీయతే,హీనాస్తు......త్రైవర్ణికేభ్యః- జాత్యంతరం ...తేషా మిదమాధానం కథమవగమ్యతే? ప్రసిద్ధేర్మంత్రవర్ణాచ్చ మంత్రవర్ణోహిభవతి సౌధన్వనా బుభవ శ్సూరచక్షుషఇతి-బుభూణాంత్వేతి రథకార స్యాధానమంత్రః-తస్మాత్ సౌధన్వనాబుభవఇతి-బుభవశ్చ రథకారాః- అపిచ నేమింనయంతిబుభవోయథాఇతి యే నేమింనయంతి తే బుభవ అభ్యుచ్యంతే-రథకారాశ్చనేమింనయంతి-తస్మాదత్రైవర్ణికానాం..ఏతదాధానమితి,

క॥ అచ్చుపడియున్న దదియు వి
యచ్చరలిపి, దానఁగూడ నలరారవు పీ
రిచ్చెడి ప్రమాణవచనము
లెచ్చో స్వబ్రాహ్మణత్వ మిఁకఁ జూపెదరో॥ 88

క॥ జనమంచివంశజులలో
ఘనులగు శేషాద్రిశర్మగా రద్దానిన్
దెనిఁగించియున్న వారలు
గొనిచదివినఁ దెలియు వీరిగు ట్టెల్లరకున్॥ 89

ఆ॥ *పలువురిట్లు లేవొకలవు బ్రహ్మాండపు। రాణమందటంచు వ్రాయుచుం
డ్రుకానియవ్వియెల్లఁగనఁబడవద్దానఁ। గల్లలైనయట్టి కారణమున॥ 90

ఆ॥ తాటిఋూకులందుఁ దాము బ్రహ్మాండపు
రాణమనుచు నేమొ వ్రాసికొని ప్ర

---

*ఆంధ్రబ్రహ్మాండపురాణము సంపాదకీయభూమిక రెండవపుట.

కొంద అలసులు స్వేచ్ఛగాఁ గొన్నికథలనుగల్పించి యవి ప్రమాణములుగ బరిగ్రహింపఁదగినవని నిర్ధారణచేయుటకు నివి బ్రహ్మాండపురాణములోనివేయని చెప్పు చుందురు-ఎన్నియో స్థలపురాణములు, ఎన్నియో వ్రతములు, ఎన్నియో గాథలు, ఎన్నియో రాఁబోవువృత్తాంతములు దీనియందున్నట్లు చెప్పుచుందురు-ఇట్లుచెప్పునట్టివారు కొంచెము చదువుకొనినవారేకాఁబట్టి యెచ్చటనైనం జూడనిది చెప్పసాహసింతురా యని కొందఱునమ్ముదురు-నేను భగవద్దివ్యక్షేత్రదర్శనాసక్తమతినై చిదంబరక్షేత్రము నకుంబోయి యాభగవద్దివ్యక్షేత్రమునుజూచి యాస్థలమాహాత్మ్యమునుజదివి తెనిఁగించిన మేలని నిశ్చయించితిని-తరువాత నొక్కమహాత్ముఁ డాక్షేత్రమాహాత్మ్యమునువివరించి యిది బ్రహ్మాండపురాణములోనిదని చెప్పెను-వేలొకపండితశిరోమణి నాయం దనురాగముకలవారగుటవలననే ఆమాట కల్లయనియు నాపురాణమును జూచినపిదపఁ దెనిగించవలసినదనియు హెచ్చరించిరి-బొంబాయికిబ్రాసి నూతనముగా ముద్రింపఁబడియున్న నీపురాణమును దెప్పించి చదివితిని-ఆ గాథ దీనియందు గనఁబడలేదు.బ్రహ్మాండపురాణ మనంతమని కొందఱుచెప్పుచుందురు-దీనిసంఖ్య పంన్రెండు వేలు-దీనిని సాంతముగాఁజదివితిని-ఇందు సర్వాసందర్భములైనగాథలులేవు.

మాణముఁగనుదాసి మనవారుదాఖలు
చేయఁ దీసికొనిరె న్యాయకర్త॥ 91

తే॥ *బ్రాహ్మణోత్పత్తిమార్తాండపఙ్క్తినింక
వారయర్థవలె ధీరు లత్యాదరమున
అచ్చుపడియుండెనది సంస్కృతాక్షరముల
బొంబయిం, గాని డే టందు బోధపడదు॥ 92

క॥ †హరికృష్ణుండను పేరున। వరలెడివిద్వాంసుఁడంట వ్రాసినదది, యాహరి
కృష్ణుం డెక్కలభూ। సురుఁడఁట, యవ్వారెయుంటక్షోణిని శ్రేష్ఠుల్॥

క॥ తత్తద్గ్రంథములంగల। మొత్తపుసారమునుదీసి ముద్దుగఁదనవిద్వత్తబ

*బ్రాహ్మణోత్పత్తిమార్తాండము ర62వ పుటలోఁ బాంచాల బ్రాహ్మణులయుత్పత్తి చెప్పఁబడియున్నది- ౫ గురుఋషులు బ్రాహ్మణులైనట్లున్నది. ఈ ౫ గురుఋషులు చెప్పబడియుండఁబట్టియు మాపూర్వికులుకూడ నీ౫గురుఋషులే కాఁబట్టియు మాజాతివారికి వీరే ఋషులైనట్లు చెప్పచున్నాను (కోర్టువారిరిమార్కు) (ఈ బ్రాహ్మణోత్పత్తిమార్తాండముకూడ దాఖల్ చేయఁగూడదని యాక్షేపించిరి. ఇది బొంబయిలో సంస్కృతమున ముద్రింపఁబడినగ్రంథము- ఇది యీతగాదా కనుకూలించునిమిత్తమై చేయఁబడినదని నేనుఁదలఁచను. ఎంతవఱకుప్రమాణగ్రంథమో ముందాలోచింపఁబడును. ప్రకృతము దాఖల్ మాత్రము చేసికోఁబడినది)

*బ్రాహ్మణోత్పత్తిమార్తాండము పాంచాలబ్రాహ్మణోత్పత్తి ప్రకరణము లైంగశైవాగమే,

శ్లో॥ బ్రాహ్మణానాంచజన్మైవ శివవక్త్రాచ్చజాయతే। పంచవక్త్రసముత్పన్నాః పంచభిః కర్మభిర్ద్విజాః॥ మను ర్మయ స్తథా త్వష్టా శిల్పికశ్చ తథైవచ। దైవజ్ఞః పంచమశ్చైవ బ్రాహ్మణాః పంచకీర్తితాః॥ మనుస్సంహారకర్తాచ మయోవై లోకపాలకః త్వష్టాచోత్పత్తికర్తాచ శిల్పికో గృహకారకః॥౩॥ దైవజ్ఞస్సర్వభూషాదికర్తావై హితకామ్యయా। లోకానాంపంచ పాంచాలాః అభూవన్ శివవక్త్రతః॥౪॥

†బ్రాహ్మణోత్పత్తిమార్తాండము ౧ వపుట

శ్లో॥ శ్రీగౌతమకులోత్పన్నో జ్యోతిర్విద్వేంకటాత్మజః హరికృష్ణః కరోమ్యత్ర బ్రాహ్మణోత్పత్తినిర్ణయం॥

యల్పడఁ జేయుచు। నత్రీరున ద్రావా సెనంటయతఁడరయుఁడింకన్॥ 94

ఆ॥ ఉండిరంటవిప్రు లుర్వి నెన్నబదిరెండు
తెఱఁగులుగను, వారితీరులెల్ల
బోధపఱచఁ టకును బూనె నఁటీతండు
సాంతకవనమందుఁ జొన్పికొనుచు॥ 95

క॥ తనశ్లోకము లేవో పురా
తనవుఁ శ్లోకంబు లేవో తద్గ్రంథమునన్
గనుగొన నశక్యమయ్యెడి
ఘనులకు నేని కలగూరగంపయియుంటన్॥ 96

క॥ కొందఱ బ్రాహ్మణులుగ మఱి
కొందఱ నుపబ్రాహ్మణులుగఁ గూరిచె నా భూ
బృందారకవర్యుండట
సందేహము వలవదింక త్స్మాసురులారా!॥ 97

క॥ *పాంచాలబ్రాహ్మణులని। యంచు నుపబ్రాహ్మణజనమందేపిరిన్
వంచించివ్రాసెనతఁ,డది। కొంచుంజనుదెంచి రెందుకోకోర్టుక హా॥98

తే॥ విశ్వశబ్దాదులైమున్న వెలసియుండి
మగుడఁ బాంచాలశబ్దాదులగుదురోటు
విశ్వపాంచాలశబ్దార్థవేత్తలార!
ఏమిసంబంధమీరెంటి కెఱుఁగఁ జెప్పుఁడు॥ 99

క॥ †బ్రాహ్మణులుగానివారలు
బ్రాహ్మణులము మేమటంచుఁ బైఁబడ విశ్వ
బ్రాహ్మణతంగొనిరఁట త
ద్బ్రాహ్మణులకుఁ దమకు భేదభావముఁజూపన్॥ 100

---

* బ్రాహ్మణోత్పత్తిమార్తాండము ౪వ పుట

శ్లో॥ ఉపబ్రాహ్మణనామ్నా వై పాంచాలాశ్చ తతఃపరం.

†కమసాలులు మదరాసు ప్రెసిడెన్సీ సెన్సుసూపరెంటెండెంటునకుఁ బంపినమహాజరర్జీ ...నిస్సందేహముగాను, యేకగ్రీవముగాను అర్జీదారులు నిజమైనబ్రాహ్మణులని

కం॥ బ్రాహ్మణులు కాసివారలు। బ్రాహ్మణులమటంచు వచ్చిపైఁబడ
సత్యబ్రాహ్మణతంగైకొనఁద। ద్బ్రాహ్మణులకుఁదమకుభిన్నత ల్దేలవోకో॥

తే॥ ఏలయొక్కఁడు తాటిచెట్టెక్కటన్న
దూడగడ్డికినన్నట్టి దుడుకువ్రాలె
నేదియోచెప్ప నది విశ్వసించుటకును
భువిని విద్వత్తశూన్యమైపోయినదియె॥ 102

కం॥ విశ్వబ్రాహ్మణశబ్దం
బశ్వప్రుతమట్లు వ్యర్థమగునని యనుచున్
శశ్వత్ఖండన చేయ న
విశ్వాస్యఫ్రుషక్కి యొకటి వెదకికొని రిటుల్॥ 103

కం॥ పాంచాలదేశసంభవు । లంచుండిన నొక్కవేళ ననఁదగు నేమో
పాంచాలబ్రాహ్మణులని । యెంచన్ హరికృష్ణుఁడటుల నెటఁజెప్పఁడుగా॥

కం॥ మనుమయముఖులైదుగురున్ । ఘనులును బాంచాలనామకబ్రాహ్మ
ణులంచని చెప్పినతండచ్చటఁ । గనఁ బాంచాలతకు నేమి కారణముండున్॥

తే॥ *వరులు కొందఱు తారుపబ్రాహ్మణులయి
మనుమయాదులఁ గొల్తురంచనియెగాని
మనుమయాదికవంశసంభవులెయగుదు
రాయుపబ్రాహ్మణులటంచు ననఁడతండు॥ 106

---

తెలియపరచుచున్నవి-"విశ్వ"అనుపదము అర్జిచారులయొక్కవర్ణము ప్రస్తుతకాలములో బ్రాహ్మణులమని చెప్పకొనెడివారివర్ణమునుండి భేదము తెలుపుటకుఁ బసర్గిగానుంపబడెను

*బ్రాహ్మణోత్పత్తిమార్తాండము పాంచాలబ్రాహ్మణోత్పత్తిప్రకరణము

శ్లో॥ స్వాయంభువస్య పుత్రాశ్చ జ్యేష్ఠోథర్వా ప్రకీర్తితః సామవేదో యజుర్వేదః క్రిమా దృగ్వేదఏవచ॥౨౭॥ వేదవ్యాసః పంచమోథ ప్రియవ్రత ఉదీరితః। ఏతే వ ణ్మఖ్యవిప్రాశ్చ తూపవిప్రా నథోశృణు॥౨౮॥ ఆద్యశ్శిల్పాయనశ్చైవ। గౌరవాయనఏవచ। కాయస్థాయన ఆఖ్యాత స్తతో వై మాగధాయనః॥౨౯॥ బ్రాహ్మణానాం శిఖాసూత్రం ముఖ్యానాంపరికీర్తితం తథా చైవోపవిప్రాణాం విహితం చ విరించినా॥౩౦॥
... శిల్పాయనస్యయేపుత్రా స్తేషు జ్యేష్ఠశ్చ లోహకృత్ సూత్రధారః ప్రస్తరారి

కం॥ * శ్రుతి నాధానపుమంత్ర। ప్రతతికిభాష్యంబుచేయుపట్లను నిక్లే
నుతిపాత్రుండగు విద్వ।త్పతి విద్యారణ్యయతియుఁ బదపడివ్రాసెక్॥
కం॥ కరణీమాహిష్యుల కు। ర్వర జననంబందినట్టి రథకారుల కే
పరఁగెఁడి నాధానంబని। పరమునులుం జాలమంది వ్రాసిచ్చిరిమున్
ఆ॥ ఇంతమందిభావ మేకీభవింపంగ నొకనియాశయమున కొప్పు టెట్లు?
మొదలు బ్రాహ్మణత్వముంబొందినంగడ అతనినుడిప్రమాణమగుట కేని॥
కం॥ అందులకై యత్యధికా। నందంబునఁజూపఁబడియె నాగరఖండం
బందెనదినిప్ర్రమాణత। యెందుఁదద్బ్రాహ్మణత్వమేపారెడినో॥86
కం॥†బ్రహ్మాండపురాణంబున। బ్రహ్మకుముఖపంచకంబుపరఁగుటయుం ద
ద్బ్రహ్మముఖపంచకంబున బ్రాహ్మణఋషులుదయమగుటబద్ధపునుడియౌ

†బ్రహ్మాండపురాణము 12వపుటలోఁబంచముఖబ్రహ్మ 5ముఖములనుండి 5గురు ఋషులుపుట్టినారని చెప్పఁబడియున్నది. ఆపంచముఖబ్రహ్మయే నిజమైనబ్రహ్మ (ఈ పురాణముకూడఁ దాటియాకులపుస్తకము, అందున నిజమైనబ్రహ్మాండపురాణము నిది యు నొక్క టేయనిచూపెడిపరతుమీఁద దాఖల్ చేసికొనుటయైనది)

* కృష్ణయజుర్బ్రాహ్మణము 1వఅష్టకము 1వప్రకరణము 34వఅనువాకము
శ్రు॥......ఋభూణాంత్వా దేవానాం వ్రతపతే॥। వ్రతేనాదధామీతి రథకారస్య
వి॥ భా॥ యస్యపురుషస్య యాభిమానినీదేవతా తామనతిక్ర మ్యాధానం......రథకారోనా మానులోమజః, సంకీర్ణ జాతిః తస్య ఋభవో,దేవతాః ఏతైర్మంత్రైర్యథాదేవత మాధానం సంపద్యతే, అత్ర మీమాంసాష్యష్ఠాధ్యాయస్య ప్రథమపాదే చింతితం, శ్లో॥ విషాదిరేవరథకృ దన్యోవాదోస్తుయోగతః రూఢేర్వర్ణాంతరంత స్యాధానే వర్షరుచ్యతే॥ అథాన్యశ్రూయతే వర్షాసు రథకార ఆదధీతఇతి తత్ర రథంకరోతీతివ్యుత్పత్యా త్రైవర్ణికో రథకార ఇతిచేన్నైవం, సంకీర్ణజాతివిశేషే రూఢత్వాత్ వైశ్యాయాం క్షత్రియాదుత్పన్నో మాహిష్యః శూద్రాయాం వైశ్యాదుత్పన్నా కరణీ - తస్యాం కరణ్యాం మాహిష్యాదుత్పన్నో రథకారః-తథాచ యాజ్ఞవల్క్యః శ్లో॥మాహిష్యేణ కరణ్యాంతు రథకారః ప్రజాయతఇతి,తస్యచ రథకార స్యాధానకాలో వర్షర్తు॥

క॥ పూర్వోత్తరసందర్భాల్ । తార్వేతకికానంగలేక తత్సభదానిన్
ముర్వీనదాఖల్చేసినఁ । బేర్వాసింగాంతురటవె పృథ్వింబత్తుల్ ॥107

క॥ హరికృష్ణువాక్యమొదటికి
సరియగుమానంబుగాదు, సకలపురాణాల్
పరికించివ్రాసినాడన
నరసితి, మయ్యాదియు నన్నృతమై కనుపట్టెన్ ॥ 108

తే॥ ఆది “లైంగే శివాగమే” యనుచుఁ గానఁ
బడెడిఁ బాంచాలబ్రాహ్మణప్రకరణమున
అరయ “లింగపురాణశివాగమోక్తు
లవ్వి” యనియగుఁ బ్రాజ్ఞుల కర్థమచట॥ 109

క॥ లింగపురాణమునందీ । సంగతియేకానఁబడదుసరిగఁబఠింపన్
దొంగప్రమాణములనకేటు । లంగీకార్యంబులౌనుహరికృష్ణునుడుల్

క॥ మంచిదియంగీకార్యమె । యంచువచించుదముగాకహరికృష్ణునుడిన్
పాంచాలబ్రాహ్మణతకు । నంచితమైనట్టిహేతువగుపడదచటన్ ॥

క॥ అగుపడకపోవుఁగాకది । తగవిశ్వబ్రాహ్మణులుగఁదాముండుచు నె
ట్లుగఁబాంచాలబ్రాహ్మణు । లగుదురుమనవాగుమరలనాలోచింపన్

---

స్తామ్రికారస్సువర్ణకః ॥౩౯॥ ................శిల్పవేదశ్చశిల్పానాం పంచానాం పరికీర్తితః అధ్యయనంచతత్రైవ సంహితాపంచకంస్మృతం॥ ౪౧॥ శిల్పాయనసుతో జ్యేష్ఠో మనోశ్శిష్యత్వమేత్యవై । పహారసంహితామాద్యాం ధాతువేదస్యలోహకృత్ ॥౪౨॥ సూత్రధారోద్వితీయోథ మయశిష్యత్వమాదరాత్ సంహితాం సూత్రధారాఖ్యా మపఠత్కాకమేవచ ॥౪౩॥ శిల్పాయనసుతిస్తష్టా శిల్పేశిష్యత్వమాదరాత్ స్వశైలసంహితాంతస్మా త్పపాఠభృగునందన ॥౪౪॥ అథతామ్రకరశ్శిష్య శ్శిల్పకస్యాభవత్పురా । శిల్పాయనసుతస్తుర్య స్త్వపఠత్తామ్రసంహితాం ॥౪౫॥ నాడింధమోథశిష్యోభూ ద్దైవజ్ఞస్యైవపంచమః। సుతశ్శిల్పాయనస్యైవ పపాఠస్వర్ణసంహితాం ॥౪౬॥ పాంచాలా మానవా ఏతే ఏతేషాంసంతతిస్తథా ॥౪౭॥మృత్యులోకేచతేసర్వే ఉపబ్రాహ్మణసంజ్ఞకాః అథైషాందేవతాఃపంచ విశ్వకర్మముఖోద్భవాః ॥౪౮॥ మను ర్మయస్తథా త్వష్టా శిల్పకశ్చతథైవచ దైవజ్ఞఃపంచమఃప్రోక్త స్స్వర్గస్థా యజ్ఞపోషకాః॥౫౦॥

తే॥ మేక మెడఁ జన్నులట్లు మన్మిత్రతతికి
విశ్వపాంచాలతల్ రెండు వెలయుఁగాక
అ వృషబ్రాహ్మణత్వంబె యందుఁగాని
వాస్తవబ్రాహ్మణత్వంబు వచ్చుటరిది॥ 113

తే॥ వ్రాసి బ్రాహ్మణభేదముల్ వరుసనతఁడు
కోర్కెఁబలితులకును గుండగోళకులకు
నడుమఁజేర్చెను బాంచాలనామకులను
అతఁ తాత్పర్యమేమొనో యరయుఁడింక॥ 114

తే॥ మాదిబ్రాహ్మణవర్ణమఁ మాటవీరు
మొదలుపెట్టిరి బహుకాలమునకు మున్నె
కానఁ దల్లిఖితంబులో కారిక లెవ్వి
దొరకి హరికృష్ణుఁ డచ్చోట దూర్పవచ్చు॥ 115

తే॥ బ్రాహ్మణోత్పత్తిమార్తాండపక్కి యెల్ల
నీవిధంబుగ నేయుండు నెంచిచూడ
పుక్కిటిపురాణములు దానఁ బుట్లుపుట్లు
కలవుగాని ప్రమాణవాక్యములు లేవు॥ 116

తే॥ సంకరబ్రాహ్మణులటంచు సాహసించి
వ్రాయఁజాలక యనె నుపబ్రాహ్మణులని
కాని యటు తాదృశపురాణకారుఁడైన
వలనిభావంబు బ్రాహ్మణులనుచుఁగాదు॥ 117

కం॥ *ప్రాగుక్తసానగాదులు। యాగంబులలోన నెపుడొ యార్త్విజ్యంబుఁ
బాగుగ నొనర్చిరనియన। సాఁగెఁ మనస్వర్ణకారశాస్త్రి వినుండీ॥ 118

---

*పైనఁజెప్పబడిన ౫గురుఋషులను గృష్ణయజుర్వేదము ౪౧వ పుటలో యాగములయం దార్త్విజ్యముచేయువారని చెప్పఁబడియున్నది.

---

*కృష్ణయజుర్వేదము ౪వ కాండవము ౩వ ప్రపాఠము ౩వ అనువాకము
మూ॥ ప్రాచీదిశాం వసంతఋతూనా మగ్నిర్దేవతా... సానగఋషిః
వి॥ భా॥ హేఇష్టకే దిశాంమధ్యే యాప్రాచీ సా త్వమసి-ఋతూనాంమధ్యేయో వసం

ఉ॥ ఇంతకుమున్ బురాణములనిచ్చెఁ బ్రమాణముగాఁగ, నవ్వి యా
వంతయునిల్వ వయ్యె, నిపుడాతఁడు కృష్ణయజుస్సులోని కొ
క్కింతప్రవేశమున్ సలిపె, నివ్విధశ్రుతుల్, మనతప్పటూహలా
ప్రాంతమువోనదక్షులు, భాష్యము తేల్చుఁ దదర్థమంతయున్॥ 119

కం॥ చయనంబున నొకక్రియనయ్యాయిదిశలందిష్టకములనమరుచు పట్లన్ని
యమమునను మవ్రుమంత్రంబులయున్నది యతఁడు చూపునయ్యదిచూడన్

కం॥ ఆయాయిదెసలనుంచుచు నాయిటికల "పానగాదుపై తిరిమీ" రం
చాయజమానుండనినటు లేయర్థం, బుండదంత కెక్కువయుచటన్॥

కం॥ చదివినవి పంచకావ్యాల్
చదివించినగురులు బ్రహ్మజాతులు కాగం
చెదిరో వదరన్ మొదలిడె
నెదకిఁక నిగమార్థసారమెటు లెక్కెడినో॥ 122

చ॥ అఱమఱలేకటుల్ శ్రుతి కపార్థము చెప్పినఁ గోర్టువారి కా
పరిచితిలేనిహేతువున భర్త్సనసేయక యూరకున్న వా
రెఱుఁగని వారికెల్లరకు సందలియర్థము విప్పిచెప్పి యా
పురుషుని బైసునుం గడిగిపోయక పండితు లూరకుందురే॥ 123

తే॥ *పిలువ రహాభూనుఁ ద్వష్టయన్ పేర నెవరు

---

*అహాభూనఋషియే త్వష్టయని పిలువఁబడును. అహాభూనునకు విశ్వరూపాచార్యుఁడను కొడుకుండెను. అతఁడు దేవతలకుఁ బురోహితుఁడు- కృష్ణయజుర్వేదము [illegible]వపుటలో నిట్లు చెప్పఁబడియున్నది.

---

తస్త్ర ద్రూపాసి- దేవతానాంమధ్యే యోగ్ని స్తద్రూపాసి...ఋషీణాంమధ్యే యస్సాన
గాఖ్యఋషి స్తద్రూపాసి,
మూ॥ దక్షిణాదిశాం గ్రీష్మఋతూనా మింద్రోదేవతా...సనాతనఋషిః
ప్రతీచీదిశాం...అహాభూనఋషిః
ఉదీచీదిశాం...ప్రత్నఋషిః
ఊర్ధ్వాదిశాం...సుపర్ణఋషిః
*కృష్ణయజుర్వేదము. [illegible]వపుట
మూ॥ విశ్వరూపోవై త్వాష్ట్రః పురోహితోదేవానా మాసీత్,

తే॥ చెలఁగి యేమాటనే వీరు చెప్పనింపు
నట్టి యెచటనో కర్మంబు పెట్టినటుల
నుండెడింగాని సంబంధ మొక్కయింత
గానఁగాఁబడ దది యేమికారణంబొ. 126

తే॥ అటు లసంబద్ధవాక్యంబు లాడువారి
నోరుమూయించె నల సుధర్ముండు మున్ను
మనదుపరిపాలకుల కట్టి మంచిబుద్ధి
పుట్టినంగాని వీరినో ర్మూతవడదు. 127

తే॥ విబుధగురుభాగినేయుఁడౌ విశ్వకర్మ
గాను దద్విశ్వరూపుండుగాను మరల
నాద్యుఁడౌ విశ్వకర్మయే యవతరించె
ననుచు మనవార లోకయుక్తి ననుసరింత్రు. 128

తే॥ అనుసరింతురుగాక యయ్యాద్యునకును
విశ్వకర్మాఖ్య రూఢమై వెలయవలదె
యోగమున నేని యయ్యాఖ్య యుండనింతు
వైదె మెట్లింత మాతని కాననములు. 129

ఆ॥ * తలలువేయిగలిగి తనర నప్పూరుషుం
డన్నిటికి యుంత్రె వైదుతలలు
వాహవావహావ్వ! వడ్రంగమన నిట్లు
లుండవలయుఁజూడి యుర్విమీఁద. 130

ఆ॥ † ఐదుతలలవాఁడు హరుఁడుగా నీవెట్టి। యొలవుట్టెవీరి కితనికెడరి
వసుధమీఁద నిట్టివార లెకాఁబోలు। తలలుమార్చునట్టి ధన్యతములు.

---

* పురుషసూక్తము

శ్రు॥ సహస్రశీర్షా పురుషః, సహస్రాక్షః స్సహస్రపాత్.

† శివాష్టోత్తరశత నామములు.

శ్లో॥ హవిర్యజ్ఞమయ స్సోమః పంచవక్త్ర స్సదాశివః.

పిలుతురో పిల్వరో దాని నిలుఁపుడట్లు
*విశ్వరూపునితండ్రియై వెలయుత్వష్ట 124
యదితినందనుఁడౌఁగాని యతఁడుగాఁడు॥

సీ॥ పంచవక్త్రంబులఁ బరఁగెడియాతఁడె
భావింప వాస్తవబ్రహ్మయనియు
విశ్వసృష్టిస్థితి విలయాదికము లెల్ల
నాతనినుండియే యైనవనియు
బ్రాహ్మణులైనట్టి త్వష్ట్రాదులేన్గుర
ప్పూరుషవక్త్రములందుఁ బుట్టిరనియు
తమజాతివారికిఁ దత్త్వష్ట్రముఖ్యులే
యొగి మూలపురుషులై యుండిరనియు
చెప్పుకొనుచుందురీరలకెప్పుడేని। విబుధగురుభాగినేయుఁడౌ †విశ్వకర్మగాని
య‡విశ్వరూపుఁడుగానిమరల। నెట్లుసంబంధులగుదురో యెఱుఁగఁబడదు॥

---

†విష్ణుపురాణము ౧౮వపుటలో విశ్వకర్మ బృహస్పతి చెల్లెలికుమారుఁడని చెప్పఁబడినది. ‡భాగవతములోఁ ద్వష్టకుమారుఁడు త్వాష్ట్రుఁడనియు దేవేంద్రుఁడు విశ్వరూపాచార్యుని బురోహితునిగానుండుమని ప్రార్థించెననియు నతఁడు బ్రాహ్మణుఁడనియు వర్ణించియున్నాఁడు.

---

*భాగవతము షష్ఠస్కంధము

వ॥ ...అదితివంశంబును వివితంబుగావినిపించెద సావధానుండవయి వినుము, వివస్వంతుండును నర్యముండును బూషుండును ద్వష్టయు సవితయు భగుండును ధాతయు విధాతయు వరుణుండును మిత్రుండును శక్రుండును నురుక్రముండును నను మనువులు జన్మించి రందు...ద్వష్టకు దైత్యానుజయైన రచనయనుకన్యకకు నధికబలాఢ్యుండగు విశ్వరూపుండుపుట్టె

†విష్ణుపురాణము ౧వఅం ॥ ౧౫వఅధ్యాయము

శ్లో॥ బృహస్పతేస్తుభగినీ వరస్త్రీ బ్రహ్మచా[illegible] విశ్వకర్మామహాభాగ స్తస్యాం జజ్ఞే ప్రజాపతిః,

‡భాగవతము షష్ఠస్కంధము

శ్లో॥ తద్విశ్వరూపం భజతాశువిప్రం తపస్వినం త్వాష్ట్ర మథాత్మవంతం ...వృణీమహే తోపాధ్యాయం బ్రహిష్ఠం బ్రాహ్మణం గురుం,

ఆ॥ వేయితలలుగల్గువిశ్వమయుండునుర్వి।గాఁడువీరిజనికిఁగారణంబు
ఐదుతలలుగల్గునయ్యీశ్వరుండునుర్వి।గాఁడువీరిజనికిఁగారణంబు.
ఆ॥ తలలుమూఁడుగల్గుతద్విశ్వరూపుఁడుర్వి।గాఁడువీరిజనికిఁగారణంబు
తలయొకండుగల్గుతద్విశ్వకర్మయుర్వి।గాఁడువీరిజనికిఁగారణంబు॥
ఆ॥ అంతరాళవర్ణులైనమాహిష్యుఁడుర్వి।గరణోవీరిజనికిఁగారణంబు
తాముவ్రాసికొన్న తాటాకుపొత్తాలఁ।గలదువీరికన్యకారణంబు॥
క॥ శ్రుతిఁగానిస్మృతులఁగానీ।యితిహాసములందుఁగానియీనానుడికిన్
వ్యతిరేకంబుగనుండినఁ।బలితుఁడనై కలిసిపోదుఁబంచమజాతిన్॥
ఆ॥ * స్వర్ణకారజాతి సర్వధా తద్విశ్వ
కర్మహేతుకంబు కాదుకాన
అతఁడు బ్రహ్మయొక్క యవతారమైనను
దండితనము రాదు దానికరయ॥ 136
తే॥ కాని యర్థంబుమాత్ర మక్కవణిఁగాదు
వారుచూపినయట్టి యావాక్యమునకు
వెలయు రెండవబ్రహ్మనా విశ్వకర్మ
యనుచుఁ దద్వాస్తవార్థంబు, కనుఁడుబుధులు॥ 147
తే॥ † బ్రహ్మకుదయించినటువంటి వారలెల్ల
వసుధ షట్కర్మలం జేయవచ్చునంట

---

* విష్ణుపురాణములో విశ్వకర్మ బ్రహ్మావతారమని చెప్పఁబడియున్నది
† మనుస్మృతి ౧౦వయధ్యాయము 74వశ్లోకములో బ్రహ్మకుజన్మించినవారందఱు షట్కర్మలుచేయవచ్చునని చెప్పఁబడియున్నది. అర్థము తెనుఁగులో వ్రాయఁబడియున్నది

---

* విష్ణుపురాణము చతుర్థాంశము ద్వితీయాధ్యాయము.
గద్య॥ తత్ర చాశేషశిల్పకల్పప్రణేతారం ధాతారమివాన్యం విశ్వకర్మాణ మాహూయ......43

† మనుస్మృతి ౧౦ వ యధ్యాయము.
శ్లో॥ బ్రాహ్మణా బ్రహ్మయోనిస్థా యేస్వకర్మణ్యవస్థితాః
తేసమ్యగుపజీవేయుః షట్కర్మాణి యథాక్రమం॥ 24

బ్రాహ్మణుల కొక్కరికిఁదక్కఁ బరులకున్న
కర్మషట్కంబునం దధికారపదవి। 138

తే॥ * మనువులకుఁ దప్పుదిద్దెడి ఘను వసిష్ఠు
నేమొ తలక్రిందుచేయంగ నెంచి యిత్తఁడు
చూపె మనుధర్మశాస్త్రముం దోఁపినన్ని
శ్లోకములు కోర్టులోనఁదా సాకిరియయి. 139

---

* 3 వయధ్యాయము 15,16,17వశ్లోకములలోఁబ్రాహ్మణపురుషునకును బ్రాహ్మణేతరస్త్రీకిని బుట్టినవారు బ్రాహ్మణులుకారనియు నీచులనియు నందువలనషట్కర్మలు చేయుట కధికారములేదనియుఁ జెప్పఁబడియున్నది.

† ఈయధ్యాయములోని19వశ్లోకమునందుఁ బ్రాయశ్చిత్తమువలన నట్టిసంకరులకు శుద్ధికలుగనేరదని చెప్పఁబడియున్నది.

‡ 11 వయధ్యాయము175వశ్లోకములో బ్రాహ్మణుఁడు బుద్ధిపూర్వకముగాఁ జండాలస్త్రీనివివాహమాడినయెడలఁ జండాలుఁడగునని చెప్పఁబడియున్నది

§ 1 వయధ్యాయము 93,94వశ్లోకములలో స్వాయంభువగుబ్రహ్మ మొట్టమొదటఁ దనముఖమునుండి బ్రాహ్మణులఁబుట్టించెనని చెప్పఁబడియున్నది

---

* మనుస్మృతి తృతీయాధ్యాయము.

శ్లో॥ హీనజాతిస్త్రియంమోహా దుద్వహంతో ద్విజాతయః । కులాన్యేవ నయంత్యాశు ససంతానాని శూద్రతాం॥15॥ శూద్రావేదీ పతత్యత్రే రుతథ్యతనయస్యచ। శౌనకస్యసుతోత్పత్త్యా తదపత్యతయా భృగోః॥16॥ శూద్రాం శయనమారోప్య బ్రాహ్మణో యా త్యధోగతిం। జనయిత్వా సుతంతస్యాం బ్రాహ్మణ్యాదేవ హీయతే॥17॥

శ్లో॥ వృషలీఫేనపీతస్య నిశ్వాసోపహతస్యచ। తస్యాంచైవప్రసూతస్య నిష్కృతిర్నవిధీయతే॥ 19

‡ మనుస్మృతియేకాదశాధ్యాయము.

శ్లో॥ చండాలాదిస్త్రీయోగత్వా భుక్త్వాచ ప్రతిగృహ్యచ। పతత్యజ్ఞానతోవిప్రో జ్ఞానాత్సామ్యంతుగచ్ఛతి॥ 175

§ మనుస్మృతిప్రథమాధ్యాయము.

శ్లో॥ ఉత్తమాంగోద్భవా జ్జైష్ఠ్యా ద్బ్రహ్మణశ్చైవధారణాత్ । సర్వస్యైవాస్యసర్గస్య ధర్మతో బ్రాహ్మణఃప్రభుః॥ 93॥ తంహిస్వయంభూస్స్వాదాస్యా త్తపస్తప్త్వాదితోసృజత్। హవ్యకవ్యాభివాహాయ సర్వస్యాస్యచగుప్తయే॥ 94॥

కం॥ ఈచూపిన శ్లోకములా। ప్రాచీనుం దోషియనుచుఁ బల్కువు చుడి, ము
న్నే చూపంబడెనందుకు। నాచే నెన్నియొ నిదర్శనంబులు సరిగన్.
క॥ *గ్రామపురోహితు నెవరున్। భూమండలమందు శ్రాద్ధభోక్తను జేయన్
బ్రేమింపఁగూడదనియొక। ప్రామాణ్యము చూపెనితఁడు పారులకరరే.
ఆ॥ కాంతు చేసి నేను గ్రామపౌరోహిత్య
మాచరింతుననుచు నతని యూహ.
అందుకని యెవిప్పె నకటయీపంచాంగ
మొందుకనుచుమీరా లెంచినారొ. 142
సీ॥ అలజగన్మయుఁడైన యయ్యాదిపురుషున
కేనువక్త్రములుంట యెంతనిజము
బ్రహ్మకుఁ దర్వాతి బ్రహ్మయైన వసిష్ఠ
ఋషి దోషకలితుఁడౌ టెంతనిజము।
బ్రాహ్మణశాఖలం బ్రథములౌ వైదికు
లే సంకరులుగావు టెంతనిజము
వెడచూపుచేఁ జూడఁబడెకి యూకమసాలు
లిలను బ్రాహ్మణులౌట యెంతనిజము
గీ॥ స్వర్ణకారశాస్త్రి పల్కినపల్కు। లింత గాకయుంట యెంతనిజము
కష్టమనక నేను గ్రామపౌరోహిత్య। మాచరించుచుంట యెంతనిజము॥
తే॥ నిజముకాదో యగునో నిలిపితినివుడద్ది
శ్రాద్ధభోక్తలుగను సలుపఁదగని
వారు మనుమతమున వర్తిలుచున్నారు
పెక్కుమంది వారిపేళ్లు వినుఁడు. 143

* 8 వ యధ్యాయము 151 వ శ్లోకములో గ్రామపురోహితుని శ్రాద్ధమందు భోక్తను జేయఁగూడదని చెప్పఁబడియున్నది.

* మనుస్మృతి తృతీయాధ్యాయము.

శ్లో॥ ...... యాజయంతి చయేపూగా స్తాంశ్చ శ్రాద్ధేనభోజయేత్॥ 151

ఆ॥ * ఎవరు మగతనాన కెడమయియుండిరో
ఎవరు పతితులుగను నేర్చఁబడిరో
హవ్యకవ్యములకు నటువంటిబ్రాహ్మణుల్
కడుననర్హులనుచు నుడివెమనువు. 144

క॥ కలుదాఁపువాఁడు గురుసతిఁ
గలిసిప్రవర్తించువాఁడు కాంచనహారుఁడున్
బలిమిన్ బ్రాహ్మణుఁగొంతుక
నులిమి యసుల్ తీయువాఁడునుం బతితు లిలన్॥ 145

ఆ॥ † యతియు బ్రహ్మచారి యనధీతవేదుండు
ధూర్తజనుఁడు కరము దుర్బలుండు
గ్రామయాజకుండు నేమింపఁదగరెవ్వ
శ్రాద్ధభోక్తలుగను జనులచేత. 146

ఆ॥ ‡ ఇది దుకాణమొకటి యెప్పుడద్దానిచే
జీవనంబొనర్చు క్షితిసురుండు
వైద్యుఁ డర్చకుఁడు పలలవిక్రేతయు
హవ్యకవ్యముల ననర్హులరయ॥ 147

సీ॥ § గురుకార్యప్రత్యాహరుఁడు గానివాఁడును
వడ్డిచేజీవించువాఁడనగ్ని

---

* శ్లో॥ యే స్తేనపతితక్లీబా యేచ నాస్తికవృత్తయః। తాన్ హవ్యకవ్యయోర్విప్రా ననర్హాన్ మనురబ్రవీత్॥ 150

† శ్లో॥ జటిలం చానధీయానం దుర్బలం కితవం తథా। యాజయంతిచ యేపూగాం స్తాంశ్చ శ్రాద్ధే నభోజయేత్॥ 151

‡ శ్లో॥ చికిత్సకాన్ దేవలకాన్ మాంసవిక్రయిణ స్తథా। విపణేనచజీవంతో వర్జ్యాస్స్యుర్హవ్యకవ్యయోః॥ 152

§ శ్లో॥ ... ప్రతిరోద్ధా గురోశ్చైవ త్యక్తాగ్ని ర్వార్ధుషి స్తథా॥ 153

జీతంబుగొని విద్యఁ జెప్పువాఁడును జీత
మొసఁగి విద్యల నేర్చుచుండువాఁడు
నిష్కారణంబుగ నిజపితృ మాతను
గురుని ద్యాగము సేయు క్రూరతముఁడు
కొంపలుగాల్చెడి కూళ కుండాశియు
గరదుండు సోమవిక్రయిజనుండు
జూదమాడునట్టి శుంఠ మిత్రద్రోహి
పుత్రునొద్దఁ జదువఁబూనువాఁడు
పతదాదిమనుజులెల్ల శ్రాద్ధార్థమై
పిలువఁదగరటంచుఁ బలికె మనువు. 148

కం॥ మనుమతము ననుసరించిన
మనకుఁ శ్రాద్ధములఁ దగినమనుజుఁడె దొరకం
డనివార్యవుఁ బద్ధతియిది
ఘనపారాశర్యమతమె కలికర్వఁబా॥ 149

చ॥ అఘదమె గ్రామయాజకత యారయఁ గాని పరోపకారమా
స్వఘనతచూచుకొంచు ద్విజసంఘమె యూరకయున్న నెవ్వరీ
లఘుకృతినాచరించెద, రిలాసురకర్తృకమైనయాజనం
బు ఘటిలకున్న సాఁగుటెటు భూమిజనంబుల కర్మమార్గముల్.

శా॥ పౌరోహిత్య మొకింత నింద్యమయినన్ బ్రహ్మత్వబీజంబు, లో
కారాధ్యుండయినట్టి బ్రాహ్మణున కాయర్థం బిలం దప్ప, దా
ధీరుల్ మున్ను వసిష్ఠముఖ్యులును దారన్ దీనిన్ విడంజాల, రో
వారుల్ బొత్తిగఁ దీసివేయకుఁడు మీ ర్వాపంబటంచీపనిన్॥

ఉ॥ పాపము పాచితింబునను బాపుకొనందగు, నెంచిచూడఁగా
నీపని యూ ననన్యగతి, యింతకుమించిన హేతుశూన్యవున్

...భృతకాధ్యాపకోయశ్చ భృతకాధ్యాపితస్తథా...॥ 156॥ ...అకారణప
రిత్యక్తా మాతాపిత్రోర్గురోస్తథా...157...అగారదాహీ గరదః కుండాశీసోమవిక్ర
యీ...158...మిత్రధ్రుగ్ద్యూతవృత్తిశ్చ పుత్రాచార్యస్తథైవచ॥160॥

బాపము లాచరించుటకుఁ బాల్పడఁగూడదు కాని దీన నే
లోపము రాదు బాపలకు,లోకుల కో నుపకారమింకను౯॥ 152

సీ॥ పరఖండములకేగి బ్యారిష్టరట్లాలు
ప్యాసుకావుటకా దనన్యగతిక
మబల రజస్వలయామీఁద నుద్వాహ
మాచరించుటకా దనన్యగతిక
మపగతపతికయా నబలకుఁ బెండ్లిపై
నాసగొల్పుటకా దనన్యగతిక
ముడిగి వేదాభ్యాస మురుశిల్పములనెల్ల
నభ్యసించుటకా దనన్యగతిక
మితరశరణమైన యిత్యాదికము సేయు
బ్రాహ్మణునకుఁదగును బాపభీతి
ఒండుదిక్కు లేకయుంపు పౌరోహిత్య
మొనరుపఁగ ద్విజాతి కున్న భీతి॥ 153

ఉ॥ * వేదవిరుద్ధధర్మము లవిశ్వసనీయములంట,యెందుకీ
సోదె,యెవండెఱుంగఁడిది,చూపెనుదానెవియో యవే యగు౯
వేదవిరుద్ధముల్,దనదు వ్రేలని తాఁదన కన్నుఁ బొడ్చుకోఁ
గాదె యిటుల్ వచించుటలు,కానఁడు ముగ్ధత సీతఁ డక్కటా. 154

సీ॥ తాఁ గనంబఱచిన తద్వ్రజసూచియే
విఖ్యాతమైనట్టి వేదమనియు

---

* 12 వ యధ్యాయము 95 వ శ్లోకములో వేదవిరుద్ధములగుధర్మశాస్త్రములు ప్రమాణముగా నంగీకరింపఁబడవని యున్నది. మేము షోడశకర్మలు చేయుచున్నాము. మేము వేదోక్తముగాఁ గర్మలు చేయుచున్నాము. మామూలుగా విశ్వబ్రాహ్మణులనిపిలువఁబడు మా బ్రాహ్మణులలో షోడశకర్మలు చేయించువారున్నారు.

---

* మనుస్మృతి ద్వాదశాధ్యాయము

శ్లో॥ యా వేదబాహ్యాః స్మృతయో యాశ్చ కాశ్చ కుదృష్టయః। సర్వాస్తా నిష్ఫలాః ప్రేత్య తమోనిష్ఠా హి తాః స్మృతాః॥95॥

దానిలోన వసిష్ఠమౌని యూయూర్వశి
కన్న కుమారుఁడం చున్న దనియు
ఘనపురాణములఁ దజ్జని యన్యథాయుంట
పరఁగ నాచేఁ జూపఁబడినదనియు
అందుచేతవసిష్ఠు నంత రాళునిఁ జేయఁ
బూర్తిగా వీల్గాకపోయెననియు
చూచిచూచియితఁడు శ్రుతివిరుద్ధంబైన
స్మృతి ప్రమాణమనఁగఁ జెల్లదనుచుఁ
జెప్పునట్టియొక్క స్మృతివాక్కు సాధించె
నెంతకష్టపడెనో యేమొకాని॥ 155

తే॥ * ఉత్తమంబగుశ్రుతిలోనె యూర్వశికి వ
సిష్ఠఋషి వుట్టలేదంచుఁ జెప్పఁబడియె
చదివియద్దాని రథకారజనములార!
మావసిష్ఠునిదిట్టుటల్ మానుడింక॥ 156

---

* ఋగ్వేదము ౫వయష్టకము ౩వయధ్యాయము 22వవర్గము

శ్రు॥ ఉతాసిమైత్రావరుణో వసిష్ఠోర్వశ్యాబ్రహ్మ న్మనసోధి జాతః- ద్రప్సం స్కన్నం బ్రహ్మణా దైవ్యేన విశ్వేదేవాః పుష్కరేత్వాదదంత...సత్రేహజాతా విషితాన మోభిః కుంభేరేత స్సిషిచతుస్సమానం- తతోహమాన ఉదియాయమధ్యాత్తతో జాత మృషిమాహు ర్వసిష్ఠం.

వి॥ భా॥ ఉతాపిచ హేవసిష్ఠ! మైత్రావరుణ! మిత్రావరుణయోః పుత్రోసి, హేబ్రహ్మన్! వసిష్ఠ! ఊర్వశ్యా అప్సరసో మనసో వమాయం పుత్రస్స్యాదితి ఈదృశా త్సంకల్పాత్ ద్రప్సం రేతః మిత్రావరుణయో రూర్వశీదర్శనాత్ స్కన్న మాసీత్-తస్మా దధిజాతోసి-తథాచవక్ష్యతే సత్రేహజాతావితిఋచి- ఏవంజాతం త్వాత్వాందైవ్యేన దేవసంబంధినా బ్రహ్మణా వేదరాశినా అహంభువా యుక్తం పుష్కరే విశ్వేదేవా అదదంత అధారయంత-తథాచఅదితేర్మిత్రావరుణౌ జజ్ఞాతేఇతి ప్రకృత్య వక్ష్యతే...సత్రే బహుకర్తృకేయాగే హేతిపూరణః జాతౌ దీక్షితౌ మిత్రావరుణౌ ఇషితావ్యేషితౌ స్వయ మస్త్వైర్జనైః నమోభిః స్తుతిభిః కుంభే వాసతీవరే కలశే సమాన మేకమేవ రేత స్సిషిచతుః ఆసించతాం,తతో వాసతీవరాత్కుంభాత్ మధ్యాదగస్త్యఃమానఃశమిప్రమాణః

*ఆ॥ కమ్మరుల్ధరిత్రి గ్రామపౌరోహిత్య,మాచరింపరంట యౌరవినుఁడు
ఇంతపెద్దయింటియీయాతనిజాతివా। రెట్టులాచరింతు రట్టిచెయ్వు

♦శా॥అందుం గొందఱు చేతురంట, యెవరో యాచేయునాచార్య, లే
పందల్ వీరిఁ బురోహితత్వమునకై ప్రార్థించిరో, యందుకే
ముందీతండు ప్రమాణముల్ సలుప కేమో మూలిగెన్, సల్పి యీ
చందంబున్ని యుఁగల్లలాడుటకునై శంకించినాఁడేమొకో

పృథ్వి॥ ప్రమాణమొనరించుచుం బలుకుకల్లకే పాపమై
ప్రమాణమొనరింప కప్రతిహతంబుగా నూఱస
త్యముల్ వలుక లేదొకో, యహహా! యెంతయాలోచనం
బు మానఖునిదా మదింబొడమె, మెచ్చఁగావచ్చుఁబో

చ॥ మునిసిభు మంచివాఁడగుట మూర్ఖుఁడితండని యుత్తమాటయే
యనియెఁ "బ్రమాణముల్ సలుపనంచువచించిన నేఁడువానరా
లనుపఁగనానుఖైదునకు" నంచు, మఱొక్కరెవ్వైనఁ దప్పకా
పని విధియించియే యవలఁబన్పుచునుండిరి యక్కలాదునిన్

§శా॥పౌరోహిత్యమటన్న నింద్యమనుచున్ బల్కారు నేమేమియో
మూరల్ సాఁచు, సమస్తకార్యములకున్ ముందుంపఁగంబడ్డవాఁ
డే రాధంబుగ నాఁ బురోహితుఁ, డతండే పూజ్యుఁడాదిన్, గురు
త్వారాధుండగువానికృత్య మెటులౌ నాక్షేపణీయం బహా!

---

*బ్రాహ్మణులమైన మేము సామాన్యముగా గ్రామపౌరోహిత్యము చేయము.
♦అచ్చటచ్చట నీ గ్రామపౌరోహిత్యముచేయువారుకూడఁగలరు.

---

ఉదియాయ పాపిదుర్భభూవ తతఏవకుంభాత్ వసిష్ఠమపిబుషిం జాతమాహుః
హేతిపూరణః.

§ గురుబాలప్రబోధిక 201 వ పుట.

వ్యా॥ శాంతికపౌష్టికాదికర్మను పురో ధీయతఇతి పురోధాః॥ స॥పు॥ పురోహి
తశ్చఁడుధాఞ్ ధారణపోషణయోః, శాంతికపౌష్టికాదిక్రియలయందు ముందరనుంచఁబడు
వాఁడు.

*క॥ ఏరుఁగ్ గ్రామపురోధకు। నీరఁటతాంబూలమాది, నేమెఱుఁగుదునీ
కారుఁడు, పెండ్లిసదస్యపు। ప్రారంభమెయతనికిడిన పైనగుచుండున్

♦ఆ॥ అతఁడుదాహరించునైదుగురు బ్రహ్మర్షు। లన్యసతుల బెండ్లియాడలేదఁ
చెప్పుడయ్యెఁ బెండ్లియీఋషీశ్వరులకు। నీకథావిధానమెందుఁగలదు

చ॥ ఇటికలఁజేర్చునప్డెకద యీఋషిపంచకవుం బ్రశంసవ
చ్చుట, యటఁగాక వేఘోకటఁ జూపెనెయాతఁడు వారిపేళ్ళ, నే
మిటికిటువ్యర్థజల్పనము, మెచ్చెదువారెవరిట్లుచెప్పఁ, §దే
లుచెటులు వీరుతప్ప నితరుల్ తొలిబ్రహ్మకుఁ బుట్టరన్నటుల్

క॥ కమవెతకిచూచినను నగు
వడదీఋషిపంచకంబు పరుల కికోకటన్
అడుగడుగునవచ్చి కనం
బడుచుండునువీరి కేమిప్రతిబంధముకా

†క॥ ఇఁక గార్గేయాగమమున। కుకవిత్వప్రాభవమునఁగొమరారెడి వే
ఘోకతాటాకులపొత్తము। పెకలించిరియెందొకాని పెద్దరికముకై

---

*సభలలోఁ దాంబూలమిచ్చునప్పుడు గ్రామపురోహితులకు ముందుగానిచ్చుట లేదు. వారియెడలఁగనఁబఱచు నగౌరవ మిదియొక్కటిమాత్రమే.

♦నే నిదివఱకుదాహరించినయైదుగురు బ్రహ్మర్షులు బ్రాహ్మణకన్యకలఁదప్ప నితరులఁ బెండ్లాడినట్లు కనఁబడదు.

§పైనిజెప్పఁబడినవారుతప్ప మఱియేఋషులును నాదిబ్రహ్మనుండిపుట్టలేదని తేలుచున్నది.

†గార్గేయాగమము 2వపుటలో నాగమములుశిల్పులచేత నేయాచరింపఁబడవలెనని చెప్పబడియున్నది. ఆపుస్తకము ముఖ్యముగాఁ బ్రతిష్ఠలవిషయములో సంబంధించియున్నది. 7వ పుటలో నావాహనమంత్రములు శిల్పులచేతనే యధ్యయనముచేయఁబడవలెనని చెప్పబడియున్నది. కోర్టువారి రిమార్కు (ఈగ్రంథము తాటియాకులది. ఇదియు నాక్షేపింపఁబడినది. ఇది నిజమైనదేయని రుజువుచేయుమఱతుమీఁద దాఖల్ చేసికోఁబడినది.)

---

†గార్గేయాగమము.

......యావత్కర్మకృతం వ శిల్పికర్తవ్య మాచరేతు బ్రాహ్మణోవా శివా

క॥ తప్పులుకుప్పలుకుప్పల। యొప్పెచ్చట నేనియొకటియుండునొ లేదో
అప్పాత్తముగొప్పతనం। బిప్పాటిదె, యదియు బుధుల కేర్పడుఁజదువన్

క॥ శిల్పి ప్రతిష్ఠాకృత్యము। సల్పుటకర్హుండటంచుఁ జాటెడిఁగాని
కల్పింపదువిప్రతయ। య్యల్పకులంబునకు, దీనిసరయుఁడుప్రాజ్ఞుల్

తే॥ సల్పుదురు కానవిగ్రహాల్ క్షమను దామె
తత్ప్రతిష్ఠాధికారముం దమకె కలద
టన్న యొక్క దురూహమై నటుల వ్రాసి
కొనినవారలు తద్గ్రంధముననువారు

క॥ ఇది వ్రాసికొనెడినాఁటికి
మది బ్రాహ్మ్యముమీఁదిబుద్ధి మరలద యీ దు
ర్మదులకు, మరలినచో నా
కొదవయునుం బూర్తిచేసికొనియే యుందుర్

ఆ॥ విగ్రహప్రతిష్ఠ వివరింప శిల్పిదే
కాని బ్రాహ్మణునిది కాదటంచు
శిల్పి బ్రాహ్మణుండు క్షితి నొక్కరుఁడుగామి
తేల్చియుండె నేతదీయకృతియె

*తే॥ శిల్పి యితఁడొక్కఁడే కాదు క్షితినిజూడ
సాలె చాకలి మంగలి చర్మకార
జనులుగూడను శిల్పులే, కనుక వారు
నాచరింపంగఁదగునుబో యాప్రతిష్ఠ

---

ర్చస్య అన్యేచైవకృతాయది। అనేకపాపసంప్రాప్తం బింబస్యారిష్టకంతథా। పూర్వాచార్యాదిభిశ్చైవ శిల్పియా కురుతాంతథా। వినాశిల్పించియత్కార్యం నకుర్యా బ్రాహ్మణాదిభిః।......ప్రథమంశిల్పినాచైవ ఆశీర్వాదం విధీయతాం। అనంతరంచవిప్రాణాం ఆశీర్వాదంతథైవచ।...

*గురుబాలప్రబోధిక 254వ పుట

శ్లో॥ తక్షాచ తంతువాయశ్చ నాపితో రజకస్తథా। పంచమ శ్చర్మకారశ్చ కారవ శ్శిల్పి నోమతాః॥

ఆ॥ శిల్పులగుదుమన్న జిక్కదు బ్రాహ్మ్యంబు చిక్కెనేఁ బ్రతిష్ఠ చెదరిపోవు
వీరు తెచ్చుకొనినవింతగార్గేయాగ। మంబె గొంతుకురిగ మాటాడుదకు
కం॥ సకలస్మృతిరత్నంబుల। బ్రకటితమయ్యెం బ్రతిష్ఠ బ్రాహ్మణకృతిగా
ఇఁక మనగార్గేయాగమ। మొకడే శిల్పికివిధించుచున్నది దానిన్
కం॥ అవనీస్థలిఁ బ్రథితములై। శివవిష్ణ్వాగమములెన్ని చెల్వారఁగ ని
ద్దైవనికినంగీకార్యం। బవు నీగార్గేయశక్తి యశ్రుతమగుటన్
*చ॥ రథమును జేయునెల్లరును రమ్యముగన్ రథకారనాములై
పృథివిఁ జెలంగవచ్చునని ప్రీతివచించియుమున్ను క్రమ్మఱన్
ప్రథమపుమూడువర్ణములఁ బర్వెడివారల కేరికేనియున్
రథమును జేయఁ దత్పదము రాజిలునన్న ద్విరుక్తిగాదొకో
కం॥ ఇట్టి ద్విరుక్తిదురుక్తులె
పుట్టెడుగల వితనిసాహిత్యమునఁ గాని కనన్
గట్టి దొకమాటయేని గను
పట్టదు, శోధింపుఁడింక బాగుగ మీరల్
తే॥ "పృథివి రథకారులందురు రథముఁ జేయు
జనములను గాని యది యొక్క జాతికా" ద
టంచమును చెప్పి యామీఁద ననియెమరల
"ఉండె రథకారులనుజాతి యొకటి,, యనుచు॥
*క॥ రథకారజాతియొక్కటి। పృథివింగలనదంటగాని పేరునకుం ద
ద్రథకారజాతివారికి। రథకృతిసంబంధ మొక్కరవ లేదఁటచూ

---

క్రాను.

మావుప్రమాణగ్రంథములు శ్రుతులు స్మృతులు పురాణములు *రథమును జేయువారందఱు రథకారులని పిలువఁబడవచ్చును. అది యొకజాతికాదు. ఆపేరు వృత్తిని మాత్రమే తెలియఁజేయును. వృత్తివలన రథమును జేయువాని కెవనికైనను మొదటి మూడువర్ణములలో రథకారశబ్ద మన్వయించును.

*రథకారులనుజాతి యొకటి కలదుకాని వారికి రథముఁజేయువృత్తితో సంబంధము లేదు.

*ఉ॥ సంకరజాతికానియది స్వచ్ఛముకాదఁట, యద్దియిప్పు డీ
వంకలఁ బ్రాణముల్గలిగి వర్తిలుచున్నదొ లేదొ స్వాత్మకున్
శంకయెయుంట, యీయధమజాతి కుదీరితమైనవృత్తి యే
పొంకపుదో యెఱుంగఁడఁట, బొంకిననీవిధినుండనాఁగదా

♦క॥ కంచరి కమ్మరి కాసెయు టంచుం గమసాలియనుచునాత్మీయులుపి
ల్పించుకొనుచుందురఁట, యవియెంచంగన్ వృత్తిఁబట్టియేర్పడెనఁటగా

ఆ॥ మ్లేచ్ఛముఖ్యజనులు మెలఁగుచునున్నవార్
వీరివృత్తులందు వేడ్కనిపుడు
కాని వారినెవరు కమసాలులనుపేళ్ల
వాడుచుంటగనము వసుధలోన

ఉ॥ చెప్పులఁజేరగాండ్రెవరొ చెప్పుడియిప్పుడు పట్టణంబుల
న్గొప్పకులంబువార్కద, జనుల్ మఱివారిని జర్మకారులం
చిప్పుడువాడుచుండిరొకొ, యొట్టిఁకవృత్తినిబట్టి యిట్టి పే
ళ్లుప్పతిలున్ ధరిత్రిపయి నొక్కకులానకుమాత్ర మారయన్॥

§క॥ పంచాణపుఁగులమేయిల నెంచంగన్ లేదటంచునితఁడువచించెన్
బ్రాంచులుకొందఱుతార్వచియించిరివీరిదెయటంచు నెఱుఁగంగతమున్

---

*ఆజాతి సంకరమైనదికానియసలైనదికాదు. ఆరథకారవర్ణ మిప్పుడు జీవించియున్నదో లేదో నాకుఁదెలియదు. రథకారజాతికి విధింపఁబడిన వృత్తి యేదియో నేను జెప్పలేను. మాబ్రాహ్మణజాతిలోఁ దక్షకులనువారు లేరు. ఎవరేపనిచేయుదురో వారి నట్లుపిలుతురు.

♦మాలోనైనను బంగారపుఁ బనిచేయువారిని గమసాలులనిపిలుతురు. ఆపేరు వృత్తివలన నుత్పన్నమైనది.

§పంచాణయనిపిలువఁబడుకులము లేదు.

---

§శబ్దరత్నాకరము 628వ పుట

పంచాణంబువాఁడు-ద్వ-వి-శిల్పి

బ్రౌన్యనిఘంటువు,

పంచాణము-Workmen, mechanics or handcraftsmen The united five castes of the carpenter, blacksmith, brazier, goldsmith and stone-cutter పంచాణమువాండ్లు people of these castes.

* తే॥ ప్రజల కుపయోగకరములౌ పనులనెల్ల
సలుపుచుండ్రిట యీతనిజాతివారు
అకట ! యీనుడి కడు పరిహాసపాత్రి
మగుట గానఁడు నిజఘనతాతురతను॥ 185

సీ॥ కలధౌతమయములౌ కమనీయభూషల
హెచ్చుకూలికిఁ జేసియిచ్చుటయును
విషమదారుగణంబు వివిధరీతులఁ జెక్కి
ఘనరథగృహములం గట్టుటయును
కృష్యాదికంబైన క్రియకు సాధనములౌ
హలకులిశాదుల౯ సలుపుటయును
త్రప్వయ స్తపనీయ రాజతపాత్రముల్
మదికింపగులౌ గమరుచుటయును

కఠినశిలలెల్ల బ్రద్దలుగా నొనర్చి
దేవతావిగ్రహంబులం దీర్చుటయును
ఆదిగాఁగల కొన్ని కార్యములె వీరి
వలన నగుఁగాని కానివి కల విఁకెన్నొ॥ 186

సీ॥ చీనిచీనాంబరాల్ చిత్రచిత్రముగ నే
యుట యొక లోకోపయోగికృతియె
మురికివౌ వసనముల్ కరము తెల్లగఁ జేసి
యొసఁగుట లోకోపయోగికృతియె
శోభరా మొగమున క్షురకర్మ మొనరించి
యేగుట లోకోపయోగికృతియె
బహువిధంబులుగాఁగఁ బాదరక్షలమర్చి
యుంచుట లోకోపయోగికృతియె

*మాకులమువారు మనుష్యుల కుపయోగకరములైనవృత్తులనన్నిటి నవలంబింతురు.

ఏత దాదికంబు లెన్నియో కలవింక
క్షితిఁ బ్రజోపయోగికృతులు దలఁప
అవ్వియెల్లఁ దామె యాచరించినఁగదా
తావచించుమాట తథ్యమగుట॥ 187

*క॥ తా బ్రాహ్మణుఁడై రథములనబ్రాబుగఁ జేయువానికర్థము చెప్పన్
సెబ్రగరథకారోనామ బ్రాహ్మణయనెడిచోటమది కెక్కుమిచ్చేన్॥

♦క॥ ఒక బ్రాహ్మణుఁ డావృత్తిని
బ్రికటంబుగఁబూనినటులఁ బలుకుటకై పూ
ర్వీకు లది వాడినవారఁట
ఇఁకఁ గౌముది యితనియొద్దనే చదువవలెన్॥ 189

§క॥ అబహిష్కృతశూద్రుండై ప్రబలునయస్కారుఁడితఁడు పాణిసిమతరీ
తిబడాయికొట్టుచేమో కబురులు చెప్పంగఁబూనెఁగానక దానిన్॥

@క॥ విశ్వబ్రహ్మోపనిష త్తీశ్వరుఁడుం జూపఁజాలఁడిల సూథముగన్
విశ్వబ్రహ్మపదంబే విశ్వంబున లేకయుండ వెలయునదెటులన్ 191

*6వ ర్కుదస్తావేజు (సిద్ధాంతకౌముది)లో "రథకారోనామ బ్రాహ్మణః" యనునది వర్ణమువలన బ్రాహ్మణుఁడై వృత్తివలన రథకారుఁడైనవానికి సంబంధించినది

♦ఒక బ్రాహ్మణుఁ డావృత్తి నవలంబిఁచినట్లు తెలియఁజేయుటకై యది వాడఁబడినది.

@మాపరివరఖుండవిశ్వబ్రహ్మోపనిషత్తునందువివరింపఁబడియున్నదిమా ప్రవరఖండకొఱకు నేను బురాణములలోఁ జూడలేదు. వైదికులగోత్రములను నేను సాంగముగాఁ జెప్పజాలను. వారు వసిష్ఠునియొక్కయు రాజఋషులయొక్కయు సంతతివారు. భరద్వాజకౌండిన్యప్రముఖగోత్రములవారు వైదికులు. పుస్తకాపేక్షలేక భరద్వాజ గోత్రిఋషుల మూలముఁ జెప్పలేను.

§సిద్ధాన్తకౌముదీ

"శూద్రాణామనిరవసితానామ్" ౨-౪-౧౦।అబహిష్కృతానాం, శూద్రాణాం ప్రాగ్వత్।"తక్షాయస్కారమ్" పాత్రాద్బహిష్కృతానాంతు, "చండాలమృతపాః॥"

తత్వబోధినీ,

- శూద్రాణామ్*త్రైవర్ణికేతరమనుష్యపర శ్శూద్రశబ్దో, నతుశూద్రత్వజాతిపరః। అనిరవసితానామితినిషేధాత్ * పాత్రాదితి*యైర్భుక్తే, "భస్మనాశుధ్యతేకాంస్యమ్"

ఆ॥ ఉపనిషత్తు లెన్నొ యుండియుంట నిజంబె
కాని యిద్దియుంట కల్లమాట
వ్రాసికొనినవారు వారె విశ్వబ్రహ్మ
యుపనిషత్తటంచుఁ గపటమతిని॥ 192

ఆ॥ ఉపనిషత్తులనఁగ నుర్వి వేదాంతముల్
వానిలోన నాత్మవస్తుతత్త్వ
ముండుఁగాని ప్రవరఖండ మెటుండెడి
స్వర్ణమపహరించుజాతిఁగూర్చి 193

ఆ॥ కుంభినీసురులకు గోత్రప్రవరనిర్ణ
యంబుచేసియుంచి రాదిమునులు
వర్తిలంగవలయు బ్రాహ్మణులైనచో
వీరి ప్రవరగోత్రవివర మందు 194

కం॥ విశ్వబ్రహ్మపదంబే। పశ్వాలపనంబుచూడ్కి వ్యర్థము గాఁగఁ
విశ్వబ్రహ్మోపనిష। త్తేశ్వతనుభవుండుచేసెనీజాతికిఁగా 195

ఆ॥ బ్రాహ్మణత్వమనెడి బ్రహ్మగృహముపట్టి యేడిపించుచుంటనిట్లువీరె
పోఁగుచేసినారుపూని విశ్వబ్రహ్మయుపనిషత్తటంచు నుత్తచిత్త 196

తే॥ అచ్చువేయించి క్రొత్తగా నపుడె దాని
కోర్టునకుఁదెచ్చె నా కట్టిగొట్టుజనము
ప్రస్నుపేరైనఁ బ్రచురింపఁబడమి దాన
కడకుఁద్రోసెను ధర్మాధికారి కినుక 197

*కం॥ లేకయె బ్రహ్మజ్ఞానం। బేకరణినొ బ్రాహ్మణుఁడగునీతనియున్నం
బేకులమువారుగూడను। నాకొనిభుజియింపరంటయుక్తమె వహా

---

ఇత్యాదిస్మృత్యుక్తసంస్కారేణాపి। పాత్రవంశుద్ధ్యతి తేషామిత్యర్థః॥

---

*విశ్వబ్రాహ్మణులనిపాడఁబడు బ్రాహ్మణులే నిజమైన బ్రాహ్మలు- బ్రహ్మజ్ఞానము గలిగిన బ్రాహ్మణులితరు లుండవచ్చును. మాబ్రాహ్మణులు బ్రహ్మజ్ఞానములేకయు బ్రాహ్మణులని పిలువబడుదురు, ఏలయన, బ్రహ్మజ్ఞానము మాసహపంక్తికిఁ గాని సహా ద్వహమునఁ గాని స ంబంధింపదు.

ఆ॥ విశ్వపదము మొదట వెలయు బ్రాహ్మణపద
మెట్లు గ్రంథరాజి నెన్నఁబడదొ
వాస్తవముగ నట్లు† వైదికబ్రాహ్మణ
పదముకూడ నెన్నఁబడదయంట॥ 199

ఆ॥ పడకపోవుఁగాక బ్రాహ్మణపదమున
కది విశేషణముగఁ గుదురఁగలదు
విశ్వపదము నట్లు లీశ్వరుఁ డైనను
జేయఁగలఁడె తద్విశేషణముగ॥ 200

ఆ॥ § బ్రాహ్మణప్రసాదభక్షణమునకు నై
యాన చేయుచుండ్రు రఖిలజనులు
సత్యమైన బ్రహ్మజాతిప్రసాదంబు
మాలఁ డైనఁగుడువఁ డేలొకాని॥ 201

క॥ రాకుండి* మహాన్యాసము। పోకుండెశివాలయమ్ము పొంతకితఁడెటో
కాకుండిన నన్నాహమ్ము పి। నాకిం దాఁకుచు నెయందుమనఁ వసియించుఁ

క॥ కాన మహాన్యాసంబుఁ రానిజనుల్! శివునిగుడికి రాకుఁడు మీరల్
హా! నిత్యాం బభిషేకము। మానుకొనఁ వలసె ముగ్ధమానవులింకఁ

ఆ॥ ఇంతచదువుచదివి యిదమిత్థమని చెప్పఁ
గలసమర్థుఁ డేమి కారణమున
నభ్యసింపకుండె నామహాన్యాసంబు
బోధపడదువాడు బుద్ధికింత 204

---

† వైదికశబ్దము విశ్వబ్రాహ్మణశబ్దమువలెనే యేగ్రంథములయందును గాన్పింపదు.

§ ఇతరవర్ణస్థులు సామాన్యముగా మాయిండ్లలో భోజనము చేయరు. వైశ్యులు మాతో భుజింతురేమో నాకుఁదెలియదు. శూద్రులుకొందఱు భుజింతురు- మావర్ణస్థుల యిండ్లలో నన్యకులజులు భుజించుచుండఁగా నేనుజూడలేదు.

* మహాన్యాసము నేర్చుకొనందువలన నేనేశివాలయములోనికిఁ బోవుటకుఁ బ్రయత్నింపలేదు.

చం॥ ‡శివుగుడి కెచ్చటేనియును స్త్రీయులు పోవ రటుంగఁడంట కా
ని వెదకి భట్టిప్రోలనొకటి నేర్పునఁజూపెను, దాన స్త్రీయు తే
శివునిప్రతిష్ఠ చేసిరఁట, సేవయొనర్చెదరంటయుంద, తా
వివరము భట్టిప్రోల్జనులె వే లిఖయింతురుగాక యాదృతిః 205

కం॥ § విశ్వబ్రహ్మపదార్థము। విశ్వమయుండగుటఁ జేసి విశ్వజగతిపై
విశ్వబ్రహ్మోపనిష। త్తీశ్వారాధునివిధాన నగుపడునఁటగా॥ 206

మహాస్రగ్ధర

ఇది యున్మత్తప్రలాపం బిఁక నగుటకునై యేమిసందేహమో మీర్
మదిలో రోజించుఁడార్యుల్! మఱిమఱి, యిటు లేమద్యపుంబోలి యూతం
డెడిరో వాకుప్రవ్వ న్యాయంబిడఁదగుసభలో నిద్దితప్పంచనంగో
విదులేలేరైరి, యీాదృగ్విధసభ నిఁక నేవిఁక సత్యంబు తేలుః 207

ఆ॥ ఉర్విఁ బెక్కుకృతులనుండె* విశ్వబ్రహ్మ
పదమటంచు నితఁడు పలుకుఁగాని

---

‡మావర్ణములు దేవాలయములోనికిఁ బోవుచుండఁగా నేను జూడలేదు. భట్టిప్రోలులో విశ్వబ్రాహ్మణులచేఁ బ్రతిష్ఠితమైన దేవాలయ మొకటికలదు. అర్చకుఁడు విశ్వబ్రాహ్మణుఁడే. అందఱును గుడిలోనికిఁ బోదురు. వాడి సుపర్ణసగోత్రము మూలఋషు లయిదుగురు. ఉపసుపర్ణ విశ్వజ్ఞశాం తౌరసేన సాంఖ్యాయనులు. విశ్వబ్రహ్మోపనిషత్తుఁజూచి ఋషులయొక్క సాంప్రదాయము చెప్పఁగలను. ఉపనిషత్తులు నూటయెనిమిదికిఁ బైఁగాఁ గలవు సంఖ్యనిశ్చయింపఁబడలేదు. అవియన్నియు వేదములనుండి సంగ్రహింపఁబడినవి విశ్వబ్రహ్మోపనిషత్తునం దన్ని వేదములనుండియు నెత్తి వ్రాయఁబడినవి కలవు కొన్నియుపనిషత్తులలో నెచ్చటినుండిసంగ్రహింపఁబడినవో వివరింపబడియున్నది మా మాతామహునిది సానగగోత్రము గోత్రఋషులవే ళ్లుపనిషత్తులయందును వేదములయందును బురాణములయందును గానుపించును. ఏపురాణములలో నేవేదములలో నేయుపనిషత్తులలోఁ గనుపించునో ప్రత్యేకముగాఁ జెప్పలేను. నేనందులను బరిశీలింపవలెను.

§విరాట్పురుషునకు విశ్వబ్రహ్మశబ్దము పర్యాయపదమగుటచే విశ్వబ్రహ్మోపనిషత్తెల్లయెడలను గనుపించవలెను. ఎందులో విశ్వబ్రహ్మోపనిషత్తునుగుఱించి సూచింపఁబడియున్నదో నాకు జ్ఞాపకము లేదు.

*విశ్వబ్రహ్మపద మనేకపుస్తకములలో వాడఁబడియున్నది.

చూపఁ డొక్క లేని శుద్ధమౌ గ్రంథం బి
కెట్లుకల్లగాదొ యిద్ది చెప్పుఁడు॥ 208

క౦॥ కాత్యాయనసూత్రంబఁట। యత్యుత్తముఁడైనయితని, దాతమవాఁడౌ
కాత్యాయనుఁడే మమ్ముల। స్తుత్యులుగఁ వ్రాసినాఁడు, చూడుఁడు దానిన్

సీ॥ తనదు నాగరఖండమున "మనుస్సానగ
గోత్రిస్య" యనుముక్కకుం బ్రథమము
మనువెసానగుఁడంచు ఘనతరార్థము చెప్పెఁ
బదుగురునవ్వ నీపండితుండు
ఆమీఁద విడఁదీసియడిగితి "గోత్రిస్య"
యనుచోట వచియింపు మర్థమనుచు
అపుడు "గోత్రిముయొక్క" యనియు "గోత్రిమునకు"
ననియు వక్కాణించె నర్థమతఁడు
అది పరప్రతారణార్థమా నర్థమో
లేక యవిదితార్థమో కనుండు
ఈప్రలాపములకు నేవగింపనికొట్టిఁ
కెట్లుధర్మసూత్ర మెఱుఁగఁగలదు॥ 210

మాది కాత్యాయనసూత్రము-కావలసినయెడల గోత్రిఖండమును జూపింపఁగల ను-విశ్వరూపాచార్యులు బ్రాహ్మణుఁడు-ఆయనసంతతివారు మాకు బంధువులుకూడ నైయున్నారు. భాగవతముకూడఁ బ్రమాణగ్రంథమే-

గోత్రిస్యయనఁగా గోత్రిమునకనికాని గోత్రముయొక్కయనికాని యర్థము-

2 వ మార్కుదస్తావేజు (వజ్రసూచికోపనిషత్తు) 343 వ పుటలో వసిష్ఠుఁ డూర్వశికి జన్మించినట్లు చెప్పఁబడినది-దేవీభాగవత మష్టాదశపురాణములలో నొకటికాదు బ్రహ్మకైవర్తపురాణ మష్టాదశపురాణములలో నొకటి-మత్స్యపురాణముకూడఁ బ్రమాణగ్రంధము-వసిష్ఠుని కతఁమాల గృహిణియైనట్లు మనుస్మృతియందుఁగలదు-మత్స్యపురాణమందు నారదున కరుంధతి సోదరియైనట్లుకలదు-విద్యారణ్యభాష్యము వేదములకుఁ బ్రమాణగ్రంథము-

క॥ *శిల్పము బ్రాహ్మణవృత్తిగఁ
దెల్పంబడ దెచటననియుఁ దిండికి లేమిన్
స్వల్పముఁబనినే తమవారి
కల్పనచేసికొనిరనియుఁ గడకితఁ డొప్పెన్॥ 211

చ॥ నిజము స్వజాతివృత్తులను నిందకపొట్ట యనేకు లిట్యోర్వన్
గజిబిజియాచుఁ దుట్టతుదఁ గాసిపనుల్ పొనరించుచున్న వా
రు జగతిఁ గాని శిల్పములె రూఢిగఁ గైకొనుచుంట లేదు, స
ర్వజనులు వీరిజాతి నదెవర్తనమందు మెలంగుటేలొకో॥ 212

సీ॥ భూములనార్జించి భూరికృషిక్రియ
నెందఱు బ్రతుక రీయిలను జనులు
హూణకల్ నేర్చి యుద్యోగవిధులచే
నెందఱు బ్రతుక రీయిలను జనులు
క్రయవిక్రయక్రియాకరణ ధురీణులై
యెందఱు బ్రతుక రీయిలను జనులు
వేదశాస్త్రపురాణవిఖ్యాతకలలచే
నెందఱు బ్రతుక రీయిలను జనులు
ఒక్క తమరె మొదటినుండియు శిల్పజీ
వనులుగాగ నున్నవారుగాని
హెచ్చుకులము వాఁడు బిచ్చగాఁ డౌఁగాక
శిల్పమునకుదిగెనె యల్పమనక 213

*బ్రాహ్మణునకు శిల్పమువృత్తియనియెచ్చటను జెప్పఁబడియుండలేదు-సామాన్యముగా జీవనముకొఱకేర్పఱచుకొన్న పనులలో నిదియొకటి. మాజాతీయులలో నెక్కువ మందిపనిపాటలవృత్తి నవలంబించుటలేదని నేను జెప్పలేను 8వ మార్కుదస్తావేజా (బ్రాహ్మణోత్పత్తిమార్తాండము)లో శ్రుతులనుండియు స్మృతులనుండియుఁ బురాణములనుండియు సంగ్రహించినవాక్యములుగలవు.

ఆ॥ §విప్రులీరలనుచు వెక్కిరించుచునుండి
రితనిజాతివార లింతవఱకు
ఇతఁడువచ్చిమాకు ‡ విప్రధర్మమే
నిడక లాగుకొనె నిఁకేదిదిక్కు 214

క॥ ఈమాడ్కి సాక్ష్యమీతఁడు
ప్రామాణ్యవిదూరముగను బలుకు టటుండఁ
దా మనసువచ్చినట్టుల
నేమొయనర్థములఁ జాల నేకరువెట్టెన్ 215

క॥ ఇటువంటి వ్యర్థవాక్కుల
కెటులీయుదునుత్తరంబు, నిప్పటి కిన్నూ
ఱిటికిఁ బయినయ్యె నేత
త్కుటిలోక్తుల ఖండనంబుఁగూర్చిన పద్యాల్॥ 216

‡విప్రపదము మాకుఁగూడఁ జెల్లును. "రథకారో నామ బ్రాహ్మణః"యనువాక్యముదాహరణముగా నీయఁబడినది. అది సంజ్ఞకుపయోగింపఁబడియున్నది. అక్కడ రూఢార్థముగా నుపయోగించినది కాదు. ఆపదమునకు యౌగికార్థముకూడ నుపయోగింపవచ్చును. అన్నిటిలోను రూఢార్థమే ముఖ్యమైయున్నది. కౌముదిలో యౌగికార్థమునం దుపయోగింపఁబడినది. షట్కర్మలు వేదమంత్రములతో బ్రాహ్మణులే చేయవలెను. శ్లోకరూపములైన యితరమంత్రములతో నితరు లీషట్కర్మలు చేయవచ్చును. అందులకిప్పు డాధార మేమియు గ్రంథరూపమైనది చెప్పలేను అదికమలాకర స్మృతిలోనున్నది. అగ్రతాంబూలము సభలలో బాగు గాఁజదువుకొన్న వాండ్రకిత్తురు. పురోహితుఁడు కూడ సంస్కారియైననిత్తురు. సంస్కారియైనప్పటికి గ్రామపౌరోహిత్యము చేయువానికి మాత్రమీయరు. శైవసిద్ధాంతప్రకారము ఖననము ముఖ్యము. కలియుగములోఁ బరాశరస్మృ

§మాణాంపతి యప్పాకణ్ణాచారి వ్రాసిన విప్రమాయావేశవిభంజనమంత్రోపదేశము 11వపుట.

నానాగోత్రస్థులుగాను శ్రోత్రశ్రోత్రమతములుగలవారుకాను స్వకులాభిమానముగలవారుగాను మనుమయమన్నగు పంచబ్రహ్మజాతస్థులయం దనూయతగలవారైనవిప్ర నామధేయంబుధరించిన బాపలు శిల్పులచే భయపరుచబడినవారుగాను పాపకార్యధురంధరులుగాను కాలముగడుపుచున్నారు. ఓరాజపుత్రులారా! విప్రులచేగల్పింపబడిన మాయయనెడు పర్వతమునకు వజ్రాయుధతుల్యమగువచనమును శ్రవణించుదురుగాక.

ఆ॥ శిష్టవైదికులను శిష్టవాసిష్ఠుల
నింకఁ శిష్టఘనుల నెవరెవరిను
నూఱుమాటలేల నోరికివచ్చిన
ట్లెల్ల మాటలాడె నేమిచెపుదు॥ 217

క॥ § తరువాతిసాక్షి మాయూర్
కరణమురంగయ్య, యతనికరణీకంబే
దురితమ్మున నోపోయియొ
మొరలిడెడిం బ్రకృత, మేమిముచ్చటలింకన్॥ 218

క॥ వినను నేతత్సాక్ష్యము। లోనంగల తత్త్వమున్ విలోకించి జనం
బౌననఁగఁ బ్రథానాంశం। బేనిగనంబఱచుట వ్రాకృత్యంబనుచున్ 219

---

తి ముఖ్యముగా నవలంబింపఁదగినగ్రంథమైయున్నది. స్మృతు లనంతములు. బుక్కరాయనికి విద్యారణ్యులు మంత్రిగానున్న ట్లతనివిషయమైనచరిత్రలో నున్నది... వెలవర్తి ఆంజనేయశాస్త్రిగ్రాలు...

§ ...1911వ సం॥ 8వ నవంబరు...ప్రతివాదులతరఫు శివసాక్షి ...జానపాటిరంగయ్య...జానపాడు.............గ్రామములోఁ బాతపాటమ్మ పోలేరమ్మ లను రెండుదేవతలు కలవు. పాతపాటమ్మగుడి యున్నము చినవీరయ్య పట్టాభూమిలో నున్నది. ఆగుళ్ళలో విగ్రహారూపములేని రెండుశిల లుంచఁబడియుండెను. పరికృతము గ్రామపు రైతులు రెండువిగ్రహములను జేయించి తెచ్చిరి...పాతపాటమ్మగుడి పురాతనమైనదిగానుండి శిథిలమైనందునఁ గ్రొత్తగా మరమ్మతుచేయించఁబడెను. కుమ్మరివాఁడే పూజారి-దేవతలఁ గుమ్మరివాఁడును జాకలివాఁడును నలంకరింతురు. విశేషము సీసభు బొగ్గవరపుఁ బెదగచ్చయ్యయు నున్నము చినవీరయ్యయు నీగుళ్ల పెత్తనదారులు. వారు చందా వసూలుచేసిరి. వైదికులుకాని నియోగులుకాని యీదేవతలఁ బూజింపరు. బ్రాహ్మణులు నైవేద్యమీయరు. బ్రాహ్మణులు తమయిండ్ల గోడలమీఁదఁ గుంకుమపసుపులతో నలంకరించి పూర్వోక్తదేవతాభావనతో నచటఁ బూజింతురు. పోలేరమ్మగుడియు నూతనముగాఁ గట్టఁబడెను. అదికూడ రైతులచేతనే కట్టఁబడెను. బ్రాహ్మణులు చందా యీయలేదు. వాది చందాయీయలేదు. వాదికాని వాదికుటుంబములోఁజేరిన మఱియొకరుకాని యెప్పుడునీదేవతలఁ బూజించియుండలేదు. ఏడేండ్లక్రింద రైతులీరెండుదేవతలను నారాధ్యునిచేతఁ బ్రతిష్ఠచేయించిరి. యంత్రము వేసివిగ్రహములక్రింద

క॥ ఏతద్వ్యవహారమున నె।య్యాతఁడు మున్నిడిన* సాక్ష్యమెట్టులుండెనొ యి
ద్వైతీయుననుండెనొ యా।యాతత భేదంబుమాత్రమగుపఱచిలలిన్ 220

ఉ॥ ఈగతిసాక్ష్యమున్నదువ నేర్పడియుండినయట్టి హేతువుల్
ప్రాగుదితంబు లేయయి విరాజిలుచున్నవి కాన నచ్చటన్

---

నుంచఁబడిన బంగారపు తీగె పోయినది. అందువలన దేవతలసత్తా తొలఁగినదని గణాచారులు చెప్పిరి. అందుపై గ్రామస్థులు కమసాలికులస్థుఁడైన పోలేటి లక్ష్మయ్యచేత మరలఁ బ్రతిష్ఠచేయించిరి. 2,3,4,5 ప్రతివాదులు ప్రతిష్ఠాసమయమున నచ్చట లేరు... 1వ ప్రతివాది ప్రతిష్ఠచేయించినతరువాత దేవతల గ్రామస్థులు పూజించుచునేయున్నారు. ప్రతిసంవత్సరము వీలైనప్పుడెల్లఁ గొలుపులు చేయుచున్నారు. కడపటి ప్రతిష్ఠతరువాత 4 కొలుపులుజరిపిరి. ఇప్పటికి 2 మాసములక్రిందఁ గడపటికొలుపుజరిపిరి. ప్రతివాదులు విశ్వబ్రాహ్మణులనికూడఁ బిలువఁబడుదురు. (క్రాను) 2,3 సంవత్సరములనుండి కొంతమంది రయితులు ప్రతివాదులను విశ్వబ్రాహ్మణులని పిలుచుచున్నారు. ప్రతివాదులకులస్థులు కూడఁ దమలోఁదాము విశ్వబ్రాహ్మణులని పిలుచుకొందురు. ప్రతివాదులకులస్థులు కమసాలులనియు విశ్వబ్రాహ్మణులనియుఁ బిలువఁబడుచున్నారుకాని బ్రాహ్మణులనిపిలువఁబడుటలేదు. వాండ్రయిండ్లలో మేము భోజనముచేయము. ఇంక నెవరు తినునది నేనెఱుఁగను- ప్రతివాదులకులస్థులు వ్యవసాయము వడ్రంగము కమసాలపని చేయుదురు- నాకుఁదెలిసిన 25 సంవత్సరములనుంచి గ్రామస్థులు గుళ్లలోపలికిఁ బూజచేయుటకుఁ బోవుచున్నారు... బ్రాహ్మణులు బోనములు చెల్లింపరు... గ్రామనైవేద్యము కరణముచే జెల్లింపఁబడుచున్నది- నేను కుమ్మరివానికి బియ్యమిత్తును-వాఁడన్నము వండి గుడికిఁదీసికొనిపోవును.

---

*...సబ్ మేజస్ట్రీటుకోర్టులో...ముద్దయిలతరఫు 1వ సాక్షి...జానపాటిరంగయ్య...

నాగ్రామంలో పోలేలమ్మపాతపాటెమ్మ...లవిగ్రహములు శికస్తుకావడంవల్ల... 1టో ముద్దాయితో ప్రతిష్టచేయించినారు...... నేను బోనము చెల్లించినాను. తక్కువ బ్రాహ్మణులు యెవరు చెల్లించలేదు- కంసలబత్తునివల్ల ప్రతిష్టచేయించినారుకనుక మేము బోనము యివ్వడంలేదని 1, 3, 4, 5 సాక్షులు అన్నారు. అందుపయిన నేను బోనము యివ్వడంలేదని 1, 3, 4, 5 సాక్షులు అన్నారు. అందుపయిన నేను 1, 3, 4, 5 సాక్షులను కంసలబత్తునివల్ల ప్రతిష్టచేయను మొదట వొప్పుకొని యిప్పుడు యెందుకుబోనముయివ్వరని అడిగినాను. యిందుకు 1, 3, 4, 5 సాక్షులు జవాబు యివ్వలేదు...

బాగుగఁ జూచుకొండనుచుఁ బాలకరాజికివిన్నవించి యే
నేగుచునుంటి శీఘ్రముగ నింకొక * బుద్ధిమదగ్ర్య పాలికిన్॥ 221

క॥ సామాన్యుఁడుకాఁ డాతఁడు। శ్రీమంతుఁడు § నాలునూర్ల సిస్తేటేటన్
గామించికట్టునఁట. యిఁక। నేమాత్రమబద్ధమాడఁడీ హేతువునన్॥ 222

ఆ॥ సిస్తు నూర్లకొలఁదిఁ జెల్లింపనేచూడుఁ
డప్పు వేలకొలఁదిఁ నలరదొక్క .

---

కమసాలులుప్రతిష్ఠచేసినందువలన బ్రాహ్మణులును వాదియును నైవేద్యములీసికొనివచ్చుట కిష్టపడలేదని నేను జెప్పినానేమో నాకు జ్ఞాపకములేదు-విశ్వబ్రాహ్మణులుప్రతిష్ఠచేయవచ్చునాయని వాదితోను మఱికొందఱితోను యోజించినాను-చేయవచ్చునని చెప్పినారు-నైవేద్యములవిషయమై వారి నడుగలేదు-క్రిమినల్ కోర్టులో నేను సాక్ష్యము చెప్పినాను-నాకుఁజదివివినిపించిన యీసాక్ష్యములోవలె విశ్వబ్రాహ్మణులు ప్రతిష్ఠచేయవచ్చునని యొప్పుకొనియును మరల భోజనము లెందుకుఁజెల్లింపరని వాదినిగాని తక్కినబ్రాహ్మణులనుగాని నేనడుగలేదు-నాసాక్షికైఫియ్యతు చదివివినిపించినారు-నేను దస్కతుచేసినాను.

కోమట్లుకూడ వండినవైవేద్యము చెల్లింపలేదు-కొంతమంది బియ్యమునుమాత్రమిచ్చినారు-వారిపేరులు చెప్పలేను-బ్రాహ్మణులలో నెవరును జెల్లింపలేదు-1వ ప్రతివాదిప్రతిష్ఠచేయునప్పుడు వాది యున్నాఁడు-నాకుదెలిసియున్నంతవఱకింతకుఁ బూర్వము విశ్వబ్రాహ్మణు లెప్పుడును బ్రతిష్టచేసియుండలేదు వాదియన్నకు నే నెదురు పార్టిదారుఁడను వాదియన్న నామీఁద నొకక్రిమినల్ చార్జి తెచ్చినాఁడు. నేనుగూడ రిమేండులోనున్నాను మే మొకరిపై నొకర మితరవ్యవహారములుకూడ జరుపుకొనియున్నవారము. 1వ ప్రతివాది ప్రతిష్ఠజరుపునప్పు డతని కతఁడే యజమానుఁడుకాని యితరుఁడేవఁడును యజమానుఁడులేఁడు. (ఈప్రతిష్ఠవిషయమైజరిగిన) క్రిమినల్ కేసులో నున్నము చినవీరయ్యకూడ నొకముద్దయియే. గుండాలము త్రయ్యపైనొక రేఫ్ కేసువచ్చినది. నే నతనిపక్షమున సాక్షిని...

*...1911వ సం॥ 9వ నవంబరు...ప్రతివాదులతరపు 4వ సాక్షి, ఉన్నము చిన వీరయ్య...జానపాడు...

§...నేను రు 400-0-0ల సిస్తు కట్టుదును మాగ్రామములోని పాతపాటమ్మ పోలేరమ్మగుళ్ళను నేనెఱుఁగుదును.

సిస్తు నధికముగను జెల్లించినంతనే
కల్లవలుకఁడనుట పొల్లుమాట॥ 223

ఉ॥ * పుట్టుకతోనె శూద్రునకుఁ బుట్టు నసత్యముఖాఖిలంబులౌ
చెట్టగుణంబు, లవ్వి ద్విజసేవయొనర్పఁ గ్రమక్రమంబుగన్
గిట్టును, బ్రాహ్మణుండనినఁ గేవల నింద్యుఁగఁజూచునట్టివాఁ
డెట్టు లబద్ధమాడఁడఁక నెక్కువసిస్తును గట్టుమాత్రనే॥ 224

ఆ॥ మున్ను † నందిగామ చెన్నమల్లిదేవ
తలకుఁ దాఁ బ్రతిష్ఠనలిపెనంట
యితఁడు నింక నొక్కయీదృశుండునుమాత్రి
మెఱఁగియుండిరంట యిద్దియగుట॥ 225

క॥ అఱువదిమూడేఁడుఁలవాఁ
డెఱుఁగఁడు రథకృత్ప్రతిష్ఠ యీగ్రామమునన్

---

† నేను 16సంవత్సరములవయస్సుననుండఁగానందిగామచెన్నమల్లయ్యయను విశ్వబ్రాహ్మణుఁ డీరెండుదేవతల బ్రతిష్ఠించెను అప్పుడు పాతపాటమ్మకు గుడిలేదు. పోలేరమ్మకుమాత్రి యొక చిన్నగుడి యుండెను. ఆదేవతలకుఁ గుమ్మరియు గొల్లయుఁ బూజారులు. బ్రాహ్మణు లాగుళ్లకుఁబోయి యాదేవతలఁబూజింపరు. 6 సంవత్సరముల క్రిందఁ బాతపాటమ్మకు మేమొక గుడికట్టించితిమి. మేము పోలేరమ్మగుడిని స్థలాంతరమున నేర్పఱచి క్రొత్తవిగ్రహములఁ బ్రతిష్ఠింపఁజేసితిమి. ఆవిగ్రహములు దుగ్గిలోవిశ్వబ్రాహ్మణులచేఁ జేయఁబడియె. బ్రాహ్మణులెప్పుడును జందా యిచ్చుటలేదు. విశ్వ

---

* భారతము,అనుశాసనికపర్వము,

శ్లో॥ రాగో ద్వేషశ్చ మోహశ్చ పారుష్యంచ నృశంసతా। శాఠ్యంచదీర్ఘవైరత్వ మతిమాన మనార్జవం॥ అనృతం చాతివాదశ్చ పైశున్య మతిలోభితా వికృతిశ్చాప్యవిజ్ఞానం జననే శూద్రమావిశత్॥ దృష్ట్వా పితామహశ్శూద్ర మభిభూతంచ తామసైః। ద్విజశుశ్రూషణంధర్మం శూద్రాణాంతు ప్రియుక్తవాన్॥ నశ్యంతి తామసాభావా శూద్రస్య ద్విజభక్తితః॥ ద్విజశుశ్రూషయాశూద్రః పరంశ్రేయోఽధిగచ్ఛతి॥

అఱువదికి రెండుతక్కువ
* పురుషుండితఁ, డెటుల నెఱుఁగఁగఁబోలెడిఁజూడన్॥ 226
క॥ డెబ్బదియైదేడులవయ
సబ్బిన † యేలూరిసర్వయాఖ్యుండును నీ
యబ్బురపుంబనియెఱుఁగం
డిబ్బుద్ధిమదగ్ర్యుఁ డెటుల నెఱుఁగఁగలిగెనో॥ 227
తే॥ చెన్నమల్లాఖ్యరథకారుచేఁ బ్రతిష్ఠ
నెవరు మాయూరిలోనఁ జేయింపలేదు
తలఁప మాయూరిపెత్తనదారులవుడు
బ్రహ్మవిద్వేషమున నిట్లు ప్రబలలేదు॥ 228
తే॥ వత్సరగ్రాసములనిచ్చి వారలవుడు
తిన్నగన్ బ్రాహ్మణుల మన్నియున్నవారు
కాని యధునాతనులవలెఁ గాఱులఱచి
స్వర్ణకారులకుఁ బూజనల్ సలుపలేదు॥ 229
ఉ॥ కాయయుఁగాని కూరయునుగాని ద్విజాతులకీయకుండఁ దా
రేయెడనేన్ భుజించుటకు నీహయొనర్చినవారుకారు వార్
వేయివచింపనేల మును విప్రకృతుల్ సవరించి పైన నా
త్మీయముచక్కఁబెట్టుకొనుధీయుతులప్పటివార్నిజంబుగన్॥ 230

బ్రాహ్మణులుకూడ వీయరు. పాతపాటమ్మగుడి నా పట్టాభూమిలో నున్నది.

* ...సబ్ మేజస్ట్రేటు కోర్టులో...ముద్దయితరఫు 2వసాక్షి...జానపాటి జానికి రామయ్య...జానపాడు...వయస్సు 58సంవత్సరాలుఁ ది10_10_06

...ఇదివరకు కంసలకులస్థుడు ప్రతిష్టలు యెప్పుడు చెయ్యలేదు. కొన్ని గ్రామాదులలో కంసలబత్తులవల్ల ప్రతిష్టలుచేయించినారని చెప్పి 1టో ముద్దాయితో నా గ్రామంలో రెండు నెలల్కిందట పోలేలమ్మ పాతపాటెమ్మను పునహ ప్రతిష్టచేయించినారు....

†...8వసాక్షి...యేలూరి సరవయ్య...జానపాడు...వయస్సు70 సంవత్సరాలు ది10-10 06

...యిదివరకు నా గ్రామంలో కంసలవానితో ప్రతిష్టలు చేయించలేదు...

తే॥ కాన నప్పుడు కమసాలియైన చెన్న
మల్లయ ప్రతిష్ఠయొనరించు టెల్లఁ గల్ల
లలిని గమసాలులం బెద్దలంబొనర్పఁ
బలికె నున్న మువీరయ్య పాపమనక॥ 231

ఉ॥ * తాను విలేజిమున్సిఫును దద్గణకుండును ధర్మకర్తలై
పూని కలాదయాజనము పూర్తినొనర్చినవారు చాలదే
దీనిప్రసక్తిలేక పృథివీసురయాజనములట్టికా
లానను నేరొచేసిరని లాఘవపున్ నుడు లేల పల్కఁగన్॥ 232

తే॥ గుళ్లుకట్టించియో లేక మళ్లుమాన్య
ములు నొసంగియొకాని యీముగ్గురైరి
ధర్మకర్తలు నేఁటికి, దానఁ జేసి
స్వర్ణకారప్రతిష్ఠకున్ సమయమబ్బె॥ 233

ఉ॥ నేను † బురోహితుండనని యీరథకారునకుం బ్రతిష్ఠలో
మానెడువడ్లగింజలును మాసిన రెండు కొలాయగుడ్డలున్
రా నరపాలొసంగుమని రద్దియొనర్చితినంట, యయ్యెడన్
దాను దనట్టివాగలును దానికి నొప్పకపోయిరంట, హా॥ 234

సీ॥ బుద్ధివచ్చినదాది పోయి దేశాంతరాల
నత్పండితులయొద్దఁ జదివినాఁడ
చదివి గీర్వాణాంధ్రసాహిత్యంబడసి యా
పయి ద్విభాషాకవి నయినవాఁడ

---

* ఆదేవాలయపుఁబనులను నేను జక్క పెట్టుచుందును. గ్రామమున్సీఫు కరణముకూడ ధర్మకర్తలైయుందురు. మేము 1వ ప్రతివాదిచేఁ బ్రతిష్ఠచేయించితిమి. అప్పుడు తగవు లేదు. ప్రతిష్ఠాకాలమున వాదికూడ నున్నాఁడు.

† పురోహితుఁడనని వడ్లు వస్త్రములు పెద్దలైనవానిలో సర్థభాగమడిగెను. 1వ ప్రతివాది యీయకపోయెను—మేమును రైతులును భాగమిచ్చుటకు సమ్మతింపలేదు. అటుపైని వివాదము లంకురించెను.

వికృతులఁ బొనరించు చవధానవిద్యతో
దేశదేశంబులు తిరిగినాఁడ
తిరిగి సత్సభలలో మరియాదలం బొంది
స్థిరయశోధనము నార్జించినాఁడ
గీ॥ విత్త్రమునఁగూడ మద్భ్రాత క్షితినిడిన
యంతతోడనె పరితృప్తి నందినాఁడ
ఇట్టినామీఁద నిటువంటిచెట్టమాట
చెప్పినాఁడీతఁ డీఁక నేమిచేయువాఁడ॥ 235

కం॥ పట్టుదలమనుజుఁ డీతఁడు। చెట్టయొమంచియొపొనర్పఁ జిత్తంబునఁదా
బెట్టమొదలెంచె నేఁబది। తట్టలయనృతంబులాడు దానికొ ఆరుఁగాఁ॥

క॥ రథకారాళిస్నేహము। పృథివీసురవైర మితని పెడత్రోవకునై
పృథుకారణంబులయ్యెను। బ్రథమం, బదినిల్ప నిట్టిపాట్లంబడియెఁ॥

తే॥ తానుబట్టినకుందేటి కొను మూఁడె
కాళ్ళటం చీతఁ డూరిలో ఘనత కెక్క
నెదురుతాఁకెను మద్భ్రాత యీతనికిని
పేర్పడెం బార్టియంతనీయిర్వురకును॥ 38

తే॥ పెద్దకాఁపౌటఁ గరణముం బెక్కురైతు
లితనిపార్టీనె చేరిరి, యితనియొక్క
చిన్నతల్లికుమారుఁడై యున్నకతన
గ్రామమున్నీభు నితడు నైక్యంబెకనిరి॥ 239

(క్రాము) నాసహోదరులిద్దఱును నాతోఁ గలసియేయున్నారు. క్రిమినల్ చార్జిలోకైతులందఱును చేర్పఁబడిరి. నాకిప్పుడు 58 సంవత్సరములవయస్సు-ధాతక అవు. నాఁటికి నేను 18, లేక 20 సంవత్సరముల వయస్సువాఁడను-నేను బందరుగాలివాన యెఱుఁగుదును-మొదట నందిగామ చెన్నమల్లయ్యచేసినప్రతిష్ఠ ధాతకు 1,2 సంవత్సరములు ముందుగాని వెనుకఁగాని యైయుండును అప్పుడు పీఁటలమీఁద నెవరుకూర్చున్నది నాకు జ్ఞాపకము లేదు. ప్రతిష్ఠాదిక్రియలు 5 దినములు జరిగెను. నేను మేమిజరిగెనో యావివరము జ్ఞాపకములేదు. పాతపాటమ్మగుడియెప్పుడు నిప్పటవే యున్నది-పాతపాటమ్మగుడి కాగ్నేయభాగమున మేమునిస్తుచెల్లించు

శా॥ క్రిందన్ మీఁదను నాచు నెన్నటికిఁ బ్రాట్రిం జంపుకోకుండ నా
చందం బీజనుఁ డస్మదగ్రిణి నెటో సాధింపఁగంజూచు చీ
సందర్భాన ద్విజాతులందఱికినిన్ సంబంధమున్నట్టి యీ
క్రందుం జేసినవాఁడుచూడుఁడుబుధుల్! కార్పణ్య మేపారఁగన్॥ 240

తే॥ బ్రాహ్మణుండైన మద్భ్రాతపైని పగను
బ్రాహ్మణుల కందఱకుఁ జేసెఁ బరిభవంబు
ఆయనకుఁ దోడునై వ్యవహారమునకుఁ
డిగితిఁగావున సాక్ష్య మీతీరు చెప్పె॥ 241

తే॥ స్వర్ణకారులఁ బెద్దలంజలిపి తగవు
లాడుచుండినవాఁడౌట నన్న మెపుడు
వారివసతులఁబోలె * నావసతియందుఁ
గూడఁ దినలేదటని దబ్బఱాడె నితఁడు॥ 242

శా॥ నాతోఁ బుట్టిన కీమహాశయున కన్యాయంబుగాఁ గయ్య మీ
రీతిన్ సాగిననాఁటినుండియు తినన్ లే దంతియేకాని ము
న్నింతం జేశుభవాసరంబునను మాయింటం బసాపడ్డ వా
డే తత్కాలమునందు మాకుఁ దమ కుండెంగా నమిత్రత్వముల్ ॥243

---

చున్న యూరిబావి కలదు-బియ్యము బట్టలను గుఱించి తగవువచ్చువఱకు బ్రాహ్మణులం
దఱును కొందఱువిశ్వబ్రాహ్మణులును నుండిరి-వారి కేమిపదార్థములువచ్చినది నాకు
జ్ఞాపకములేదు-నేను 2 వ ప్రతివాదిని జూడలేదు. కంకణము లెవరును గట్టుకోలేదు-
అది యనవసరముగాఁ దలఁపఁబడెను-ఆరాధ్యబ్రాహ్మణుఁడు యాజనమునుజరిపినప్పు
డెవ్వరేని కంకణముకట్టుకొన్న సంగతి నాకు జ్ఞాపకములేదు-తరువాత నొకసంవత్సర
మున విగ్రహములు యంత్రములు లేకయేయుండెను- 1 వ ప్రతివాది గ్రామము మాగ్రా
మమునకు 48 మైళ్ళదూరములో నున్నది-ఆయనకుఁ జుట్టమైన 5 వ ప్రతివాది యాయ
నను బిల్చుకొనివచ్చెను-1 వ ప్రతివాది ప్రతిష్ఠచేయుటకు గాను గ్రామస్థులనెక్కువసొ
మ్మడిగినప్పుడు తక్కువసొమ్మునకే చేయవలసినదిగా వాది సిఫారసుచేసెను- 9 సం
వత్సరములక్రింద వాదియన్న నామీఁదను మఱికొందఱిమీఁదను క్రిమినల్ కేసొకటి
తెచ్చెను

* వాదియింటిలోఁగాని ప్రతివాదులయిండ్లలోఁగాని యెన్నడును భోజనము
చేయవలసినంతయవసరము నాకుఁగలుగలేదు...

క॥ * కుమ్మరి యైదవసాక్షి।కమ్మరిపక్షంపుఁ గమ్మ కాఁపుజనుల మూ
లమ్మున నదియో చెప్పెను,నమ్మఁగ నెటువీలుపడెడిన్యాయము లేమిన్

క॥ ‡ ఇత్తురఁటద్విజులుబియ్యము।త త్తండులములనువండి తా నైవేద్యం
బెత్తునఁటా దేవతలకుఁ,జొత్తెంచరఁ టచ్చటికిని క్షోణిసువర్యుల్ ॥245

కం॥ † మ్రొక్కను సైతము మ్రొక్కరఁ। టెక్కాలమునందుఁగూడ నీ దేవతకున్
మ్రొక్కనెకూడని దేవత। కెక్కారణమునను బియ్యమిత్తురు తలఁపన్ ॥246

ఉ॥ పాఱులుమాత్ర మన్న మిడఁ బాల్పడరంచువచించి వెంటనే
బేరులు తెత్తురన్నమని పెప్పె పెలోఁబడెవీఁడు,విప్రులే
దారినిబోవ వైశ్యులదె దారినిబోదురనటన్న జ్ఞాన మీ
వీరనికున్నఁ జెప్పఁడిటు వీటెడియై ప్రతివాదు లార్వఁగన్ ॥ 247

కం॥ అన్నమె నైవేద్యంబిడు
మన్నవణిక్కులజు లూరకుంటకుఁ గతమే
మున్నదొ మదికిం దోఁపదు
మొన్నటి రథకృత్ప్రతిష్ఠ మొదలుగ మరలన్ 248

---

*...1911వ సం॥ 9వ నవంబరు...ప్రతివాదులతరఫు 5వసాక్షి...పాలెశ్శ వీరన్న...జానపాడు...

...నేను గుమ్మరిని- నేను బాతపాటమ్మ పోలేరమ్మల కర్చకుఁడను

‡ బ్రాహ్మణులు మాకు బియ్యమిత్తురు. మేము వానినివండి దేవతలకు సమర్పింతుము. బ్రాహ్మణు లాదేవాలయములకు రారు.

† మ్రొక్కులుకూడఁ జెల్లింపరు. వాదియు వాదివంశస్థులు నెప్పుడును మ్రొక్కులుచెల్లించియుండలేదు (క్రాసు)...బ్రాహ్మణు లెప్పుడు నన్నము నైవేద్యము పెట్టరు. వారియిండ్లకుఁబోయి మేము బియ్యము కూరలు మొదలైనవి కొనితెత్తుము 1వ ప్రతివాదిప్రతిష్ఠచేయుటకుఁ బూర్వము కొందఱుకోమట్లు వండినయన్నము తీసికొనివచ్చుచుండిరి. విశ్వబ్రాహ్మణులును బియ్యము మొదలగువస్తువులు నైవేద్యములకు గాను మాకిచ్చుట వాడుకయైయున్నది. నేను మొదటిప్రతిష్ఠకుఁ బిలువఁబడితిని. మేము రెండుకుటుంబములవారము పూజారులుగానుందుము అక్కడిపను లుభయులచేతను జేయఁబడుచుండును ఉభయులము నైవేద్యములు పంచుకొందుము. నేనును నంకాళనుపూజారియును వక్కడిపనులు చేయుచుందుము.

ఉ॥ ఎంతగనూటిపోసిననునీతనికిం బెదకాఁ పబద్ధముల్
కొంత నిజంబెపల్కఁబడెఁ గుంతితమాట మనీష, వైశ్యుల
త్యంతపుభక్తిఁ బూర్వమున నన్ను మొసంగుటయుం గలాదుచే
వింతప్రతిష్ఠ చేయఁబడు వెంటనె మానుటయుఁ నిజంబులే 249

ఆ॥ అట్లె బ్రాహ్మణులును నన్ను మున్నైవేద్య
మిచ్చుచుండి ప్రకృత మీప్రతిష్ఠ
యైనదాది మాని,రద్ది యొక్కటె వీని
సాక్ష్యమందుఁగల యసత్య మరయ॥ 250

కం॥ అధికారులగుచు గ్రామపు
నధికారులె యెన్నొ కల్లలాడఁగ వీఁడా
యధికారులకుం లోఁబడి
యధమత నొకయనృతమాడ నది తప్పేమా॥ 251

సీ॥ ?ఒకటవప్రతివాది "యున్నవారు ప్రతిష్ఠ
యానెడఁ బ్రతివాదులంద" అనియె
రెండవప్రతివాది ఖండించె నద్దాని
"నే నందు లే"నన్న దానితోనె
పెద్దకాఁ పతసపైప్రేమాతిశయముచేఁ
బోషించెనద్దానిఁ బూర్ణముగను
అతనిప్రేరణమీఁద నరుదెంచి పూజారి
యాతనివాక్యమే యనువదించె

3, 4, 5 ప్రతివాదులు యంత్రము వేసి ప్రతిష్ఠచేయునప్పు డుండిరి...

?... మేజస్ట్రేటుకోర్టులో...1వముద్దయి...వోలేటిలక్ష్మయ్య...............

...6,7,2,3,4,5,8,9,10ముద్దాయిలు నాతో వుండి ప్రతిష్టచేయును సహాయ్యము చేసినారు...

"ఒక్క యొకటన ప్రతివాదిదక్క నవుడు
తక్కు ప్రతివాదులెవరునుం దనర, రనుచుఁ
గరణ మందరిపైఁగూడఁ గరుణఁజూపె
దేని నమ్మంగవలె వీనిలోనఁ జెప్పుఁడు॥ 252

ఉ॥ *చాకలివాఁ డనంతరపుసాకిరి, ముందుకుముందె వీఁడుతా
†నీ కమసాలియిండ్ల భుజియింతున నెక్, భుజియించుఁగాక,యీ
వాకున నేమిలాభములువాటిలు నీ కమసాలివారికిక్
చాకలితిన్నమాత్రమున తొమ్మసురులయ్యెదరొక్కొ వీరిలక్ 253

క॥ చాకలికింపగునన్నం। బేకరణిం గుమ్మరికిని నిష్టముకాదో
ఆకరణినిష్టమైనక్ జాకలివలెనుడువఁడేల సాక్ష్యము వాఁడుక్ 254

క॥ గ్రామాధికారి సాయము।తో ముందుగ బోధపఱచితో ద్దేఁబడు నీ
గ్రామపుఁజాకలివాఁడిటు। లేమేనివచించుఁగాక యేమగుదానక్ 255

క॥ ధర్మాధికారిచేతను।నిర్మర్మతఁబిల్వఁబడిన నిజరజకుఁడుతాఁ
గర్మారాన్నముతిననని।మార్మసలుటచాలదొక్కొ మనవారలకుక్

---

*...1911వసం॥9నవంబరు...ప్రతివాదులతరఫురెవసాక్షి...తుమ్మపూడి పకీరుగాఁడు...చాకలి...జానపాడు

†ప్రతివాదులకులస్థుల నే నెఱుంగుదును. నేను వారియిండ్లలో భోజనముచేతును. (కాను) నైవేద్యములలో నాకు భాగముగలదు.కొన్ని వేళలలోఁ గరణము వండినయన్నముకూడఁ దీసికొనివచ్చును.౯,౧౦సంవత్సరములనుంచి నే నా గుళ్ళలోకిఁ బోవుచుండుటలేదు. బ్రాహ్మణులు వండినయన్నము తీసికొని వచ్చుసంగతి నాకుఁ దెలియదు. నేనది చూడలేదు.కరణముబోనము వేఁటయు గుడికిఁ బంపఁబడుచుండును.కరణముతల్లి 9,10సంవత్సరములక్రింద నన్నమును దీసికొని వచ్చుచుండెను.ఆమె యిప్పుడు చాల ముసలిది.మాతండ్రికాలమునుండియు నేను బ్రతివాదులయిండ్లలోఁ దినుచుంటిని నేను వెలివేయఁబడలేదు...

చ॥ ధరణిసురాళి బోనములఁ దాఁ గొనిపోవు టెఱుంగఁడంట, యా
కరణముతల్లి బోనమును గైకొనిరాఁ బొడఁగాంచెనంట వీఁ
డరయుఁడు దీనియందుఁగల యర్థము పాఠకులార! మీర, లీ
కరణము కాఁడె బ్రాహ్మణుఁడు, కాఁడన నాతఁడు కోపగింపఁడే॥
ఆ॥ కుంభకారకునకె కొలుతునుబియ్యమం
చనివచించెఁ గరణమయ్య, తాను
కరణమల్లె కుంభకారుఁడుఁ వచియించె
రజకుఁ జేతదుక్తి రద్దుపఱచె॥ 258
క॥ కనుఁగొనుఁ డీసాక్ష్యంబుల నెనయుపరస్పరవిరోధ, మిఁక బ్రాహ్మణులే
యనువున నన్నముగొనిపోరని రుజువయ్యెనొ, వచింపుఁడార్యజనంబుల్॥
ఆ॥ (1) తాండ్రసూరయాభిధానుఁడై కొండూర
నుండెనంటయెవరొ యొక్క వెలమ
యీకలాదులకును నేడవసాక్షిగా
వచ్చె, వీరి నెటుల మెచ్చినాఁడొ॥ 260
తే॥ (2) ఎపుడొ తక్కళ్ళపాటివీరేశలింగ
మనెడికమసాలి తమయూర నొనరిచెనఁట
లలితకున్ గంగకుం బ్రతిష్ఠలను, వాని
నర్చనము సేతురఁట బ్రాహ్మణాదిజనులు॥ 261
క॥ నిజమేయని యెంచుదమది
యజమానుఁడుగాఁగనుండి యటుఁ గంకణమున్॥

---

(1)..1911వసం॥10వనవంబరు..7వసాక్షి..తాండ్రసూరయ్య..వెలమ..కొండూరు,

(2) మానుకొండలో గ్రామస్థు లొకదేవత ప్రతిష్ఠచేయించిరి. అచ్చట నామేనల్లునివ్యవసాయపుఁబనులు నాచేతఁ జేయింపఁబడవలసివచ్చెను. ఆప్రతిష్ఠనుదక్కళ్ళపాటి వీరేశలింగమను నొక విశ్వబ్రాహ్మణుఁడు చేసెను-అచట నాగ్రామదేవతకుబ్రాహ్మణు లన్నము నివేదనముసయఁ జేరు. ఆదేవత పేరు లలితాంబ-ఆదేవాలయములో నేటేట నుత్సవములు జరుపుటలేదు. ఆలలితాంబాదేవత వీరేశలింగముచేతఁ బ్రతిష్ఠింపఁబడినది. ఆదేవతను బ్రాహ్మణులును బూజింతురు. గంగమ్మయను గ్రామదేవతకుమాత్రము బ్రాహ్మణులు నివేదనము చేయుటలేదు

(1) నిజహస్తంబునఁదాల్చిన
సుజనుఁడు లేఁడంటమెవరు, చోద్యము కాదే॥ 262

కం॥ ఒక్కఁడు యజమానుండై
నిక్కముగం దద్విధులను నేర్చిన మఱియిం
కొక్కని నాచార్యుఁగఁ గొని
చక్కగ నెఱవేర్పవలయు సత్క్రియ లెల్లన్॥ 263

తే॥ ఇలఁ బ్రతిష్ఠాది సత్కర్మలెల్ల నిటుల
జరుగవలసినవైయుండ నెఱుఁగను యజ
మానుఁడున్ లేక కంకణమూనఁబడక
యీప్రతిష్ఠలుజరుగుటకెసఁగు కతము॥ 264

కం॥ విశ్వబ్రాహ్మణులమనుచు।శశ్వద్వాదములుసలుపుస్వర్ణహారులవౌ
(2) ఈశ్వరప్రతిష్ఠలిట్టులెయాశ్వాచరితంబులగుచునలరఁగఁబోలున్॥ 265

కం॥ ప్రతివాదుల నెఱుఁగండఁట
ప్రతివాదులనంగనెవరు? ప్రతిగ్రామమునం

---

(1) అచ్చటఁ బ్రతిష్ఠచేయునప్పుడు యజమానుఁడుగాఁ గంకణముకట్టుకొనికూర్చున్నవారెవరును లేరు. విశ్వబ్రాహ్మణునకుఁ బ్రతిష్ఠాధికారము కలదని యూహించెదను. కొండూరిలో రాములవారను పేరుతో నొకవిగ్రహము స్థాపింపఁబడియున్నది. ఒకవిశ్వబ్రాహ్మణుఁ డర్చకుఁడైయున్నాఁడు. బ్రాహ్మణాది సర్వజాతులవారిచేహారతి యీయఁబడుచున్నది. అందఱును బంక్తిగాఁదీరియున్నప్పు డొకవిశ్వబ్రాహ్మణుఁడు చావవిగ్రహమున కెదుట హారతిఁబట్టుకొని యుండును. (క్రాసు) నేను జానపాడెఱుగను. నాది బెజవాడ తాలూకా. నాగ్రామమునకు మానుకొండ రెండుమైళ్ళదూరములో నున్నది. మేము కమసాలులయిండ్లలో భుజింపము. విశ్వబ్రాహ్మణులు కమసాలులనికూడఁ బిలువఁబడుదురు. వారిలోఁ గొంద ఱినాఁడార్లనికూడఁ బిలువఁబడుదురు. కొంద ఱగసాలులనఁబడుదురు. వారి కన్నివృత్తులును గలవు. వారిలోఁ గొందఱుపురోహితులుగానున్నారు. మాకు వైదికులే పురోహితులు. విశ్వబ్రాహ్మణులు తమకుమాత్రమే తాము పురోహితులని తలఁచెదను. మే మెవరికిని గాల్లుకడుగము. లలితాంబప్రతిష్ఠ 4,5 సంవత్సరములకుఁ బూర్వమైయుండును. తూముజయరాముఁ డిప్పు డిక్కడనేయున్నాఁడు. ఆయన వీరేశలింగముప్రతిష్ఠయప్పు డున్నాఁడు.

(2) నేనుబ్రతివాదుల నెఱుఁగను. నాసమ నింటికంటించినారు. ఇంతకుముందే సమనుతీసికొన్నాను. ఆవిగ్రహమును వీరేశలింగము చేసినాఁడు.

దతివాదంబులొనర్చెడి
పతితులు కమసాలులెల్లఁ బ్రతివాదులెకా॥ 266

ఉ॥ కావున వీరిలో నెవరుకావలెనంచు బలాత్కరించి యీ
దేవయఁ దోడితెచ్చి యిట దించిరొ, వక్కణముంబొనర్చెఁదా
నీవిధి, బ్రహ్మజాతిపయి నేవముగల్గి మెలంగువారిలో
నీవగకాఁ డొకండనుట కేవిధమా విచికిత్సలేదుగా॥ 267

తే॥ వచ్చె నమ్మానుకొండనివాసియైన
(1) తూముజయరాముఁ డితనికిఁదోడుగాఁగ
(2) ఇద్దటెది పాఠ మొక్కటే, యిరువు రొక్క
గురువునొద్దనె పాఠంబు జరుపఁబోలు॥ 268

---

ఆవిగ్రహమును విశ్వబ్రాహ్మణులు నీటిలో స్నానముచేయించినారు విగ్రహము మీఁద వడ్లుపోసినారు విగ్రహము నూరేగించి తీసికొనివచ్చి యంత్రములతో స్నానము చేయించినారు ఒకయతీశ్వరుఁడు చేయవలసినపద్ధతులను జెప్పుచు నక్కడఁ గూర్చున్నాడు-ఆయన కొకమతములేదు ఊరేగింపై వచ్చినతర్వాత విఘ్నేశ్వరపూజయుఁ బుణ్యాహవాచనమును జరుపఁబడినవి-ఏదిముందుచేసినారో తెలియదు వైదికులువచ్చి నప్పటికినివా డేమియు జోక్యముకలిగించుకొనలేదుమా గ్రామములో6,7 వైదికయిండ్లును 6నియోగులయిండ్లును నున్నవి. 5,6 విశ్వబ్రాహ్మణులయిండ్లున్నవి. వీరేశలింగ మన్యగ్రామస్థుఁడు-బ్రాహ్మణాది సర్వమతములవారును దేవతకుఁ గొబ్బెరకాయలు కొట్టినారు. అప్పుడు సంతర్పణ యేమియు జరుపలేదు ప్రతిష్ఠయైనతర్వాత రెం డుత్సవములు జరిగినవి-శూద్రు లన్నముఁబంపినారు- మేము వెలమలము-దాసీ జనద్వారమునఁ బంపినాము-బ్రాహ్మణులును వైశ్యులును నన్నము తీసికొనిపోరు కొండూరు మానుకొండలలో మాత్రమే యీయుత్సవమును జూచినాను రాములవారిపూజచేయుటకుఁగా నేర్పఱుపఁబడిన స్తంభము నాపినతండ్రివేయించినదే-అక్కడ నొక గుడి కూడ నున్నది.

(1) 1911వసం॥ 10వనవంబరు...8వసాక్షి...తూముజయరాముఁడు...మానుకొండ,

(2) మాగ్రామములో బాలాంబయనుదేవత విశ్వబ్రాహ్మణులచే స్థాపింపఁబడినది. ఆప్రతిష్ఠ తక్కెళ్లపాటి వీరేశలింగమువల్లజరిగినది. బోనములు శూద్రులుమాత్రమే యర్పించినారు-

తే॥ ఇతఁడు మాయూరి పెదకాఁపు నించుకంత
(1) హెచ్చుతగ్గుగ సదృశులే యెంచిచూడ
అతనికన్నను నితనికి శతమెయఁట
సిస్తులోఁ దక్కువ, యిఁకేమి చెప్పవలెను॥ 269

శా॥ ఆ మాయూరికిఁ బెద్దకాఁపయిన బ్రహ్మద్వేషిచారిత్రముల్
వేమాఱుల్ వివరించియుంటి వెనుకన్ నేఁగానఁ దత్తుల్యుఁడే
యీమర్త్యుండును, బ్రాహ్మణుం బిలువకే యేవ్రాఁ పనుల్ చేసెనం
చామాన్యుం డజనుల్ వచింపవిని యత్యానందముం బొందితిన్ ॥

తే॥ "స్వర్ణకృద్వ్యాజనంబుతో నవన మొకటి
సలుపుచున్నాఁడుఁ గూడదన్ శాస్త్రమున్నఁ
జెప్పుఁడం"చని మాబోంట్లఁ జీరినట్టి
కందినీలాచలాఖ్యుని బంధుగితఁడు॥ 271

తే॥ బొమ్మిరెడ్డ్యన్వయంబునం బుట్టినట్టి
(2) సూర్యనారాయణునినుడు ల్వాచుఁడింక
(3) రెడ్డి తెగయెల్లఁ గమసాలియిడ్డయన్న
మారగించిన దైపోయె నతనికతన॥ 272

సీ॥ అల కొండవీడు మున్ బలురాజధానిగా
బహుకాలమేలిన ప్రభులు రెడ్లు
గద్వాల మొదలుగాఁగలచోట్లఁ బ్రకృతంబు
ధార్మికులౌ జమీందార్లు రెడ్లు

---

(1) నేను రు800 లసిస్తు చెల్లింతును- (క్రాసు) ఆప్రతిష్ఠ సుమారు 5సం॥ లక్రిందట నైయున్నది నేను బ్రతివాదుల నెఱుఁగను ఆవిగ్రహము నీటిలో స్నానము చేయించఁబడినది వడ్లు దానిమీఁదఁబోసి యూరేగింపుచేసి మంత్రములు చెప్పిన తర్వాతఁ గొబ్బరకాయలు కొట్టినతర్వాత గుడిలో స్థాపనచేయఁబడినది...

(2) ... 1911 వ సం॥ 10వ నవంబరు ... 9వ సాక్షి ... బొమ్మిరెడ్డి సూర్యనారాయణ ... రెడ్డి ... ముత్యాలంపాడు,

(3) మాగ్రామములో విశ్వబ్రాహ్మణులున్నారు మాకులపురెడ్లు వాండ్రయిండ్లలో భోజనముచేతురుకాని వాండ్రు మాయిండ్లలో భోజనముచేయరు

ఆంధ్రభూమండలి నతిభాగ్యవంతులై
  క్రాలుచుండినయట్టి ఘనులు రెడ్లు
భూదేవగురుదేవ పూజనావరమతిఁ
  జరియించు సచ్ఛూద్రజనులు రెడ్లు
అట్టిరెడ్లకె యీమూర్ఖుఁ డపయశంబు
దెచ్చె "నగసాలియన్నంబు తిందు" రనుచు
దోమకొండఁ వసించెడి దొరలెవిన్నఁ
నేమియేం జేయుచుండిరి యీనృశంసు. 273

కం॥ వ్రడంగియిడినయన్నము ప్రద్రనయుతమనుచు, రెడ్లు సాపడినట్లే
వడ్రంగి యితనియూరున। బొడ్రాయిప్రతిష్ఠ సలుపఁబోలెడిఁ జూడన్

ఆ॥ బొడ్డురాయి యేడఁ బూజించుటది యేడ
తత్ప్రతిష్ఠ యేడ, త్వష్ట యేడ
వినవినఁ మజెంత వింతయైకనుపట్టె
స్వర్ణకారులతరపు సాక్ష్యసరణి. 275

ఆ॥ కాఁపుపెత్తనంబు గలయూర నొకవేళ
నగునుగాక యేతదాదికములు
పదుగురుండినట్టి బలుగ్రామమునమాత్ర
మిట్టిపనులుజరుగ వెప్పటికిని. 276

కం॥ పాడూరిలోన మంచపుఁ। గోడెటులంబోతరాజొ కుగ్రామమునన్
జేఁడగుమూర్ఖజనుండటు। వాఁ డేపనిసేయ నెవరు వలదనువారల్

(1) మాయూరిలో బొడ్రాయి యనుగ్రామదేవతకు సుమారు 10 యేండ్లక్రింద బెజ్జంకి రామాచార్యులను విశ్వబ్రాహ్మణునిచేఁ బ్రతిష్ఠచేయఁబడినది. మూడేండ్లక్రింద మాసాబత్తుల సుబ్బయాచారిచేఁ బ్రతిష్ఠచేయఁబడినది (కారిసు) మొదటిప్రతిష్ఠవలన 9,10 సంవత్సరములుమాత్రమే దేవతకు మహత్తయుండును గావున రెండవప్రతిష్ఠ చేయ వలసివచ్చినది. దీనఁగూడ 9యేండ్లవఱకే మహత్త్వముండును అంతకుఁబూర్వ మెవరు ప్రతిష్ఠచేసినది నాకుఁ దెలియదు. బొడ్రాయియను గ్రామదేవతకుఁ బ్రతిసంవత్సర ముత్సవము చేయఁబడుచుండును అన్నము నైవేద్యము పెట్టుచుందురు. ముత్యాలమ్మయను మఱియొక గ్రామదేవతకూడఁ గలదు. బెజ్జంకి రామయాచార్యులది రాజమహేంద్రవరము నేను సాకలములోనే యున్నాను.

క॥ తిందురుస్వర్ణకృదన్నం । బందఱురెడ్లునటంచునని ప్రథమమునన్
(1) బొందంబడెఁగాన్చేసిన। నెందుం దినుపట్లఁ జూచియెఱుఁగనటంచున్ ॥

క॥ వచ్చెం దదుపరి గొల్లఁడు మెచ్చెన్ రథకారజనుల మేటులటంచున్
(2)ఇచ్చెన్ హైన్యముద్విజులకు
హెచ్చెన్ దౌష్ట్యముమఱింత యేమని చెపుదున్॥ 279

క॥ తినఁడఁట వైదికగృహముల
(3) మనునఁట తిని స్వర్ణకారమందిరములనే
మును పెన్నఁడేని యిట్టివి
వినియుంటిరో లేదో వినుఁడు విశ్వజనంబుల్॥ 280

క॥ ఎఱిఁగియొ యెఱుఁగకొ యందఱు
(4) ధర మమ్మునె బ్రాహ్మణులుగఁ దలఁచిరి మును, పీ
నెఱిగొల్ల చెప్పె, నిజమగు
వరబ్రాహ్మణులనఁగ వడ్లవారేచుండీ॥ 281

క॥ అనుఁ డనకుండుఁడు మీర
ల్జనులారా! సువర్ణకారు సద్బ్రాహ్మణుఁడం
చనె గొల్లవాఁడు, చాలును
ఘనులును బ్రాహ్మణులు నైరి కమసాలు లిఁకన్॥ 282

క॥ ప్రతివాదసారమారయ । క్షితిదేవులు గ్రామశక్తిసేవింపరటం
చతిమౌర్ఖ్యంబునమరలన్। బ్రతివాఁడునుదద్విరుద్ధభాష లెనుడువున్॥

---

(1) నాకులపువాండ్రు విశ్వబ్రాహ్మణులయిండ్లలో భోజనము చేయఁగా నేను జూడలేదు.

(2) .........1911 వ సం॥ 10 వ నవంబరు .........10 వ సాక్షి...... బండారు సిద్దప్ప......గొల్ల.........తుమ్మలకుంట.

(3) మేము విశ్వబ్రాహ్మణులయిండ్లలో భోజనము చేతుము-మాకులపువాండ్రు వారియిండ్లలో భోజనము చేతురు-మేము వైదికులయిండ్లలో భోజనము చేయము-బ్రాహ్మణులు గ్రామ దేవతకు బోనము పెట్టరు.

(4) (క్రాసు) విశ్వబ్రాహ్మణులు కమసాలిబత్తులు. మాగురువు విశ్వబ్రాహ్మణుఁడు-నిజమైన బ్రాహ్మణులు విశ్వబ్రాహ్మణులే-మాకుఁ బురోహితులు లేరు-పెండ్లిండ్లలో బ్రాహ్మణులు గాని విశ్వబ్రాహ్మణులు గాని మాయిండ్లలో మంత్రములు చెప్పరు.

క॥ (1)కరణాల్బోనాలిత్తురు।మఱివైదికులీయర నెడిమాటయెయది,యా
కరణాల్బ్రాహ్మణులనియెడి। యెఱుకేలేదరసిచూడహీనాత్ములకున్॥

తే॥(2) ఇంతఁ దక్కెళ్లపాటి వీరేశలింగ
మయ్య, యయగారె, యాచార్యు, లతనిదైన
సాక్ష్యముం జూపుచున్నాఁడ సరిగఁజూడుఁ
డార్యవరులార! యద్దాని నాదరమున॥ 285

క॥ ఆచార్యుండఁటఁబాతఁ। డాచార్యత్వంబదేరికర్మా మొయెఱుఁగం
డాచార్యులగీచార్యుల। రాచరికమువారుగూడ రద్దుపఱుపరే॥ 286

క॥ (3) వేఁబది యఱువదివఱకు బ
రాబరిగం జేసెనంట రా ప్రతిమలుగా
నీబుద్ధిమంతుఁ, డపి తా
నే బాగుగఁ బ్రాణమిచ్చి నిలిపెనఁటరరే!॥ 287

తే॥ ఇల్లుగాలిచిరమ్మన్న నేగి యూరె
కాల్చివచ్చినరీతి నీకాసెయతఁడు
విగ్రహావుఁజేఁత తన కులవృత్తిగాఁగ
అప్రతిష్ఠలకును సిద్ధమయ్యెనవుర॥ 288

ఆ॥ బ్రహ్మవిష్ణుభర్గ ప్రాణప్రతిష్ఠలన్
(4) జేసెనంట యితఁడు శ్రేష్ఠుఁడగుచు
తండ్రినాఁటినుండి తనవృత్తి యదియయై

---

(1) గ్రామదేవతలకు వైశ్యులును గరణములును బోనములెత్తురు వైదికులు బోనములు తేఁగా నేనుజూడలేదు కమసాలులుకూడ బోనములు తీసికొనిపోవుదురు నైవేద్యము మాకిచ్చిన మేముతినెదము...

(2) ...1911వ సం॥ 11వ నవంబరు...11వసాక్షి...తక్కెళ్లపాటి వీరేశలింగాచార్యులు...కొప్పెరపాడు

(3) నేను దేవాలయములు విగ్రహములు ప్రతిష్ఠలు చేయుదును ప్రతిష్ఠకముందు నేను విగ్రహములఁజేతును అది నావృత్తి నేను 50, 60 విగ్రహములను జేసి ప్రతిష్ఠజేసియుందును.

(4) మాతండ్రికూడ నీవృత్తినే యవలంబించెను మే మన్ని దేవతలను జేతుము త్రిమూర్తులఁగూడఁ బ్రతిష్ఠింతుము.

యుండెనంట యేతహస్తి వినుఁడు॥ 289

చం॥ చెలఁగునుగాక విగ్రహము చేసెడిపట్ల నితండు చెప్ప నీ
లలి, యది యేరువద్దనిరి, లాఘవ మంతకుమించి చెప్పఁగ
దలఁచిన, నీతఁ డన్నిటికిఁ దానెఘనుండఁట, పెక్కులేలవీ
రిలపయి సృష్టికర్తలము నేమెయటంచు వచించుచుండ్రుగా. 290

తే॥ ఆప్రతిష్ఠను దమకుండు హక్కుగూర్చి
యాతఁ డుంజూపె గార్గేయునాగమంబె
నేను బూర్వంబె తెలిపితి దానివితము
చదువుఁ డొకమాఱు మరల నాస్థలమునందె. 291

తే॥ అతఁడు గార్గేయునాగమమను టెకాక
(2) మయుమతాగమమని చెప్పె మఱియునొకటి
ఎన్ని పేళ్లని పెట్టనిం డింతకద్ది
క్రొత్తవౌ తాటికమ్మల పొత్తమొకఁడె. 292

కం॥ వేదములఁట శాస్త్రములఁట। యాదొడ్డగు నాగమంబు, లలరెద రెవ్వో
(3) వేదాళ్ళదివిన వారలు। రాదీ వేదంబు మాని రాట్టుల కేని॥ 293

---

(1) ఆవశ్యకములగు వేదమంత్రములను బఠింతము విగ్రహమున కుపయుక్తములగు రూపవర్ణనలతోఁ బ్రారంభమై మంత్రిసంస్కారములును (బతిష్ఠయును జేయుటతో సమాప్తియగును విగ్రహములు చేయుటకుఁ బూర్వము వినాయకుని మేము పూజింపవలెను ఈవినాయకపూజ కొండవద్ద శిలానిశ్చయమునకుఁ బూర్వము కూడఁ జేయవలెను ఈనిశ్చయమైన రాతిని శిల్పాలయము (మేము పనిచేయుచోటు) లోఁ దొమ్మిదిమాసములుంతుము అవయవము లన్నియు గర్భస్థశిశువునకువలె మేము చెక్కుదుము 7వ నెలలో జీవకళాన్యాసము గావింతుము విగ్రహముపూర్తియైనపిదపఁ బ్రతిష్ఠచేయుటకుఁ బూర్వము ద్వాదశసంస్కారములు చేతుము. ద్వాదశసంస్కారములకుఁ బఠింపవలసిన వేదమంత్రములుగలవు ప్రతిష్ఠచేయు శిల్పిబ్రాహ్మణుఁడే.

(2) గార్గేయాగమ మయమతాగమములలో నిట్లు చెప్పఁబడియున్నది

(3) ఈగ్రంథములు వేదములును ధర్మశాస్త్రములును నైయున్నవి 13వ దస్తావేజు (గార్గేయాగమము) 2వ పేజీలో ద్వాదశసంస్కారములఁగూర్చి చెప్పఁబడియున్నది మొదటి 14 పుటలలోఁ బరశివ విశ్వనిర్ణయగుణమునుగూర్చి చెప్పను 2వ పుటలోఁ బ్రారంభమందు శిల్పులు ప్రతిష్ఠోత్సవము నిర్వహింపవలసినదని చెప్పఁబడియున్నది.

ఆ॥ (1) కానఁడేమొయితఁడు తాను విశ్వబ్రహ్మ
యుపనిషత్తు నచ్చువేసియుంట
కాంచియున్న గోత్రఖండకై బ్రహ్మాండ
పుం బురాణమునకుఁ బోఁడుపోఁడు॥ 294

క॥ (2) అది ముద్రితమయియే యు
న్నదియంచనేఁగాని యందుసందా సనిఁ
ట్టిది కలదో లేదో చూడం
డదిచదివెడి తెలివిలేని యాహేతువునన్॥ 295

తే॥ తాములిఖియించికొనినట్టి తాళపత్ర
ములను దమగోత్రఖండంబు చెలఁగుకతన
నచ్చుపడియున్న యద్దానియందుఁగూడ
నుండెనని యనుకొనేఁగాని యున్నెయద్ది॥ 296

మ॥ (3) రావినూతల చీమకుర్తులు రాణనొప్పెడియూళ్ళ,భూ
దేవు లెందఱొ గట్టివాం డ్రటఁ దేలియుండిరి,వారె యీ
దేవయం బిలిపించి యీశుప్రతిష్ఠనే నలిపించిరం
టీవిచారవిదూరమానుడి యెట్లునమ్మఁగఁ బోలెడిన్॥ 297

క॥ అద్దంకిగ్రామ మంతకుఁ
బెద్దది,యాయూరిలోని పృథ్వీదేవు
ల్శ్రద్ధలోకో యీలింగము
విద్దెకె భ్రమియించి యిట్టివిధి కొప్పటకున్॥ 298

(1) మాగోత్రకాండ బ్రహ్మాండపురాణాంతర్గతము-మాఋషులు మహాభువన త్వష్ట విశ్వరూపులు(కాదు) బ్రహ్మాండపురాణములోఁ జాల నధ్యాయములున్నవి-అది యెవరుచేసినారో నాకు జ్ఞాపకములేదు-పురాణములు పదునెన్మిది- వాని పేరులుగాని వానిచేసినవాని పేరులుగాని నేను జెప్పలేను-బ్రహ్మాండపురాణముకూడఁ బదునెన్మిదింటిలో నిదేయని నాకు జ్ఞాపకము.

(2) అది యచ్చుపడియున్నది. నేనుగోత్రఖండమునకు మాత్రము సమాచారము చేసినాను-అది తెలుఁగక్షరములలోనున్నది.

(3) రావినూతల చీమకుర్తి యద్దంకులలోను నేను మఱచిపోయిన మఱికొన్ని యూళ్ళలోను మొత్తమున కాలుగుళ్ళలో బ్రతిష్ఠచేసినాను.

క॥ (1) తా యాజకుఁడుగనుండిన
యాయాదేవాలయముల నర్చకులును నా
త్మీయులుగారఁట, యితరులె
యాయర్చకతంగ్రహించిరంట వినుండీ॥ 299

తే॥ ఎంచిచూడ శివార్చకు ల్పాంచరాత్రు
లలరుచుందురు శివకేశవార్చకులుగ
వారికర్మంబె పగిలెనా? వర్ధకిప్ర
తిష్ఠితార్చల కర్చన ల్సేయుటకును॥ 300

క॥ ద్వైతాద్వైతప్రముఖుల। చేతఁ బ్రతిష్ఠితములైన శిలలె విశిష్టా
ద్వైతులగు పాంచరాత్రుల। చేతను నర్చింపఁబడవు క్షితి నెందేనిన్

॥ తామె ప్రతిష్ఠల్పొనరిచి
యేమాసపుఁగూడ నంటనీయక పూజ
ల్నేమంబునఁ గావించు న
సామాన్యులు పాంచరాత్రజనములు తలఁపన్॥ 302

తే॥ పాంచరాత్రాగమంబునఁ బరఁగ దాక్షి
(2)యరయ విష్ణుప్రతిష్ఠల నాచరింపఁ
దగినవా రెవ్వరైనది, దానిలోన
శిల్పి యెందాక నర్హుఁడో చెప్పఁబడియె॥ 303

భుజంగప్రయాతము.

శివబ్రాహ్మణుల్గూడఁ జేయంగఁ బోరీ
యుపాధ్యుల్ప్రతిష్ఠించు నవ్వానిపూజల్

(4) ఈదేవాలయములలో నర్చకులు మాపలమువాండ్రు కారు.

(1) విష్ణుతిలకము సప్తమాధ్యాయము, 165వ పుట

శ్లో॥ యజమానో గురుంసమ్య గర్చయే దంశురార్పణే। కర్మార్చాదిషు బేరేషు నిర్మితేషు యథావిధి॥ రత్నన్యాసం పీఠికాయాం కారయిత్వాథ శిల్పిభిః। ఉన్మీలయిత్వా నేత్రాణి శిల్పినశ్చ ధనాదిభిః॥ తోషయిత్వా తతో బ్రాహ్మణ్। ధామ్నోంతర్బహిరబ్జజ। మార్జనాలేపనాద్యైశ్చ శోధయిత్వా సమంతతః॥ ప్రజ్వాలితైర్దర్భపుంజైః పర్యగ్నికరణం చరేత్.

వివాదర్ జయంబుద వీక్షించి తానే
మెహోపక్కనీతం డిటు లక్కల్లమాటల్॥ 304

క॥ పెదగొట్టెపాటిలో శివుc
(1) గుమురుగనిల్పితినటంచుc గూసెనితం డ
య్యాది కేవలమ్మృష,సందియ
మొదవినc జమువుకురుగాక యుత్తర మవలన్॥ 305

తే॥ ఈదుమూడిననైన రమేట్ప్రతిష్ఠ
యితనియూరనునైన పోలేల్ప్రతిష్ఠ
(2) మానుకొండనునైన యుమా ప్రతిష్ఠ
యాదిగాcగలవన్నియు నబ్లె మృషలు॥ 306

క॥ (3) అందరు బ్రాహ్మణులనియే
యందఱుమమునను చునుమువు నావాక్యంబున్
జందమె చెప్పెడినీతని
యందంబంతెయును, నేల యధికోక్తులతోన్॥ 307

తే॥ (4) అంతకంటెనునాశ్చర్యమైన యింకి
నొక్క వాక్యంబుగల దద్దియున్ వినుండు
ఇతcడు కమసాలియను పేరె యింతవఱకు
తానువిన లేదc టిది యొంతసూనృతంబొ॥ 308

---

(2) పెదగొట్టెపాటిలో నేను శివప్రతిష్ఠచేసినాను. ఈదుమూడిలోను మాగ్రామములోను విష్ణుప్రతిష్ఠచేసినాను. రావినూతలలోcగూడ విష్ణుప్రతిష్ఠచేసినాను. వల్లీ వారిపాలెములోను మాగ్రామములోను పోలేరమ్మప్రతిష్ఠచేసినాను.

(1) మానుకొండలో లలితాంబప్రతిష్ఠ చేసినాను. పూనూరులోc జింతలమ్మ యంకమ్మల ప్రతిష్ఠలుచేసినాను. పోతారులంకలోc బోతరాజుప్రతిష్ఠచేసినాను.

(2)మము నెప్పుడును బ్రాహ్మణులనియే పిలుతురు. బజారులోc దెలియనివాండ్రుమాత్రము విశ్వబ్రాహ్మణులని పిలుతురు.

(3) నే నిదివఱకు కమసాలియను పేరు వినలేదు. అది యొకవృత్తిపేరు. గార్గేయాగమము గార్గేయమహర్షి చేసినాcడు మయమతాగమము మయవిశ్వకర్మచేసినాcడు

ఉ॥ (1) ఆగమమంచు నేకృతిని హాజరుపెట్టెను కోర్టుకద్దితా
బాగుగ నొక్క యూరుభవబాలకుచేత లిఖింపఁజేసెనం
టాగుణవంతుఁ, డందెకల దాత్మగరిష్ఠతయెల్ల నెందుకో
వాఁగెడు బ్రాహ్మణుండనని వ్యర్థముగం బదిమంది నవ్వఁగ॥ ॥309

ఆ॥ (2) అంజనీతనూజు నాలయపుంబని
మేలనంగఁ జేయు మేస్త్రికిద్ది
వ్రాసియిడితినంచు వైశ్యుఁ డప్పొత్తంపుఁ
దుదలిఖించె, దానిఁ జదువకొనుఁడు॥ 310

తే॥ తన్ను బ్రాహ్మణుఁడనుటయే తథ్యమైన
శంకరుని దాను నిల్పుటే సత్యమైన
బాగుగఁ బ్రతిష్ఠసల్పిన బ్రాహ్మణునకు
వ్రాసియిచ్చితినని యేల వ్రాయఁ డతఁడు॥ 311

ఉ॥ అంత విలేజిమున్సిభు సమాగతుఁడై వచియించె సాక్ష్య, మా
(3) వంతయుఁగానరాదుభిద యాతనివాక్కులఁ బెద్దకాఁపు బ

(4) 18వ మార్కు దస్తావేజు (గార్గేయాగమము) ఒక ప్రాతబొక్కునుండి వ్రాయఁబడ్డది 5, 6 సంవత్సరములక్రింద నేనొక కోమటిచేత వ్రాయించినాను కావలెనంటెఁ జినిగిపోయిన ప్రాతతాటాకులపుస్తకము దాఖలుచేతును... తక్కెళ్లపాటి వీరేశలింగాచారి వ్రాలు...

(5) గార్గేయాగమముచివర

ప్రమాదినామసంవత్సర శ్రావణ శు ౧౨ బుధవారంవర్కు గుంటూరుతాలూకా యిలాకాలోచేరిన గొట్టిపాటిలో శ్రీ ఆంజనేయస్వామివారి దేవాలయంపని పూర్తిజేయించిన మేస్త్రీ వింగవోల్ తాలూకాయిలాకా కొప్పెరపాటికాపురస్థుడైన తక్కెళ్లపాటి వీరేశలింగాచార్ల...వ్రాశియివ్వడమైనది.

1911 వ సం॥ 13 వ నవంబరు.....ప్రతివాదులతరపు 12 వ సాక్షి...... బొగ్గవరపుఁ బెదయచ్చయ్య- విలేజిమున్సిభు.....జానపాడు.

మా గ్రామములోఁ బాతపాటమ్మ పోతేరమ్మ గుళ్లున్నవి. 40 సం॥ క్రిందఁ జెన్నమల్లను విశ్వబ్రాహ్మణునిచేఁ బ్రతిష్ఠచేయఁబడెను. రెండుగుళ్లలో స్థాపనకు మాయన్న కంకణముకట్టుకొనెను. బ్రాహ్మణులు దేవతలకు బోనము వంపరు. చివరప్రతిష్ఠకు 1 వ ప్రతివాదిని పిలిపించినాము. ప్రతిష్ఠయైనతర్వాత బియ్యము పప్పు గుడ్డలు పంచుకొనుటలోఁ గలహముజగెను. వాదియు 1 వ ప్రతివాదియు వివాదపడిరి.

ల్వింతగు వాక్కులం, గనుక వేరుగఁ జర్చయొనర్పఁ గాని యొ
క్కింతకుమాత్రి ముత్తరము నిచ్చుచునుంటి బుధుల్కనుండికన్

ఆ॥ కాఱులఱచెనితఁడు గ్రామపౌరోహిత్య
(1) మేను జేయుననియు నా నియోగ
మునను నే గొచేసి కొనివచ్చి యాసొమ్ము
నాకునిత్తురనియు న్యాయ మురివి॥ 313

ఆ॥ ఏనెచేతుఁగాక యితరుఁ జేచేయించి
వచ్చు సొమ్ము నాకు నిచ్చుఁగాక
అంత పాపకార్యమనుచుఁ జింతిలఁగాని
మిథ్యవైచిరనుచు మిడుకుచుంటి॥ 314

తే॥ కవిత విద్వత్త యొకయింత ఘనతయొసఁగ
బ్రదుకుచుంటిని నేను మర్యాదతోనె
జనులుకొందఱు నింద్యమఁచనుచుఁదలఁచు
గ్రామయాజనముననుండి కాదుకాదు॥ 315

ఉ॥ పాఱులమీఁది ద్వేషమున బత్తుని నొక్కరుఁ దోడితెచ్చి పో
లేరమకుం బ్రతిష్ఠసలిపించిన కాఁపులకొంపలేనియుర్
దూరముచేసి నాపనికిఁదోడ్పడ కాధ్యపురోధలైనవార్
వేఱుగనున్నవారు కడు వేడుక మాకొటికన్ నిజంబుగన్॥ 316

---

(క్రాసు) మొదటిప్రతిష్ఠ థాతసం॥రుఁ బూర్వమైయుండును. నాకు బాగుగా జ్ఞాపకములేదు. నా కప్పటి కిరువదిసం॥ల ప్రాయము. అప్పుడుప్రతిష్ఠచేయించినది. జానపాటిగ్రామస్థుఁడు. అతఁడు మాగ్రామములోఁ బ్రతిష్ఠయేకాని పౌరోహిత్యము చేయఁడు. 2 వ ప్రతివాది యుపనయనము వివాహము నెవరుచేయించినది నాకుఁదెలియదు. నే నక్కడి కేగలేదు. మాకులమునకు వైదికులు పౌరోహిత్యముచేయుదురు. ఆరాధ్యుఁడుచేసిన మొదటిప్రతిష్ఠ చెడిపోయినందువలన మరల విశ్వబ్రాహ్మణుని బిలువవలసి వచ్చెను వైదిక బ్రాహ్మణులు ప్రతిష్ఠప్పుడేమియు జోక్యము కలిగించుకొనలేదు. మావలెవారుకూడ నక్కడనేయుండి భాగము కావలెనని కోరినారు. అందుకే మే మాటంకము పరచినాము.

(2) వాఁడి పౌరోహిత్యముచేయఁడు ఏజంట్లుద్వారమున జరుపును.

చ॥ కనుకనె పెక్కు ధాన్యముల గాదెలునింపఁగ నాలఁ బెంపఁగన్
జనులకువడ్డికిన్ ధనముఁ జాలి మెలంగుచునున్న వారు వా
రిన ధరియింప నర్హ పితృదేవబుధాతిథిపూజనల్పనే
యొనరి నగారవార్జనము లుంటిని నేను యథోచితంబుగన్॥ 317

ఆ॥ నాదు జీవనంబు కాదు ముమ్మాటికి
నార్యులార! గ్రామయాజనంబు
అదియవృత్తిగలుగు నవ్వైదికులకు నే
నచటభాగమడుగు టనవసరము॥ 318

ఉ॥ బత్తుప్రతిష్ఠకొప్పి యట భక్తి నవహాప్తినిబొందుదనక్కు ను
న్మత్తులపోలె నుండిన యమాయికవర్యులు పాలుకోసమై
యొత్తెఁగాడుదుర్జగడ, మీనుడి యెవ్విధినమ్మనాను, ధీ
రోత్తములార! లెస్స మది యోజనచేసి జవాబొసంగుఁడీ॥ 319

తే॥ ఏమిసంబంధముండెడి నెంచిచూడ
నల ప్రతిష్ఠకు గ్రామాశ్రయంబునకును
అట్లు సంబంధశూన్యమైనట్టిపనిని
భాగమేరీతిఁగోరెడి బ్రాహ్మణాళి॥ 320

తే॥ కడఁగి యెద్దినెనన గాటఁగట్టివేయుఁ
డనెడిధర్మాధికారులైనట్టికతన

---

నాకొమారుఁడు క్రిమినల్కేసులో నొకముద్దయి-ఉన్నముచినవీరయ్య నాపినతల్లి కొడుకు-మేజస్ట్రేటుకేసులో నతఁడుకూడ నొకముద్దయి-మాయూరిలోఁ గరణాలకు బ్రాహ్మణులకుఁ బార్టీలున్నవి-నేను గరణముపక్షమున నున్నాను-నేను వతఁడు స్నేహముగానే యున్నాము-గుండాలముత్తయ్య యాడుదానిని జెటిచినకేసులో నే నతనిపక్షమున సాక్షిని-కరణముగూడ సాక్షి-వాదియన్నయు మతికొందఱు సొకదొంగతనము మఱుఁగుపఱచినట్లుగా నాపై రిపోర్టుచేసినారు నన్ను-సస్పెండుచేసినారు-ఫిర్యాది తన సొమ్మేమియుఁ బోలేదనిచెప్పినది రెండవసారిప్రతిష్ఠకు యజమానుఁడులేదుకావునఁ గంకణ మెవరును గట్టుకొనలేదు- 2 వ ప్రతివాది ప్రతిష్ఠప్పుడు గ్రామములో లేఁడు-కోమట్లు బోనముతీసికొని పోదురు-బ్రాహ్మణులు ప్రొక్కున్నచో బియ్యము నితర

పన్ని యీమాలికం బెరపార్టివార
లాటలాడంగఁజొచ్చి రన్యాయస్మృతిని॥ 321

క॥ గుండాలముత్తయాఖ్యుఁడ। ఖండించుచను దెం చెవరునగఁ సాక్షిగనై
(1) వెండి విమర్శింపఁగఁదగు। దండినుడు ల్గానరావు తత్సాక్ష్యమునఁ॥

క॥ మునిసీభు పెద్దకాఁపును। బనిఁగొనిమును పాడినట్టిపాటయె యీతం
డును బాడె, కమ్మతెగయె। ల్లను నొక్కటిగాక భిన్నలక్షణమగు॥

ఆ॥ ఎవతో యాడుదంట, యీతఁ డేమో చేసె
నంట, యద్ది కేసు నయ్యెనంట
ఇలు విలేజిమున్సి భింతకుమున్నె తా
ననియెఁ దనదుసాక్ష్యమునను గనుఁడు॥ 324

క॥ కరణము మున్సిభు పెదకాఁ
పురపడిఁ బ్రేరేప నితఁడు పాుమ్మనుచుం దా
నరుదెంచి పలికె సాక్ష్యము
గురుతఁ వహియించికాదు కుకలాదులపై॥ 325

క॥ తక్కినవారికిమాత్రము
వెక్కస మొకదుండెఁగాని విప్రజనులపై
నక్కమసాలులమీఁదను
నక్కట! గౌరవముగలదె యాలోచింపఁ॥ 326

ఉ॥ ఏ మగునన్న దాసిఁ గర మీసునఁ గాదనుచే ప్రధాన మా
సాముల, కంతెకాని కమసాలులపైని గురుత్వమున్నదే

---

వస్తువులు కుమ్మరవానికిత్తురు- నేను విశ్వబ్రాహ్మణులయిండ్లలోఁగాని వైదికులయిండ్ల లోఁగాని భోజనముచేయను-మాగురువులు వైష్ణవులు- నేను వారియిండ్లలోఁ దినుదును--

(1)...1918 వ సం॥ 13 వ నవంబరు...ప్రతివాదులతరఫు 18 వ సాక్షి... గుండాల ముత్తయ్య...కమ్మ...జానపాడు

పాతపాటమ్మపోలేరమ్మగుళ్లు నేనెఱుఁగుదును. బ్రాహ్మణులు బోనముతీసి కొని పోరు. కడపటిప్రతిష్ఠప్పుడు నేనున్నాను. ప్రతిష్ఠయైన తర్వాత బ్రాహ్మణులకు విశ్వబ్రాహ్మణులకుఁ దగవువచ్చెను. కరణము కమ్మవారు విశ్వబ్రాహ్మణులపక్షమున

ఆ మన స్వర్ణకారులకున్నైనను విప్రులు గౌరవింపరట
శ్యామమె కాని కాఁపు లెటుపల్కిన మానమె భూషణంబగున్॥ 327

ఉ॥ మానముఁబూనకున్న యెడ మాటలతోనిడ రుత్తరంబువార్
గానఁ దదంతికంబునను గౌరవకాంక్ష దొలంగియుండి మా
పైని సవారిచేయుదురు బాపలమేమని, యోయియన్న మా
త్రానను మండిపోదు, రవురా! కమసాలులనంగఁ దిట్టుదుర్॥ 328

ఆ॥ ఈప్రతిష్ఠయైన యిటువెన్క నవ్వారి
యామము మఱియొకింత యతిశయిల్లె
పదుగురేగువీధిఁ బండి మంచములపై
దిగరు చేవ్రుఁడేగుదేరుఁగాక॥ 329

క॥ (1) నల్లూరినాగయాఖ్యుం
డుల్లానముపుట్టి సాక్ష్యమొయ్యనఁ జెప్పన్
మెల్లగ రా నపుడచ్చటి
కెల్లరు కొనియాడిరతని నిక్కమసాలుల్॥ 330

---

సహాయముగవచ్చినారు. తగవు బియ్యమునకును గొత్తగుడ్డలకును-వైదికులు బియ్యము గుడ్డలలో భాగముకావలెనన్నారు.

(క్రాసు) నేనుగుళ్లవద్దఁబనులుచేయింతును. నేనెఱిఁగినంతవరకు బ్రాహ్మణుతె న్నడును బోనము చెల్లించుటలేదు. కోమట్లప్పుడప్పుడు బోనము తెచ్చుచుందురు. కోమట్లలోనెవరువచ్చినది యెవరురానిది చెప్పఁజాలను నాకువ్యక్తికలిగినది మొదలు బ్రాహ్మణులు విశ్వబ్రాహ్మణులు బోనము తీసికొనిపోకుండుట యెఱుఁగుదును కరణము తల్లి బోనము తీసికొనిపోవుటయెఱుఁగను రెండవప్రతివాది ప్రతిష్టప్పుడులేఁడు. నావిరాఁది క్రిమినల్ కేసులోఁ గరణము మునిసీఫు నాతరఫుసాక్షులు. వాదియన్నకునాకు స్నేహము.

(1) ...1913 వ సం॥ 13 వ నవంబరు...14 వ సాక్షి...నల్లూరి నాగయ్య...కమ్మ...గారపాడు

ఆ॥ 1 గారపాటిలోన గంగాధరుండను
నొక్క దేవతాఖ్యుఁ డుండెనంట
అచట స్వర్ణకారు లభిషేకపుంగ్రియ
స్వీయహస్తములనె చేతురంట॥ 331

క॥ 2 ఏవంవిధుఁడగుశివునకు నావైదికజనులుకూడనభిషేకంబుల్
గావించిపోవుచుంద్రఁట, యీవిధమితఁడుండి కాంచునఁటయయ్యేడల్

చ॥ 3 నలుబది యేండ్లనుండియును నాగయ తద్రథకారమందిరం
బుల భుజియించు చయ్యెనఁట పూతుఁడు, తజ్జనుసాక్ష్యమందునన్
గలయఖిలోక్తులందునను గట్టివిమూర్ఖవిషయంబు, లందునన్
దొలుతటిరెండు మిథ్యలనితోఁచెడు నుండుఁ డొకింత పాఠకుల్!

తే॥ స్వర్ణకారులయన్నంబు స్వచ్ఛమనుచుఁ
గుడుచుఁగాకీతఁ డేమగుంగుడిచినంత
కుమఁ గుల్భ్రష్టులౌజనుల్ చర్మకార
వేశ్మములఁగూడఁ దినుటకు విశ్వసింత్రు॥ 334

---

(1) మాగ్రామములో విశ్వబ్రాహ్మణులు గంగాధరస్వామిగుడిలో నభిషేకము చేయుదురు.

(2) వైదికులుకూడఁ జేయుదురు.

(3) నేను విశ్వబ్రాహ్మణులయిండ్లలో భోజనముచేయుదును. నేను వారియిండ్లలో 40 సం॥లనుండి భోజనముచేయుచున్నాను.

బ్రాహ్మణులు విశ్వబ్రాహ్మణులు గ్రామదేవతకు బోనముతీసికొని రారు. గంగాధరస్వామియర్చకుఁడు తంబళవాఁడు-ప్రతివత్సరము కార్తీకమాసములోఁ గొమ్మూరి పిచ్చావధాను లభిషేకముచేయఁగాఁ జూచినాను- కోమట్లుకూడ బోనము తీసికొని రారు-బోనమిత్తునని మొక్కుకొన్నప్పు డేమిచేయుదురో తెలియదు-ఒకకేసులోఁ గొమ్మూరి వెంకటసుబ్బయ్య నాతరపుసాక్షి- అతఁడు విశ్వబ్రాహ్మణుఁడు

నల్లూరి నాగయ్య నిశాని,

తే॥ * తక్కు విషయద్వయంబు తద్గ్రామకరణ
మైతనర్చెడి యజ్ఞనారాయణాఖ్యుఁ
డనృతమని వ్రాసిపంపిన యట్టిజాబు
కలదు దిగువను జదువరుల్! కనుఁడు దాని॥ 335

తే॥ వేయిరూపాయలిచ్చినన్ వ్రాయుఁడతఁడ
బద్ధమెన్నటికిని, నట్లు వ్రాయునేని
తినును బత్తులయన్నమిా జనుఁడటంచు
నేల వ్రాయును బ్రతివాదిహితముగాను॥ 336

---

* బ్రహ్మశ్రీ జానపాటి పట్టాభిరామశాస్త్రిగారిసన్నిధికి-విన్నపములు రాచకొండ యజ్ఞనారాయణ అనేకనమస్కారములు.

మాగ్రామశివాలయపుత్పత్తి తెలియపర్చమని కోరితిరి-పూర్వం యీదేవాలయం రాచకొండ కృష్ణసోమయాజులవారివల్ల కట్టించబడినది-అనంతరం కొంతకాలమునకు శిలయా షికస్తు అయినది-అప్పట్లో సోమయాజులగారికి అయిదుగురుకుమాళ్ళు అయి--వకరిమాట వకరికి పడక మాగ్రామకంసాలి కొమ్మాచారి అందెలును ధర్మకర్తగా యేర్పర్చి తాము యజమానులుగావుండి అందులకృత్యములు తమరే జర్పుచూ వుండిరి-యీప్రకారం సుమారు 16 సంవత్సరములక్రిందట ధ్వజస్తంభం వేశేవర్కు రాచకొండ వారే అచ్చట ప్రతిష్ఠవగైరాలకాలమందున్ను నవరాత్రులలో పారువేటకాలమందున్నూ సంకల్పంవగైరాలుజర్గించి కార్యనిర్వాహణ చేయుచుండిరి-దరిమిలా తాము బ్రాహ్మణులమని వృథావ్యాజంకల్గజేసుకుని షుమారు 12 సంవత్సరములక్రిందట శివాలయములోను ధారాపాత్రప్రతిష్ఠచేయుకాలమందు గ్రామములోని బ్రాహ్మణులను బిల్వకుండా తామే సంకల్పాదులు అర్చకుడిద్వారా చేయించి మంత్రములు వారివల్లజర్పబడెను-అదిలగాయతు బ్రాహ్మణులము ఆగ్రామశివాలయంలోకి వెళ్లడము లేదు-ఆకంసాలీలు అభిషేకాదులు లింగమునకు చేయడంలేదు-విడిగావుండి మంత్రములు చెపుతారు-అర్చకుడు లింగమునకు అభిషేకంచేస్తాడు...మాగ్రామకాపరస్తుడు నల్లూరి నాగన్న తాను కంసాలీలయిండ్లల్లో భోజనంచేస్తాడన్న వాడుక గలదు...

కం॥ 1 మువ్వాపాపారాయని। దవ్వలి సాక్ష్యం, బతెంకునటు పూర్వపువాఁ
డెవ్విధిగననిన వాఁడో। యవ్విధిన నెఁదిందురథ కమ్మదన్నంబనుచున్ 337

కం॥ 2 తమయిండ్ల శుభాశుభక
ర్మములం జేయింప వేదమంత్రంబులనే
కమసాలుల సమ్ముఖమునఁ
గ్రమముగ నేర్చుకొనుచున్నఁ ఘనుఁడితఁ డహహా॥ 338

తే॥ కమ్మవారు శుభాశుభకర్మములకు
ద్విజులఁ బిల్వరు కాఁబోలుఁ బృధివినింక
ఇంత మొనగాఁడు తమలోనె యేర్పడంగ
నన్యుఁ బిలుచుట కిఁక నేమియవసరంబు॥ 339

ఆ॥ మంత్రములను గఱచు మాత్రాన నర్హుండు
కాఁడు కాఁడు యాజకత్వమునకు
ఉండవలయుఁ దప్పకుండ బ్రాహ్మణ్యంబు
యాజకత్వమునకు నానవడిన॥ 340

కం॥ వేదమునదివిన నాదుము
భూదేవుల మని తలంపఁబోలద యెపుడున్
వేదాక్షరపు విచారణ
మాదిగ తనమబ్బఁగలదు మహి శూద్రునకున్॥ 341

---

(1) ... 1911వ సం॥ 13 వ నవంబరు...15 వ సాక్షి ... మువ్వా పాపారాయఁడు...కమ్మ...తాడిపఱ్ఱు.

మాగ్రామములో విశ్వబ్రాహ్మణులు బ్రహ్మేశ్వరలింగమును స్థాపనచేసినారు-ప్రాతలింగము స్థానభ్రష్టమైనందున విశ్వబ్రాహ్మణులు తిరిగి ప్రతిష్ఠచేసినారు-బ్రాహ్మణులును గోమట్లును దేవుని బూజింతురు-బ్రాహ్మణులును గోమట్లును గ్రామదేవతకు బోనము తీసికొనిపోరు-నేను విశ్వబ్రాహ్మణులయిండ్లలో భోజనము చేయుదును-రు 50 ల సిస్తు చెల్లింతును

(2) క్రాసు-నేను కర్మలు చేయించుటకుఁగాను సంస్కృతమంత్రములు నేర్చుకొనుచున్నాను.

మాలిని॥ అది తెలియమి నాతం డట్లు వాక్రుచ్చెఁ గ్రన్నన్
[1] బద్ధపదయి కంబోచంపల్లి బసవయ్య నెన్నన్
కుధరనితని కెట్లో గొప్ప వార్పత్తులంచున్
మదిగుదురుట చేతన్ మాన్యులం జేసె వారిన్॥ 342

శా॥ 2 విశ్వబ్రాహ్మణు లేమటంచు నెకదా విద్వేషుంచుం, టటుల్
విశ్వబ్రాహ్మణులం బెకాక మఱియున్ విజ్ఞుండునుంబో లేఁదా
విశ్వబ్రహ్మలు విశ్వకర్మలనియున్ వీఁడంచునున్నట్టివాఁ
డైశ్వర్యంబరుదెంచెఁబో యికఁ గరం బా స్వర్ణకారాళికిన్॥ 343

క॥ 3 కుడుచునఁట రథకృదన్నము
కుడువండఁట వైదికులది, కుడువకపోనీ
పడిపోయెనె యే బానిసె
కొడుకులో కుడువమిని వైదికుల బ్రాహ్మ్యమిలన్॥ 344

ఆ॥ 4 రుక్మకారజనులె రూఢి బ్రాహ్మణులంచు
నంత్యజుండు వచ్చె నంత్యమునకు
బత్తులకును దుదకు బ్రాహ్మణ్యమిప్పింప
శరణమయ్యె నంత్యజాతివాఁడు॥ 345

---

(1) 16వ సాక్షి...పోచంపల్లి బసవయ్య...మంగలి ...గుంటూరు.

(2) ప్రతివాదులు విశ్వకర్మలనియు విశ్వబ్రహ్మలనియు విశ్వబ్రాహ్మణులనియుఁ బిలువఁబడుదురు. ఆముగ్గురును వొక్కటే తెగవారు.

(3) నేను విశ్వబ్రాహ్మణుల యిండ్లలో భోజనము చేయుదును వైదికుల యిండ్లలో భోజనము చేయను

(4)...17వ సాక్షి...మందపాటి పరశురాముఁడు...మాదిగ...గుంటూరు

నేను విశ్వబ్రాహ్మణుల నెఱుఁగుదును-వారియిండ్లలో భోజనము చేయుదును వైదికుల యిండ్లలో భోజనము చేయను-మాపలపువాండ్రు విశ్వబ్రాహ్మణులను బ్రాహ్మణులుగా నెంతురు-(క్రాసు) విశ్వబ్రాహ్మణులు మాగురువులు మా పెద్దలు యావత్ప్రపంచమునకును విశ్వబ్రాహ్మణులే సృష్టికర్తలని చెప్పినందున నేను వారిని నిజమైనబ్రాహ్మణులుగా నెంచితిని. విశ్వబ్రాహ్మణులు శిల్పులని నేనెంతును-నే నియోగుల యిండ్లలోఁగూడఁ దినను.

క॥ ఏతచ్చండాలుండును మాతావునఁగుడువఁడంట, మంచిదేయిదిత
ప్రీతిదమైనపదార్థము మాతావునదొరకకునికిమానఁగఁబోలున్

ఆ॥ గొడ్డుమాంసమేడఁ గొనితెచ్చిపెట్టు న
వ్వానికొఱకుఁగాను వైదికాళి
హాసి క్లిష్టమైన వస్తువులిడుచోటఁ
డిందునసె, నిఁకేని తెలిసికొనుఁడు॥ 347

శా॥ నాపక్షంబున సంత్యజించుపలికెన్ నాడింధమాన్నంబు మే
మాపత్కాలమునందు నేని తినమం, చద్దానికిన్ మాఱుగా
నీపాపిష్ఠునిదోడి తెచ్చి యకటా! యీరీతిఁగూయించినార్
పోపొండంచను దిక్కులేమి నట దుర్బుద్ధిన్ విపక్షప్రజల్॥ 348

ఆ॥ క్షత్రవైశ్యజనులుమాత్రము సాక్ష్యాన
కెందుదొరకరైరి యింతెకాని
చాలమట్టు కొరులు సాధితులైనవా
రధికమా వ్యయప్రయాసములను॥ 349

కం॥ సాధితులైనప్పటికిని। బాధించెనుగొంతమందిఁ బ్రతివాద్యన్నం
బేధర్మమెట్టులున్నను। నాధర్మమ్మొకటివిడువరైరవ్వారల్॥ 350

కం॥ పదునేడ్గురుసాక్షులలో। మొదలిర్వురుస్వర్ణకారులె, మోమోడకయె
స్నదిమందితినమెయంచని। రెది తెలియనిమూఢులేద్వి రేడ్చిరితుదకున్॥

కం॥ ఒకమంగలి యొకచాకలి
ఒకమాదిగ యొక్కరెడ్డి యొకగొల్లఁడు క
మ్మకులజు లిరువురు తేలిరి
యొకమాటమి వారికూడు భుజియించుటకున్॥ 352

కం॥ మాదిగమంగలిగొల్లలె
వైదికవేశ్మములఁదినక పదలినవారల్
పీడులఁబాఱఁగవైచిన
యేదోతినువారలిండ్లనెటుతిందురయా॥ 353

కం॥ ఏతప్పుడుసాక్ష్యంబును। పాతకులై దివసషట్కపర్యంతంబుల్
బీతింజెప్పించిరియిటు, లాతతయత్నంబుతోడ నాప్రతివాదుల్ ॥
శా॥ ఏచండాలుఁడొవచ్చి స్వర్ణహారుకు జేఁదించునంచుం ద్రిలో
కాచార్యుండననుష్ఠ వైదికు పవిత్రాన్నంబె నేనొల్లనం
చాచంద్రార్కమకీర్తికై పలుకుఁగాకా, కోర్టుమున్నీభు లో
కాచారంబునుగుర్తెఱుంగఁడో కో యీయన్యాయ మూహింపఁగన్
కం॥తనయంతటఁదాఁబిలిచిన
తననేవకు లెటులఁజెప్పిదాటుకొనిరో యీ
యనమదికిఁదెలియుటయె చా
లునుబో వ్యవహార మెట్టులో తీరిచినన్॥ 356
తే॥ ఏదియెట్లుండినం బ్రతివాదులందు
నొండొరుల నైకమత్యంబు మెండు నుండు
వచ్చె మావాఁడు సాక్షిగా వారిదెసను
వారిలో నాకు నెపఁడేనివచ్చెనొక్క॥ 357
చ॥ కనుకనె మాదుసంఘమిటు గన్యాతగోల్పడఁజూచుచుంటయున్
దినమొక ఇంతవారలటు దీప్తివహించుచునుంటయున్ ఘటిం
చెనుమహి, నల్పసారములె చేరుచునొక్కట దుర్జయంబులౌ
నని వచియింపరే విబుధు లయ్యయిగ్రంథములందు బాగుగన్ ॥358
సీ॥ పింజగోచీలును బెడతలనువిభూతి
యెన్నడుపెట్టినా రిట్లువీరు
దర్భలంజేపట్టి తద్దినాల్పెట్టింప
నెన్నడువెడలినా రిట్లువీరు
ఆచార్యబిరుదంబు లవలీలధరియించి
యెన్నడుమించినా రిట్లువీరు
ఒకరికొక్కరుజాబు లొగివేదమూర్తులం
చెన్నడువ్రాసినా రిట్లువీరు

గీ॥ మూడుదినముల కొకసారి కూడిసభల
నెన్న డొనరించుచున్న వా రిట్లువీరు
ఇన్నియునుసాగుచుండుట కున్న కతము
తలఁప నవ్వారి యైకమత్యంబెచుండి॥ 359

ఆ॥ ఎంతయైకకంఠ్య మేర్పడియున్నను
సాధ్యకృతులెయగును సాధితములు
కొండకుం దగిల్చి కొండొకనాగలి
నెందతేనిలాగుఁ డేమిఫలము॥ 360

సీ॥ కుండలాల్ దగిలించుకొన్నంతమాత్రానఁ
బ్రాప్తింప దెన్నఁడుఁ బ్రాహ్మ్యమిలను
కమసాలియనఁ గఱవఁగర్ వచ్చుమాత్రానఁ
బ్రాప్తింపదెన్నఁడుఁ బ్రాహ్మ్యమిలను
ఏము బ్రాహ్మణులమం చెగిరినమాత్రానఁ
బ్రాప్తింపదెన్నఁడుఁ బ్రాహ్మ్యమిలను
వేదాలుసదువంగ వెడలినమాత్రానఁ
బ్రాప్తింపదెన్నఁడుఁ బ్రాహ్మ్యమిలను

గీ॥ బ్రాహ్మణర్షిపరంపరాప్రాప్తమైన
యన్వయంబున జనియించి యాదినుండి
బ్రాహ్మణులుగను వాడంగఁబడినఁదప్ప
వాదులాడిన బ్రాహ్మ్యంబు వచ్చునొక్కొ॥ 361

క॥ ఈరీతి నుభయసాక్షుల
నాక్షార్థ్వంద్రెంద్రుదినము లామున్సీఫ్ గార్
కోరి విచారణయొనరిచి
చీరి యుభయవాదులను వచించెను నిట్లుల్॥ 362

క॥ "శ్రుతులుర్ స్మృతులు పురాణము
లితిహాసము లాగమములు నిట దాఖలుచే

సితి రీర, లందునం బరి
చితి యంతగ లేదునాకుఁ జెప్పఁగ నెదియున్॥ 363

తే॥ కాన నుభయకులస్థుఁడుం గాని ప్రాజ్ఞుఁ
డొక్కరుఁడు మధ్యవర్తిగా నుండెనేని
గ్రంథములలోని సారంబు గ్రహణమగుచుఁ
బలుకు నిష్పక్షపాతియై కలవిధంబు॥ 364

క॥ కోరుకొనుఁ డెవని నేనియు
మీ" రనివచియించుటయును మేమంటిమి, "మా
పాఱులుదప్ప మఱొక్కరు
నేరుతురే శ్రుతులలోని నిజమెఱుఁగుటకున్॥ 365

తే॥ కాన మాదృష్టి కెవ్వఁడుం గానరాఁడు
బ్రాహ్మణేతరులందంచుఁ బలుకుటయును
బెద్దయుంబ్రొద్దు" చింతించి పెద్దకమ్మ
నొకని జెప్పిరి ప్రతివాదు "లుండ" ననుచు॥ 366

తే॥ తుమ్మపూడియఁ టాయున్న కమ్మకాఁపు
దాతఁ డమరము వర్లించెనంట కొంత
అంతమాత్ర శ్రుతిస్మృతు లవగతంబు
లగునెకో యిందుఁ దీర్మాన మొగిని సలుప॥ 367

ఉ॥ ఈయనఁదోడి తెచ్చుటకొ యెందులకో యొక వాయిదాయిడెన్
న్యాయసభాధికారి, యపుడా మనుచెప్పినతుమ్మపూడిక
మ్మాయనపేరు నెత్తికొన "కక్కజుఁడీతఁ" డటంచు నింకను
క్కాయనపేరు చెప్పుచును హాజరుపెట్టిరి యొక్కపత్రికన్॥ 368

తే॥ అద్ది యొకపల్లెలోన నయ్యద్భుతుండు
తగనొనర్పఁగ నెదో యవధాన మపుడు
ఘనతఁ దత్రత్యజనులచేఁ బనుపఁబడిన
యట్టి యాహ్వానపత్రిక యరసిచూడ॥ 369

కం॥ పేరేలనాముకఁబగు।నూరన్ వసియించునట్టిరెయొక సాలెయు మ
న్నారను పేరిటివాఁడును।నై రాజిలునతఁడునంస్కృతాంధ్రపరిచితిన్
ఆ॥ సంస్కృతాంధ్రములను సాహిత్యమొకరీతి
నున్న వాఁడెయాతఁ డుండుఁగాక
అంతమాత్రముననె యఖిలశ్రుతిస్మృతు
లవగతంబు లెట్లుఁగును దలఁప॥ 371
క॥ మీమాంసాదికశాస్త్ర ప్రామాణ్యనిబద్ధమైన త్రయిభాష్యంబే
సామాన్యసాహితిమ ద్ధీమజ్జనములకుఁ దేట తెల్లంబగుఁగా॥ 372
క॥ గురుముఖమున నెఱుఁగన్ వలె
మఱి శాస్త్రజ్ఞానశూన్యమానవు లది, యా
గురువులు ద్విజులకుఁదప్పన్
సరిగన్ బోధింప రెంతసచ్ఛూద్రులకున్ 373
క॥ బోధింత్రుగాక యెవరో।బాధకమడియుభయులకును బాపదమౌటన్
శోధింపశూద్రజనులకు।సాధింపఁగఁదగినవిద్య చాలఁగలదిలన్॥ 374
క॥ కాన శ్రుతిస్మృతు లెవ్వడ
నేని పఠింపంగఁజనద యిల శూద్రులకున్
మానములున్నవి పెక్కులు
కానంబడ రెవ్వుడు నవ్వి కఱచినశూద్రుల్॥ 375
క॥ కాఁబట్టిరాజమన్నార్ ।నేబాసననింత కైతసెప్పినమాత్రన్
తాబుద్ధిబోనుపఁగలఁడోకో।యాబాడబవేద్యమైనయామ్నాయమునన్॥
క॥ వడుగైనదాది యెవ్వరి
నడవడి తనతోను యాఘనప్రజ్ఞులకే
కడువశముగాక తిరుగన్
బడు శ్రుతి, వశమగునె సాలెపాండితి కెవ్వరున్॥ 377
ఆ॥ తంతువులనుగూర్చి తగవస్త్రములనేయు
ప్రజ్ఞగలుగు నెడల బ్రాహ్మణులకు
తంతువాయుఁడైన తద్రాజమన్నారు

కవి వచించు శ్రుతులగలవిధంబు॥ 378

క॥ కమసాలెలకున్నాలెకుఁ గ్రమమనుగుసంబంధముండెఁగాపుర వాకల్
సమశీలుకోసి కొనినారమితానందంబుకొందెన్యాయాధిపుడా॥ 379

తే॥ బ్రాహ్మణేతరులను బెద్దపండితులగు
వారలున్నారలనిపించు వాంఛదగిలి
రాజమన్నారుకవిగారి రాకగూర్చి
సమ్మతించెను మున్సిఫు చాల నవుడు॥ 380

క॥ ఒప్పుకొనకుండినను మే। పప్పుమధర్మాధికారియామన్నారుర్
రప్పించితనదుకోర్టుకు గొప్పగగౌరవము నూపెఁ గోవిదబుద్ధిన్

ఆ॥ కుర్చిపగిలిపోను గూర్చుండుటేకాని
యితఁడుచేసినది మతేమి లేదు
రామకృష్ణయజ్వసామిపూర్వమున నయ్యో
డివిటిక్రిందనుండుదీప మతఁడు॥ 382

క॥ మునిసీఫుగారుమాత్రము
ఘనప్రశ్నము లేవొయడిగి కడు సంతసమం
దినవాఁడు తనకుఁదామది
పనివడఁబిలిపించినవుడు పాడియె యదియున్॥ 383

తే॥ తమ్ము బ్రాహ్మణులనికాని దండివార
లనియునుంగాన్ యనకున్న నాత్మహితము
లై నవేవు రెండునవినయుంతమాత్ర
సంతసంపడెఁ గమసాలిజనముకూడ॥ 384

మ॥ ఇరుపత్తుంబులదాఖలైనకృతులం దేమూల నేమున్నదో
నరిగంజూడఁడు, చెప్పఁగందగిన యాసారాంశముం జెప్పఁ డ
క్కఱలేనట్టిఁడు పిల్వఁగాఁబడుట యేకా కక్కటా! యీయఁడే
సిరి యాసాలెమనీషికిన్ మఱియు వాచేఁ గోర్టువార్కుఱ్ఱులన్॥ 385

తే॥ "ఏ సెకండ్లాసురైల్బండి నెక్కివచ్చి
నాఁడ" నని రాజమన్నారు నలుబడింటి

దనుకఁ దనకైన కర్చులీష్టును లిఖించి
యిచ్చె మున్సిఫుగారి కిఁ కేమనందు॥ 386

క॥ ఆలీష్టు నరిగ నమ్మం।జాలక క్లార్కేమి యో ప్రసంగింపు మటయున్
హేలమెయిన్ మున్సిఫ్ గార్।పాలెమనీషిన్ గుఱించి చయ్యనఁబలికెన్॥

క॥ "ఏతరగతిరైల్వే మీ।రేతెంచితిరో నిజంబె యెఱుఁగం జెవుడీ
ఆతతలాభము నొందుట।కై తలపకుఁడిందె, యేమియగు వద్దానన్"॥

క॥ అనుడు "సెకండ్క్లాస్రైల్వేం।డిని నే రాలేను కాని నే ము స్వెండ్లా
డిన సీమంతిని చచ్చినఁ।బనివడి యింకొక్కదానిఁ బరిణయమైతిన్॥

శా॥ ఆబాలామణి మత్సకాశమునఁ గావ్యాభ్యాసముం జేయుచున్
దాఁ బాఠాల్ పడిపోవునన్న మతిచేతన్ వెంటరాఁగోర నే
నాబింబాధరిఁగూడివచ్చితిని నాహ్లాదంబు సంధిల్లఁ, గా
రాబుంబాణిగృహీతిఁబాసి తిరుగన్ రాదెయ్యెడం బూరుషుల్॥ 390

తే॥ ముద్దుకోమలియది, నేను ముసలివాఁడ
కావునం దెచ్చుకొంటి నొక్కరుని బైని
వంటమొదలైన పైపనుల్ వాఁడొనర్చి
చెలికి నాకు సహాయంబు సేయుచుండు॥ 391

తే॥ పిన్నవయసుదియది, నేను బెద్దవాఁడ
నట్లగుట నడువంగ లేమదుఁగుగూడ
బండికావలెఁ బురిలోని పైనమునకె
కాన నిచ్చితి నిట్లునేఁ గర్చులీష్టు॥ 392

ఉ॥ కోకిలవాణి జంకకొకకొంచెముకూడ సభాముఖంబునన్
శ్లోకము పద్యమున్ మిగుల సుష్ఠువుగం బఠియించి యర్థమున్
వాకొను శ్రోత్రపేయముగ, వట్టిది కాదిది, చిత్తగించుచోఁ
గైకొనివత్తునిచ్చటికిఁ గంజదళాక్షి" నటంచుఁ బల్కుడున్ 393

ఉ॥ ముక్కులవ్రేళ్ళుపెట్టుకొని మోములుత్రిప్పి హసించి రందఱున్
"జక్కరబొమ్మ పాండితిప్రశంసము నిప్పుడ యేల" యందు నా
మొక్కవచెప్పినట్టి వ్యయుమెల్లను జేర్చుక న్యాయకర్త పెం

మక్కువ నీయఁజేసెఁ బదునాలుగుముద్రలు పద్మసాలెకుఁ౯ ॥ 394

క॥ "నీచామహాత్మ్య" మనునా ఋచావైఖరికి నాదువ్యవహారం బే
కాచాలినదృష్టాంతము । ప్రాచీనులవాక్కు కాదు వ్యర్థం బెపుడు౯

సీ॥ భూసురత్వముగూర్చి పోట్లాడువారిందు
సంకీర్ణసంకర స్వర్ణహారులు
వారె బ్రాహ్మణులంచు వచ్చిచెప్పినదిందుఁ
బుల్కసాంబష్టాది పుణ్యాజనులు
వారిపక్షపు న్యాయవాదిశేఖరులిందుఁ
బరఖండగాములౌ ప్రౌఢతములు
మధ్యవర్తిగవచ్చి మాట్లాడినతఁడిందుఁ
బండితంమన్యుఁడౌ పద్మసాలె
గీ॥ చివరఁ దీర్మాన మొనరించు ప్రవరుఁడిందు
బ్రాహ్మమత సుప్రవిష్టుఁడౌ ప్రాజ్ఞమూర్తి
ఇట్టి వ్యవహారముఁ౯ మనమెన్న డేని
యీక్షణముచేసియుంటిమే యిద్ధరిత్రి॥ 396

క॥ వ్యవహారము తుదకెటులో । యవుఁగాక విచారమేలయద్దానను, ద
త్ప్రవర్షి వాక్పరంపర । యవితథమనఁదగు నిదర్శనాగ్ర్యంబయ్యె౯ ।

క॥ ఈరీతివిచారణయు స్థిరింగును ముగియుటయును నెవ్వాళులకో
తీరుపరివాయిదాయిడెఁ । దీరుపునుఁ జెప్పుటకును దిగమానంబుల్ ॥

• గద్య •

ఇది శ్రీమజ్జగద్గురు గురుకరుణా కటాక్ష సంప్రాప్తకవితా
సాహిత్య నిధాన హారితసగోత్రోద్భవ శ్రీ నారాయణ
పేరమాంబికా గర్భశుక్తిముక్తాయమానవిద్వత్సభా
విష్కృతావధాన విధాన జానపాటి పట్టాభి
రామాభిధాన విలిఖితంబగు స్వర్ణకార
వ్యవహారంబునందుఁ
దృతీయభాగము

శ్రీ సోమేశ్వరాయనమః

# స్వర్ణకారవ్యవహారము.

చతుర్థభాగము

కం॥ రంగపతి! రంగనాయక! రంగేశ్వర! రంగధామ! రంగనివాసా!
రంగ! యనువారిపాపము! కంగారై పోవుగాక కస్తురిరంగా!
(కస్తురిరంగశతకము)

మ॥ అల మన్నార్క వికీయఁ జేసినవ్యయం బర్పింపనేబడ్డ బా
ములకుం జింతిలి కొన్ని రూపికలఁదా మూర్వారముల్ పంపె న
వ్వల నవ్వారికి లాభ్ధిచంద్రిముఁడు సుబ్రహ్మణ్యశాస్త్రిల్, తదం
ఘ్రులకున్ మ్రొక్కి యుపక్రమింతు నికఁ దీర్పుల్గల్గునిభ్భాగమున్
కం॥ మాన్యతయంబుదనుక౯ । జేసిమదిన్ యోజనంబు సిద్ధాంతితమై
* భాసిలుస్వాభిప్రాయము! వ్రాసెన్ మున్సిఫుగారు వరుసన్ గనుఁడీ

* గుంటూరుడివిజనల్ డిస్ట్రిక్టుమున్సిఫుకోర్టులో

మహారాజరాజశ్రీ కనకపల్లి రంగనాయకులునాయఁడు గారు, బియేబియల్

అడిషనల్ డిస్ట్రిక్టుమున్సిఫు

1912 సంవత్సరము మార్చి 30వ తేది శనివారము

అ॥ నెం 26 వ 1911

జానపాటి పట్టాభిరామశాస్త్రిగారు:— వాది

1 వోలేటి లక్ష్మయ్య 2 నందిగామ కాశీపతి 3 వీరిపురపు భిక్షాపతి 4 నందిగాము చిన్నబ్రహ్మము 5 జొజ్జూరి మల్లయ్య, } ప్రతివాదులు

1912 వ సం॥ 20 వ ఫిబ్రివరి మంగళవారమున వాదితరఫుప్లీడరులగు మహారాజశ్రీ రంగావఝ్ఝల హనుమయ్య కాకాని పుండరీకాక్షుఁడు గార్లయొక్కయు 2, 3, 4, 5 ప్రతివాదులప్లీడరులగ్నుచున్నవ లక్ష్మీనారాయణ, వి. అంకమ్మనాయఁడు, జే. డి. సామియేల్ గార్లయొక్కయు సమక్షమున నీదావా హీరింగునకు రాఁబడుటయు నది మొదలుకొని యాలోచననిమిత్తముంచి యీరోజున దీర్పు చెప్పబడినది. వ్యవహారమధ్యమున 1 ప్రతివాది చచ్చిపోయినాఁడు.

కం॥ ఈతీరువునం గలిగిన। నీతులకుం జాలవరకు నిగ్గైనజవా
జే తానిడియెఁ జడ్జియు। జూతురుగా గంధముందు సుజ్ఞజనంబుల్

జడ్జిమెంటు.

(1) పోలేరమ్మ పాతపాటమ్మల యాలయములలోఁ బ్రాణప్రతిష్టచేయుసధి కారము తనకును దనకులపుబ్రాహ్మణులకునే కలదనియుఁ బ్రతివాదులకును దద్వర్ణపు వారికిని లేదనియు నిర్ధారణచేయుటకును బ్రతివాదులుగాని తత్సంఘమువారుగాని యిఁకమీఁదటఁ బ్రాణప్రతిష్టగాని మఱి యేవిధమయినసంస్కారముగాని చేయకుండ నుత్తరువిచ్చుటకును దిరిగి వానిసంఘపుబ్రాహ్మణులు ప్రతిష్ఠచేయుటకుఁ గావలసిన రు 190లు ప్రతివాదులనుండి తను కిప్పించుటకును వాదిచే నీదావా తేఁబడినది.

(2) వాది బ్రాహ్మణుఁడై తద్బ్రాహ్మణులకుమట్టుకే యాగుళ్లలో విగ్రహప్రతిష్ఠచేయుట కధికారముకలిగియుండి యీదావాకుఁబూర్వము నాలుగుసంవత్సరముల నాఁడు వాదియు నితరబ్రాహ్మణులును వైశ్యులసాహాయ్యముతో జానపాటిలో నదివఱకుండినవిగ్రహములు ప్రాతవై పూజానర్హతను బొందియుండినందువలనఁ దిరిగి ప్రతిష్ఠించియుండఁగా సంకీర్ణసంకరులగుటచే యాజనకర్మములోఁ జేరిన ప్రతిష్ఠచేయుట కధికారములేని ప్రతివాదులు 1906 వ సం॥ జూలై 22వ తారీఖున శూద్రుల తోటాటుతో సంప్రోక్షణమును వంకపెట్టుకొని విగ్రహముల నంటుపఱచి యుత్తములైన మూఁడుజాతులవారికిని బూజానర్హములఁ జేయుటమూలమున వాదికిని నుత్తములైన మూఁడుజాతులవారికిని బ్రస్తుతపువిగ్రహములఁ దోసివేసి పునఃప్రతిష్ఠచేయవలసినంత యవసరముగలిగి యందులకు రు 190లు కర్చుపెట్టవలసివచ్చి యాజరిగినపని ప్రతివాదులకాం పెతనమువలనగనుక వారాసొమ్మియవలసియుండుటయు వాదియుఁ దత్సంఘములోని యితరబ్రాహ్మణులును బునఃప్రతిష్ఠచేసినతర్వాతఁ బ్రతివాదులు మరల నపవిత్రపఱుపకుండురీతి నొక యుత్తరువుకూడ నవసరమయియుండుటయు నీదావా తెచ్చుటకుఁ గారణములుగాఁ జూపబడినవి.

(3) వాదితోపాటీగ్రామములోని బ్రాహ్మణులందఱు నీప్రతిష్ఠవిషయమందాయిష్ఠములేనివారు కారుకావున వారందఱిపక్షమున నీయనయొక్కఁడే దావా తెచ్చుటకు వీలులేదనియు నీరెండుగ్రామదేవతల బ్రాహ్మణులకుఁ బూజానర్హములఁ జేయవలెననికాక విగ్రహములు ప్రాతవై పూర్తిగా శిథిలములైనందువలన

కం॥ ఆయన వదలినవిషయము
లాయాభాగములఁ గొన్ని యలరెడుఁగానన్
న్యాయస్మృతిననుసరించుచుఁ
జేయుచలె విమర్శము మనచే నగుదనుకన్ 4

◆ చం॥ శిలలు పురాతనంబులయి చెప్పడియుండఁగ నూతనంబులన్
నిలిపితి మంతెకాని కడునిష్ఠఁ బ్రతిష్ఠయొనర్ప లేదటం
చల ప్రతివాదులందఱును నాన్సరులోన లిఖంపఁ జేసియున్
సలిపినటుల్ ప్రతిష్ఠ తమ సాక్షులచేఁ బలికించి రియ్యెడన్ 5

---

◆ మేము నూతన విగ్రహముల స్థాపించినారమే కాని ప్రతిష్ఠచేయలేదనియు మేము యోజనములోఁ జేరిన ప్రతిష్ఠాదికర్మలు చేయుట కర్తవ్యమనియు నిప్పుడు తిరిగి ప్రతిష్ఠచేయవలసిన యవసరమే లేదనియుఁ బ్రతిష్ఠచేసినను దావా మొత్తము చాల హెచ్చువగున్నదనియు వాది యేవిధమైనపరిహారమునకు నర్హుడుకాఁడనియుఁ బ్రతివాదులు పోరాడుచున్నారు.

(4) వాది ప్రాతసివిల్ ప్రొసీజరుకోడు 30 వ సెక్షనుప్రకారము దావా తెచ్చుట కుత్తరువునిమిత్తము పిటీషనిచ్చినాఁడు-అది నర్సారావుపేట డిస్ట్రిక్టుమున్సిఫుగారు కొట్టివేసిరి-ఈకోర్టుకు, ట్రాన్స్ఫరైనతర్వాతఁ బ్రతివాదులు ముందుగా నిల్వ నేరదను దానినిగుఱించి(యి)ప్రస్తుతపుదావా యొకటవయార్డరు 8 వ రూలుప్రకారము కోర్టువారి యుత్తరవులేకుండ నిల్వదగినదేనా?యను సారాంశ మెత్తుకొనిరి-మఱునాఁడీసారాంశమునుగూర్చి కొంతవఱను వాదింపఁబడినతర్వాత వాది సంఘముతరఫున దావా తెచ్చుట కుత్తర్వునుగోరుచు 1 వ యార్డరు 8 వ రూలుప్రకారము పిటీషను పెట్టినాఁడు. 1911 వ సం॥ అగష్టు 28 వ తారీఖున నీయబడిన యుత్తరువులోని కారణములనుబట్టి యది కొట్టివేయఁబడియె-అదినముననే వాది తనయొకనిచేతనే ప్లైంటు దాఖలుచేయఁబడినట్లు సవరింపవలసినదని మఱియొకపిటీషను పెట్టెను-1911 వసం॥ అగష్టు 24 వ తేది యుత్తరువులోని కారణములనుబట్టి యాప్లైంటు సవరింపఁబడియె-నర్సారావుపేట డిస్ట్రిక్టుమున్సిఫుగారేర్పాటుచేసిన మొదటిసారాంశము మార్పునుబొందింపఁబడియె-విచారణపన్న సారాంశములు,

ఉ॥ ఇంతటిభేదముండినను సంచుకయేనది యెత్తుకోక య
త్యంతము వారివాదముల నాత్మను నమ్ముట యెట్టికరమో
సుంత వివేకమున్న మనుజుల్ గుఱుతింపకపోవ, రింత కే
యింతయబద్ధమున్న నిఁక నెంతగనుండెడి హ్యాజ్యమంతటన్ ॥

---

(1) ఈదావాగుళ్ళలో వాదిసలము వారుమాత్రమే ప్రతిష్ఠచేయువధికారమ
కలిగియున్నారా ?

(2) ప్రతివాదులు 1906వ సంవత్సరములోఁ బ్రతిష్ఠచేయుటమూలమున నప
త్రకార్యముచేసినారా ?

(3) వాది తానుగోరిన యుత్తరువునను నష్టమునకును నర్హుఁడేనా ?

(5) వాదిపక్షమున 14 మందియుఁ బ్రతివాదులపక్షమున 17 మందియు విచా
రింపఁబడిరి. విచారింపఁబడినయంశముల రుజువుచేయుటకై సంస్కృతగ్రంథముల
ప్రమాణములుగా నీయఁబడినవి. అవి క్రిందఁ జెప్పఁబడును. ఈదావా తీర్మానమ
కాకముందే మొదటిప్రతివాది కాలధర్మము నొందెను. వాది తక్కినప్రతివాదులమీ
దమాత్రము చర్యజరిపినాఁడు.

(6) మొదటిసారాంశము—ఈసారాంశములోని ముఖ్యాంశములమాత్రమే చె
ప్పిన బాగుగా నుండెడిని. ప్రతివాదులు విగ్రహములఁ దాఁకినందువల్ల నపవిత్రములై
బ్రాహ్మణులకుఁ బూజానర్హములైనవని తిరిగి పవిత్రములఁజేయుటకుఁగాను వాది
యొక్కఁడే సొంతహోదాతో నీదావా నడపినాఁడు. తాను విగ్రహములఁ బరిశుద్ధము
లఁగాను బూజార్హములఁగాను జేయు నధికారముగల హైందవసంఘములో నొక
డైనందువలన నిపుడు తననిమిత్తమును దక్కిన బ్రాహ్మణవైశ్యాదులనిమిత్తమును జాల
ధనమువ్యయపడిచేయుప్రతిష్ఠ వ్యర్థమగును గావునఁ బ్రతివాదులు విగ్రహముల ముట్టుకొ
మటచే నంటుపడిచినట్లు నిర్ధారణచేయవలసినదనియు నందువలననే పునఃప్రతిష్ఠకుఁ
గావలసినద్రవ్యము వారివలన నిప్పింపవలసినదనియు వారు మరల గుళ్ళలో సంబంధము
కలుగఁజేసికొనకుండులాగున నాజ్ఞాపింపవలసినదనియు వాది చెప్పెను. ఆయన బ్రా
హ్మణుఁడననియు బ్రాహ్మణులకుమాత్రమే ప్రతిష్ఠాధికారము కలదనియు సంకీర్ణసంక
రులైనప్రతివాదులకు మతగ్రంథములుచెప్పెడిప్రకారము గుళ్ళలోఁ బ్రతిష్ఠచేయు
టకధికారము లేదనియు వారు తాఁకినమాత్రాన నైలపోఁవ
నాయు నక్రమముగాను నశాస్త్రీయముగాను వారు ప్రతిష్ఠచేయుటవలన

ప్రస్తుతపువిగ్రహము లపూజ్యము లైనవనియుఁ బునఃప్రతిష్ఠకు వ్యయములనిప్పించుచుఁ దాను బూజచేయునట్లు చేయవలసినదనియుఁ బ్రతివాదు లందులో సంబంధము కలుగఁజేసికొనకుండ నాజ్ఞాపింపవలసినదనియుఁ జెప్పుకొనును.

(7) ప్రతివాదులు ప్రస్తుతపు విగ్రహములఁ బ్రతిష్ఠించినామని యొప్పుకొనుచు హైందవులందఱికిని బూజ్యములగుటకై విగ్రహములఁ బ్రతిష్ఠించునధికారము తమ కున్నదనియు సంకీర్ణసంకరులము కామనియు నందువలన మైలపోఁకమునకుఁ బునఃప్రతిష్ఠ యనవసరమనియు వాదించుచున్నారు.

(8) వాదిచెప్పెడిరీతిని బ్రతివాదులు ప్రతిష్ఠాధికారములేనికులమువారై వారు తాఁకినమాత్రమున దేవతాశిల లపవిత్రములయ్యెడివో నీగుళ్లలోనిశిల లపూజ్యము లైనవని యాయన యాక్షేపించుట యుక్తమే. అప్పు డెవరికర్చునకైన నేమి తిరిగి ప్రతిష్ఠ చేయఁదలచినచోఁ బ్రతివాదులు మరల నా దేవతాశిలల నపవిత్రములఁ జేయకుండులాగున నాజ్ఞను బొందుట కర్హుఁడు. ఈసారాంశములో మనము విచారింపవలసినది ప్రస్తుతపువిగ్రహములు పూజార్హములైనవా యను నంశము.

(9) ఈసారాంశముక్రింద నాలోచింపవలసిన యంశములు

(ఎ) గ్రామదేవత లైన పోలేరమ్మ పాతపాటమ్మలు హైందవులందఱికిని బూజ్యములగురీతిని స్థాపించు నధికారముగలవా రేకులమువారు?

(బి) ఆకులమునకు హైందవులందఱును సామాన్యముగా వ్యవహరించుకొను పేరు చాలునా? లేక ప్రతిష్ఠచేయుటకుఁగా నాకులమువారి కితరగుణము లేమైన నుండవలయునా?

(సి) ప్రతివాదు లట్టికులమునకుఁ జేరియుండలేదా? వారియందుఁ బ్రతిష్ఠచేయుటకుఁదగినగుణములు లేవా?

హైందవులకుఁ బ్రమాణములైనసంస్కృతగ్రంథములఁ జూచియీ పైప్రశ్నలకు జవాబు చెప్పవలసియుండును. పార్టీలు తెచ్చినగ్రంథములు లోకాచారమునకును యుక్తిశాస్త్రమునకును విరుద్ధములుగానున్నప్పటికి హైందవసిద్ధాంతమునకు విరుద్ధముగానుండనంతవఱకు నేను వాని ననుసరించితీరవలయును. ఆగ్రంథములకుఁ బరస్పరవిరోధము కలిగినప్పుడుమాత్రము మతసంబంధమని వారివారి నమ్మకములకే విడిచిపెట్టవలసినప్పటికిఁ గేవల హేతువాదములకే సంబంధపెట్టుటకంటె నామనస్సు నుత్క్రమించిజ్ఞానముతో రెంటిలో నేదిసమంజసమో దానినే తీసికొనవలసియుండును. పాశ్చాత్యుల లోకను యుక్తిశాస్త్రి

* తే॥ బ్రాహ్మణుండని పేర్కొనంబడెడిపదము
యాజనమె వృత్తిగాఁగల యార్యజనులఁ
దెలియఁజేయు నటంచని తెలియ కెవ్వ
రొప్పికొనిరో రికార్డునం దుండదేచట॥ 7

కం॥ జీవికయగు బ్రాహ్మణునకు। భావింపఁగ యాజనంబు, పదమునకర్థం
బావిధమునఁ జెప్పంజన। రేవారు నొకింత జ్ఞానమే యుండినచోఁ॥ 8

---

నుగుణ్యముగా న్యాయమును బరిశీలింపవలసిన హిందూదేశములోని న్యాయసభలకుఁ బార్టీలు వచ్చినప్పుడు వారి నమ్మకముల ప్రకారము పోవుటకు వీలులేదు మతవిషయములోఁ దర్కముపయోగించుటకు వీలులేదని యొక ప్లీడరు చెప్పినట్లు నాకు జ్ఞాపకమున్నదికాని యైనను న్యాయకర్తకు యుక్తియుక్తముగునా కాదాయని విచారించుట ముఖ్యగుణము గనుక నాగుణమును నేను నిల్పుకొందును.

(10) మతగ్రంథములను వానివాని తారతమ్యానుసారము తరగతులుగా నేర్పఱిచుట యావసరము. 1 శ్రుతులు. 2 స్మృతులు. 3 పురాణములు. 4 ఇతిహాసములు. వీనిలోఁ బరస్పరభేదము కలిగినప్పుడు క్రిందితరగతి పైతరగతికి లోఁబడియుండవలె.

(11) మతసంబంధములైన పనులు బ్రాహ్మణులు చేయవలెననియు నవి షట్కర్మలనియు నవి యాచరించుటకు బ్రాహ్మణులకుట్టికే యధికారముకలదనియు వాది చెప్పుచున్నాఁడు. ఆయారుకర్మలలో నొకటి యాజనము. యాజనమనఁగా విగ్రహముల స్థాపన చేసి మనుష్యులయొక్క ప్రార్థనలకుఁ బ్రతీకారము చేయుటకై ప్రాణముపోయుటయైయున్న యది. ఈప్రతిష్ఠ యెవరుచేయవలసినదియు నేవిధముగాఁ జేయవలసినదియు నాగమములలోఁ బూర్తిగాఁ జెప్పఁబడియున్నదని ప్రతివాదులు చెప్పుచున్నారు. అదికూడ యాజనములోనిభాగమే యైయున్నది. యాజనాధికారముగలవారు ప్రతిష్ఠాధికారముకూడఁ గలవారైయున్నారు. ఏయాగమములు ప్రస్తుతోపయోగములో వేనిఁ బ్రమాణములుగాఁ దీసికొనవలయునో యందువిషయమై వాదిప్రతివాదులు భిన్నాభిప్రాయులైయున్నారు. ప్రస్తుతము విచారింపవలసినవిషయము యాజనకర్మ మేకులము వారు చేయవలెననునది.

* (12) బ్రాహ్మణశబ్దము యాజనమేవృత్తిగాఁగలవారిని దెలియఁజేయునని పార్టీ లొప్పుకొనుచున్నారు. బ్రాహ్మణశబ్ద మెవరియందు సార్థకమగునో యది తేల్చుటమాత్రము కష్టము. మను ధర్మశాస్త్రములో బ్రాహ్మణేతరుల కెవరికిని

§ తే॥ బ్రహ్మకులమునందుఁ బ్రభవమందిన వాఁడు
బ్రహ్మమందు నిష్ఠఁబరగు వాఁడు
బ్రాహ్మణుండనంగఁబడునంచు నమరంపు
వ్యాఖ్య తెలియఁజేయు నరయుఁడందు॥ 9

తే॥ చాల దిదికూడ బ్రాహ్మణశబ్దమునకు
బాగుగా నర్థముం దెల్పఁ బ్రాజ్ఞులార!
కాంచుఁడొక మాఱు మరల నీగ్రంథమందె
మీఱు బ్రాహ్మణశబ్దవిచార మీఁదు॥ 10

---

యాజనకర్మాధికారము లేదని చెప్పఁబడియున్నది. వాది తాను బ్రాహ్మణుఁడననియుఁ బ్రతివాదులు కారనియుఁ జెప్పుచున్నాఁడు. ప్రతిష్ఠాధికారముకలవారని ధర్మశాస్త్రములలోఁ జెప్పఁబడిన బ్రాహ్మణు లెవరని చెప్పవలె?

(13) బ్రాహ్మణశబ్దము తనకులమువారికే వర్తించుననియుఁ దానును దనకులము వారు మాత్రమే బ్రాహ్మణులనియు మనుధర్మశాస్త్రమునందుఁ జెప్పబడిన బ్రాహ్మణులు తము శేయనియుఁ గాక పోయినచోఁ దమపూర్వులా బ్రహ్మణశబ్దముచే వ్యవహరింపఁబడరనియుఁ బ్రతివాదులు బ్రాహ్మణులుగా వ్యవహరింపఁబడక మఱియొకరీతి వ్యవహరింపఁబడుచున్నందున వారిని బ్రాహ్మణులుఁగా నెంచుటకు వీలు లేదనియు వాది చెప్పెడిని. మనుష్యుఁడు తాను వ్యవహరింపఁబడు దానినిబట్టి గాక తన నిజస్థితినిబట్టి విచారింపఁబడవలసియుండును గావున వాది సామాన్యముగా బ్రాహ్మణుఁడుగా వ్యవహరింపఁబడినను వాస్తవమునకుఁ గాఁడని చెప్పుచుఁ బీటరని పిలువఁబడువాఁడు మొదట జానయినను దాఁ జెప్పుకొను దానినిబట్టి లోకము పీటరని పిలువక తప్పదని దృష్టాంతప్రదర్శనపురస్సరంబుగఁ బ్రతివాదులు వాదించుచున్నవారు. ఈవివాదముయొక్క పర్యవసానమిట్లు నామాటలతోఁ జెప్పనగును.

(14) వివాదపర్యవసాన మేమిటన? మనుస్మృతిలోఁ జెప్పఁబడిన బ్రాహ్మణుఁడు బ్రాహ్మణకులములో జాతమాత్రుఁడైనా లేక బ్రాహ్మణుఁడు చేయవలసినకర్మల నుండవలసిన గుణములు కలిగియున్నవాఁడా యనునది. వాదిప్రతివాదు లుభయు

---

§ గురుబాలప్రబోధిక ద్వితీయకాండము బ్రహ్మవర్గము
బ్రహ్మణి పరబ్రహ్మణి నిష్ఠావత్వాత్ బ్రాహ్మణః బ్రహ్మమందు నిష్ఠగలవాడు
బ్రహ్మణః కులే భవత్వాద్వా బ్రాహ్మణః బ్రహ్మకులమందుఁ బుట్టినవాఁడు.

◆ కం॥ తత్తత్కృతికరణార్హులు। తత్తద్గుణములగలట్టి ధన్యులె కానీ
రిత్తగు బ్రహ్మణలాదిక। మిత్తఱిఁగలవారుకాక యెన్నఁగననుచుఁన్॥

కం॥ దృష్టాంతపూర్వకంబుగ। స్పష్టంబుగ వ్రాయఁబడిన జడ్జిమెంటునొగిన్
గష్టమనక పఠియించిన। దుష్టులుగాకుండరెవరుఁ దోడ్తోమనలోన్॥

కం॥ గుణములె ప్రధానమై త
ద్గుణయుక్తులె కొన్ని క్రియలకుం జాలెడిచో
గుణగణమును నటులె క్రియా
గణమును సృష్టింపవలయుఁగద ప్రథమమునన్ 13

ఆ॥ అట్లుకాక బ్రాహ్మణాదివర్ణంబుల
నెందు కేరుపఱిచె నీశ్వరుండు
ఏరుపడినకులము లేమిప్రయోజన
మాచరించినట్టు లరసిచూడ॥ 14

లును మనుష్యులనియెంచఁబడుటకు సమానాధికారముగలిగి యున్నవారు. ఒక పనిచేయుటకు వాడికిఁ బ్రత్యేక మధికారముండి ప్రతివాదులకు లేకపోవుటయనునది యాపనిచేయుటకుఁదగిన యోగ్యత వాడియందుండియుండుటవలననై యుండవలె. మనుష్యుని సత్తననుసరించి విధులేర్పడినవికాని విధులు ముందేర్పడి యందునిమిత్తమై యామనుష్యుఁడు సృష్టింపఁబడలేదు-భగవంతుఁడు సృష్ట్యాదిని విధుల ముందేర్పఱిచి యందునిమిత్తమైన మనుష్యులఁ దరువాత నేర్పఱిచినాఁడన్నను నట్లుచేయుటయందుఁ దనకుఁగల యుద్దేశమునను సరించియే చేసియుండవలె. ◆ అట్లేర్పడినమనుష్యులాయుద్దేశితమైన పనుల కవసరమగు యోగ్యతలుగలిగియుండవలెను-న్యూలాకార మందఱికి నొకవిధముగానే యుండును గావున నీగుణములు మానసికములును నీతికిని మతమునకును సంబంధించినవియుఁగా నుండవలయును-పూజార్హములగు విగ్రహాదులకు సంబంధించియుండవలసిన మతవిషయములో మనస్సును నాత్మనే చూడవలయును గాని చర్మచక్షుర్గోచరమగు స్థూలాకారమును జూడఁగూడదు- ఈ హేతువులను బట్టి బ్రాహ్మణశబ్దము గుణవద్వాచకమగుఁగాని జాతివాచకము కానేరదు- బ్రాహ్మణత్వ వ్యవహారమాత్రము బ్రాహ్మణశబ్దము సార్థకము కాదు- ఈప్రకారము మతసంబంధ కార్యముల నెరవేర్పుట కుండవలసినగుణములును మతవిషయమగునధికారమును నొకపర్యా

నమే యేర్పఱచినయెడల నట్టియోగ్యతలుగలిగియున్న మనుష్యులను బ్రాహ్మణులని పిలి నట్లుగానే విశ్వబ్రాహ్మణులనిపిలిచినను బిలువవచ్చును, కంసాలులనిపిలిచినను బిలువ చ్చును. గులాబిపువ్వు నేపేరుచేవాడినను వాడవచ్చునుగాని యది యట్టిసువాసనమా త్రమే కలిగియుండవలె.

(15) వాదిపక్షమునఁ బ్రతిధనసాక్షిగావిచారింపఁబడినపండితుఁడు (పల్లాది రామకృష్ణశాస్త్రులుగారు) షట్కర్మలుచేయువారే బ్రాహ్మణులనిచెప్పనుగాని యవి యెవరుచేసినను వారు బ్రాహ్మణులగుదురనిమాత్ర మొప్పుకొనఁడు. ఆయన బ్రాహ్మణశ మున కర్థము లోకులచేత బ్రాహ్మణుఁడని యెంచఁబడుచు నట్లు పిలువఁబడువాఁడని చెప్పుచున్నవాఁడు. కర్మ లేవియుఁజేయకపోయినప్పటికి బ్రాహ్మణసంతతివాఁడైనచో తఁడుగూడ బ్రాహ్మణుఁడయనియుఁ జెప్పెడిని. ఆయర్థము ప్రకృతము మేము బ్రాహ్మణులమని గంతులువేయువారి కుపకరింపవలెనను నుద్దేశముతోఁ జెప్పఁబడినదికాని రియైనదికాదు. వాస్తవార్థప్రకారముండవలసిన విధ్యుక్తములకు లోపము దెచ్చుచున్న నది. వాస్తవార్థమువిచారించిన నందులకు నిరంతరశ్రమలును సంపూర్ణములును నగు న్ని గుణము లవసరమైయున్నవి. అవి యొకమనుజునియొక్కగాని యొకసంఘము యొక్కగా నియభిప్రాయమునో లేక స్వేచ్ఛనో యనుసరించినవిమాత్రము కావు. ఒకవల మాకారమును వారివారిపనులనిమిత్త మెంతమంది చతురవుబొమ్మయనిచెప్పినను నట్లు నేరదు. బ్రాహ్మణశబ్దముయొక్క నిజమైనయర్థముపోయి ప్రకృత మొకసంఘము వారిని తెలియఁజేయుట కుపయోగింపఁబడుచుండవచ్చును. కాని జనసంఘముయొక్క రమార్థసాధనమున కొకవిగ్రహాకృతితోఁజేయఁబడిన యచేతనపురాతిబొమ్మలో పలికి దేవత నాహ్వానించి ప్రాణప్రతిష్ఠచేయుటకుఁ దగినయథకారమును యోగ్యతయుఁ గలమను ష్యుల నిర్ధారణచేయుటవిషయమైన శ్రమమును దగ్గించుటకు సహాయకారికాదు.

(16) బ్రాహ్మణులు సృష్టికర్తయొక్క నోటినుండియు నితరు లితరావయవముల నుండియుఁ బుట్టినారనిచెప్పు హైందవపురాణములలోకి దిగుట నా కనవసరముగఁ దో చుచున్నది. వాదితరపు 2వసాక్షి (శిష్ట్లా సీతారామశాస్త్రి) కృతయుగములో స్త్రీలులేరని ను మనుష్యులందఱు నొక్కటేజాతివారనియుఁ దెల్లనిదేహములుగలవారనియుఁ గొన్ని గ్రంథములలోనుండినట్లు చెప్పుచున్నాఁడు.

* తే॥ సత్యశీలాదిగుణముల చయముతోనె
బ్రాహ్మణత్వంబుసాధింపఁ బాటుపడెడి
తీరుపరికి లభించెబో భారతమున
నుండు నజగరోపాఖ్యానమొందు దుదకు॥ 15

చ॥ అజగరరూపుఁడైన నహుషాఖ్యునిగూరిచి ధర్మజుండు ముఖ

ఆయనచెప్పినట్లు త్రేతాయుగములోనే జాతులేర్పడిన సృష్ట్యాది నవి యారంభింపఁబడియుండవు. కృతయుగములోఁ గర్మలతో నవసరములేక ప్రతిమనుష్యుఁడును దేవుని భక్తిశ్రద్ధలతోఁ బూజసేయుట సామాన్యధర్మమై యట్లు ప్రతివానిచేతను జేయఁబడుచున్నయెడల నట్టిసంఘము మరల హీనజాతులలోకివచ్చుటకుఁ గారణము లేదు. అసలుగునత యాత్మనుబట్టి యుండుననియు నెవఁడు ప్రార్థనవల్ల నోరు చెవులు లేని రాయిని ప్రాణముగలదానినిగాఁజేసి మనుష్యులకు వరములిచ్చులాగొనరించునో వాఁడు మాంసము నెముకలతో నిర్మింపఁబడిన తనతండ్రికన్న నేదియో విశేషముకలిగి యుండవలెననియు జనులు వాడుకొందురు. వాదిపక్షపు 3 వ సాక్షి (చెల్లపిళ్ల వెంకటశాస్త్రిగారు) అందఱును మొదట శూద్రులై క్రమముగా వైశ్యులుగను క్షత్రియులుగను బ్రాహ్మణులుగను మారిరని కొన్నిగ్రంథములలోనుండినట్లు చెప్పెడిని. వాది తనపండితసాక్ష్యమునకుఁ దా బద్ధుఁడై యుండవలయును. శూద్రకులమునుండి బ్రాహ్మణకులమునకుఁ బ్రమోషనగుట కాధ్యాత్మికమార్గమున నడచుకొనుచు సంతటితోనే తృప్తిచెందక యుండవలయును.

* మహాభారతము వనపర్వములో సత్యము దానము క్షమ శీలము తపస్సు దయ మొదలగు గుణము లెవనికిఁగలిగియుండునో వాఁడు బ్రాహ్మణుఁడని చెప్పఁబడి యున్నది. "ఈగుణములు శూద్రునియందుండవా" యని యజగరుఁడు ధర్మరాజు నడుగఁగా "నటువంటిశూద్రుఁడు శూద్రుఁడుగాక బ్రాహ్మణుఁడే" యగుననియు "నాగుణములులేనివాఁడు శూద్రుఁ" డనియు నాయన యుత్తరముచెప్పెను. "కులముతో నవసరమే లేదనియు గుణమే కావలసినదనియుఁ దెలివిగలవారు చెప్పుదు" రని ధర్మరాజు వాక్రుచ్చియున్నవాఁడు.

"నిజమును శాంతి మున్నగు ననింద్యగుణంబులుగల్గువాఁడెయ
గ్రిజుఁ"డని చెప్పియుండెననికా మనమున్నిభుగాను భారతం
బుఁ జదివి తా గ్రహించినది బుద్ధిసుసూక్ష్మత వెల్లడింపుచున్॥ 16

తే॥ "సుగుణసంపత్తిగలిగిన శూద్రజనుఁడు
బ్రాహ్మణసమానుఁడంచునున్ బ్రాహ్మణుండు
సుగుణసంపద లేకున్న శూద్రసముఁము" డ
టంచునేకాని తద్భావ మన్యమగునె॥ 17

క॥ సత్యాదికసద్గుణముల। నిత్యానుష్ఠానబుద్ధి నెగడఁగఁ బ్రజకున్
సత్యరతుఁడైనధర్మజుఁ డత్యుక్తిగఁ దావచించెనటునహుషునితోన్

క॥ దేసికి శ్రైష్ఠ్యంబీయఁగ। మానసమున నెంత్రో బుధులుమఱిమఱిదానిన్
బూనినుతియింత్రుకానీ। దానియవశ్యాచరణమెతన్మతమచటన్॥ 19

(1) క॥ సవనమున వపాహోమం। బవశ్యకరణీయమనుటకై "యాదివిజ
ప్రవరుండుగుండెఁజీలిచి।యవితథము గ్రవేల్చె"ననదెయామ్నాయంబున్

(2) తే॥ "ఎవఁడు పుండరీకాక్షుఁదా నెద స్మరించు
వాఁడు బహిరంతరంబుల వరలుశుచిత"
ననుచు స్మృతివాక్యముండినయంతమాత్ర
నితరశౌచంబు మానెనే యిలజనంబు॥ 21

తే॥ పుండరీకాక్షు జను లెదం బూజసేయ
నచట నెటుచెప్పిరో మును లతిశయోక్తి
సత్యశీలాదివృత్తంబు జనులుపూన
ధర్మజుం డట్టు లత్యుక్తి తావచించె॥ 22

ఉ॥ అంతియెకాని శూద్రజను డా సుగుణంబులు గల్గినంతనే

---

(1) వేదాంతపరిభాష, ఆగమపరిచ్ఛేదము, యోగ్యతానిరూపణము
శ్రు॥ "సప్రజాపతి రాత్మనోవపా ముదఖిదత్" యిత్యాదావపి తాత్పర్యవిష
యీభూత తూబర (శృంగహీన) పశుప్రాశస్త్యాబాధో యోగ్యతా.

(2) స్మృతి॥ శ్లో॥ అపవిత్రః పవిత్రోవా సర్వావస్థాం గతోపివా
యస్స్మరే త్పుండరీకాక్షం స బాహ్యాభ్యంతరశ్శుచిః

వింతగ బాహ్మణుండగుచు వెల్గెడినంచనికాని బ్రాహ్మణుం
డంతటిలోనె శూద్రజనుఁడయ్యెడునంచనికాని తేల దా
యాంతకసూనుభాషణ మటుపైఁగల శ్లోకములం బఠించినన్ 23

(1) నాసిసిభుగార్గ్రహించిన ఫణిన్ నహుషుండు గ్రహించి శంకతోఁ
చిన మనుఁ ధర్మజుం గురించి చేసెను ప్రశ్నము "ధర్మరాజ! నీ
వనినవిధాన బ్రాహ్మ తయన్నది వృత్తమునం డియే లభిం
చిన వృథగాఁగ జాతుల సృజించినదెందుల కింక" నాపుడున్ 24

క॥ అతిసూక్ష్మశాస్త్రవిషయ ప్రతిపాదనపూర్వకంబుగఁ బాండుతనూజా
ట్పుత్తుఁడు వచించెను మద్భాషితములకెమహాహాపయుక్తిసేనెడిరీతిన్ 25

(2) "సకలజాతులపురుషుల సంగమాన । సకలజాతుల స్త్రీలును
సంతుగనుడు । వర్ణసంకర మైపోయె వసుధ గాన
జాతి దుర్జ్ఞేయమని యార్య! నాతలంపు 26

(3) మహిని వాగాదికములట్లు మైథునమును సర్వసాధారణంబయ్యె పర్వ
యుండ నెపుడుఁగామాంధమైయుండు నీజనంబు సులభసాధ్యంపుఁ
బని కేలచారకయుండు 27

(4) ఇచట "యేయజామహే" యను శ్రుతివాక్య
మగుఁ దగుప్రమాణ మహికులేంద్ర!

---

(1) మహాభారతము

అరణ్యపర్వాంతర్గ తాజగరపర్వము – ఆశీత్యధికశతతమాధ్యాయము

సర్పఉవాచ – శ్లో॥ యదితే వృత్తతో రాజన్! బ్రాహ్మణః ప్రసమీక్షితః వృథా జాతి స్త దాయుష్మన్! కృతి ర్యావ న్నవిద్యతే॥

(2) యుధిష్ఠిర ఉవాచ – శ్లో॥ జాతిరత్ర మహాసర్ప! మనుష్యత్వే మహామతే! సంకరా త్సర్వవర్ణానాం దుష్పరీక్ష్యేతి మేమతిః॥ సర్వే సర్వా స్వపత్యాని జనయంతి సదా నరాః॥

(3) శ్లో॥ వా జ్మైథున మథో జన్మ మరణంచ సమం నృణాం॥ వ్యాఖ్య – వాగాదీనామివ మైథునస్యాపి సాధారణ్యాత్ జాతి ర్దుర్జ్ఞేయా – తథాచ శ్రుతిః "నచైతద్విద్మో బ్రాహ్మణాస్స్మో వయ మబ్రాహ్మణావా" ఇతి బ్రాహ్మణ్యే సంశయ ముపన్యస్యతి.

(4) శ్లో॥ ఇద మార్షం ప్రమాణంచ యేయజామహఇత్యపి॥ వ్యా॥ నను జాత్య నిశ్చయే

సవనములను హోతృజనముచే నయ్యాది
యుచ్చరింపఁబడుచు నుండునెపుడు॥ 28

క॥ ఏమేము బ్రాహ్మణులమైనామో లేకన్యులమయినామో యరయుచో
నామేము యజించుచున్నా "మనుచుఁ దదర్థమగును నాగకులేంద్రా

క॥ యజమానులయిన జనములు
నిజజననం బెవ్వలన నెగడినయదియుఁ
నిజమెఱుఁగక యీమంత్రం
బుఁ జదివి హోమము సేయఁబూనుదు రచటన్ ॥ 30

(1) ఆ॥ కాన బ్రాహ్మ్యగతమునకు ము శీలంబ కారాఁ
దత్త్వదర్శిజనుల తలఁపువలన
మనువుమాత్ర మన్యమును వచియించె నీ
విషయమందు వినుము విషధరేంద్ర!॥ 31

(2) ఆ॥ "జననమందుఁ బొడము సకలవిఘ్నంబులా
దోసఁగులెల్ల నవలఁ దొలఁగిపోవ
జాతకర్మ మనుచు సరవి నాభిచ్ఛేద
మునకుఁ బూర్వ మొకటి యొనరుపనగు॥ 32

(3) క॥ సావిత్రీనామకయా
దేవతనే తల్లిగాఁగఁ దెలియఁగఁదగు న
ప్డావిధముగ నాచార్యగ
భావనచేసికొనవలయుఁ బదపడి తండ్రిన్ 33

---

కథం బ్రాహ్మణోహ మిత్యా ద్యభిమానపురస్సరం యాగాదౌ ప్రవర్తతే త్యాశంక్యాహ, ఇదమార్ష మితి॥ అత్ర "యేయజామహ" ఇత్యనేనచ "యే వయం స్మో బ్రాహ్మణాః అన్యేవా తే వయం యజామహ" ఇతి బ్రాహ్మణ్యే అనవధారణం దర్శితం మంత్రలింగమపి "యఏవాస్మి ససన్ యజ" ఇతి......

(1) శ్లో॥ తస్మాచ్ఛీలం ప్రధానేష్టం విదుర్వై తత్త్వదర్శినః॥

(2) శ్లో॥ ప్రాఙ్నాభివర్ధనాత్పుంసో జాతకర్మ విధీయతే॥ వ్యా॥ కస్మైత్రపబ్రాహ్మణ్యహేతు రిత్యాహ ప్రాగితి॥ నాభివర్ధనాత్ నాళచ్ఛేదనాత్॥

((3 శ్లో॥ తదాస్యమాతా సావిత్రీ పితా త్వాచార్యఉచ్యతే॥

(1) క॥ ఉపనయనం బగుదాకను
విప్రులఁ శూద్రసముఁడగుచు వెలయును ద్విజుఁడా
యుపనయనం బగుమీఁదనె
జపతపములు మొదలుగాఁగఁ జలుపఁగఁ దగెడిఁ " ॥ 34

క॥ అని ఈగతిస్వాయంభువ।మనువామ్నా యో క్తకర్మమార్గమె బ్రాహ్మ్యం
బునకు నిదానంబనుచును జనులమనస్సంశయంబుసమ యుంచెలిఁ॥

తే॥ ఎపుడు వేదో క్తకర్మవిహీనులగుచు బ్రాహ్మణక్షత్రవిట్కులప్రభవులుం
డో? అపుడుశూద్రసమానులై యలరఁగల గుతత్స్వధర్మపరిత్యాదతఁ లెల్ల

(4) తే॥ వేదచోదితమైనట్టి వృత్తమెల్ల
నెచట లోపించి స్వేచ్ఛమై నేగఁబడునో
అచట బలమైన సాంకర్యమవుఁయుండె
ననుచు నూహింపగందగు నహీకులేంద్ర! ॥

(5) ఉ॥ జ్ఞాన త్రయీరహస్యము సుఖంబుగఁదెల్పఁగ నేరుపడ్డ యా
మానవధర్మశాస్త్రమున మంచిగమించ వచించురీతిగఁ
దానదయానృశంస్యజప తథ్యపురోగమమైనయట్టిదై
యేనుమొదల్ వచించినదియింతకుసంస్కృతవృత్తమయ్యెడుఁ।

---

(1) శ్లో॥ తావ చ్ఛూద్రసమో హ్యేష యావద్వేదేన జాయతే

(2) శ్లో॥ తస్మి న్నేవం మతిద్వైధే మను స్స్వాయంభు వోఽబ్రవీత్॥ వ్యా॥ ద్వైధే జాతే సంశయేసతి

(3) శ్లో॥ కృతకృత్యాః పున ర్వర్ణా యది వృత్తం నవిద్యతే॥ వ్యా॥ వృత్తం వైదికసంస్కారో యది నవిద్యతే తర్హి సర్వాఃప్రజాః కృతకృత్యాః శూద్రతుల్యాః తథాచస్మృతిః- "నశూద్రే పాతకం కించి న్నచ సంస్కారమర్హ" తీతి తేషాం సంస్కారానర్హత్వ నిష్పాపత్వాభిధానా త్కృతకృత్యత్వం దర్శయతి తద్వత్ త్రైవర్ణికా అపి స్యురిత్యర్థః॥

(4) శ్లో॥ సంకర స్తత్ర నాగేంద్ర! బలవాఁ ప్రసమీక్షితః॥ వ్యా॥ అత్ర వృత్తాభావే॥

[5] శ్లో॥ యత్రేదానీం మహాసర్ప! సంస్కృతంవృత్త మిష్యతే । తం బ్రాహ్మణ మహం పూర్వముక్తవాఁ భుజగోత్తమ !

ఆ॥ జాతకర్మముఖ్య సంస్కారములచేత
నెవఁడు శుద్ధుఁడగుచు నెసఁగియుండు
వాని సత్య శీల దానాది వృత్తంబె
సంస్కృతం బటండ్రు శమను బుధులు॥ 39

అ॥ అట్లుజాతకర్మమాదిసంస్కారములు|సత్యశీలములునుసరిగఁగల్గి యుండినట్టివాఁడెయుత్తమబ్రాహ్మణుం|డిదియయార్య!|నాదుహృద్గతంబు॥

క॥ ఆసంస్కారము లెల్లన్। జేసికొనన్ శూద్రునకును జెల్లదయెపుడున్
ఆసంస్కారవిహీనున। కేసుగు ... న్నఁగాఁడయిలవిప్రుఁడుగన్,,

చ॥ అనివచియించెఁ బాండుసుతుఁ, డంతటియర్థము గల్గియున్న వా
ఘనతర భారతోక్తులకుఁ గానివి పోనివి యేవొ వ్రాసి యా
మునిసిభుగారు బ్రాహ్మణుల మొత్తము చిత్తము నొవ్వఁజేసినా
రనవసరంపువ్రాఁతయని యావల జెజ్జి రిమార్కుచేయఁగన్॥ 42

సీ॥ ప్రతివాదిపండితు పటిమవీక్షింతమా
వ్యర్థమౌసాక్ష్యంపుఁ బ్రవచనమున
తన్న్యాయవాదుల దక్షిమగన్గొందమా
స్వర్ణకృద్బ్రాహ్మణ్య సాధనమున
మధ్యవర్తిమనీషి మహిమయోజింతమా
స్వప్రియపాండితీ స్థాపనమున
స్వీయమౌ విద్యావిశేషంబునెంతమా
వర్ణసాంకర్యంపు వాదనమున
ఇట్టిసాధనసంపత్తి పెట్టుకొనియె
అమ్మహాభారతీయ రహస్యములను
ప్రకటనముసేసి ప్రస్తుత బ్రాహ్మణులను
దిగువఁద్రోచిన మున్సిభుం బాగడవలదె॥ 43

కం॥ ప్రాశస్త్యద్యోతనమునకై శాస్త్రము లర్థవాద మనుస్మృతిసేయన్
లేశంపుజ్ఞానమునను ప్రబ। వేశించిరి బ్రాహ్మమతులు పెడవాదములన్॥

ఆ॥ అగ్నిహోత్రతప్తమానయః పిండంబు
న టంగాల్పఁగాక యగ్నిలాగె
అగ్నిహోత్రతప్తమానుక్కుముద్దందొ్రి
యగ్నిహోత్రిమంద్రోయవనిజనులు॥ 45

క॥ రాజపురోహితుఁడౌ జను। రాజుగ నే చెప్పికొందు రిభసమునఁ బ్రజ
లాజసమానుండౌనో। రాజెయగునో నిజమెఱుంగ రాదా కామనకున్॥

కం॥ ఆవిధసత్యాదిక సం। భావితుఁడౌ శూద్రజనుఁడు బ్రాహ్మణసముఁడై
తా వెలయఁజాలుఁగానీ। కేవలబ్రాహ్మణుఁడుగాఁడు క్షితినెన్నటికిన్॥ 47

ఆ॥ ఆప్రకారముగనె యవిలేని బ్రాహ్మణుం
డగును శూద్రతులితుఁ డంతెకాని
బ్రాహ్మణుం డనంగఁబడక కేవలశూద్రుఁ
డనఁగఁబడఁడు నిశ్చయంబుగాను॥ 48

సీ॥ ఋతుమతీసతిపెండ్లి శ్రుతిచోదితంబంచుఁ
గోర్కెమైఁ దాఁ జేసికొన్ననాఁడు
విధవావివాహంబు విధిబోధితంబంచు
నన్నాతిఁ గవగూడి మన్ననాఁడు
జాతిభేదములుంట నీతిగాదని యెల్ల
తెగలవారింగూడి తిన్ననాఁడు
ఉదధియానముసేసి హూణసంఘముతోడ
నుచితంపుగోష్ఠితో నున్ననాఁడు
మఱియు నిటువంటివేయైన దురితములకు
సాహసంబు నధిష్ఠించి చన్ననాఁడు
వీనికృత్యంబు లెల్లరున్ విన్ననాఁడు
కాఁడు బ్రాహ్మణుఁ, డందాక కాకపోఁడు॥ 49

కం॥ ఇత్యాద్యత్యంతైనః। కృత్యంబులు భూమిసురుని క్రిందికిలాగున్
నిత్యానుష్ఠితసుతపః। సత్యాదులు పైకిలాగఁజాలవు శూద్రున్ 50

తే॥ చెట్టుకొనగొమ్మనుండినయట్టి పండు క్రిందికింబడు నేదేని క్రిందువలన

క్రిందనుండినపండు నేచందమునను
మీఁదికిం జేర్ప నెవరికిం గాదు తరము॥ 51
ఆ॥ పండుపగులవలయుఁ బండులోపలివిత్తు
వలన మఱొకచెట్టు మొలవవలయు
పెద్దపెరుఁగవలయుఁ బెరిఁగి కాయవలయుఁ
గాసి యచట నుండఁ గాంచివలయు॥ 52
ఆ॥ అంతకార్యమైన యటువెన్కబై కేగు । నంతెగాని యింకనట్లుగాక
భూమినున్నపండు భూరుహశాఖపై । కేరహీన్ రయంబచేరఁగలదు
క॥ ఈచొప్పుననేగన్ వలె । నీచుఁడుపైజాతి, కుత్తనీతులవలనన్
నాచెప్పినపైసామ్యమె । వేచేకూరెడినినేల? విస్తృతియింకన్॥ 54
క॥ ముందున్ వెనుకంగాంచక । యెందోయొకముక్కగాంచియే మున్నిభీ
చందమునవ్రాసె, భారత। మందేయీవిషయమెల్లనలరెడిఁగనుగోన్॥
*ఉ॥ "శూద్రుఁడు సత్వనిష్ఠుఁడయి శోభిలెనేని భవాంతరంబునన్
శూద్రతవీడి వైశ్యుఁడయి చొచ్చిక్రమంబుగ క్షత్రదేహమున్
క్షుద్రత వోవఁగం దుదకు క్షోణిసురుండగు" నంచు నున్న స
చ్ఛాద్రుని ధర్మవాక్యమును జూడుఁడు భారతమంద యుండెడున్॥
తే॥ "బ్రాహ్మణత్వంబు కడుదుర్లభం బనేక
జన్మములఁబొంద తిరుగంగ సంభవించు
నపుడుగనునది" యనియున్నయట్టి భీష్మ
పలుకులంగూడఁజూడుఁ డబ్భారతమున॥ 57
క॥ ధర్మజ్ఞుండై మిక్కిలి, పేర్మిసియుఁగౌశికాఖ్యపృథ్విసురునకున్
ధర్మోపదేశియగునా । ధర్మవ్యాధునకుబోయతనమేమిటికో॥ 58
ఆ॥ ఎంతతపమొనర్చెనింద్రునుద్దేశించి। బ్రాహ్మణత్వమునకుఁబాపమమ్మ
తంగుఁ, డంతమైనఁదత్సిద్ధియయ్యెనే।యతనికకట! వ్యర్థమయ్యెఁగాక॥

* భారతము-అరణ్యపర్వము-ధర్మవ్యాధుఁడు కౌశికునకుఁ జెప్పుట.

వ॥ సత్త్వగుణనిబద్ధుండగునేని శూద్రుండైనను జనాంతరంబున వైశ్యత్వంబు నొంది, క్రమంబున రాజ భూసురభావంబులు భజించి భవవిముక్తుండగు.

తే॥ * ఉండఁదగినన్ని గుణములు నున్నవాఁడు
జ్ఞాని సుఖదుఃఖములను సమానదృష్టి
నిష్పరిగ్రహుఁ డటువంటినీతిశాలి
యెట్లుకుయ్యిడెనో చూడుఁ డింద్రునొద్ద॥ 60
క॥ బ్రాహ్మణికడుపునఁ బుట్టియు
బ్రాహ్మణకర్మములశుద్ధిపఱుపఁగఁ బడియున్
బ్రాహ్మణవీర్యుఁడుగామిని
బ్రాహ్మణ్యముఁబడయకతఁడుపరిభవమందెన్॥ 61
ఆ॥ విదురసంజయులకు విప్రుఁడున్ సరికాఁడు
నుడువఁబడిరె బ్రాహ్మణులుగ వారు
జనకుఁ డెంతజ్ఞాని, క్షత్రియత్వవ్యవ
హార మతనిఁబాసి యరిగినదియె। 62
క॥ వేయేలనహుషుఁడడిగిన। యాయాప్రశ్నంబులకునుననుకూలముగన్
వేయుత్తరంబొసంగిన। యాయమనందనుఁడుమాత్రమలఁతియెతలఁపన్॥
క॥ తనుదానపోలుఁగాకే। మనవచ్చునజాతశత్రునతిశాంతతయున్
ఘనసత్యశీలములు నే। జనులకువర్తిల్లెఁజెపుఁడు సౌజన్యనిధుల్!॥ 64
సీ॥ అతని సత్యంబున "కాచార్యసుతుఁ డీల్గె"
ననుట కొప్పకయుండె యలఘుసాక్షి
అతని దయామతి కల సుయోధను కట్లు
విడిపించిపుచ్చుటే వింతసాక్షి
అతని శాంతాత్మత కతివ దుశ్శాసనుం
డీడ్వ నూరకయుండె హెచ్చుసాక్షి
అతని దానంబున కరివచ్చి "శర" ణన్నఁ
బ్రేమచూపించుటే పెద్దసాక్షి
అట్టిసత్యశీలుఁ డట్టిదయాశాలి అట్టిశాంతమూర్తియట్టిదాత

* భారతము-అనుశాసనికపర్వము. ఇంద్రమతంగసంవాదము. భీష్మః॥ మతంగో నామ నా మ్నావైసర్వైస్సముదితో గుణైః...మాతంగః॥ ఏకారామో హ్యహం శక్ర! నిర్ద్వం

బ్రాహ్మణుండటంచుఁబలుకంగఁబడక యే
యేలక్షత్రియుఁడుగనెంచఁబడెనో

క॥ ఈయీ కారణములచే
నా యమనందనుని భావ మటుగాకయ యీ
నా యనినట్టులె యయ్యెడు
ధీయుతు లరయుండు సరిగఁ దెలియంబడెడిన్॥ 66

తే॥ వర్ణభేదము లేక కేవలగుణముల
వలననే బ్రాహ్మణత్వాదు లలవడునను
వాదమున కించుకేనియు భారతంబు
సాధకముగాదు వ్యర్థప్రశంసతప్ప॥ 67

క॥ జాతివ్యవస్థయంతయు। నాతతముగ భారతంబునం దేయుండెన్
గీతలుపుట్టుటకుంగల। హేతు వెదోయరయుఁడార్యులింతకు మొదలన్

ఆ॥ జ్ఞానబోధ యంతగాఁజేసి కృష్ణుండు
కడకు నెదివిధించెఁ గవ్వడికిని
"క్షత్రియుండవీవు సంగరక్రియ వీడఁ
దగ" దటంచునే కదా తలంప॥ 69

క॥ జ్ఞానముగల్గక పూర్వము
తానైనన్ క్షత్రియుండు తదనంతరమం
దైనమఱి బ్రాహ్మణుఁడు కా
కానరుఁడెటులయ్యె క్షత్రియత్వయుతుండే॥ 70

క॥ ఏజాతికిఁజేరినజనుఁ
డాజాతికిదగినధర్మమతినిష్ఠ మెయిన్
దాజరుపనగును నైదవ
ప్రాఁజదువగు భారతంపుఁబద్ధతిఁజూడన్॥ 71

క॥ హైందవ పురాణములయం
దుం దిగు టనవసరమనుచుఁ దుద కమ్మునిభ్

ద్వా నిష్పరిగ్రిహాః। అహింసాదమ మాస్థాయ కథం నార్హామి విహిత్వా॥

హైందవమా గ్రంథంబే
యెందులకొ ప్రమాణముగను నీ వైకొనుటల్॥ 72

తే॥ "సృష్టికృద్వక్త్రబాహాదిసీమలందు
బ్రాహ్మణాదికవర్ణముల్ ప్రభవమగుట
తక్కు హైందవుల పురాణతతిని బరఁగి
* పరఁగకుండెనుగాఁ బోలు భారతమున 73

ఆ॥ వర్ణసంకరంపువాదంబునకుసాధకంబటంచుఁగొనియెఁగానిదాని
వాస్తవముగనదియువర్ణవ్యవస్థాపనమునకే సుసాధనంబుచూడ 74

ఆ॥ కాదుబ్రాహ్మ్యమునకుఁ గతము కేవలశీల
మే యటన్నవాద మింతెకాని
శీలముం బరిత్యజించి యుండుఁ డటన్న
బోధగా దిదంత భూసురులకు॥ 75

ఆ॥ మునిసి ధనినలాగె మన కవశ్యంభావ్య
మైనయట్టిశీల మవలఁద్రోచి
"మేము బ్రాహ్మణులము మేముబ్రాహ్మణుల"మం
చెగురులాట కరము తగనిచేఁత॥ 76

కం॥ అబ్రాహ్మణులకు బ్రాహ్మ్యం
బబ్రాహ్మ్యము బ్రాహ్మణులకునలవడుననుటే
సెబ్రినుడికానితీర్పరి
దభ్రముమతియేమియుండదనోక్తులలోన్॥ 77

శా॥ జాతిబ్రాహ్మ్యము కల్గుమాత్రి మనకున్ స్వర్గంబు రాఁబోవ, దా
జాతిబ్రాహ్మ్యము సార్థకంపడుటకై సత్యానృశంస్యాదికా
న్వీతంబౌ నిగమోక్తధర్మ మెపుడున్ నిర్వర్తనీయంబు, త
ద్రీతిన్ వర్తిలమే నపార్థమగు భూదేవత్వ మీక్షింపుఁడీ॥ 78

---

* భారతము శాంతిపర్వము జనకపరాశరసంవాదము.
తే॥ పద్మభవ ముఖబాహూరు పాదసంభవములుగాన భూసుర రాజ వైశ్య శూద్ర
భావములు తారతమ్యసంప్రాప్తినొందె జననదేశగుణంబుల మనుజనాథ!

ఉ॥ బ్రహ్మ ముఖాంబుజాతమునఁ బ్రథమంబునఁ గల్గినట్టి యీ
బ్రాహ్మణజాతివారమయి భాసిలుచుండియు నాత్మనిష్ఠమౌ
బ్రాహ్మణధర్మముం గర మపార్థము సేసితిమేని నిజంబుగన్
బ్రాహ్మణనామధారుల మపాత్రులమున్ మన మౌదు మారయన్

కం॥ నూటికిఁదొంబదిమందియు సూటిగమనలోననట్లుచూపడుట నెకా
గూటింప మొదలు వెట్టిరి సాటిజనుల్ మనలనిట్లు భూసురులారా! 80

ఉ॥ ఎల్లజగానకున్ గురుల,మెల్లకలల్ మన పెట్టెసొమ్ము,ల
ల్లెల్లజనంబులందుఁ గడు హెచ్చులమై ప్రథమంబునుండియున్
మెల్లగ స్వీయధర్మములమీఁద నుపేక్ష వహించుచుంటనే
యొల్లమిఁజూపుచుండిరిటు లోకులు, ద్విజాతులు! మేలుకాంచుఁడీ॥

క॥ బ్రాహ్మణతాసామ్రాజ్యము। బ్రహ్మమొదల్ మనకొసంగెఁ బరిపాలింపన్
బ్రహ్మయొసంగినపదమో। బ్రాహ్మణజనులార! నిల్పఁ బొల్లంబడుఁడీ

క॥ పృథివీదేవులమయ్యును
ప్రథమము మనమే యధర్మపరులమయిన దు
ష్పథమగును " యథారాజా
తథాప్రజా " యనెడిరీతిఁ దక్కుజనంబున్॥ 83

తే॥ విభునిచేత స్వధర్మంబుఁ విడువఁబడిన
నవనిసామ్రాజ్యమే జనులపహరింత్రు
బ్రాహ్మణత్వంపు సామ్రాజ్య పదవిమాత్ర
ముంత్రె మనము స్వధర్మంబు లుజ్జగింప॥ 84

ఉ॥ క్షత్రియవైశ్యశూద్రులును భూసురులేయయి పూర్వమందుఁ ద
ద్ధాత్రిసుపర్వధర్మములఁ దప్పిచరించుటచేతనే యిటుల్
క్షత్రియవైశ్యశూద్రతలు దాల్చినవారఁట, న్యాయక యీ
చిత్రపుఁ బూర్వపక్షమును జేసెను, నేమివచింత మిచ్చటన్॥ 85

క॥ § ముందర బ్రాహ్మణులై యా।యందఱునున్ వారివారియాచరణముచేఁ
గ్రిందికి దిగుటలు భారత।మందేయుం డెనఁటదియు యథార్థం బేమో

§ మహాభారత శాంతిపర్వము 180 వ యధ్యాయములోఁ బ్రపంచమంతయు

ఆ॥ ఉండుఁగాక దాని నెప్పుదు వేదంబు
అందునాల్గుజాతు లాదియంద
పుట్టినటులఁ జెప్పఁ బురుషసూక్తంబుదా
"బ్రాహ్మణోస్య" యనెడి పదముచేత॥ 87

కం॥ ఇతిహాసము భారతమన
శ్రుతికిన్ స్మృతికిని బురాణసూక్తికినిం గ్రిం
ది తరగతిం జేరినయది
యితిహాసము, కావున నది యెటుచెల్లనగున్॥ 88

క॥ ఈయంశంబుం గూరిచి। నాయాశయమున్న విధమున నెతన చేతన్
వ్రాయఁబడియుంటఁ దీర్పున। న్యాయాధిపుఁడిందుబద్ధుఁడై యుండఁదగున్

చ॥ వెనుక నతండు చెళ్ల పిళ వెంకటశాస్త్రులవారిసాక్ష్యమం
దున నెదొ యొక్క వాక్య పెడత్రోవగలట్టిదియుండ "వాడి యీ
తనదగు ప్రాజ్ఞసాక్ష్యమునఁ దాఁ గడు బద్ధుఁడుగాఁగ నుండనౌ"
నని లిఖియించె, నెట్టులివుఁ డాతఁడు బద్ధుఁడుగాక యుండెడిన్॥ 90

క॥ నాపక్షంబునవచ్చిన। యేపండితుసాక్ష్యమునకో యే బాధ్యుఁడఁగా
స్వోపన్యస్తంబగునుడి। కేపగిదింగాఁడు బాధ్యుఁడీతీర్పరియున్॥ 91

క॥ పండితుపలుకులఁగానీ
పాండిత్యవిహీనజనుని పలుకులఁగానీ
యుండఁదగు శాస్త్రసమ్మతి
ఉండనినాఁ డవి గ్రహింపకుందురు బుధుల్॥ 92

మ॥ అవుఁగా కాయన పండితుండు, మఱి నాకై సాక్ష్యముం జెప్పఁగా
కెవియుం జూపక యే ప్రమాణములఁ దా "నెల్లర్ మొదల్ శూద్రులై
అవలన్ వైశ్యులు క్షత్రియుల్ ద్విజులుగా నై రోజ" నన్నం దదు
క్తి వృథా నన్నెటు బద్ధుఁ జేసెడిని శాస్త్రీయంబు గాకుండుటన్॥ 93

---

మొదట బ్రాహ్మణులనియుఁ దర్వాత వారువారుచేయుపనులనుబట్టి యనేకజాతులవా
రుగా విభజింపఁబడిరనియు భృగుమహర్షి చెప్పెడిని. బ్రాహ్మణునకు గొప్పతనము
నిచ్చునది పుట్టుకయే కాదు పైనిజెప్పిన గుణములుకలిగియున్న వాఁడే బ్రాహ్మణుఁడు

క॥ ఆమాడ్కిఁ జెప్పంబడు। ప్రామాణ్యము లేనినుడులె బాధించెడిచో
ప్రామాణ్యవిచారణకై। యేమనుచుఁ దిగినవాఁడొ యీమున్సిభుఁడా॥
మ॥ నుడివెన్ వెంకటశాస్త్రి శాస్త్రహితముల్ నూ, అందులో నిద్దియొ
క్కఁడె యిట్లుండెను, నుండుఁగాక, యొక వాక్యమ్మేమి బాధించు, నె
క్కుడు వాక్యమ్ములు శాస్త్రధూరములు వాక్రుచ్చెంగ, శిష్టాన్వవా
యుఁడు మున్సిఫివె సత్ప్రమాణములుగా నెయ్యన్ గ్రహింపంగఁదాన్
క॥ *శాస్త్రనిబద్ధములఁటయా
శాస్త్రులువచియించునట్టిసంగతులెల్లన్
శాస్త్రజ్ఞానంబుండుట
శాస్త్రులప్రౌఢిమ నెఱుంగఁజాలెనుమున్సిఫ్॥ 96

---

(17) గుణములనుబట్టికాక పూర్వకులనుబట్టియే బ్రాహ్మణత్వమును నిర్ణయింపవలయునని యెడిది వాది వాదమైయున్నయది. ఇందువిషయమై యుభయపక్షములందును ననుకూలముగాను బ్రతికూలముగాను సాక్ష్యము చెప్పఁబడినది. నేను జేసెడివాదమునకు సాక్ష్యముతోఁ బనియేలేదు. వాదియుఁ బ్రతివాదులును బుట్టుకనుబట్టి వారిహక్కును నిల్పుకొనవలెనని యత్నించినారుగనుక వారివాదములనుగూర్చి యించుక విచారించుట యవసరమైయుండవచ్చును. మొదట ప్రతివాదికి దన్నుఁ బ్రస్తుతము వాదములోనున్న శాస్త్రోక్త బ్రాహ్మణుఁడుగా జెప్పుకొనుట యభిమతమైయున్నది. వాది తిరిగి బ్రాహ్మణులచేఁ బ్రతిష్ఠింపఁజేయుటకుఁగాను గర్భులనుగోరుటవలన వారియుత్పత్తికూడ నాలోచింపవలసియుండును. ప్రతివాదులు నాలుగవకులముకంటెఁ దక్కువవారై యాజ్ఞవల్క్యస్మృతిలో సంకీర్ణసంకరులుగాఁ జేర్కొనఁబడిన రథకారజాతివారని వాదిచెప్పుచున్నాఁడు. సూతసంహితలో రథకారులు సంకీర్ణసంకరులనియు వారివృత్తి వడ్రంగము కమ్మరము బంగారపుఁబని యనియుఁ జెప్పఁబడియున్నది. ప్రతివాదికులస్థులావృత్తులచేజీవించుచుండుటచే రథకారులని చెప్పఁబడువారు వారేయని వాది వాదించుచున్నాఁడు. పుట్టుకవల్ల బ్రాహ్మణుఁడును బండితుఁడును నగు వాదితరపు 2 వ సాక్షి (శిష్టా సీతారామశాస్త్రి) సామాన్యముగాఁ గమసాలులనియెంచఁబడు ప్రతివాదికులస్థులు, యొగ్గిబిటుయీ (యాజ్ఞవల్క్యస్మృతి) లోఁ జేర్కొనఁబడిన రథకారజాతివారని చెప్పుటకుఁ బ్రమాణ మేమియు లేదని చెప్పెడిని.

* ఆయన సాక్ష్యములోని సంగతులు శాస్త్రప్రమాణములని చెప్పుటకు వీలులేనున్నవి.

ఆ॥ *శాస్త్రిగారికైన సాక్ష్యమాక్షేపింపఁ
జాలకుండిరంట సరిగ నెవరు
అరయ నతని సాక్ష్యమందు నాక్షేపావ 97
కాశముండదంట లేశమైన॥

ఉ॥ నోరికి వచ్చినట్టులుగ నూతన నాగరికాళికిం బ్రియం
బారహి నెవ్వియో నుడువు నాతని సాక్ష్యమె ప్రస్తుతంబునన్
గౌరవపాత్రమయ్యె, కలికాల మహత్త్వముగాక యస్యమా
కారణముండఁబోవ దిటుగా పుటకుం దలపోసి చూడఁగన్॥ 98

ఆ॥ నెగడ రాజకీయనిర్బంధ మొకియింత
యూఁగవలసివచ్చె నంతె కాని
కాకయున్న శాస్త్రిగారివాక్యంబులు
ఖండితంబు లెట్లుగాకయుండు॥ 99

క॥ సరియగు విమర్శకత్వము
వరలఁగనీ యవ్విధమున వరలకపోని
నరపతిసంబంధ్యధికృతి
పరఁగుట నెది వ్రాయఁ జెల్లుభాగ్యంబుండెన్॥ 100

క॥ కనుకనె న్యాయాధిపుఁ డిటు
మన సీతారామశాస్త్రిమాటల నెల్లన్
ఘనవేదపు మాటలఁగా
పనిగొని తా వ్రాసినాఁడు బళియన జనముల్॥ 101

ఆ॥ తనదు హృదయమునకు ధర్మ్యంబులని తోఁచి
వ్రాసె నాతఁడటుల, వ్రాయఁగాక
చదివి కలరి కార్డు సత్యముఁ గ్రహియింప
నెవరు కొట్టినార లిపు మనను॥ 102

---

* ఆయన సాక్ష్యము నెవరు నాక్షేపింపలేదు. వాదిచేఁగూడ నాక్షేపింపఁబడుటకు వీలులేదు ఈవిషయమై చెప్పఁబడిన గ్రంథములన్నియు నుదాహరించుటకు వీలు కాదు. మొట్టమొదట భగవంతుఁడైన యాదినారాయణమూర్తి చతుర్ముఖములుగల బ్రహ్మనాఁ బుట్టినాఁడనియు నానాజాతులవారిని సృష్టించినాఁడనియు నీసాక్షి వక్కాణించును.

క॥ ఇందు విమర్శింపఁగఁదగు। సందర్భంబులవిమర్శనలిపియయుంటిన్
డెందమునఁజొన్పిపఠింపుఁడు। సందేహామువీడఁగలమహీసురులారా! ॥

* తే॥ బ్రహ్మసంతతియైనట్టి బ్రాహ్మణులకు
బ్రహ్మసుతులందు నొక్కఁడై పరఁగు విశ్వ
కర్మసంతతివారైన కనకకారులు
జ్ఞాతులయ్యెదరంట యీకతవినుండు॥ 104

క॥ సీతారామబుధోక్తుల। నేతీర్ఖండించియుండు టెఱుఁగుదురుకదా
ఆతీరునుడులసారం। బీతీరుగ్రహింపఁబడియెనీతీర్పరిచేన్॥ 105

ఆ॥ కనకకారు లొకరెకాదుచూ జ్ఞాతులు
ప్రథములైనయట్టి బ్రాహ్మణులకు
బ్రహ్మసృష్టమగా ప్రపంచంబు సర్వంబు
నగును జ్ఞాతివర్గ మరసిచూడ॥ 106

క॥ కొందఱుసాక్షాద్బ్రహ్మకుఁ। గొందఱుతద్బ్రహ్మసుతులకుంగల్గుటచే
నందఱిది బ్రహ్మవంశమె। యందఱునుర్జ్ఞాతిజనులె యన్యోన్యంబున్

మఱియు నీసాక్షి విశ్వకర్మయనునామ మాయననామములలో నొకటియై యున్నదనియు విశ్వకర్మ కుమారుఁడు త్వష్టయనుపేరుగలవాఁడనియుఁ ద్వష్టయనఁగాఁ జిత్తరువులుచెక్కువాఁడని యర్థమనియు వడ్రింగమనువృత్తిని వాడుకలోకిఁ దెచ్చుటచే నాతని కాపేరు వచ్చినదనియుఁ జేతిసంబంధమైనపనులతో జీవించెడి యన్నితెగలవారును విశ్వకర్మచేతనె సృష్టింపఁబడిరనియు నాదిమూర్తిగాక మఱియొకవిశ్వకర్మ యున్నాఁడనియు నతఁడు కమసాలులను సృష్టించియుండవచ్చుననియు నీవిశ్వకర్మ సృష్ట్యాదిని దనక్రింద నుపనాయకులుగానుండి పనిచేయుటకుఁ జతుర్ముఖబ్రహ్మచే సృజింపఁబడిన నవబ్రహ్మలలో నొకఁడనియుఁ జెప్పుచున్నవాఁడు.

* కనుక నవబ్రహ్మలలో నొకఁడైన విశ్వకర్మవంశమువారు చతుర్ముఖబ్రహ్మయొక్కవంశమువారే. ఈకారణమునుబట్టి వాదికులమువారును బ్రతివాదులకులమువారును దాయాదులయియున్నారు. కనుక వివాదమున కేమియుఁ గారణముండఁగూడదు.

తే॥ ఇతరజనములబాంధవ్య మెట్టులున్న
బ్రాహ్మణక్షత్రవిట్ఛూద్రవర్ణ మనుజు
లెల్లరున్ బ్రహ్మకేకద యేరుపడిరి
వదనబాహూరుపదములవలననుండి॥ 108

ఉ॥ ఆవిధి బ్రహ్మకుం గొడుకులయ్యెడు వర్ణచతుష్టయప్రజల్
కేవల మన్నదమ్ములను కీర్తివహింపకె హెచ్చుతగ్గులన్
భూవలయంబునన్ మెలఁగఁబోలునె విప్రులు హేమకారకుల్
భావము లైక్యమందఁ దగుబంధుతమైఁ జరియించుచుంటకున్॥ 109

శా॥ సీతారామమనీషిసాక్ష్యమును వీక్షింపంగ నొక్కండునున్
ఖ్యాతగ్రంథపుసూక్తి గన్పడదు, సత్యం బిట్టులుండంగఁ ద
త్సీతారామబుధప్రదర్శితకృతుల్ శ్రోత్రప్రమాణంబులం
చేతీ ర్మన్నిభ కొన్నిగ్రంథములపై రెత్తంగ నుంకించెనో॥ 110

§ తే॥ పురుషసూక్తాదులం దెవ్వి పుటలఁ గూడఁ
బేరుకొనియెను బాతిక ప్రీతిగాఁగ
అబ్బుధోక్తులఁ బురుషసూక్తాదులందుఁ
గల దిటంచునుఁ దాఁ జూపఁగలుగునొక్కొ॥ 111

---

§ వాదితరఫు 2వ సాక్షి (శిష్టాసీతారామశాస్త్రి) చెప్పినసంగతులకుఁ బురుషసూక్తము 14వ పుటయు విష్ణుపురాణము సప్తమాధ్యాయములో 286వ పుటయు భాగవతము సప్తమస్కంధములో 201 పుటయుఁ గాశీఖండము 622వ పుటయుఁ బ్రమాణములు. ప్రతివాదులు రథకారులుకూడ బ్రాహ్మణులని చెప్పుటకుఁ గృష్ణయజుర్బ్రాహ్మణము 10వ పుటయు నాపస్తంబశ్రౌతసూత్రము 240వ పుటయుఁ బ్రమాణముగాఁ జూపినారు. ప్రస్తుతపుఁగసాలులు రథకారులని నిశ్చయించుటకుఁ దగినయాధారమేమియు లేదుగనుక నీవాదమున నేవిధమైనలాభమును లేదు. వారు విశ్వబ్రాహ్మణులమనియుఁ దరువాత బ్రాహ్మణులమనియుఁ జెప్పుకొనుటకుఁ గ్రమముగాఁ జేయుప్రయత్నములు దీనికిఁ గొంచెమైనను సహాయముచేయవు. ఏమియు నర్థములేని పదములకిట్లర్థముచెప్పుట వారి యనాలోచనమును బక్షపాతమునే సూచనచేయును.

తే॥ బ్రహ్మ వదనాదికావయవములనుండి
భూమిదేవపురోగముల్ పుట్టిరనెడి
గ్రంథముల్ తన కనవసరంబులుకద
పురుషసూక్తంబు నెట నవసరముకాదు॥ 112

తే॥ అప్రమాణంపువాదంబు న్నాచరించి
బళిర ! శిష్టాన్వయుఁడు స్తోత్రపాత్రుఁడయ్యె
♦ సప్రమాణంపువాదంబుసలిపికూడ
నయ్యె మల్లాదివంశ్యుఁ డనాదృతుండు॥ 113

క॥ సత్యంబు జనవిరుద్ధ మ। సత్యమెజనరంజకంబుజగతిని, గాదేఁ
మత్యమరాచార్యుండని। స్తుత్యతగన్నట్టిబుధుఁడుదూషితుఁడగునే॥

సీ॥ గర్తపురింగూడఁ గాలూఁదవచ్చిన
స్త్రీపునరుద్వాహ మాపినాఁడు
దొడ్డయుర్లాంసభఁ దొంగిచూడఁగవచ్చు
తరుణీవివాహముం దరిమినాఁడు
వెయిపండితులుగల్గు వేపర్లసభ విశి
ష్టాద్వైతవాదంబు నాఁగినాఁడు

---

(18) తుచ్ఛవంశజులైనబుషులు వాదికిని వాదికులమువారికిని ప్రవరులైయున్న మాత్రమున వారిని సంకరులఁగాఁ జేయఁజాలరు. ఆబుషులు పారమార్థికఘనతగల వారగుటవలన వారిని స్వగోత్రప్రవరులఁగా నవలంబించిరో లేక తత్సంతతివారే వీరగుదురో తెలియదు.

♦ గొప్పపండితుఁడైన వాదితరపు మొదటిసాక్షి (మల్లాదిరామకృష్ణసోమయాజులుగారు) యీదావాలో వాదికంటె నెక్కువశ్రద్ధవహించి తనకులమందుండెడి దురభిమానమును వెల్లడిపఱచుచు నకస్మాత్తుగాఁదోఁచెడితలఁపులుగల తెలివితో బ్రాహ్మణేతరుఁడుకూడఁ దపస్సువల్ల బ్రాహ్మణుఁడు కావచ్చునని సామాన్యము గా బ్రాహ్మణులఁగాఁజెప్పఁబడెడి విశ్వామిత్రుఁడు మొదలయినవారుండుటచే నిరాకరింపలేక యొప్పుకొన్నాఁడు.

తగు నుపన్యాసకతాశక్తి నీపాటి
గానరాఁడనుకీర్తి గాంచినాఁడు
ధర్మసంస్థాపనమునందు దక్షమైన
యట్టి యత్యద్భుతప్రజ్ఞ యమరియున్న
రామకృష్ణమనీషి తీర్పరికినిట్లు
దురభిమానయుతుండుగాఁ దోఁచె నకట! ॥

క॥ ఇక్కేసుననాకంటెను। నెక్కువశ్రద్ధన్ వహించెనీపండితుఁడన్
వెక్కసమున న్యాయాధిపుఁడక్కటకట! దురభిమానమారోపించెన్

ఉ॥ ధర్మమునాశమొందుటకుఁ దానెదనోసి మనీషియాట దు
ష్కర్ములొనర్చువాదముల ఖండనసేసి సనాతనంపుఁ ద
ద్ధర్మమునిల్పఁ బాటుపడెఁ, దాదృశుఁడైన మహానుభావుపై
మర్మవిభేదకంబులగుమాటలు వ్రాయఁ గలం బెటాడెనో॥ 117

క॥ నేనొక్కండ నెవాదిని। గానిందునధర్మదృష్టిగల యెల్లరకున్
దీనవివాదంబున్నది। కాననెయిటువచ్చియజ్వకష్టంపడియెన్॥ 118

---

వసిష్ఠుఁడు వ్యాసుఁడు విశ్వామిత్రుఁడు మొదలయినవారు మొదట నపవిత్రుల
నియుఁ దరువాతఁ దపమువల్ల విముక్తిఁ జెందినారనియుఁ దెలియుచున్నది. వాదితరపు
శివసాక్షి (చెళ్లపిళ్ళ వెంకటశాస్త్రిగారు) ప్రతివాఁడును బుట్టుకవల్ల శూద్రుఁడనియు
నుపనయన కర్మమువలన బ్రాహ్మణుఁడగుచున్నాఁడనియు బ్రాహ్మణులైనతలిదండ్రు
లకుఁబుట్టినయాఁడుపిల్ల బ్రాహ్మణునిభార్యయగునంతవఱకు శూద్రదిగా నేయుండునని
యుఁ జెప్పుచున్నాఁడు. మార్పునకుఁ జేయవలసినకర్మలు రాజైనవిశ్వామిత్రుని బ్రాహ్మ
ణఋషినిగామార్చిన బహుశతవత్సరాచరితతపస్సుతో సామ్యముగలవిగా నేయుండ
వలెను. క్షత్రియాదీతరవర్ణజులఁ బ్రాహ్మణులఁగాఁ జేయుటకుఁ గావలసిన తపస్సు
లేకయే సామాన్యముగా నిప్పుడుచేయు నుపనయనము మొదలగు నితరసులభకర్మలు
శూద్రబాలకుని బ్రాహ్మణునిగా మార్చుననియనుకొనుట గింజలోనుండెడి పప్పును
గనుగొనక పై బెరడును బొగడినట్లుండును. ఈచెప్పిన నాసంగతు లంతసకారణములని
యొప్పుకొనరుకాని యేవిధమైన మార్పుకలుగునని యొప్పుకొనుటవలనఁ బుట్టుకవల్లఁ
గలుగు హెచ్చు సత్యముకానట్లు కనఁబడెడిని.

క॥ ధర్మమునెడలంగలిగిన । ధర్మాధిపునత్యనిష్ఠతనెచాటెడిసీ
తీర్మానముపరికింపఁగఁ । గర్మవశంబునను నాకుఁగానేర్పడియెన్॥

---

ఇది వాదికే యనుకూలమైనయంశము వాదిపూర్వు లొకప్పు డపవిత్రులైనప్పటికి వారిపారమార్థికగుణములు పవిత్రముచేసినవనియు వాదికిఁ బారమార్థికగుణము లేవైన నున్నను లేకున్నను దేహసంబంధమయిన యపవిత్రత యేమియుఁ బొందలేదనియు నాయభిప్రాయము. ప్రతివాదులుచెప్పెడి గోత్రములనుబట్టిన యసంబద్ధత నంగీకరించుటకు వీలులేదు.

(19) ప్రతిష్ఠచేయుటకుఁ బారమార్థికగుణములచే నేసంఘమువా రర్హులని విచారించుటకు నటించిన నటింపునంతయు నటించి యిఁక నాచారమునుబట్టియు నాచారము మతసంబంధమయిన కట్టుబాటుగా నేర్పడుటనుగురించియు విచారించెద. పూర్వకాలమునుండి మతసంబంధమైనకర్మలు బ్రాహ్మణులుమాత్రమే చేయించుచున్నారు. పూర్వికులు దేవునితో సంభాషణాదిసంబంధము గలుగఁజేసికొనుటకుఁదగిన యాధ్యాత్మికగుణములుగలిగియున్నందువలన నాయాకర్మలుచేయించుటకై నియోగింపఁబడియుందురుగాని తద్వంశజులుకూడఁ బూర్వికులకు నిజమైన ప్రతినిధులుకారు. జాతిభేదములేనితెగలలోవలెనే పౌరోహిత్యమునకుఁ దగినవారినేర్పఱచుకొనుట, యట్టిపదవికుండవలసిన, యోగ్యతలననుసరించి యుండునెడలఁ బ్రథమమం దుండునట్లేర్పఱుపఁబడిన యాయోగ్యత కొంతవరకైనను నిలుపఁబడునని యూహింపవచ్చును. కాని హిందూదేశములోవలె వంశపారంపర్యమునుబట్టి యటేర్పఱుపఁబడుచున్నందువలనఁ బ్రత్యేకముగాఁ బురోహితుఁ డొకసంఘమువాఁడుగా నేర్పడి యట్టిసంఘము విధివిహితమన్నట్లు స్థిరమయిపోయినది. అట్లు స్థిరపడిపోయిన సంఘమునకు వెల్పలనున్న యేమంచిభూతమును దానిలోపలికిఁ జొరఁజాలదు. ఇట్లు క్రమక్రమముగా వంశపరంపరాగతమయిన యాసంఘమందలి మంచియంతయుఁ బోయి మన కపేక్షింపఁదగని మడ్డిమాత్రమే శేషించియుండెను. ప్రథమమునఁ బురోహితకృత్యమునకై యేర్పఱుపఁబడిన యధ్యాత్మికగుణము లెన్నఁడో మఱచిపోయి తనున్మూలమున లౌకికలాభములు పడయుటకుమాత్రమే శ్రద్ధాళువులైయుండుట ప్రస్తుతపుఁబురోహితసంఘమువారి స్థితియైయున్నది. కావున మహాభారతములో బ్రాహ్మణశబ్దమునకున్న యర్థమును మఱచిపోవలసివచ్చినది. సత్య మసత్యమునకు దాన మాత్మంభరిత్వమునకు క్షమ యీర్ష్యకు మంచినడత యహంకారమునకు నుపకార మపకారమునకు వైరాగ్య మత్యాశకు దయ క్రూరత్వమునకుఁ గ్రమముగా స్థలమునిచ్చుచున్నవి.

తే॥ ఎన్ని మెలికలు తిరిగినఁ గన్నుమునకు
నాగ మల్లనఁజనుక్రియ నాకులంపు
నారలే యాదినుండియు బ్రాహ్మణులుగఁ
దలఁప బడుచుఁ శిరంబొప్పెధర్మనేత॥ 120

ప్రథమము జనసామాన్యమున కైహికసాధనమునకై యేరుపడిన పురోహితసంఘమునకీప్రస్తుతబ్రాహ్మణులు చెందియున్నట్టు లంగీకరించెడి యాచార మెన్నఁదగినది కాదు. అటువంటియాచార మంగీకరింపఁదగినదని యేశాస్త్రప్రమాణమును జూపలేదు. దేవతాప్రతిష్ఠలు సర్వజనసంబంధమయినవనియు నైహికపురోవృద్ధి కేర్పడలేదనియుఁ జెప్పుటకు వీలుకాదు. ఒకసంఘమువారే గురువులు గా నంగీకరించునాచారమునకు నేనంత ప్రామాణ్యమీయను. శ్రుతిస్మృత్యాదులకున్నంతప్రామాణ్యమాచారమునకుగూడ నున్నదని యీకోర్టువారు చెప్పుకొనుట కధికారమున్నదాయని సందేహము.

(20) ఈవిషయమైశాస్త్రములయొక్క సాహాయ్యముతో దీర్పుచెప్పుటకు వీలులేదను నాయభిప్రాయమువలన వాదియొక్కయుఁ బ్రతివాదులయొక్కయుఁ గులముల హెచ్చుతగ్గులఁ దేల్చుట కుభయవాదులు దాఖల్ చేసిన గ్రంథముల విచారించుట యనవసరము. గ్రంథములు బ్రాహ్మణుఁ డెట్లుగానుండవలసినదియు నేమేమిపనులుచేయవలసినదియుఁ దెలియఁజేయును. ఇందు మనమువిచారింపవలసినది యిప్పుడు బ్రాహ్మణులమనిచెప్పుకొనువారు శాస్త్రప్రకార ముండవలసినరీతిగా నుండుచున్నారా? నిజమైన బ్రాహ్మణులుచేయఁదగినకర్మలు చేయుటకుఁ దగియున్నారా? యనునదియై యున్నది. ఎన్నిశాస్త్రములుపరిశీలించినను నీపరిశ్నములకు జవాబొసంగుట కష్టము. ప్రస్తుతము బ్రాహ్మణులను పేరుపట్టుకు నిలిచి యాబ్రాహ్మణధర్మములు త్వరితముగ నశించుచున్నవి.

(21)జనులు వాడుకలోఁబెట్టుకొనిన బ్రాహ్మణాదిశబ్దముల వాస్తవార్థము విచారింపక ప్రస్తుతవ్యవహ్రియమాణమగు నర్థమునుబట్టియే విచారించినచో వాదిని బ్రాహ్మణుఁడనిచెప్పుటకు నాకేమియు సందేహములేదు. ప్రతివాదులు మేముబ్రాహ్మణులమనిచెప్పుకొనుటకును వీలులేదు. హైందవులుమనస్సులలోఁ బారమార్థికగుణముల విషయమై యనేకము లనుకొనినప్పటికి సర్వసంఘమతసంబంధకార్యములకును వాదికులమువారిని బ్రాహ్మణులుగా నెంచుచున్నారు.

* ఉ॥ ఒప్పెనుగాని యాది తమయొక్క రెపారము సేసివిద్యవా
రప్పటినుండికూడభువి నజ్ఞులపై నధికారమూనుటన్
గొప్పతనంబునొందుటకుఁ గోరిక సేయక యన్యులైనవా
రొప్పి స్వహీనపుంగతికి నుండినవారలటంచు వ్రాసెడిన్॥ 121

§ చ॥ పలుకుఁబడింగడించి కడు బ్రాహ్మణు లెన్నొతరాలనుండియున్
బలిమిని హీనజాతి కిటు పాఱఁగఁదోలిరికాని స్వర్ణకా
రులఁ బ్రథమంబు వారలును రూఢిగఁ గుంభినిదేవులంతవా
రలె యయి యున్నవారలని వ్రాసెను మున్సిభుగారు చూడుఁడీ॥ 122

• క॥ ఉండుట నాథానంబను
కొండొకకర్మంబు వారుగూడను ఘనులై
యుండిరని భ్రాంతిపడియెడు
మెండుగ సీతం, డిదేటిమేధయొ యెఱుఁగన్॥ 123

---

ఆచారము బలవత్తరమగుటవలన స్వయముగా నిరుత్సాహులును నాచారమందు బట్టుదలగలవారును నైన హైందవులు దాని నుల్లంఘించుటకు ధైర్యసాహసములు లేక యుండిరి-ఎన్నియో తరములనుండి వాదికులమువా రదేవిధముగా నేర్పడినతక్కినమూడు కులములవారికంటె నెక్కువయని యెన్నఁబడుచున్నారు.

* తెలవిలేమిచేఁ దక్కినకులముల కీకులముతో సరితూఁగవలెననెడి యుద్దేశము కలుగనేలేదు-ఈగురుమతమువారు విద్య తమసొమ్ముచేసికొనిరి. తెలివి యజ్ఞానము మీఁద నధికారము చెలాయింపకమానదు-ఇంగ్లీషువిద్యవల్ల స్వాతంత్ర్యమునుగుఱించియు మర్యాదనుగుఱించియు నూహలుపుట్టినపిమ్మటనే తక్కినకులములవారు తమస్థితికిని భూసురులమని గ్రంథములలో వ్రాసికొనుచున్న బ్రాహ్మణులయొక్క స్థితికిని గల తారతమ్యమునుగూర్చి యాలోచించుట కారంభించిరి.

§ ప్రతివాదులు పెక్కుతరములనుండి సంఘములోఁ జాల నీచస్థానమునకుఁ ద్రోసివేయఁబడియుండిరి-ఆస్థానమునుండి వా రిప్పుడు తలయెత్తుటకువీలులేనంత ప్రాబల్యము(పలుకుఁబడి) బ్రాహ్మణులకుఁ గలిగిపోయినది.

• శాస్త్రప్రకారము వారుచెప్పుకొను పుట్టుకనుబట్టియే యొకవిధముగా నిప్పుడు వారికిచ్చెడిమర్యాద యీయఁదగినదికాదని సూచించుచున్నది-షోడశకర్మలుం గలిగి వేదచోదితమగు నాధానముకూడఁ జేయవచ్చునను సంగతినిబట్టిచూడ వారు మొట్ట మొదట బ్రాహ్మణులకంటెఁ దక్కువవారు గాకయుండవచ్చును.

క॥ ఆధానంబున్నంతనె యాధట్టుల బ్రాహ్మణులుగ నెంచెడియెడలన్
బాధించుఁ దన్నిషాదుఁడు నేధరణిన్ బ్రాహ్మణుండ నెటుఁగాననుచున్॥

తే॥ వానికింగూడ రౌద్రాభిధానమైన
యాగమొక్కటివిధియించె నాగమంబు
ఒక్క యాధానికేవచ్చి యుర్విసురత
రౌద్రయాగికి నేరీతి రాకయుండు॥ 125

* ఉ॥ లేకయ యేప్రమాణమును లేఖిని చేతఁ జెలంగ నెంచు నీ
పోకడ సొంతయూహమెయిఁ బోయినవాఁడఁట, వ్యాసలేఖనల్
కైకొనునప్డు వ్రాయఁదగు గ్రంథమునంతయు జెడ్డిమోటులో
వాకొననౌనొకో జనులవాడుక చొప్పున నేగకుండఁదాన్॥ 126

---

ఇప్పుడు సంఘములో హీనమైనస్థానమును బొందియున్న మాటమాత్రము నిరాకరించుటకు వీలులేదు-ప్రతివాదులప్లీడరు వాదించినవిధముగా బౌద్ధులకాలములో శిల్పాద్యన్యవిద్యలయందే గణ్యతయుండుటవలన శిల్పములయందే శ్రద్ధవహించి పారమార్థిక వృత్తుల నభ్యసింపకపోవుటచే బ్రాహ్మణులయొక్క కోపమునకుఁ బాత్రులైయుండవచ్చును-అట్లు వారికోపమునకుఁ బాత్రులైనందువలననో లేక యప్పటినుండియే మేము బ్రాహ్మణులమని చెప్ప మొదలుపెట్టినందువలననో యెందు కెప్పటికిని నధోగతినే యుండవలసివచ్చినదో, చెప్పుటకు వీలుకాదు-ఆయన చెప్పెడిసంగతులు యుక్తములైనవే కావచ్చును. బ్రాహ్మణకులమునకుఁ జెందియున్న వైదికులును నియోగులును బోట్లాడుకొని చిరకాల మొకరియందొకరసూయకలిగియుండుటయు నందొకరెక్కువబలమునువహించి రెండవవారి నణఁగఁద్రొక్కవలెనని నిరాదరణచేసిన కొంతకాలమున కణఁగఁద్రొక్కివేయఁబడిన సంఘమువారియొక్క ఘనత మఱుగుచేయఁబడినది కావచ్చును-ఈవిధమైనసంగతులు హైందవప్రభువులు రాజ్యముచేయుచు బ్రాహ్మణుల కున్నతస్థానములిచ్చినకాలములో జరుగుటకు వీలుగానుండెను.

* ఒక యూహవలనఁ జెప్పునదియేకాని చరిత్రాది ప్రమాణసిద్ధమైనది కాదు గనుక నిది యుపయోగించుటకు వీలులేదు-జనాభిప్రాయనుబట్టి వాదిని బ్రాహ్మణునిగానెంచవలెను-ప్రతివాదుల నటుల నెంచుటకు వీలులేదు.

సీ॥ * ఈయనిమాట వాస్తవమో యేనొక దమ్మిడిగూడ నిందుఁ జం
దా, యది యెప్పుడేర్పడెనో తాతలనాఁడు, ద్విజాతు లొక్కరే
నీయరు, కాన నేను నదియేవిధి నీయకయుంటి, నంతెకా
నీ యిడకున్నమాత్రమున నేను దదర్చకు నేఁగఁజెల్లదే॥ 127

ఆ॥ సంఘమెల్లఁజేరి చందాలు వేయున
ష్టగ్రవర్ణమనెడి యాదరమున
వదలియుండఁబోలు వాస్తవమరయుచోఁ
బ్రథమకాలమందు బ్రాహ్మణులను॥ 128

ఆ॥ § పాతపాటియమ్మపదము తెలుంగొటఁ
బొత్తములను లేకపోవుఁగాక

---

(22) ఈదావావిషయములో నీతీర్పు చాలదు. ప్రతివాదులు బ్రాహ్మణులుగా నెంచఁబడకపోయినప్పటికి దావాగుళ్ళలోఁ బ్రతిష్ఠచేయఁదగుదురా తగరా యనునంశము విచారింపవలసియుండును. సాక్షులీవిషయమై వాడుకలో నేలాగున్నట్లుచెప్పినారో విమర్శించెద. వాదితరపు 2 వ సాక్షి (శిష్టాసీతారామశాస్త్రి) బ్రాహ్మణేతరులుకూడఁ గొన్నిచోట్లఁ బ్రాణప్రతిష్ఠచేయుదురనియు నట్టిగుళ్ళలోఁ బ్రాణప్రతిష్ఠచేయువారును నంతకంటెఁదక్కువకులమువారును బూజఁజేయుదురనియుఁ జెప్పినాఁడు. శాస్త్రములలో శిల్పులనిచెప్పఁబడెడి విశ్వబ్రాహ్మణులు బ్రహ్మక్షత్రియవైశ్యశూద్రజాతులు సాలిగింటికన్న హెచ్చో సమానమో చెప్పలేకపోయెను. ఆయనచెప్పినప్రకారము చాలకాలముక్రిందటనే గ్రామదేవతలపూజలు బ్రాహ్మణులు మానుకొనిరి. హీనజాతులవాండ్రు పశువులను బలులిచ్చుటవలనను నాబలులు తమ రీయఁగూడదుగనుకను బ్రాహ్మణులు పూజచేయుట మానుకొనిరి. వాదికూడ నీదావాగుళ్లు ప్రథమమం దెవ్వరుకట్టినారో విగ్రహముల నెవరుప్రతిష్ఠచేసినారో తనకుఁ దెలియదని చెప్పెను.

* ఈప్రతిష్ఠకుఁగూడ బ్రాహ్మణు లెవరును జందాయియ్యలేదు. వాదికూడ నొకదమ్మిడైనను నీయలేదు. నైవేద్యములు మొదలైనవితీసికొనునది కుమ్మరులు. వారు శూద్రులలోఁ దక్కువజాతివారు. బ్రాహ్మణులు నైవేద్యములలోఁగాని యితరలాభములలోఁగాని భాగమనుభవింపరు.

§ పాతపాటమ్మ నూతనముగా స్థాపనచేయఁబడినది. ఆదేవతల పేళ్లు మతగ్రంథములలో నెక్కడను గనఁబడవు.

• అంతమాత్రముననె యామె దేవతగాక
దయ్యమనఁగఁబడుచుఁ ద్యాజ్యయగునె॥ 129

ఆ॥ గ్రామదైవతంబె కాని యాపాతపా
టమ యపూజ్యమైన యన్యగాదు
గ్రామము ల్ధరిత్రిఁ గలవు పెక్కులుగాన
నూరికొక్కనామ ముంచఁబడియె॥ 130

ఆ॥* ప్రకృతియొక్కకలలె పరికింప గ్రామదే
వతలు, వాని మానివరులుగూడఁ
గొలిచియుండి, రట్టిగొప్పదేవతలనే
దయ్యములుగననుట తప్పు తప్పు॥ 131

ఆ॥ దయ్యమన్న జను లతజ్ఞులై చులకన
గానుజూతు రంతెకాని తలఁప
దైవశబ్దభవమె దయ్యంపుశబ్దంబు
దాన దయ్యమన్న దైవతంబె॥ 132

ఆ॥ అట్టిదైవతంబు లార్యులయవిగాక
నార్యజనుల వెట్టులగును దలఁప
వానిఁగొలిచియున్న వరమును లార్యులే
కారొ భూమిసురులెకారొ తారు. 133

---

• అవి కలరా స్ఫోటకము మొదలైన తెవుళ్ళీ దేవతలమహిమవల్లఁ గలుగుచున్నవనియు వీనిని దృప్తిచెందించిన నా తెవుళ్లు పోవుననియుఁ దలంచుచు నేమియుఁ దెలియక మూర్ఖులైన గ్రామ్యులయొక్క దయ్యములై యున్నవి. బహువిధముల నీ దేవతలార్యులవి కాక ప్రథమమందుండిన యనార్యజనులవయి యుండవచ్చును. వాదితర ఫు 6 వ సాక్షి గుడిలోఁబూజ గొల్లవాఁడు చేయునని చెప్పెను.

---

దేవీభాగవతము-నవమస్కంధము-ప్రథమాధ్యాయము.

* యాయాశ్చ గ్రామదేవ్యస్స్యు స్తాస్సర్వాః ప్రకృతేఃకలాః......పుష్పధూపాదిభిర్భక్త్యా పూజితా మునిభిస్సదా।కలా యాయా స్సముద్భూతాః పూజితా స్తాశ్చ భారతే॥ ౧౯౭॥ పూజితా గ్రామదేవ్యశ్చ గ్రామేచ నగరే మునే!

ఆ॥ గ్రామదైవతములఁ గామించి మునిజను
లొలిచినటుపురాణములనుగలదు
తన్మసుపర్వుఁడైనచారుదత్తాఖ్యుండు
గొలిచినటుచరిత్రకూడఁదెలుపు॥

చ॥ పశుబలులీయఁగాఁబడెడి పాపపుదేవతలంచునెంచి యే
దిశనొ త్యజింత్రుగాక మహీదేవులు వానిని, దానసేమి, యా
దిశఁగలఁ బల్లెలం బురుల ధీమదనీకముసైత మాత్మరు
క్పరిశమనగోరి యప్డపుడు భక్తిని గొల్చుచునుంట సత్యమౌ॥ 135

శా॥ ఈమధ్యంగద స్ఫోటకామయముచే నెంతే ప్రజానష్టిగా
భీమన్నాగరికాళికూడఁ గదుభక్తిం దాము పోలేరమ్మ
క్షేమాభ్యర్థనపూర్వకంబుగను గొల్చెం జాల గుంటూరిలో
శ్రీమించంగను భక్ష్యభోజ్యములనుం జేయించి యర్పింపుచున్॥136

క॥ అంతటిగుంటూర్పురిని।యంతటినాగరికజనులెయర్చింపంగన్
జింతిలుదుగ్రామదేవత।చెంతకుద్విజులేగిపూజచేయరనుటకున్॥

ఆ॥ చదివిఇంగిలీషుస్వాతంత్ర్యమూనంగ।జూచువారికెదియుఁదోఁచితీరు
భూమిసురులతోడఁబోలుటకై ప్రజ।వాంఛసేతయుతఁడువారియడొక్కొ॥

చ॥ కొలుతురొ లేదొ వేశోకటఁ గుంభిని దేవులు గ్రామదేవతన్
నిలుపుఁడు, జానపాడునను నేమముతోడుత నాదినుండియున్
గొలుచుచునున్నవార్కదకనుంగొన, నేమిటికింక నీగతిన్
గిలుకుట పూజచేయరని కేవలమిథ్య యథార్థమట్లులన్॥ 139

క॥ *కరణముసాక్ష్యంబాయిక।ధరణీసురవరులుగ్రామదైవతపూజ
ల్జరుపమికినగుప్రమాణము।పరిశీలకుఁడైనతీరుపరికరయంగన్

* ప్రతివాదులతరపు 3 వ సాక్షి యాయూరికరణమును బ్రాహ్మణుడును నయియున్నాఁడు- ఆయన 1 వ ప్రతివాదిచేఁ బ్రతిష్ఠజరుపఁబడకపూర్వ మాగుళ్లలో 2 విగ్రహాకారములేని రాళ్లున్నవనియుఁగొన్నిరోజులక్రింద గ్రామపురైతులువానిని విగ్రహములఁగాఁ జేయించినారనియుఁ జందాలు బ్రాహ్మణేతరులయొద్దనే వసూలుచే యంబడినవనియు వైదికులుగాని నియోగులుగాని గ్రామదేవతలను బూజింపరనియు వారింటియొద్దనే గోడలకుఁ బసపును గుంకుమయుఁ బెట్టి పూజింతురనియు వాడి నినితరబ్రాహ్మణులను విశ్వబ్రాహ్మణులు ప్రతిష్ఠచేయవచ్చునాయని యడిగినాననియు దానికి వారొప్పుకొన్నారనియు 1 వ ప్రతివాది ప్రతిష్ఠజరిగించినపుడు వాడిరియు న్నాఁడనియుఁ జెప్పను-

శా॥ మేజస్ట్రేటు సమక్షమందునను నిమ్మేదిన్యమర్త్యాళితాఁ
బూజల్ చేయును గ్రామదేవి కనుచుం బూర్వంబు వాఁక్రుచ్చి యీ
రో జీరీతివచించినందులకునై రుష్టుండు కాకుండెకా
కోజం గైకొనె సత్ప్రమాణముగ నీయుద్యోగి తద్వాక్యముల్ 141

క॥ తప్పక వ్రాసికుల్యాషను
తప్పడుసాక్ష్యంబుక్రిందఁ దాజరుపఁదగన్
గొప్పప్రమాణముగాఁగొనె
నప్పారులు గ్రామదేవి నర్చింపమికిన్॥ 142

ఆ॥ ఎదివచించెఁదొల్లి నితఁడు మేజస్ట్రేటు
చెంత నద్ది నేను జెప్పలేద
టంచు నిటవచించె నంతకంటెను దప్పు
సాక్ష్య మేమియుండు జనులు! చెపుఁడు॥ 143

క॥ చదివి వినిపించి నాఁడఁట
కద మేజస్ట్రేటుగారు కరణంబునకున్
అది యతనిచెవులఁబడమికి
నెదియో కలయట్టిహేతు వెఱుఁగఁగవలదే॥ 144

మ॥ కనులం గారముచల్లినట్లు తనదౌ కైఫీతె తా నీయలే
దను ధన్యాత్ముని తప్పుసాక్ష్యమెయిటుల్ యాథార్థ్యమంచన్న యీ
మునిసిఫ్ తీరు పదెంత న్యాయమగునుర్ ముంజేతగాజుల్ కంకణం
బున కద్దంపుఁబనేమియంచు మహిం సద్బుద్ధుల్ ప్రశంసింపరే॥ 155

తే॥ ఇట్టికరణముసాక్ష్యమే యెడఁదనమ్మి
ద్విజులుకొల్వరు తద్గ్రామదేవిననుచు
నిక్కమయినట్టి వ్యాజ్యెంబు నెట్టివేయఁ
గలుగు నాదుమనఃక్షోభ దెలుపవశమె॥ 146

---

మొదటిప్రతివాది ప్రతిష్ఠచేయుట కేమైన ననిష్టమున్న యెడల వాది యచటికి రాకపోవలసినవాఁడే.

◆ఆ॥ కరముఁ బెద్దచేసెఁ గరణానకన్న మా
యూరి పెద్దకాఁపుగారి నితఁడు
సిస్తు నాల్గునూర్లు చెల్లింతునని చెప్ప
నుబ్బి మోతుబరిగ నొగి గ్రహించె॥ 147

ఆ॥ సిస్తు నాల్గునూర్లు చెల్లింతుననుమాట
మొదటి యనృత మరయ మోతుబరిది
అతనితండ్రు లెపుడొ యవిభక్తులుగనున్న
నాఁడు కట్టిరంట నాల్గునూర్లు॥ 148

ఉ॥ అల్ల విలేజిమున్సి ఫడినట్టి రసీదులఁగాంచియో యెటో
తెల్లముఁ జేసికోఁదగిన దీనిని ద్వేషముఁ బూని చెప్ప నీ
కిల్లరినోటిమాటలకె గట్టియొనర్చె తదుక్తమైన యా
యెల్ల ప్రవృత్తి సత్యమని యెంచుట చాలఁ బ్రమాద మారయన్॥

ఉ॥ సిస్తు మతింతయిత్తునని చెప్పినయట్టి మనుష్యునెల్లనున్
విస్తృతసత్యవాక్యునిగ వేగ్రహియించిన సత్యదూరకా
ప్రస్తుతకాలమం దెవరు స్వాల్పడకుండెద రిట్టిచేతకున్
దుస్తరమింక వ్యాజ్యములతోఁ బ్రజ న్యాయముపొంది రాకకున్

---

◆ 4వ సాక్షి (పెద్దకాఁపు) తాను చిన్నవాఁడైయుండఁగాఁ బ్రతివాదికులము వాఁడగు నంగిగామ చెన్నమల్లయ్య ప్రతిష్ఠజరిపినాఁడనియుఁ బూజకు బ్రాహ్మణులెవ్వరు నేగరనియు గొల్లవాఁడును గుమ్మరివాఁడును బూజారులనియు నీగుళ్లు శూద్రుల వేకనుక విశ్వబ్రాహ్మణులకుఁగూడ నీపూజతో సంబంధములేదనియుఁ బ్రతిష్ఠచేయు సమయమందు వివాదమే లేదనియు వాదికూడ నున్నాఁడనియు నీవివాదము దేవతకర్పించిన వడ్లు గుడ్డలు పంచుకొనునప్పుడు ప్రారంభమైనదనియు వాది గ్రామపురోహితుఁడుగనుక సగపాలుకావలెననెననియు నాయన భాగార్హుఁడు కానందునఁ బ్రతిష్ఠచేసిన మొదటిప్రతివాదికే యంతయుఁ జెందవలెనని గ్రామస్థులు చెప్పిరనియు జనులందటికిఁ జాలఁ గష్టముగ నుండకుండుటకుఁ గొఱ్ఱె కట్నము తీసికొనవలసినదని 1వ ప్రతివాదికి వాది సిఫారసుచేసెననియుఁ జెప్పెను. ఈనాలుగవసాక్షి సర్కారునకు నాలుగు వందలరూపాయలు సిస్తు చెల్లించును.

ఆ॥ కూడుగుడ్డలేని కుమతి నేఁజెల్లింతు
వేయిసిస్తుటన్న న్యాయకర్త
యాతఁడిచ్చుసాక్ష్య మా నిజంబన్నచో
నంతమొందకున్నె న్యాయమవని॥ 151

ఉ॥ తాదృగతథ్యవాక్యనని తజ్జను మోతుబరీగనెంచి యిం
కేదివచించినన్ నిజమె యీరితమైనదటంచు నమ్మెచున్
వాది పురోహితుండగుట నచ్చి ప్రతిష్ఠకులబ్ధమైన వ
స్త్రాదులఁ గోరి యీయమిని వ్యాఖ్యము దెచ్చెనటంచు వ్రాయునే॥

క॥ నను నీరీతిఁ బురోహితుఁ
గను భావనచేసి తనదుకలమున కెంతో
పనికల్పన చేసికొనియెఁ
దనయశ మాసూర్యచంద్రతారము గాఁగన్ 153

క॥ ఘటమున్ భిన్నముఁ జేసెనొ
పటముం జించియొ మఱొక్కపని యొనరిచియో
పటుమతి ఖ్యాతుఁడుకావలె
నెటులయినంగాని పురుషుఁ డిమ్మహిలోనన్ 154

క॥ కవినగుటెకాక పత్రిక
నవసంవత్సరములాది నడపెడినాపై
నవివీతుల మాటలువిని
యెవ్వ్రాయుటఁగాదె యాతఁ డిటు నుతికెక్కన్॥ 156

ఆ॥ దాయలైనయట్టి మాయూరియవరజు
లనుటకున్ విచారమంద నేను
న్యాయకర్తయైన యీయన వ్రాఁతకే
చింత యింతగాను జేయవలసె॥ 157

---

5సాక్షి పూజారి-కుమ్మరి-బ్రాహ్మణు లపుడపుడు బియ్యమునిత్తురనియు నవి మేము వండి గుడిలో నైవేద్యము పెట్టుదుమనియుఁ గొలుపులప్పు డింటింటికిం బోయి బియ్యముగాని యన్నముగాని యడుగుదుమనియు జనులందఱు దేవతకుఁ దమమీఁదఁ గోపమురాకుండుటకై యిత్తురనియుఁ జెప్పెను.

సీ॥ విద్వత్కవియటన్న విశ్వాసమున నాథ్యు
లర్పించు భూరివర్షాశనములు
మతిమంతు లష్టప్ర కృతులు వధానముల్
జరిపించి యొనరించు సత్కృతులును
ఆత్మీయపత్రిక యందునఁ బ్రచురింపఁ
గాఁబడుచుండు సద్గ్రంథములును
స్వసమార్జితంబౌచుఁ బరిమితంబై యున్న
మాన్యంబులం బండు ధాన్యములును
నస్మదీయదేహయాత్ర కాధారముల్
గాఁగ నీచు లెవరో గ్రామయాజ
కుండనగుచు నెంతో కోరితిఁ బాలన్న
ధర్మ నేత నమ్మఁదగునె యకట॥ 158

క॥ న్యాయస్థానమునందున
న్యాయాధిపుఁడగుచునుండి న్యాయవిమర్శల్
చేయఁగఁబూనినయప్పుడు
న్యాయం బెదో యెఱుఁగకున్న నవ్వారె ప్రాజ్ఞుల్

సీ॥ ఎవఁడు మద్భ్రాతకు నెంతోకాలమునుండి
పరమశత్రుండయి పరఁగుచుండె
ఎవడీప్రతిష్ఠకు నెక్కువసాయమై
ముద్దయిగాఁ జేరె మొట్టమొదట

---

7వసాక్షి యితరగ్రామస్థుఁడు. పశుబలులీయఁబడక బ్రాహ్మణులుకూడఁ బూజించు లలితాంబ కొక విశ్వబ్రాహ్మణుఁడు ప్రతిష్ఠ చేసినాఁడనియుఁ దద్గ్రామములోనే పశుబలులీయఁబడుచు బ్రాహ్మణులుపూజచేయనటువంటి గంగమ్మయను మఱియొక దేవత గలదనియు బ్రాహ్మణులుకూడ హారతియిచ్చునటువంటి రాములవారిస్తంభమునకు విశ్వబ్రాహ్మణుఁ డర్చకుఁడుగా నున్నాఁడనియుఁ జెప్పెడిని-ఈసాక్షికి జానపాటిలోని పార్టీ వైషమ్య మేమియులేదు.

ఎవ్వఁడు కమసాలియిండ్ల సాపడ నేమి
తప్పంచుఁ గోర్టులోఁ దగవులాడె
ఎవ్వఁ డెన్నడుకూడ నే వైదికులయిండ్లఁ
దిన లేదటనె ద్విజద్వేషమూని
అట్టివానిసాక్ష్య మాపెట్టితలగుడ్డ
యాప్రగల్భవాక్కు లాకళంక
గాంచి నమ్మి నన్ను గ్రామయాజకుఁగాఁగ
వ్రాయు టెంతగర్హ్య వర్త్మ మకట॥ 160

8వసాక్షి యింకొక గ్రామమువాఁడు- లలితాంబప్రతిష్ఠచేసిన విశ్వబ్రాహ్మణుఁ చేతనే మఱియొక ప్రతిష్ఠ జరుపఁబడినట్లు చెప్పుచున్నాఁడు. ఈయన మోతుబరి సర్కారుకు రు 300 లు సిస్తుకట్టును. 9వసాక్షి మఱియొక గ్రామమువాఁడు. పదిసం॥ లక్రిందట బెజ్జంకి రామయ్యాచార్యులనువిశ్వబ్రాహ్మణుడు బొడ్రాయి యనుదేవతకుఁ బ్రతిష్ఠచేసెననియు 9,10 సంవత్సరములు పూజజరిగినతర్వాతఁ దత్ప్రతిష్ఠమహిమ యంతరించినందునఁ దిరిగి యాదేవతకు మాసాబత్తుల సుబ్బయాచారి ప్రతిష్ఠ చేసెననియుఁ జెప్పెడిని. 11వ సాక్షి లలితాంబను ప్రతిష్ఠచేసినవాఁడే. ఆయన నావృత్తి విగ్రహముల ప్రతిష్ఠ చేయుటయేయనియు నాతండ్రికూడ నదియవృత్తి నవలంబించెననియు నన్ని దేవులను దేవతలను బ్రహ్మవిష్ణు మహేశ్వరులసహితము నేను బ్రతిష్ఠించుచున్నాననియు నిప్పటికి 50,60 ప్రతిష్ఠలు చేసినాననియుఁ జెప్పెడిని. మొట్టమొదట రాయియేర్పఱచుకొనుటతో నారంభమై యారాతికి దేవతాశక్తి యిచ్చుటతో నంత్యమవుదని ప్రతిష్ఠచేయవలసిన విధమును జెప్పుచున్నాఁడు. కడుపులోఁ బిండమువృద్ధియైనరీతిగా విగ్రహము యొక్క యవయవములు చేయవలెననియు విగ్రహముచేయుటలోఁగూడఁ బిండమునకవయవములేర్పడుకాల మెంతయో యంతకాలము(అనఁగా 9 నెలలు) పట్టుననియు 7వ నెలలో రాతికిఁ బ్రాణముపోయునటువంటి జీవకళాన్యాసమనుకర్మముజరుపఁబడుననియు గార్గేయాగమము 2వ పుటలోఁ జక్కగాఁ జెప్పఁబడిన 12 సంస్కారములు తద్విగ్రహమును గుడిలోస్థాపనచేయుటకుఁబూర్వము జరుపఁబడుననియు నిదిశిల్పులుమాత్రమే చేయవలెననియు నే నాజాతిలోనివాఁడననియుఁ దన్ను నిజముగా బ్రాహ్మణుఁడనియే వాడవలెననియు జనులందఱును దెలియక విశ్వబ్రాహ్మణుఁడని యందురనియుఁ జెప్పను.

* తే॥ ఇంకఁ దక్కెళ్ళపాటి వీరేశలింగ
మఱువదిప్రతిష్ఠలం దాను జరిపియుంట
సత్యమేయంట, మేము తత్సాక్షిఁ గొనిసు
లోనఁ బడఁగొట్టలేదంట దేనకేని॥ 161

కం॥ మేమెఱుఁగనట్టి తత్త
ద్గ్రామములఁ బ్రతిష్ఠ లెప్పుడో కావించితినం
చేమోనుడువఁగ వానిని
నేమని క్రాస్ చేయవలెనో యెఱుకపడదుగా॥ 162

కం॥ ఎవరచటధర్మకర్తలు
ఎవరెవరపు డుండిరనుచు నీమొదలగు నె
య్యావొకద యడుగఁగవలయుట
యెవ్వ వానికి బదులుచెప్పఁడేమి యడిగినన్॥ 163

కం॥ ఏయల్లయలో యచ్చట। నాయెడవసియించిగనుచునతఁడువచించున్
వ్రాయునుదానుందీర్పున। సీయవిసత్యములెయనుచు నేమగుదానన్॥

తే॥ అంతియేకాని యాయల్లయలనుదాను
కోర్టుతగఫున రప్పింపఁ గోరునొక్కొ
అటుల రప్పించియరసినయపుడె సత్య
మెల్ల నావిష్కృతంబగు నెంచిచూడ॥ 165

తే॥ అట్లు సాధారణముగ న్యాయానికారు
లొనరుపరటంచు మేమును నూరకుంటి
మతఁడు చెప్పినవన్నియు నన్నృతములని
ఋజువుచేసెదవిప్పుడు ప్రజలు! కినుఁడు॥ 166

మత్తకోకిల॥ గొట్టెపాటి శివప్రతిష్ఠను గోరి తానె యొనర్చియు

---

* అతనియొక్క యాత్మస్తుతి సంతృప్తులను గుఱించి యతనిని క్షమింపవచ్చునో లేదో యది యటుంచిన నతఁడు చెప్పినగ్రామములలో నతఁడుచేసినప్రతిష్ఠలు నిజమైయుండును-అన్ని దేవతల పేళ్లును జెప్పుచున్నాఁడు. కాని సులో నతఁడుచేసినప్రతిష్ఠలవిషయమై నాకేమియు సందేహము కనఁబడలేదు.

న్నట్టులాతఁడు చెప్పియుండఁడె, యా ప్రతిష్టకుఁ బంపఁబ
డట్టియా * శుభలేఖ యెల్లను నాదరించి పఠింప ను
న్నట్టి సత్యము తెల్లమయ్యెడి నార్యులార! పఠింపుఁడీ॥ 167

కం॥ అది యనృతంబని తెలును
గద యీ యాహ్వానపత్రికం గాంచినపై.
కొదవవియు నిట్టి వేయని
మది నెంచుకుఁదలఁపఁదగదు మన మింక నేని॥ 168

ఉ॥ గానిగఁ జెంచి యుద్యమము తప్పక సల్ప లభింపకుండ, గాఁ
గాని సమీపవర్తులగు గ్రామము లయ్యవి గాక యున్కి నె

---

12వ సాక్షి దావా గ్రామపు రైతు-40 సంవత్సరములకింది దటఁ దనయాన్న చెన్నమల్లను విశ్వబ్రాహ్మణునిచేఁ బ్రతిష్ఠ జరిపించినట్టును వాదికిని బ్రతివాదికిని వివాదము ప్రతివాది పతిష్ఠచేయునప్పుడు వచ్చిన పైవస్తువులు పంచుకొనుటలో వచ్చినట్టును జెప్పుచున్న వాఁడు-గ్రామములోనుండు పార్టీదారులలో నితఁడొకఁడు

---

* శ్రీవిశ్వేశ్వర ప్రతిష్ఠాహ్వానపత్రిక. *

శ్రీమదఖిలమహీమండల మండనాయమానులును సకలవిద్వద్గణ గణనీయ గుణధురీణులును నగు శ్రీ——గారి సముఖమునకు-శ్రీవిశ్వేశ్వరపదపరాగాను రేణు పూజాధురంధరుండును శ్రీహరిహరగురుప్రియశిష్యసేవకుండును శ్రీమత్ త్రిపత్తిపాటిపురమండలీతిలకంబగు గొట్టిపాడుయను పురవరంబున నివసించియున్న పచ్చల వెంకటదాసయ్య విన్నవించుకొను విధేయవిజ్ఞాపనము-శ్రీమత్ త్రిపనపాటి మృత్యుంజయ అయ్యవార్లగారిచే నేను శ్రీమత్ స్వామికాగమోక్త ప్రకారముగాను శ్రీవిశ్వేశ్వర వీరభద్రాది ప్రతిష్ఠలను జరిగించుటకు శ్రీ దుర్ముఖినామసంవత్సర ఫాల్గుణశు ౭ బుధవారము రోజున పెద్దలవల్ల సుముహూర్తము నిశ్చయింపబడి జరగబోవుచున్నది. తమరు సహా కుటుంబ బంధుమిత్ర సపరివారముతో తమ స్వకార్యములయొక్క తీరికలను విచారింపక యిచ్చటికి వచ్చి శ్రీ శివప్రతిష్ఠలను సాధుసజ్జనుల మనఃప్రీతిగా దర్శించి నన్ను బ్రహ్మానందావాప్తిని పొందింపవలయునని మిక్కిలి ప్రార్థించుచున్నాడను-సుజనవిధేయుఁడు, పచ్చల వెంకటదాసయ్య.

గుంటూరు శ్రీధర్మసంరక్షిణీ ముద్రాక్షరశాలలో ముద్రింపబడియె

ష్టే నట కేగి యారయుట కే సమకూరదు, సత్యనిష్ఠమా
మానవకోటి కీ యొకటిమాత్రము చాలదొకో తలంపఁగన్ 169

క॥ పదుమూడవసాక్షికినిన్ బదిరెండవసాక్షికట్లుపార్టీక్రోధం
• బుదయింపకుంటవాఁ)సెనుసదయుండై న్యాయకర్తజడ్జెంటునఁదాన్

కం॥ఆవిధిఁబార్టీక్రోధముఁ।బోవిడువక చెప్పినట్టిపూరుషుసాక్ష్యం
బేవిధిగనమ్మనౌనో।ధీవిలసితులార! చెప్పుఁడు తేటపడంగన్

*ఉ॥ విగ్రహపూజ సేయుమని వేదము వాకొనదంట, యీతఁడ
వ్యగ్రిత వేదమంతయును నధ్యయనంబొనరించినట్టి ద
ర్పాగ్రిమనీషుఁడౌట నిటు వ్యాఖ్యయొనర్చెడి, నింతపాటి ధీ
రాగ్రణి యున్నవాఁడె భువి నగ్రజులందు నొకండు నేనియున్॥ 172

మ॥ ప్రతిమారాధన వేదమొప్పదను నప్రామాణ్యమాత్రాంత యీ
మతిమంతుండు లిఖించె† వేదములె ప్రామాణంబు లద్దాని, కు
న్నతులౌ పండితు లెందఱో సలిపియున్నారేతదర్థంబు మేల్
కృతులంగావున వానిఁజూడుముజనంబీయంతయున్ జ్ఞాతమా॥ 173

---

• 13వ సాక్షి యతనితో నేకీభవించినాఁడు. కాని తగాదావిషయములలో నంత పార్టీయుద్రేకమును కనఁబఱుపలేదు. 14వ సాక్షి యీ (గుంటూరు) తాలూకాలోని గారపాడను గ్రామములో గంగాధరస్వామిగుడిలో నభిషేకములు విశ్వబ్రాహ్మణులు చేయుదురని చెప్పెను. 15వ సాక్షి తాడిపల్లిగ్రామములో విశ్వబ్రాహ్మణులచే బ్రహ్మేశ్వరలింగప్రతిష్ఠ చేయఁబడినట్టు చెప్పెడిని. పై యుదాహరణములన్నియు విగ్రహములను బ్రతిష్ఠచేయునపుడు విశ్వబ్రాహ్మణులకుఁగూడ సంబంధమున్నట్టు ఋజువు చేయును.

*23 ప్రస్తుతాంశముమీఁద గ్రంథములను విచారించిచూచెద. ప్రతిష్ఠను గుఱించి చెప్పునవి యాగమములేయనుట నిర్వివాదము. వేదములు విగ్రహారాధన నొప్పుకొనవు గనుక వానిలో నాగమములను గుఱించిన ప్రశంసలేదు.

---

† శ్రు॥ తైత్తిరీయకాణ్వసంహితా చతుర్థకాండము
సురూపాం ప్రతిమాం విష్ణోః ప్రసన్నవదనేక్షణాం
తామర్చయేత్తాం ప్రణమేత్తాం యజేత్తాం విచింతయేత్॥

*క॥ వేదమునవిగ్రహార్చన। లేదనునందాక నె యవలీలనెఱిఁగియుం
కేదియుఁదెలిసికొనుటకున। నాదరముంజూపెనంటయమ్మునిభుదాన్॥

తే॥ అదియెకారణమున నిప్పుడాగమాదు
లందలివిశేషములఁ దనకుం దెలుపఁగ
రాజమన్నారుకవిగారి రాజసభకుఁ
బ్రీతిఁ బిలిపించెనంట పేరేలనుండి॥ 176

క॥ ఈయనపిలిపించునుగా। కాయనయరుదెంచుఁగాక యరుదెంచినపైఁ
జేయఁబడినట్టి కార్యం। బేయదియుంగానరాదొకించుక యేనిన్॥

*కాని యాగమములు నీప్రస్తువిషయముచెప్పు గ్రంథములుఁ జదువక నే నింతవఱకు నిరాదరముగాఁజూచినయంశము నిప్పుడు తెలిసికొనవలెనని బుద్ధి గలిగినందున బ్రాహ్మణుఁడును విశ్వబ్రాహ్మణుఁడునుగాక గొప్పపండితుఁడైన కారెంపూడి రాజమన్నారుగారిని గోర్టులో మధ్యవర్తిగా నేర్పఱచి యాగ్రంథములలోని విశేషముల నాకుఁ దెయఁజెప్పుటకై పేరేలనుండి పిలిపించితిని.

యజుర్వేదీయ మైత్రాయణసంహితా తృతీయకాండ ప్రథమప్రశ్నము.

శ్రు॥ పాషాణ లోహ మణి మృణ్మయ విగ్రహేషు పూజా పునర్భోగకరీముముక్షోః.

ఋక్సంహితా సప్తమాష్టకము

శ్రు॥ అదో యద్దారుః ప్లవతే సింధో రపారే, అపారుషం త దారభస్వ

రామతాపిన్యుపనిషత్తులోని శివునిగూర్చిన రామవచనము

శ్రు। అవిముక్తే తవక్షేత్రే సర్వేషాం ముక్తిసిద్ధయే। అహం సన్నిహిత స్తత్ర పాషాణప్రతిమాదిషు.........చిన్మయస్యాద్వితీయస్య నిష్కళస్యాశరీరిణః ఉపాసకానాం కార్యార్థం బ్రహ్మణో రూపకల్పనా.

ఋగ్వేదము

శ్రు॥ తవశ్రియే మరుతో మర్జయంత రుద్ర యత్తే జనిమ చారు చిత్రం.

వ్యా. హేరుద్ర! తే, మరుతః, బ్రహ్మవిష్ణ్వాదిదేవాః, తవ, చారు, మనోహరం, చిత్రం అద్భుతం, యత్, జనిమ, లింగం, అస్తి, తత్, శ్రియే, ఐశ్వర్యాయ, మర్జయంతః, పూజయంతః, ఆసన్నితి శేషః.

మరా—ఇత్యాదులు పెక్కులున్నవి. గ్రంథవిస్తరభీతిచే వదలితిని.

ఆ॥ స్వప్రమాణమైన సాక్ష్య మీయఁగలేదు
కోర్టునకుమూని కొంచెమేని
కోర్టువారిఫలనఁ గొని యధికారంబు
మఱి రిపోర్టునేని జరుప లేదు॥ 178

*ఆ॥ అర్చలంగుఱించి యడుగ మున్సిఫుగారు
చెప్పె నెవిదెయొ రెండు చివర కతఁడు
నోటుచేసికొనుచు నుడివినయవ్వాని
తీరుపున లిఖించెఁ దీనుపరియు॥ 179

క॥ పంచప్రశ్నాగమమున।మించెడినఁటయతడు చెప్పమేల్విషయంబుల్
మంచిదొ చెడ్డదొయయ్యది। కాంచుదమన లేదుతత్ప్రకాశమునందుః

క॥ కోరుకొనెననియునది మ।న్నా రిరుపార్టీలు తద్ఘన గ్రంథముదే

---

*ఆయన పూజనీయములయిన యర్చారూపములు శాక్తములు దైవ్యములు పైశాచములు మానవములునని నాలుగువిధములనియు మనుష్యులకు మానవములతో సంబంధమనియు నవి యభిమానములు సామాన్యములు ప్రకృతములని తిరిగి మూడువిధములుగా విభజింపఁబడెననియు నైశ్వర్యముగలమనుష్యులచే స్థాపింపబడునవియభిమానవిగ్రహములనియు సామాన్యజనులచే స్థాపనచేయింపఁబడునవి సామాన్యవిగ్రహములనియు నపాయపుగినములలో స్థాపనచేయఁబడునవి ప్రకృతవిగ్రహములనియుఁ బ్రకృతములు జనులను రోగములద్వారమున బాధించుచు బలులను గోరునవియగుట నీచదేవతలనఁబడుననియు జెప్పఁబడెఁ. బంచప్రశ్నాగమమను గ్రంథమును గోరుకొనెను గాని యుభయవాదులునుఁ దానిని దేలేకపోయిరి-నిర్ణయసింధువులో బ్రహ్మను బ్రాహ్మణులుమాత్రమే స్థాపనచేయవలెననియు విష్ణువును నాల్గుజాతులవారును మాతృదేవతల నెవరైనను స్థాపనచేయవచ్చుననియుఁ జెప్పఁబడియున్నది.-గ్రామదేవతలను దేవతలనితలఁచెడిచో నిర్ణయసింధువులో నెవరయినను స్థాపింపవచ్చునని చెప్పఁబడిన మాతృదేవతలు కావలెను. లేనిచో నవి శాస్త్రములలోనివి కావు. శూద్రుఁ డర్చకుండుగా నున్నటువంటి విగ్రహముల బ్రాహ్మణుఁడు పూజచేయనే కూడదు. దావాగుళ్లలో గొల్లకుమ్మరు లర్చకులుగా నున్నారు. వాది బ్రాహ్మణుఁడుగనుక యీ దేవతలను బూజచేయుటకు వీలులేదు.

నేరక పోయిరనియునీ। తీరునలిఖియించినాఁడు తీర్పరికనుఁడీ॥

తే॥ గొప్పపండితుఁడనితన్నుఁ గోష్టవారు
మించు వేడుకతోఁ బిలిపించినపుడు
గ్రంథసామగ్రితోడనే కదలిరాక
యేలరావలె నూరకే యితఁడు మొదలు॥ 182

కం॥ వచ్చియవాకుచెవాకులు। చెచ్చెరనెవో చెప్పియెందో చెలగునటన్నన్
దెచ్చెడివారెవరయ్యది। యెచ్చటనేన్ గలదో లేదో యింతకునదియున్॥

*తే॥ శూద్రుఁ డర్చకుఁడుగనున్న చోట బ్రాహ్మ
ణుఁడు పూజింపఁగూడదం చుండుఁగాక

---

* శైవధర్మము 76వ పుటలో శూద్రుఁడర్చకుఁడుగాఁ గలిగినటువంటి శివుని గాని విష్ణునిగాని పూజచేసినబ్రాహ్మణునికి ముక్తిలేదని చెప్పఁబడియున్నది.

(24) బ్రాహ్మణులెప్పుడును భగవంతుని ప్రక్కనుండి భక్తులాభగవంతుని దయకుఁ బాత్రులగులాగు సిఫారసుచేయుటకుఁగల పవిత్రత యెట్టిదైనను గార్గేయాగమములో విగ్రహములు చేయుట మొదలుకొని గుళ్ళలో స్థాపనచేయునంతవఱకు కడుపులోఁ బిండమెన్నివిధములుగా మాఱునో యన్నిదశలీవిగ్రహముకూడ ననుభవింపవలసియుండునని చెప్పఁబడినందునఁ బ్రతిష్ఠప్పుడు ముఖ్యస్థానార్హుఁడు శిల్పాచార్యుఁడని చెప్పఁబడినట్లును నెపుడును విడనాడకుండ నుండవలసివచ్చి యతఁడులేకుండ గడపుకొనుటకు వీలులేనట్లును గనఁబడెడిని. ప్రతివాదుల సాక్ష్యములోఁ జెప్పఁబడిన ప్రతిష్ఠలుచేయఁబడినచోట్లు ప్రతిష్ఠాసంబంధములోఁ బ్రతివాదులకుఁగల యధికారమును స్థిరపఱచును. ఎల్లవిగ్రహములను స్థాపనచేయుటకు హక్కు కలిగినవారు శిల్పాచార్యులేనాయను విషయమును గుఱించి నాయొక్క నిశ్చయాభిప్రాయము నీయనక్కఱలేదు. ప్రతివాదులు తాముగూడ శిల్పాచార్యుల తెగలోనివారమని చెప్పుకొనుట కేమియు నభ్యంతరమున్నట్లు కనఁబడదు. ఈదావాలో బ్రాహ్మణులవిషయమై కావలసియున్నది. వాది బ్రాహ్మణుఁడనని వాదించుచున్నాఁడు. నిర్ణయసింధువులో శూద్రుఁడర్చకుఁడుగాఁ గలిగినటువంటి విగ్రహములను బ్రాహ్మణులు పూజించిన నరకమును బొందుదురని చెప్పఁబడియున్నది. వాది యటువంటి నరకమును గోరుకొనక పోవచ్చును. సాక్ష్యమునుబట్టి తెలియుచున్న సామాన్యముగ జరుగు క్షుద్రదేవతలఁ బూజచేయుట వానికి జంతువుల బలియిచ్చుట బ్రాహ్మణులయొక్క యనిష్టమును ఋజువు చేయుచున్నవి

అద్ది శివకేశవులవిషయంబైనాని
గ్రామదేవతవిషయమై కాదుకాదు॥ 184

ప్రస్తుతపుదేవతలు శివుఁడుగాని విష్ణువుగాని యయిన నాయుద్దేశమేలాగున్నప్పటికిఁ బోలేరమ్మ పాతపాటమ్మ మొదలగు గ్రామదేవతల ప్రతిష్ఠ వాదియు వాదికులమువారును మాత్రమే చేయవలెనని లేదని నేను జెప్పవచ్చును-కనుక మొదటిసారాంశము వాదికననుకూలముగాఁ దేలినది.

(25) 2 వసారాంశము-మొదటిసారాంశపువాదములో వాడుకనుబట్టియు గార్గేయాగమునుబట్టియుఁ బ్రతివాదికులమువారికిఁ బ్రతిష్ఠాసమయములో నెక్కువ ముఖ్యమైన భాగముండుటనుబట్టియుఁ బ్రకృతదేవతలుగాక యింకొక యెక్కువదేవుఁడయినప్పటికి మైలపడనేరఁడు. కనుక యీ దావా దేవతలవిషయమై చెప్పనవసరము లేదు-అవి మయిలపడనే లేదు-రెండవసారాంశముకూడ వాదికననుకూలముగానే తీర్మానించితిని.

(26) మూఁడవసారాంశము. వాది నష్ట మెట్లు పొందుచున్నాఁడో నాకుఁ దెలియదు. గ్రామదేవతలను బూజచేయుట కర్హతయున్నదని యనుకొనినప్పటికి సహస్రసంఖ్యాకజనులలో వాదియు నొకఁడు. దావా బ్రాహ్మణసంఘముపక్షమునఁ దీసికొనివచ్చినవాఁడు కాఁడు. సంఘముపక్షమునఁ దీసికొనివచ్చి తరువాఁత దానొక్కఁడే దావా నడపినాఁడు. ద్విజసంఘము తరఫున దావానడపుట కుత్తరువిచ్చినట్లు [illegible]ంచినప్పటికి లెక్కకెక్కువయిన ముఖ్యసంఘమును వదలిపెట్టినాఁడు. పూజచేయువారిలో నధికసంఖ్యాకులు శూద్రజాతిలోనుండిరి. వారిపక్షమునఁగూడ నేజంటుగానుండుట కేర్పఱచుకోలేదు. ఆప్రతిష్ఠకు వారు తృప్తిఁ జెందియుండిరి. ఇప్పటికయినను దమ్ము నెమ్మదిగానుంచినచో ననేకవందనము లొనరింతురు. ఎవరివల్లను నధికారముఁ బొందిన యేజంటుకాఁడుగనుక హైందవసంఘమునకుఁగా నాయన కేమియు నష్టముకట్టియిచ్చుటకు వీలులేదు-ఆయన యింకొక ప్రతిష్ఠ చేయఁబూనుకొనుట కేమియు విధిలేదు-తానాపూజలో సంబంధముగలిగించుకొనుటకు వీలులేదుగనుక తనకుఁగలిగిన పారమార్థికనష్టమునకుఁగాను బ్రతిఫలము కోరవలసియుండఁగాఁ దిరిగి ప్రతిష్ఠచేయుటకుఁ గావలసినద్రవ్యమిప్పించుమని కోరినాఁడు-పారమార్థికనష్టమునుగోరినను దానికి సమానముగాఁ జెప్పఁదగిన ప్రాపంచికవస్తువు లేమియు నుండనేరవుగనుక పారమార్థికనష్టము ద్రవ్యరూపముగా నిర్ధారణచేయుటకు వీలులేదు.

*చం॥ శిలలు పురాతనంబులయి చేడ్పడియుండఁగ నూత్నవిగ్రహాల్
నిలిపితిమంచు నాన్నరున నిక్కము వారలె తెల్పియుండఁగన్
దొలి ప్రతివాది కొక్కనికె గౌరవపుజోక్యముగాని తక్కునా
రలకుఁ బ్రతిష్ఠ లేదనుచు వ్రాసిన మున్సిభుగారి నెన్నన॥ 185

†క॥ మతవిద్వేషముఁ బెంచెడి
మతితో నే నుంటినన నెడి మాట యనృతమా
ఇతరులవ్రాఁత లనృతమని
మతిఁదోఁచినఁ బ్రతిలిఖించుమాట నిజమగునా॥ 186

---

కాబట్టి నష్టమును గుఱించిన దావాకూడ నిల్వఁదగినది కాదు. విశ్వబ్రాహ్మణులు సంబంధముపుచ్చుకొనుటవలన దేవతాశిలలపరిశుద్ధములైనవని కాని ముందపరిశుద్ధములగునని కాని ఋజువు కాలేదుగనుక యింజక్షన్ గూడ నిప్పించుటకు వీలులేదు. ఈసారాంశముకూడ వాదికి విరుద్ధముగాఁ దీర్మానించితిని

(27) ఈదావాయందిరొక విచిత్రమున్నది. 1వ ప్రతివాది యీప్రతిష్ఠ చేయుటకుఁ బిలువఁబడిన యన్యగ్రామవాసి. గ్రామస్థులు సొమ్మునిచ్చి యేర్పఱచుకొన్న యేజంటు. వాది ప్రత్యేక మాయనమీఁద వ్యాజ్యము దెచ్చుటకుఁ గారణములేదు. ఏమేనియున్నను నాయన చచ్చినందువలన సంక్షేపించుకొనవలసియుండెను గాని తరువాతఁ గూడ వాజ్యమును నడపఁగూడదు.

* 2 మొదలు 5 వఱకైన ప్రతివాదులకీప్రతిష్ఠతో నేమియు సంబంధము కలిగియున్నట్లు తోఁపదు. వారు ప్రతివాది సంఘమునకుఁ జేరియుండుటయే తప్ప నితరకారణ మేమియు లేదు. వారిలో నెవరైన నక్కడ నుండినారనుటకుఁగూడ సందేహమే. కొంతమంది యక్కడ లేమనికూడఁ జెప్పుచున్నారు. వారిమీఁద వ్యాజ్యమునకుఁ గారణము లేనట్లు తీర్మానించుచున్నాను. వాదికీవ్యాజ్యము జరిగింపవలెనని యభిప్రాయమున్నదిగనుక యందు ముఖ్యముగాఁ బ్రతివాదులుగాఁ జేర్పఁదగినవారు దీనికిఁ జందావేసి ప్రతిష్ఠ యేర్పాటుచేసిన తదిగ్రామపువారయియున్నారు.

† ఆయన నిశ్చయముగాఁ జాలకాలమునుంచి యుభయవాదులయొక్క మనస్సులను గలంచెడి బ్రాహ్మణులెక్కువ విశ్వబ్రాహ్మణులెక్కువ యనెడి వాదము ద్వారమునసైన గోపమును బుట్టించువిషయమై పోరాడవలెనను నుద్దేశముతో నున్నవాఁడు

తే॥ బ్రాహ్మణుల మేమెయనుచు నీబత్తు తెలమి
వాదములుచేయ నయ్యెది వలదటంటి
ఉత్తవాదులెకాక మాయూరిలోఁ బ్ర
తిష్ఠయే సేయ వ్యాజ్యంబు తెచ్చియుంటి॥ 187

ఉ॥ + వ్యాజ్యము తేకమున్నె రహి వారి ప్రబోధిని సాఁగుచుఁ జగ
త్పూజ్యతఁగన్న బ్రాహ్మణుల దూషణసేయఁ బ్రసిద్ధగ్నిమంటలో
నాజ్యముపోసినట్లగుడు నప్పుడునిల్పితి నేను బత్రికన్
ద్వ్యాజ్య భవన్మహాహాయని త్వాష్ట్రిజనాళిగుణించి తెల్పుచున్॥

తే॥ వరుస యుదికాని నే మతవైరములను
మెండుసేసెడితలఁపుతో నుండలేదు
తథ్యమెఱిఁగింపవలెనన్న తలఁపెకాని
యొరుల దూషింపవలెనన్న యూహకాదు॥ 189

తే॥ ఏను స్వయముగ లిఖియించు నెల్లవిషయ
ములను నొకటని యనృతంబు గలిగనేని
తల్లితోడను మర్యాదఁ దప్పినట్లు
బ్రహ్మహత్యకుఁగూడఁ బాల్పడినయటు॥ 190

తే॥ ప్రాసవిశ్రమములఁగూర్చుపట్లనుండు
వృద్ధిసంకోచములకేమి విడువుఁడద్ది
ఎఱిఁగి యయథార్థవిషయంబు నేనువ్రాయ
సాహసింపనుజనులార! సత్యమిద్ది॥ 191

తే॥ కలగుణంబుల నెల్లను గప్పిపుచ్చి
లేనిదోసఁగులఁజూపితుఱి లీలమెయిని
ప్రాజ్ఞులయ్యు నసూయాప్రభావమునను
నవనిజనములు తఱచు మహాత్ములందు॥ 192

*క॥ చీదఱపుట్టించినదఁట! నాదగు వ్యవహారమకట! న్యాయమెసునకున్

+ ఆత్మఘనతను దెలుపుకొనుటకుఁగా నుభయవాదులు నభినవసరస్వతీప్రబోధినుల ద్వారమునఁ గ్రోధమును వెళ్ళఁగ్రక్కుచున్నవారు.

* ఈదావా చీదఱపుట్టించునటువంటిది కర్చులతోఁ ద్రోసివేయుటయైనది.

నాదురదృష్టముచేయఁగ॥ బ్రాదుర్భవమయ్యెనతనిపాలిటికదియుఁ॥
తే॥ స్వర్ణకృద్వాదములును దత్సాక్ష్యములును
వానిపైఁ జేయఁబడిన తీర్మానములును

1912 సంవత్సరం మార్చి 30 వ తేది పబ్లీకుకోర్టులో నీతీర్పు చెప్పఁబడినది.

సి. రంగనాయకులు,
అడిషనల్ డిస్ట్రిక్టుమున్సిఫ్.

విచారింపఁబడిన సాక్షులు.

వాదితరపు

1 వల్లాది రామకృష్ణశాస్త్రి సోమయాజులు 2 శిష్టాసీతారామశాస్త్రి 3 చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రి 4 జానపాటి పట్టాభిరామశాస్త్రి (వాది) 5 జానపాటి చినప్పయ్య 6 కూరపాటి వెంకయ్య 7 కొత్త కోటయ్య 8 తాడువాయి కోటయ్య 9 గొబ్బి నాగన్న 10 బొమ్మిరెడ్డి వీరాస్వామి 11 కావూరి సుబ్బఁడు 12 అన్నంగి నారాయఁడు 13 ఇంకొల్లు రంగనాయకి 14 గొట్టెముక్కల ముత్తాయు.

ప్రదివాదులతరఫు.

1 నందిగామ కాశీపతి 2 ఎలవర్తి యాంజనేయశాస్త్రి 3 జానపాటి రంగయ్య 4 ఉన్నము చినవీరయ్య 5 పారెళ్ళ వీరన్న 6 తుమ్మపూడి పకీరుగాఁడు 7 తాంద్ర సూరయ్య 8 తూము జయరాముఁడు 9 బొమ్మిరెడ్డి సూర్యనారాయణ 10 బండారు సిద్దప్ప 11 తక్కెళ్ళపాటి వీరేశలింగాచార్యులు 12 బొగ్గవరపుఁ బెదయచ్చయ్య 13 గుండాల ముత్తయ్య 14 నల్లూరి నాగయ్య 15 మువ్వా పాపారాయఁడు 15 పోచెంపల్లి బసవయ్య 17 మందపాటి పరశురాముఁడు.

డాఖలయిన దస్తావేజులు.

వాదితరఫు.

ఏ.మనుధర్మశాస్త్రము: పేజీ,37,487,581, 35, 585, 589, మఱియు 90
బి. పరాశరధర్మశాస్త్రము (పేజీ 31)
సి. నిర్ణయసింధువు (పేజీ 192 మఱి 213)
డి. జైమినీయన్యాయమాలావిస్తరము (పేజీ 310)
ఇ. విజ్ఞానేశ్వరీయము (పేజీ 14 మఱి 15)
యఫ్. అష్టాదశస్మృతి (పేజీ 22 మఱి 23)
యఫ్ (1) సూతసంహిత (పేజీ 50)

నాకుఁ బుట్టించెఁ జీదఱ్ఱయాకతమున
నింక సంక్షేపమొనరింతు నీప్రశంస

జి. విష్ణుస్మృతి (పేజీ 10)
హెచ్చి. మార్కండేయపురాణము (పేజీ 53)
జే. గురుబాలప్రబోధిక (పేజీ 255 మఱియు 256)
కే. నారదస్మృతి (పేజీ 62)
యల్. వైద్యనాథదీక్షితీయము (పేజీ 52)
యమ్. వాచస్పత్యము (వాల్యూము 5 పేజీ 4791)
యన్. ఆంధ్రమహాభారతము (వాల్యూము 1 పేజీ 60 మఱియు 185)
ఓ. 10-10-6 వ తేది ప్రతివాదులతరఫు 3 వ సాక్షికైఫియ్యతు, గుర్జాలసబ్ మేజస్ట్రేటుగారియెదుట, నెం 190/06 ర కేసులో నిచ్చినది.
పి. మత్స్యపురాణము (పేజీ 323, 329, మఱియు 330)
క్యు. బ్రహ్మాండమహాపురాణము (పేజీ 93 మఱియు 94)
ఆర్. మీమాంసాదర్శనము (పేజీ 686 మఱియు 588)
యస్. దేవీభాగవతము (పేజీ 547)
టి. విష్ణుతిలకము (పేజీ 165)
యు. 2-10-06 వ తేది గురిజాలసబ్ మేజస్ట్రేటు కోర్టుఫయిల్ నెం 160/06 ర కేసులో మొదటప్రతివాది కైఫియ్యతు.

ప్రతివాదులతరఫు.

1 పురుషసూక్తభాష్యము (పేజీ 13. 14 మఱియు 19)
2 వజ్రసూచికోపనిషత్తు (343, 748 మఱియు 749)
3 కృష్ణయజుర్వేదము (పేజీ 85 మఱియు 93) తైత్తిరీయసంహిత
4 కృష్ణయజుర్వేదము (పేజీ 10) (బ్రాహ్మణభాగము)
5 నానార్థరత్నమాల (పేజీ 246)
6 సిద్ధాంతకౌముది (పేజీ 326)
7 ఆపస్తంబశ్రౌతసూత్రము (పేజీ 240)
8 బ్రాహ్మణోత్పత్తిమార్తాండము (పేజీ 562)

చం॥ మునిసిభుగారితీరుపున మోదము నాకుఘటింపనుంట నా
యనపయినున్న న్యాయపతియంతికమందు నపీలుచేయుద

9 కృష్ణయజుర్వేదము (తైత్తిరీయసంహిత) 3వ యధ్యాయము 4 వ కాండము
పేజీ 41 (ఏ) డిటో డిటో పేజీ 92, 1 వ భాగము 5 వ యధ్యాయము 2 కాండము

10 విష్ణుపురాణము (పేజీ 94 మఱియు 286)

11 భాగవతము (పేజీ 201, 490 మఱియు 491)

12 మనుస్మృతి (పేజీ 77, 376, మఱియు 550)

13 గార్గేయాగమము (పేజీ 2, 8, 15, 16, 29, 30, 32 మఱియు 38)

14 కపిలగీత (3 వ యధ్యాయము పేజీ 24)

15 విశ్వబ్రహ్మోపనిషత్తు (పేజీ 2, మఱియు 3)

16 నిరుక్తము (ఉత్తరపటి) పేజీ 310 మఱియు 316)

17 ఋగ్వేదసంహిత (పేజీ 464 మఱియు 467 (ప్రథమాష్టకము)

17 (ఏ) ఋగ్వేదము(ద్వితీయాష్టకము) పేజీ 221, 223 మఱియు 225)

17 (బి) డిటో (తృతీయాష్టకము) పేజీ 138 మఱియు 169)

17 (సి) డిటో (చతుర్థాష్టకము) పేజీ 356)

17 (డి) డిటో (అష్టమాష్టకము) పేజీ 35)

18 ఐతరేయబ్రాహ్మణము (పేజీ 764)

19 అగ్నిపురాణము (పేజీ 52, 53, మఱియు 57)

20 వాల్మీకిరామాయణము (పేజీ 34)

21 కాశీఖండము (పేజీ 622)

22 శైవధర్మము (పేజీ 76)

23 నిర్ణయసింధువు (పేజీ 240 మఱియు 241)

24 నాగరఖండము (పేజీ 14, 17, 18, 26, 27 మఱియు 31)

24 (ఏ) డిటో తెలుగు

35 సంస్కృతశబ్దార్థకల్పతరువు (పేజీ 602)

సి. రంగనాయకులు,

అడిషనల్ డిస్ట్రిక్టుమున్సిఫ్.

ద్ధనుండు విమర్శఁజేసి కుతుకంబుననిచ్చిన * తీరుమానముల్
వినిచి యనంతరంబునను విశ్రమముం గయికోఁ దలంచితిన్ ॥

---

గుంటూరు టెంపొరరీ సబ్ జడ్జివారికోర్టులో మహారాజశ్రీ ఏ. సాంబమూర్తిఅయ్యరు,
అవర్గలు బి ఏ బి యల్ సబ్ జడ్జి

1915వసంవత్సరము 25వ సెప్టంబరు శనివారము.

1915వసంవత్సరము, నెం 4రు అప్పీలు

గుంటూరు జిల్లాకోర్టు ఫయిల్ 12వసంవత్సరము, నెం 324రు అప్పీలు

జానపాటి పట్టాభిరామశాస్త్రి ... అప్పిలెంటు.

1 నందిగామ కాశీపతి
2 సిరిపురము భిక్షాపతి
3 నందిగామ చినబ్రహ్మము
4 జుజ్జూరు మల్లయ్య
} రెస్పాండెంట్లు.

గుంటూరుడివిజనల్ డిస్ట్రిక్టుమున్సిఫ్ కోర్టుఫయిల్ 1911వసం॥నెం26రు అసలుదావాలో 30-3-1912వ తేదిని కోర్టువారిచేఁ జేయఁబడిన డిక్రీమీద యప్పీలు.

అసలు, నెం26/1911రులోని పార్టీలు

వాది-జానపాటి పట్టాభిరామశాస్త్రి

ప్రతివాదులు- వోలేటి లక్ష్మయ్యవగైరాలు

1915వసం॥ అగష్టు6, 31వ తేదీల నప్పిలెంటుతరఫు ప్లీడరు రంగావఝ్ఝల హనుమయ్య, రెస్పాండెంట్లుతరఫు ప్లీడరు మాడభూషి వెంకటనరసింహాచార్యులుగార్లచే హీరింగుచేయఁబడి యీరోజువఱకు కాలోచననిమిత్తము వాయిదా వేయఁబడి కోర్టువారిచే నీరోజునఁ జేయఁబడిన తీర్మానము.

1. గుంటూరుడివిజనల్ డిస్ట్రిక్టుమున్సిఫ్ కోర్టు, నెం26రు డిక్రీమీఁద నిదిఅప్పీలుఅయినది.

2. జాతిచే బ్రాహ్మణుఁడైన యీవాది దావాగ్రామములోనుండిన 2 గ్రామదేవతలైన పోలేరమ్మ పాతపాటమ్మలకుఁ బ్రాణప్రతిష్ఠచేయునధికారము తనకును తనజాతివారికిని మాత్రమే కలదని నిర్ధారణచేయుటకీదావా తెచ్చినాఁడు. వాది యింకను బ్రతివాదులు బ్రాహ్మణులుకారనియు దావాదేవతలకుఁ బ్రతిష్ఠచేయునధికారము లేదనియు 1906వసం॥లోఁ బ్రతిష్ఠజరిగించి విగ్రహములు బ్రాహ్మణులకపూజ్యములు చేసిరనియుఁ జెప్పుచు నిఁకనెప్పుడును నిట్టిపనిచేయకుండఁ గోర్టువారి యింజక్షన్ గోరుచున్నాఁడు.

సీ॥ ఏఁ బుట్టిపెరిఁగిన దేసంఘమందో యా
సంఘంబె బ్రాహ్మణజాతిమనియు

---

తిరిగి విగ్రహములఁ బూర్వపద్ధతిని బూజార్హములఁగాఁ జేయుటకై జరుగవలసిన సంప్రోక్షణకయ్యెడికర్చు రు 190 లు నిప్పించవలసినదనియుఁ గోరుచున్నాఁడు. ప్రతివాదులు తద్గ్రామములోని యితరబ్రాహ్మణులతరఫునఁగూడ నీవాది దావా చేయ. లేదనియు నందువలన బ్రాహ్మణులందఱితరఫున నీదావా నడపుటకు వీలులేదనియు దావాలోఁ జెప్పబడినదేవతలకు బ్రాహ్మణవర్ణపూజ చేయఁబడుటలేదనియుఁ దమ రాదేవతా శిలలకు సంప్రోక్షణ చేయలేదనియుఁ బ్రతిష్ఠచేయుటకుఁ దమతెగవారి కధికారముకలదనియు నష్టము చాల హెచ్చుగా వేసిరనియు నది యిప్పించవలసిన యవసరము లేదనియుఁ జెప్పుదురు. ఈదావాలో వాన్సరు దాఖలుచేసినతర్వాత బ్రాహ్మణులందఱితరఫునఁ దనను బనిచేయనీయవలసినదని వాది పిటీషన్ బెట్టినాఁడు. ఆపిటీషన్ ప్రతివాదులాక్షేపించిరి. అందుపైఁ ద్రోసివేయఁబడినది. అందుపైని దావాయాలయములోఁ దానుగూడఁ బూజచేయువాఁడే యైనందున సొంతహోదాలోనే దావానడపుటకు వాది కోరినాఁడు. క్రిందికోర్టువారు దావా యొరులఁ గష్టపెట్టనుద్దేశించి వేసినదిగా నెంచి త్రోసివేసిరి. మఱియు వాది యితరులైన యెవరితరఫునను దావా తేక స్వయముగానే తెచ్చినందునను దన కాముష్మికనష్టముకలిగియుండఁగా నట్టినష్ట మిప్పించుఁడని కోరనందునను నష్టముకూడ నిప్పించుటకు వీలులేదని తీర్మానించిరి. డిక్లరేషన్ విషయములోను నింజెక్షన్ విషయములోను గోర్టువారుచేసిన తీర్మానముమీఁదనే వాది యప్పీలు దాఖలుచేసినాఁడు.

(3.) తీర్మానించవలసినవిషయము లేవనఁగా

1. దావాదేవతాశిలల ప్రతిష్ఠచేయుటకు బ్రాహ్మణులకుమాత్రమే యధికారముకలదా?

2. 1916వ సంవత్సరములోఁ బ్రతివాదు లట్టిప్రతిష్ఠచేసినారా? అట్లుచేసిన యెడలఁ దద్దేవతలఁ బూజించువారిలో నొకఁడైనవాదికి సొంతహోదాతో దావా తెచ్చుటకుఁ గారణమైన యపవిత్రపుఁబనిని జేసినారా?

3 వాదికి నింజెక్షన్ డిక్లరేషను నీయఁదగియున్నవా?

కలహకారణములైన కమసాలిజనులది సంకీర్ణ సంకర జాతియనియు

(4) ఆన్సరులోఁ బ్రతివాదులు వాది బ్రాహ్మణుఁడు కాఁడని చెప్పియుండలేదు. శ్రుతిస్మృతిపురాణేతిహాసాదుల నుభయవాదులుం బ్రమాణముగా నంగీకరించుచున్నవారు. ఈప్రమాణములనుబట్టి యాజనము బ్రాహ్మణునకువిధింపఁబడినకర్మలలో నొకటియైయున్నది. ప్రస్తుతపుదేవాలయములలో విగ్రహములకుఁ బ్రాణప్రతిష్ఠచేయుకర్మము యాజనములోఁ జేరినదియనియు నుభయవాదులు నొప్పుకొనుచున్నవారు. ప్రతివాదులు బ్రాహ్మణులు కానందునఁ బ్రతిష్ఠాధికారములేదని వాది చెప్పుచున్నవాఁడు. విగ్రహములను గుఱించియు నట్టిసమయములందుఁ జేయు కర్మలంగుఱించియుఁ జెప్పెడి యాగమములు ప్రమాణములుకావని యెవరును గట్టిగా వాదించియుండలేదు. తమకుఁ బ్రతిష్ఠాధికారముకలదని చెప్పుటకై ప్రతివాదు లాగమములే ప్రమాణములని చెప్పుచున్నవారు. ఆగమములుచెప్పురీతిని బ్రతివాదులు ప్రాణప్రతిష్ఠచేయవచ్చునా యనునది ప్రశ్నయైయున్నయది. ప్రతివాదులు మొదట వాది బ్రాహ్మణుఁడని యొప్పుకొన్నను నీవిషయమైజరిగిన విచారణలో నుభయవాదులకు నుద్రేక మెక్కువయగుడు వాదితన పక్షమున 8 మొదలు 14వఱకు సాక్షులను విచారించినప్పుడు ప్రతివాదులు మరల వాది బ్రాహ్మణుఁడు కాఁడని చెప్పఁదలంచినట్లు కనఁబడుచున్నది. ప్రతివాదులతరఫు 10,16 17 సాక్షులు వైదికబ్రాహ్మణునియింటిలో మేము భోజనముచేయమనియు నట్లుచేసినచో మమ్ముఁ గులమునుండి బహిష్కరింతురనియుఁ జెప్పునటులఁ గొన్ని ప్రశ్నలడుగుటకుఁ గ్రిందికోర్టువా రొప్పుకొనినట్లు కనఁబడుచున్నది. సంఘసంస్కారి శిరోమణిమతముకంటెఁ గూడ నీసాక్ష్యములో హెచ్చుపోకడపోయినట్లు నాకుఁ గనఁబడుచున్నది. కాఁబట్టి పైనిజెప్పిన మాజుమానిసాక్ష్య మెక్కువ యుద్రేకముకలదిగానున్నందువలనను నిజమునకుఁ జాల దూరముగానున్నందువలనను దీనినిబట్టి నిశ్చయించుటకు వీలులేదు. అనేకసహస్రసంవత్సరములక్రిందటి గ్రంథములలోఁ జెప్పఁబడినవియు బ్రాహ్మణులకుండఁదగినవియు నగు ధర్మములవిషయమై క్రిందికోర్టువారు ప్రమాణములను జర్చించి యట్టిప్రమాణములలోఁ జెప్పఁబడినధర్మము లిప్పటిబ్రాహ్మణులందు లేవని కనిపెట్టిరి. అది యెట్లున్నను నీవ్యాజ్యములో, గోర్టువారు నిర్ణయింపవలసినవిషయము ప్రతివాదులు బ్రాహ్మణులగుదురా కానియెడల విగ్రహస్థాపనచేసి ప్రతిష్ఠచేయుట కధికారమున్నదా యనునదియైయున్నది.

ఆజాతివారల కర్చాప్రతిష్ఠలో
లేశమే నధికృతి లేదటనియు
వారు మద్గ్రామదేవతలఁ బ్రతిష్ఠింప
నస్మదర్చకు భంగమయ్యెననియు
వాని మరలఁ బ్రతిష్ఠింపవలయుననియు
ఇందులకునగువ్యయము నిప్పించుఁడనియు
ఎన్నఁడిట్లు చేయకుండ నాజ్ఞ యీయుఁడనియు
నాదువ్యాజ్యంబునందుండు వాదమిదియు॥ 196

ప్రతివాదులు తాము విశ్వకర్మబ్రాహ్మణులో విశ్వబ్రాహ్మణులో యగుదుమని చెప్పుదురు. కాని బ్రాహ్మణవిభాగమున్న యేగ్రంథమందును విశ్వ (కర్మ) బ్రాహ్మణులు కనఁబడరు. ప్రతివాదులు జన్మమాత్రముననే వారిని బ్రాహ్మణుఁడని పిల్చుటకు వీలులేదని చెప్పుచు వెంటనే మేము విశ్వకర్మసంతతివారము గనుక బ్రాహ్మణులమని చెప్పుదురు. పుట్టుకనుబట్టి యొకఁడొక్కజాతివాఁడగునా కాదాయని విశేషముగాఁ జర్చింపవలసిన యవసరము లేదు–ఏలయనిన? ఈవిషయము ప్రమాణగ్రంథములలో స్పష్టముగా నున్నది. వారుకనుబట్టియు నాచారమునుబట్టియు నదియే సంగతి తేలుచున్నది. ఇందువిషయమై యేదేని ప్రమాణము కావలసియున్నయెడల నే నీక్రింది ప్రమాణములఁ గనబఱచుచున్నాఁడను.

మనుః సర్వవర్ణేషు తుల్యాసు పత్నీ ష్వక్షతయోనిషు
ఆనులోమ్యేనసంభూతాః । జాత్యా జ్ఞేయాః తఏవహి॥

అన్నిజాతులవారికిని వర్తించెడి విధి యేమనఁగా నవివాహితలుగానున్న యాఁడువాండ్రు తమజాతివారిని పెండ్లిచేసికొన్నందువలనఁ బుట్టినవారు ఆనులోమ్యధర్మమునుబట్టి తలిదండ్రులజాతివారే యగుచున్నారు–అవివాహితయనఁగా మొదలొకపురుషునిచేత ననుభవింపఁబడని ప్రజోత్పాదకస్థానముగలది.

అనార్య మార్యకర్మాణాం ఆర్యం చానార్యకర్మాణం
సంప్రధార్యాబ్రవీద్ధాతా నసమా నసమావితి॥

బ్రాహ్మణేతరకర్మలుచేయుబ్రాహ్మణుఁడును బ్రాహ్మణకర్మలుచేయు బ్రాహ్మణేతరుఁడును సమానులుకారని బ్రహ్మదేవుఁడు చెప్పియున్నాఁడు. ఈవిషయములో వాదిపక్షపు 1 వ సాక్షి (మల్లాది రామకృష్ణశాస్త్రిసోమయాజులవారి) సాక్ష్యము చూడవలసినది.

సీ॥ ఏఁబుట్టి పెరిఁగిన దేసంఘమందో యా
సంఘంబె బ్రాహ్మణజాతమనియు

వైశేష్యాత్ ప్రకృతిశ్రైష్ట్యాత్ నియమస్యచధారణాత్,
సంస్కారస్యవిశేషాచ్చ వర్ణానాం బ్రాహ్మణః ప్రభుః

జాతులవిషయమై చర్చించునపుడీ పైశ్లోకము చెప్పఁబడినది. తన వర్ణోత్కృష్టతవలనను ప్రకృతి (సత్వరజస్తమోగుణములయొక్క కూడిక) యొక్క యాధిక్యమునను నియమములజరుపుటవలనను గర్భాధానపుంసవనాది సంస్కారములవలనను బ్రాహ్మణుఁడు హెచ్చుగాఁ జూడఁబడుచున్నాఁడని దీనియర్థము

గీత॥ బ్రాహ్మంకర్మ స్వభావజం

బ్రాహ్మణులు పుట్టుకలోనే ప్రకృతిలో నవసరమైన మేళనము కలిగియున్నవారు.

ఆపస్తంబః॥ బ్రాహ్మణః జన్మతశ్శ్రేయాన్

బ్రాహ్మణుఁడు పుట్టుకవలననే యితరజాతులవారికన్న శ్రేష్ఠుఁడు.

దేవలః॥ బ్రాహ్మణ్యాం బ్రాహ్మణాజ్జాతః సంస్కృతో బ్రాహ్మణోభవేత్

బ్రాహ్మణపురుషునకు యథావిధిగా వివాహితయైన బ్రాహ్మణస్త్రీయందుఁబుట్టి గర్భములో నున్నప్పుడును బుట్టినతర్వాతను గావలసిన సంస్కారము లైనవాఁడు బ్రాహ్మణుఁడగును.

మనుః॥ ఉత్పత్తిరేవవిప్రస్య, మూర్తిః ధర్మస్యశాశ్వతీ
సహిధర్మార్థముత్పన్నో బ్రహ్మభూయాయకల్పతే

బ్రాహ్మణునివిషయములో బుట్టుకయేధర్మముయొక్క శాశ్వతమైన యాకారమైయున్నది. ఏలయన ధర్మాచరణమునకును మోక్షార్థమును నతఁడు పుట్టినాఁడు.

మనుః॥ బ్రాహ్మణా బ్రహ్మయోనిస్థాః యేస్వకర్మణ్యవస్థితాః।
తే సమ్యగుపజీవేయుః, షట్కర్మాణి యథాక్రమం॥

బ్రాహ్మణునివలన బ్రాహ్మణస్త్రీయందుఁబుట్టి బ్రాహ్మణధర్మముల నడుపుచుండువాఁడు జీవికకు నిర్ణయింపఁబడిన షట్కర్మలు చేసికొని జీవింపవచ్చును.

మనుః॥ శూద్రాయాం బ్రాహ్మణాజ్జాతః, శ్రేయసాచేత్ప్రజాయతే
అశ్రేయాం శ్రేయసీంజాతిం గచ్ఛత్యాసప్తమాద్యుగాత్,

శూద్రస్త్రీయందు బ్రాహ్మణునివలనఁ బుట్టిన పురుషుఁడు సత్కర్మలుచేసినట్లయినఁ బుట్టుకవలనఁ దక్కువకులపువాఁడైనను నేడుతరములలో నుత్కృష్టజాతిని బొందవచ్చును.

కలహకారణులైన కమసాలివారిది
సంకీర్ణ సంకర జాతియనియు

(5) ఉభయవాదులును దాఖల్ చేసినపుస్తకములలోఁ గొన్ని ప్రమాణములనియుఁ గొన్ని యీవ్యాజ్యముతో సంబంధములేనివియు వినియుండనివియు ననియుఁ గొన్ని యిటీవల బ్రాహ్మణులమని చెప్పుకొనువారిచేఁ గల్పింపఁబడినవనియుఁ జెప్పుదురు. ఐతే, ప్రమాణములైన గ్రంథములందుమాత్రము మీప్రతివాదులు పుట్టుకవలనగాని వృత్తివలనఁగానికర్మలవలనఁగాని రథకారులనికాని లేక శిల్పులనికాని వాడబడియున్నది. లోకములో మనుష్యులందఱును భ్రాతృభావముతో నుండవలసినదిగాను దేవుని దండ్రిఁగాఁ జూడవలసినదిగాను జెప్పెడి వేదాంతశాస్త్రము ప్రస్తుత మీకేసులోనిపార్టీల వివాదాంశమునకు సంబంధించినదికాదు కాఁబట్టి యీలోకములో మనుష్యజాతి పలువర్ణములుగా విభాగింపఁబడియున్నదను దానిమీఁదనే యీకేసు తీర్మానముచేయవలసి యుండును. విశ్వకర్మశబ్దము యోగమందు రూఢియందును నుపయోగింపవచ్చును. ప్రతివాదులు దాఖల్ చేసిన ప్రమాణగ్రంథములలోని యెగ్జిబిటు 8, 4, 17 (కృష్ణయజుర్వేద ఋగ్వేదము) లలోఁ జెప్పఁబడినటువంటియుఁ బ్రతివాదులచేఁ దమ మూలపురుషుఁడుగాఁ జెప్పుకొనఁబడునట్టియు విశ్వకర్మపరాత్పరుఁడుగాని శిల్పికాఁడని తెలియవచ్చెడిని. సామాన్యముగా నలుగురూహించుప్రకారము కులమనునది మతసంబంధమైనదియు సంఘసంబంధమైనదియు నైయున్నది. వాడుకనుబట్టియుఁ బేరునుబట్టియు బ్రాహ్మణుఁ డెవఁడైనదియు నొకమనుష్యుఁ డేకులమునకు సంబంధించినవాఁడైనదియుఁ జెప్పుటకేలాటిసందేహము నుండదు. మునిసిభుగారు చాల శ్రమపడి వ్రాసినప్రకారము ప్రస్తుత కాలపుబ్రాహ్మణులకుఁ బూర్వగ్రంథములలోఁ జెప్పఁబడినప్రకారము తమపూర్వీకులకుండిన పరిశుద్ధత మొదలైనగుణములు లేకపోవచ్చును. అయితే, ఈకాలపున్యాయస్థానము లీకాలమున సంఘమున్నపద్ధతినిబట్టి న్యాయ్యమైనతీర్మానము చేయవలసియున్నది. కావునఁ బూర్వకాలపుగుణగణములనుబట్టి బ్రాహ్మణత్వమును దీర్మానించుట యసంభావ్యము. పైనిజెప్పినప్రమాణములవలన బ్రాహ్మణునకును బ్రాహ్మణికిని బుట్టినందువలననే బ్రాహ్మణుఁడగుచున్నవాఁడు. అయితే, అతనిబ్రాహ్మణత్వ మతఁడుచేయు కర్మలవలనఁగాని పారిశుద్ధ్యమువలనఁగాని హెచ్చుదశకుఁగాని తగ్గుదశకుఁగాని వచ్చినప్పటికి స్వాభావికమైన బ్రాహ్మణత్వమునుగుఱించి యెన్నఁడును నాక్షేపణ చేయఁబడినట్లు కనఁబడదు

## ఆజాతివారికి హారహారాదిప్రతిష్ఠ లేశమే నధికృతి లేదటనియు

పురాణములలో నొకటిరెండువిషయములలోఁ గర్మాచరణ పారిశుద్ధ్యముల వలన బ్రాహ్మణేతరులు బ్రాహ్మణులైన ట్లగుపడినను నీకాలమం దట్టికర్మలును పారిశుద్ధ్యమును బ్రాహ్మణేతరుల బ్రాహ్మణులఁగా మార్పఁజాలవు. ఐనను గొన్నిచోట్ల బ్రాహ్మణేతరుఁడు తర్వాతరాఁబోవుజన్మమున బ్రాహ్మణ్యమును బొందుటకుఁగాను ముం దనేకజన్మములందుఁ గర్మలవలనను పారిశుద్ధ్యమువలనను దనయోగ్యత నధికపఱుచుకొనిన ట్లుదాహరణము లున్నవి. మహాభారతములో గొప్పపేరుపొందిన విదురుఁడు బ్రాహ్మణునకుండవలసిన సల్లక్షణము లుండియు బ్రాహ్మణస్త్రీకిఁ బుట్టనందువలన బ్రాహ్మణుఁడని యనిపించుకోనట్లు కనఁబడెడిని. ఈసందర్భములోఁ గ్రిందఁజూపఁబడు ప్రమాణములు కొంతవఱకు సంబంధించునని తోఁచెడిని. అవి తక్కువజాతిజనులు హెచ్చుజాతికి సప్రమాణముగాఁ జెప్పఁబడినకర్మలు చేయుట కర్హులుకారనియు నట్లు చేయుటవలన నెక్కువకులములోఁ జేరరనియుఁ దెలియఁజేయును.

అనార్య మార్యకర్మాణం ఆర్యం చానార్యకర్మిణం।
సంప్రధార్యాబ్రవీద్ధాతా నసమౌ నసమావితి॥
శూద్రాయాం బ్రాహ్మణాజ్జాత శ్శ్రేయసాచేత్ప్రజాయతే।
అశ్రేయాం శ్రేయసీంజాతిం గచ్ఛ త్యాసప్తమాద్యుగాత్ ।
జీవేదేతేనరాజన్యః । సర్వేణాప్యనయంగతః।
నత్వేవజ్యాయసీంవృత్తి మభిమన్యేత కర్హిచిత్॥
యోలోభా దధమో జాత్యా । జీవే దుత్కృష్టకర్మభిః।
తంరాజా నిర్ధనంకృత్వా । క్షిప్రమేవ ప్రవాసయేత్ ॥
వరం స్వధర్మో విగుణో । నపారక్య స్స్వనుష్ఠితః।
పరధర్మేణజీవన్హి సద్యఃపతతి జాతితః॥

రథకారులలో నొకతెగయైన ప్రతివాదులు యాజనములో నొకభాగమైన యొకవిధంపు నాధానము తమకుఁగూడ నిర్ణయింపఁబడినమాత్రమునఁ దమనుగూడ బ్రాహ్మణులఁగాఁ జెప్పకొనఁగూడదు. ఈవిషయములో మనము చక్కఁగా నాలోచించిన, ఇ, యఫ్, జి, యల్, యమ్, (విజ్ఞానేశ్వరీయము, అష్టాదశస్మృతులు, సూతసంహిత, వైద్యనాథదీక్షితీయము, వాచస్పత్యము) లవలన రథకారు లెవరైనది తెలియుచున్నది. వారు కరణజాతిస్త్రీలయందు మాహిష్యజాతిపురుషులకుఁ బుట్టిన సంతతివారు. వైశ్యస్త్రీయందు క్షత్రియపురుషునకుఁ బుట్టినవారు మాహిష్యులు. శూద్రస్త్రీయందు వైశ్యపురుషునకుఁ బుట్టినవారు కరణులు.

బ్రాహ్మణులఁ బూజించు ప్రతిమాదికములకుఁ
గొలఁది వారిప్రతిష్ఠ కూడదనియు

ఉపనయమును నాధానమును జెప్పఁబడినప్పటికి జాతినిగనుగొనుటకు వృత్తియాధారమయినయెడల యల్ మార్కు దస్తావేజు (వైద్యనాథదీక్షితీయము) వలన రథకారులు బంగారునగలు చేయువారనియు వ్యవసాయపుఁ బనిముట్లును పాత్రలును జేయువారనియుఁ గనఁబడుచున్నది. ద్విజులకేర్పడియున్న కొన్నిమంత్రము లుచ్చరించుటకు వీరి కధికారము లేదని, ఆర్ మార్కుదస్తావేజు (మీమాంసాదర్శము )వలనఁగనఁబడుచున్నది. 6 వ మార్కుదస్తావేజు (సిద్ధాంతకౌముది) వలన రథకారులు బ్రాహ్మణులని కనఁబడదు. ఐతే, ఒకబ్రాహ్మణ్ణుని పేరు రథకారుఁడని కనఁబడును. 3వ మార్కుదస్తావేజు(కృష్ణయజుర్వేదము) లోనుదహరింపఁబడిన విశ్వరూపాచార్యునితండ్రియైన త్వష్టయనునతఁడు కశ్యపుని ద్వాదశపుత్రులలో నొకఁడుగాని 8,9, 15 దస్తావేజు బ్రాహ్మణోత్పత్తిమార్తాండము కృష్ణయజుర్వేదము తైత్తిరీయసంహిత విశ్వబ్రహ్మోపనిషత్తు లలోనుదహరింపఁబడిన త్వష్టకాఁడు. ఇదిగాక 2వ మార్కుదస్తావేజు వజ్రసూచికోపనిషత్తు లోనన్నిజాతులవారును నుత్తమస్థితికి వచ్చుటకుఁ దపస్సుగాని మానసికప్రార్థనగాని చేయవలసినట్లు చెప్పఁబడియున్నది, 15వ మార్కుదస్తావేజయిన విశ్వబ్రహ్మోపనిషత్తనునది వాడుకలోనున్న నూటయెనిమిదియుపనిషత్తులలోఁ గనబడదు. అయితే, 1008యుపనిషత్తులనిచెప్పువానిలో నుండునేమో నేను జెప్పఁజాలను. చిత్రముగా నీ 15వ మార్కుదస్తావేజు(విశ్వబ్రహ్మోపనిషత్తు) లో నితరప్రామాణికోపనిషత్తులలోవలెఁగాక గోత్రఖండముమాత్రమున్నయది. 13వ మార్కు దస్తావేజు గార్గేయాగమము ఫ్రాగ్మెంటుగా వ్రాసినదికాని ప్రామాణికగ్రంథముగాని కాదు. ఇందులోఁగూడ విశ్వకర్మ బ్రాహ్మణులుగాని రథకారులుగాని బ్రాహ్మణులని చెప్పియుండలేదు. బ్రాహ్మణ శాఖలలో విశ్వకర్మ బ్రాహ్మణులుకూడఁ జేరియున్నారని యెక్కడను బ్రమాణమును గనపఱుప లేదు. 19వ మార్కుదస్తావేజు (వాల్మీకిరామాయణము) క్రమముగా నర్థముచేయలేదు దానిలోఁ బ్రమాణముగానెత్తుకొన్న భాగ మీక్రిందివిధముగానున్నయది.

> ఇష్టకాశ్చ యథాన్యాయం కారితాశ్చ ప్రమాణతః।
> చితోఽగ్ని ర్బ్రాహ్మణై స్తత్ర కుశలై శ్శిల్పకర్మణి॥

కొన్నికర్మలుచేయుటకుఁగాను బ్రాహ్మణులు క్షేత్రగణితమును జిత్తరువునువ్రాయుటను గొంతవఱకు నేర్చియుండవలసియున్నది.

సపరిమాణంబుగా వీనిఁ జాల మంచి
గానె తీర్మాన మొనరించెఁగాని జడ్జి
తుద కొకించుక క్రిందుమీఁదుగ నొనర్చె
ప్రకృతనిర్ధార్య మతిసూక్ష్మభాగ మగుట॥ 197

పైఁజెప్పినదానిలో నావిషయమ్ములోఁ గుశలురైన బ్రాహ్మణులవిషయమై చెప్పబడియున్నది. శిల్పులు బ్రాహ్మణులని దానియర్థముకాదు. "శిల్పకర్మణి" యనుదానిలో సప్తమి "బ్రాహ్మణైః" యనుదానిలోఁ దృతీయ యుపయోగించినందున నిజముగా శిల్పులు బ్రాహ్మణులని దీనిలో నర్థముచేయనట్లు కనఁబడును. దీనివ్యాఖ్యానములో శిల్పకర్మణియనుదానికి శుల్బకర్మణియని పాఠాంతర మున్నట్లు కనఁబడును. శుల్బశాస్త్రములోఁ గుశలురని యర్థము. కాఁబట్టి 19వ దస్తావేజు (వాల్మీకిరామాయణము)లో శిల్పులు బ్రాహ్మణులని యర్థముచెప్పుట కుపచరింపదు. 24వ మార్కు దస్తావేజు (తాటియాకుల నాగరఖండము)ను నిప్పుడు దాఖల్ చేసిన డబ్లియుమార్కు దస్తావేజైన యచ్చుపుస్తకము [సంస్కృతాక్షరములలోనున్న నిజమైననాగరఖండము]ను ననేకభాగములలో సరిపోయినట్లు కనఁబడదు.

[6] మనుష్యులు నాలుగుజాతులుగా విభాగింపఁబడినారనియు వానిలోనుండు భేదములు కొంచెమించుమించుఁగాఁ బుటుకతోనే వచ్చుచున్నవనియు హైందవులు నమ్ముచున్నారు. ఇంతవరకు నీహిందూదేశములోనుండుమానవుల నాయాజాతులక్రింద విభజించుట కెట్టికష్టమును గనఁబడదు. ఇతరయుగములలోమాదిరిగా నీకలియుగము [అనూయాగ్రస్తమైన కాలము]లో నొకజాతివా రంతకం టెనుత్కృష్టజాతికివచ్చుటకు వీలులేదనికూడ హైందవులు నమ్ముచున్నారు. బ్రాహ్మణుఁడు తనయిష్టమైనవృత్తినవలంబించుటకుఁ బ్రమాణమున్నదికాని యేజాతివాఁడైనను వృత్తిమార్చుటవలనఁ బైజాతిలోకిఁగాని క్రిందిజాతిలోనికిఁగానిపోనేరఁడు. క్రమముగానో యక్రమముగానో బ్రాహ్మణులు సంఘములోఁ బ్రథములుగానున్నారని యొప్పుకోకతప్పదు. సంఘములో నుత్కృష్టుఁడై యున్నంతమాత్రమున జాతి మాఱఁబోదు. వారిస్థితిమాత్రము మాఱవచ్చును. అట్టిప్రశ్న వివాదాంశగానప్పు డనేక కాలములనుండివచ్చుచున్న బ్రాహ్మణోత్కృష్టతపైని సులభముగాఁ దప్పులెన్నుట కోర్టువారుచేయు తీర్మానములో నప్రస్తుతము. జనులగుణాగుణములే జాతిని నిర్ణయించునవిగాఁ దీసికొనినయెడల హైందవధర్మశాస్త్రము నమలునకుఁ దెచ్చుటకుఁగాని వివిధజాతులలోనచ్చుతగవులు తీర్చుటకుఁగాని యసంభవము.

సీ॥ * ప్రకృతదేవాలయాల్ బ్రాహ్మణజనులచే
భక్తిమైఁ గట్టింపఁబడియెననియొ
తద్గ్రామదేవతాద్వయమున కవ్వార
లొగి క్షేత్రపాత్రంబు లొసఁగిరనియొ
ఆ దేవతావిగ్రహములకైన ప్రతిష్ఠ
శాస్త్రోక్తవిధముగా సలిపిరనియొ
దేవతాకృతిరాను దీర్పించి విగ్రహాల్
నేర్పుమై గుడులందు నిలిపిరనియొ
వాసికొంటకుఁగాను వసుధామరుల్ సొమ్ము
ప్రీతితోడఁ గర్చుపెట్టిరనియొ
నేనుబుజువుచేయ నేరనైతినటంచు
ప్రోసివైచెజడ్జి తుద కపీలు॥ 198

క॥ చందాలువేసికొనిజనులందఱుఁగట్టించియుండిరా యాలయముల్
చందా బ్రాహ్మణులిడమికి మున్దే తెల్పితి నిదానముం గనుఁ డచటన్

క॥ కులములకన్నిటికిం గురు
వులగుటఁ జందాలుతప్పె భూమిసురులకున్

---

ఈకేసులోఁ బైనిజెప్పినవిధముగా నే నభిప్రాయపడుటవలన వాది తాను బ్రాహ్మణుఁడనని చెప్పు నర్థములోఁగాని ప్రామాణికగ్రంథములుచేయు నర్థములోఁగాని బ్రాహ్మణు లెవరాయనువిషయములో సకలహైందవులు నొప్పుకొనురీతిగాఁగాని ప్రతివాదులు బ్రాహ్మణులని నేనొప్పుకొనను. సంఘములోనున్న యితరజాతులవారి హక్కులతో జోక్యముపుచ్చుకొనంతకాలము ప్రతివాదులు తమ నే పేరుతోఁబిలుచుకొన్నను నాక్షేపములేదు.

* (7) వాది దావాకుసంబంధించినదేవాలయములు బ్రాహ్మణులుకట్టించినారని కాని బ్రాహ్మణులచే వానికీనామములీయఁబడినవని కాని వానిలో విగ్రహముల బ్రాహ్మణులు స్థాపించినారనికాని వారు బ్రతిష్ఠచేసినారనికాని యందునిమిత్తమై కర్చుపెట్టినారని కాని స్థిరపఱచుకొలేదు. దావాయాలయములలోనుండు శిలలు నూతనముగా నేర్పఱుపఁబడినవై యున్నయవి.

ఇలఁ జండాయిడనట్టిరె
అలఘుతదారంభములను నగ్రేసరులున్॥ 200

క॥ మునిసిభుకడఁ గరణముకడ
పనిపాటల చాండ్రికడను బ్రాహ్మణులకడన్
గోన రేయూరను జండాల్
జను లంద ఆటెంగినట్టి చరితమో యిదియున్॥ 201

తే॥ అట్టిచండాలొసంగని యామునిసిభు
కరణముల్ బ్రాహ్మణులె యగ్రగణ్యులచట
కనుక బ్రాహ్మణు లేమియుం గర్చుపెట్టి
గుమలుకట్టింపకుం టొక్క కొదవగాను॥ 202

క॥ పదిమందితనయు లొకనికి
నుదయింపఁగ నంద అగుదురొకొ యుద్యోగుల్
ఎదియు గడింపనివానికిఁ
బదపదమని భాగమిడక పంపఁగవశమే॥ 203

క॥ భీమార్జునసంపాదిత।మామహీకంతటికి నేలయద్ధక్రుతుఁడయ్యెన్
దామునుధర్మజుఁడటుచం।దామేమిడక యె ప్రధానతంగాంతునటన్

ఆ॥ ఈయకుంటనిజమొ యీదేవతలకు బ్రా
హ్మణజనంబు తాము మాన్యములును
అంతమాత్రమున నె యవ్వారిస్వాతంత్ర్య
మునకు నేమిలోపమో యెఱుంగ॥ 205

ఆ॥ ఈయకుండ్రిగాక యీబ్రాహ్మణులు వాని
నిచ్చునారె యితరు లెవ్వరేని
కాన నందఱికిని గలదుపో స్వాతంత్ర్య
మచటి మంచిచెడ్డ లరయుటకును॥ 206

ఆ। ఎవ్వరేని నాములిడిధర్మకర్తలై।యుంపరేన్ స్వతంత్రులౌరులుకారు
ఎల్లరున్ స్వతంత్రులేమాన్యముల్లేని।యీవిధంపుగ్రామదేవతలకు

ఆ॥ గ్రామజనుల కెల్లఁ గలుగుట సంబంధ
మలరె గ్రామదేవతలుగ నవ్వి
గ్రామదేవతాఖ్య గలదె యాశివ కేశ
వాదులకును నెందు నరసిచూడ॥ 208

క॥ స్థాపనమునకుఁ బ్రతిష్ఠకు। నేపాటియొ భిన్నభావ మొలుఁగను గాని
బాపలప్రతిష్ఠకుం గల। దాపార్టీ సాక్ష్య మొకరమాధారంబై॥ 209

ఆ॥ అందఱుఁగు మీఁద నైన ప్రతిష్ఠ తే। రెండు, వానిలోన నొండు భూమి
సురులె చేసినారు పెరడా ప్రతిష్ఠ కే। యీవివాద మంకురించుటాయె॥

క॥ కావునఁ బైయంశంబుల। నేవిధమున బుజువు చేయ నేనరయంగన్
గేవల సాక్ష్యమె కానఁజన। దీవిధపుం గేసులందు నెన్నదు జడ్జిల్॥ 210

ఆ॥ *గ్రామదైవతముల బ్రాహ్మణుల్ పూజింప
రనుచు జెడ్జి కూడ మునిసిభటులె
తలఁచుచున్నవాఁడు, దానిని గుఱియించి
వ్రాసియుంటి మున్నె వాస్తవంబు॥ 211

క॥ §పూజయు నైవేద్యముఁ బ్రతి
రోజును నీగుడులలో జరుగవను మఱియుం
డోజంగ లిగెను సందియ
మీజడ్జిగారికకట! యేమనువాఁడన్॥ 212

క॥ ఎన్నియొ మహాస్థలంబులె। యున్నవి మహిమీఁదఁ బూజయున్ నైవేద్యం
బెన్నడొ యొకనాఁడగునవ। వన్నియు ద్విజులేగఁ దగనియవియగునో

ఆ॥ అనుదినంబు నేగి యర్చించి నైవేద్య
మిచ్చునట్టివార లెవరు లేక

* ఆవిగ్రహములు బ్రాహ్మణులు సామాన్యముగాఁ బూజచేయని గ్రామదేవతల
పేర నేర్పఱుపఁబడినవై యున్నయవి.

§ దావా దేవాలయములలోఁ బ్రత్యహమును బూజా నైవేద్యములు లేవు ఇప్పు
విగ్రహములఁ జేయుటకుఁగాని స్థాపించుటకుగాని బ్రాహ్మణులు కొంతపైకము కర్చుపెట్టి
నటువాది బుజువు చేయలేదు.

ఆంజనేయుఁడుండెనస్మదీయగ్రామముననె, యతనిఁగొల్వఁజనరెద్విజులు॥

సీ॥ తద్ధనూమంతుని ధామమేర్పఁ దమచేత
భక్తిమైఁ గట్టింపఁబడినదనియొ
తద్రామదూతకుఁ దమచేతనే క్షేత్ర
పాత్రంబు లొసఁగంగఁ బడినవనియొ
తద్దేవతాశిల తమవారిచేతనే
పరఁగఁ బ్రతిష్ఠింపఁబడియెననియొ
తన్నిమిత్తముగాను దమచేత నొకకొంత
పైకంబు వ్యయపెట్టఁ బడియెననియొ
బ్రాహ్మణాళి బుజువుపఱుపఁజాలరుకాన
స్వర్ణకారముఖ్యజనములార!
ముట్టుకొనుఁడు మీకుఁ దట్టి ప్రతిష్ఠింపుఁ
డీకఁ దదాంజనేయు నేమిభయము॥ 215

తే॥ * నీచజాతికి వృత్తిగా నిర్ణయించె
భద్రకాళ్యర్చనము స్మృతి బాగుగాను
గాన కుమ్మరి పూజారిగాపుటకును
నర్హుఁడే గ్రామదేవతయాలయమున॥ 216

తే॥ సంకరుండగువాఁడుపూజారిగాఁగ
నుండుదేవత నర్చింప యోగ్యమగునె
త్మ్నాసురుండని శంకింపఁ జాలఁదప్పు
శాస్త్రవిహితంపుఁబనిగాన నలుపుటొప్పు॥ 217

* గొల్లవాఁడును గుమ్మరవాఁడును, ననఁగా శూద్రులీదేవాలయములలోఁ బూజారులని యుభయవాదులు నొప్పుకొన్నదే. అందువలన నీదేవాలయములలో బ్రాహ్మణులు పోయి పూజించునాచారము లేదు.

వైద్యనాథదీక్షితీయము.

శ్లో॥ బ్రాహ్మణా చ్ఛూద్రకన్యాయాం జాతః పారశవస్తథా
భద్రకాళ్యర్చనం తస్య వృత్తం వాద్యంచ వర్తయే॥

* క॥ కలివర్జ్యంబులఁ జేరుట
నిలిచెఁ దదాచారమిపుడు నిశ్చయమునకున్
తొలియుగములఁ బాకంబును
సలిపినవార్ శూద్రులె ద్విజసదనంబులలోన్॥ 218

క॥ శూద్రుఁడువండినయన్నమె భద్రదముగ మెసవినట్టి బ్రాహ్మణజనముల్
శూద్రార్చకదేవత క్షేమాద్రిం బూజింపదగరు మదిఁ బరికింపన్॥

తే॥ ప్రథములగు బ్రాహ్మణులయిండ్లఁ బాకములను
ఆచరించినవార్ శూద్రులగుటవలన
కాదె సచ్ఛూద్రులైయున్న కాఁపులిపుడు
కుమ్మరుల్ వండు నన్నంబు గుడుచుచుంట 220

ఉ॥ కుమ్మరివండునన్నమును గుడ్చుట తప్పెటుగాకయుండెనో
కమ్మల కాపు ప్రకారమున భూసురకోటికిఁగూడ నియ్యెడన్
కుమ్మరియర్చకత్వమునఁ గూడి రహించెడి గ్రామదేవతన్
సమ్మతితోడఁ గొల్చుటయు శాస్త్రవిహితంబయగున్ నిజంబుగన్॥

ఆ॥ భగవదాజ్ఞయగుచుఁ బరఁగు శ్రుతిస్మృతుల్
పలికినటుల మనము సలుపవలయు
కాని యల్పశంక కల్పించుకొని స్వేచ్ఛ
చనుట నరకమునకుఁ జనుటయగును 222

క॥ • విద్యాహీనులపూజకె హృద్యత నేర్పడియెనంటయీ దైవతముల్
విద్యాహీనులుకారొకొ యద్యతనప్రజలు పెక్కురవనీస్థలిలోన్ ॥22

• పామరులయొక్కయు విద్యావిహీనులయొక్కయుఁ బూజనిమిత్తమేర్పడి యీగ్రామదేవతల స్థితి యెపుడేని కఱవుగాని జాడ్యములుగాని వచ్చినప్పుడె బైటి చ్చును.

*పరాశరమాధవీయము 24వ పుట.

...కన్యానా మసవర్ణానాం వివాహశ్చ ద్విజాతిభిః...ద్విజస్యాబ్ధౌతు నిర ణం శోధితస్యాపి సంగ్రహః...బ్రాహ్మణాదిషు శూద్రస్య పచనాదిక్రియాపి చ.. తానిలోక సప్త్యర్థం కలే రాదౌ మహాత్మభిః నివర్తితాని కర్మాణివ్యవస్థాపూర్వ బుధైః

తే॥ వేదశాస్త్రపురాణముల్ వెక్కిరించి
కాని వెఱ్ఱియొ వ్రాయుటేకాదు విద్య
వేదశాస్త్రపురాణోకవిధులెఱింగి
ఆప్రకారము వర్తించు టగునుగాని

ఉ॥ సత్యమెఱుంగజేయఁగల జ్ఞానమె వాస్తవమైనవిద్య,యా
సత్యము బ్రహ్మ,మన్యమగు సర్వము మిధ్యయ,యిట్టిలోకముల్
సత్యముగాఁ దలంచి పరిజ సంసృతిమోహములోనఁజిక్కి తా
నిత్యము సంచరించునొకొ నిక్కపువిద్యయె నేర్చియున్నచోన్॥225

తే॥ బ్రహ్మమే సత్య మితరప్రపంచమెల్ల
కల్లయనుపాటిజ్ఞానంబు గలుగుఁగాక
సతము మాయాతిరస్కృతమతులుగాక
ఉంటమాత్రము దుర్లభం బుర్విపైని 226

క॥ దారసుతాదులయందున్ దీరనిమోహముననుండిధీమజ్జనముల్
వారలయారోగ్యంబును గూరిచివెయిదేవరలనుగొల్చెడిఁగాన్॥ 227

తే॥ జాడ్యములచేత నవ్వారు పీడ్యమాను
లైనయెడ గ్రామదేవత యర్చనంబు
తప్ప కొనరించుచుందురు ధరణిదేవు
లైననేమి మఱెవ్వరో యైననేమి॥ 225

*ఉ॥ ఎన్నఁడొ యాదికాలమున నీగుడు లెవ్వరుకట్టజేసిరో
నిన్నటివారి కేమెఱుక నే నది గట్టిగఁజెప్ప,నట్టిచో
ఎన్నుచు దీనిఁగూడ నొక హేతువుగాఁగ నపీలు తోసిపైవె
చెన్నరవర్యులార!సబుజెడ్జియు నేమివచింతు మీకిఁకన్॥ 228

యస్ మారుకుదస్తావేజు(దేవీభాగవతము)లో జీవహింస చేయఁగూడదని యెట్టి ప్రమాణమును లేనప్పటికి వాదియొక్క 2వసాక్షి(శిష్టాసీతారామశాస్త్రి)చెప్పినప్రకారముగాను ప్రతివాదులర5,14సాక్షులు చెప్పినప్రకారముగాను నీగ్రామదేవతలయొద్ద జీవహింస చేయుటవలన బ్రాహ్మణులు పూజచేయుట మానినట్లు కనఁబడెడిని.

*ప్రథమమం దీదేవాలయములు కట్టించినవారియొక్కయు నీవిగ్రహములఁబ్రతిష్ఠించినవారలయొక్కయుఁ పేళ్లు చెప్పలేనని వాదియే యొప్పుకొనుచున్నవాఁడు.

ఆ॥ గ్రామదైవతములఁ గామింప రక్షింప
ధరణిదేవులన్న తలఁపుతోడ
జెడ్జిగారు నిక్క చేసిరి తీర్మాన
మిచటి ధర్మసూక్ష్మ మెఱుఁగఁబడక॥ 234

కం॥ విప్రులు వికర్మగతులైర ప్రాజ్ఞతనూను సేచు వైరిమహాత్మ్యల్
సుప్రథితమైనధర్మం బప్రామాణికవిమర్శ నడవింగలసెన్॥ 235

సీ॥ బ్రహ్మవిద్వేషంబు ప్రబలిపోయె జగాన
కానాగి రెల్లరు కర్మసుపర్వు
లర్థతత్పరులు ధర్మాధికారముమాని
వైరూళ్ళఁ దీర్పరు లల్పమతులు
దుష్టుల కందఱుం దోడ్పడఁజొచ్చిరి
శిష్టులపైన కేరుఁ జేరరైరి
కల్లలేజనరంజకంబులై రహించె
జనవిరుద్ధంబయ్యె సత్యవాక్కు .

---

పైజాతివాఁడైన వాది యీప్రతిష్ఠవలన నేమియు నష్టముఁబొందినట్లు కనుబడలేదు. గ్రామదేవతలు బ్రాహ్మణులచేతనే ప్రతిష్ఠింపఁబడవలసినట్లు ప్రమాణమును లేదు. సాక్ష్యమును లేదు. ఇంకను 28మా[illegible] దస్తావేజు (న్యాయసింధువు)లో దీనికి విరుద్ధముగనే యున్నది. వాదిచేఁ గనఁబఱుపఁబడిన ప్రమాణములనుబట్టికూడ విగ్రహములను జేయు రథకారులు లేక శిల్పులను వారు ప్రాణప్రతిష్ఠయుఁబూర్వము కొంతకర్మము చేయవలసినట్లుగాఁ గన్పడెడిని. ఈకేసువిషయమై పైని నేనభిప్రాయపడినదానినిబట్టియు రికార్డులోనుండు సాక్ష్యమునుబట్టియుఁ జూడఁగా పైహికాముష్మికసంబంధమైన యెట్టినష్టమును బ్రాహ్మణుఁడైనవాది పొందలేదనియు వ్యాజ్యమునకుఁ గారణ మేర్పడలేదనియు నష్టమిప్పింపఁదగిన యేయుపకారమును బొందలేదనియు నేను మనస్తృప్తిగా జెప్పుచున్నవాఁడను. ఇతరుల నష్టమెట్టులున్నను గాకపోయినను నీదావా మంచిసలహాలతోఁ జేయఁబడలేదని నాయభిప్రాయము. పైతీర్మానమునుబట్టి యీయప్పీలు కర్చులతోఁ ద్రోసివేసితిని.

25-9-15 ఎం. సాంబమూర్తి అయ్యరు-సబ్ జడ్జి.

పిన్న పెద్దవివేకంబు సున్నయయ్యె
గురువు దైవంబు ననుమాట మఱవఁబడియె
నందియన నంది పందినాఁ బందియయ్యె
పదుగు రొక గుంపుగం జేరి పలికినంత॥ 236

ఉ॥ కొంపలుగాల్చనీ యొరుల కుత్తుకలొత్తదమంచుఁ గాలనీ
కెంపుఘటిల్ల నేత్రములఁ గేకలు వేయుచు నోర్లఁ దిట్టనీ
లంపులమారులై యధికలాభములొందుచు సంచరింపనీ
తెంపువహింపనీ యెవరుఁ దీర్పఁగడంగరు తస్కరాత్ములన్॥ 237

చ॥ కుజనుని జోలికేగఁ దమకొంపల నెక్కడ నిప్పు నెట్టునో
గజిబిజిగానటంచుఁ బ్రజ కాతరులై కర మూరకేసి యా
కుజనుఁడు కీడుసేయఁ గనికూడ వచింపరు సాక్ష్య మక్కటా!
నిజమిఁక నేడనున్నయది నీతిపరుల్ కడుఁ దక్కువైరిలన్॥ 238

ఉ॥ కల్లలు పల్కియో యొరుల కాళులనొత్తియొ ముఖ్ఖుసిప్పియో
పిల్లలనమ్మియో మఱియు బీదజనంబు దివాలుతీసియో
అల్లరిచేసియో యెటో ధనార్జనసేయుట ముఖ్యధర్మమం
చెల్లరు నేర్చికొంగడఁగి రీ కలికాలమహాత్మ్య మెమ్మనన్॥ 239

క॥ కావుననీతీర్మానము కావింపంబడె యుగానుసారముగాఁగన్
యావద్ధర్మము మాఱఁగ। నీవిషయముఁ గూర్చి చింత యొకింకఁ జేయన్

ఆ॥ ధర్మనిష్ఠగలదు ధర్మాధికారుల
కైనఁ బ్రస్తుతాంశ మధికసూక్ష్మ
మందువలన నిట్టులయ్యెఁగాని యొకింత
యును స్వభావదౌష్ట్య ముండఁబోదు 241

ఉత్సాహము॥ ఉగ్గుబాలతోనె మనుజు లొగి ససత్యనిష్ఠులై
సిగ్గువీడి కోర్టులెక్కి చెప్పఁ దప్పుసాక్ష్యముల్
పగ్గగలిగినట్టి తీరుపరులు నేమిచేయుదుర్
లగ్గ లెటుఘటిల్లు సాధులకు ధరిత్రి నియ్యెడన్॥ 242

తే॥ ఇప్పటికి నైన నష్టమిప్పింపఁదగిన
యంతతోర నాకుఁ గల్గ లేదనితలంచి
ఈయఁజేయక పోయె,గానీ తలంప
నుడువఁ డగసాలులన్ బ్రాహ్మణులుగ జడ్జి॥ 243

చ॥ వ్యవహృతి త్రోసివేయఁబడి వాది జితుండయిపోయెనన్న వై
భవము మఱేమిలేదు ప్రతివాదిజనంబుల కెంచిచూచుచో
అవనిసురత్వముంగుఱిచి యన్వహముం బడుపాట్లు వ్యర్థమై
అనమతిఁగూర్చుటం దమరె వైరి జితుల్ పలుమాట లేటికిన్॥ 244

క॥ ఈవిషయముస్పష్టంబడెఁ గావలసినదేమినాకు,గ్రామపుదై వా
లావారి కెపూజ్యములై కైవల్యపదంబొసంగుఁగావుతఁద్వరలోన్॥ 245

తే॥ శక్తియున్నను లేకున్న శ్రద్ధమెయిని
ధర్మమున్ నిల్పయత్నంబుఁ దగ నొనర్పఁ
బాపములనుండి విడువంగఁబడి యుమేశుఁ
జేరుననుచుఁ బురాణముల్ చెప్పుకతన॥ 246

చ॥ అగుదుము మేము బ్రాహ్మణుల మం చగసాలులు వాదులాడఁగా
దగదని రాయిగుద్ది యది ధాతుణి శాశ్వతమౌచుఁ దాఁ జెలం
గఁగ నొకతీర్పుమూలమున గట్టియొనర్చినవాఁడుఁ గాని నేఁ
బగఁగొనికాద యేరిపయిఁబద్మదళాక్షుఁ డెఱుంగు నంతయున్॥ 247

ఉ॥ కొందఱు మెచ్చు కీపనిని గోవిదులయ్యు వృథాప్రయత్నమం
చందురఁ,టందుఁగాక విధియాట నొనర్చితి నేను దీని,నీ
చందము మత్కృతంబయిన సర్వము పుణ్యచరిత్రమౌచుఁదా
నందఱచేత గేయమగునట్టుల గ్రంథముగా లిఖించితిన్॥ 248

ఉ॥ ఎందఱచేత వ్రాయఁబడి యెన్ని చరిత్రము లుండ పృథ్విపై
నందఱునుం బఠింపరవి యందఱుఁ బారముసేయకుండ, రా
చందము నాదుగ్రంథమును సత్యారతుల్ పఠియింత్రు కొంద, ఱే
రందఱు మెప్పులన్ వడయునట్లు లిఖింపఁగలారు చూడఁగన్॥ 249

సీ॥ పద్యముం బఠియించు ప్రౌఢి యుండఁగవలె
నున్న నర్థజ్ఞాన మొనరఁగవలె
నొనర రసజ్ఞతయును గల్గఁగావలె
గలిగిన సువిమర్శకతఁ గనవలె,
గనిన శ్రుతిస్మృతులను నెఱుఁగఁగవలెఁ
నెఱిఁగి యారీతిగా నేగఁగవలె
నేగి పెరల కది యెఱిఁగింపఁగావలె
నెఱిఁగించియును నసూయఁ దఱుమఁగవలె
ఇన్ని రకముల సుగుణంబు లున్న వారు
పాఠ మొనరించి యుద్ధాని బఠియటుండ్రి
ఆడ లేకను మద్దెల యోడటన్న
భంగి గుణహీను లేమని బల్కనింద॥ 250

క॥ ఏరోటికి నాపాట యొ! యారంభముచే తధర్మమని కాని యిటుల్
సారెకు నేను లిఖించుట! యూరయ నే ననఁగ నెవ్వరన్యులు మఱియుఁ॥

ఉ॥ ఒక్క డెయియ్యు విశ్వసయుఁ దూరకయుండఁగలేక భూమికల్
పెక్కులు దాల్చి దేశపని ప్రీతిని దాన నొనర్ప నేనటం
చిక్కరణిం బొనర్చితిని సేఘునభూమి [illegible], నట్టులే
తక్కిన వానియుం మనను దజ్జగ దాత్మ చరించుఁగాకృతఁ॥ 252

గద్యం.

ఇది శ్రీమజ్జగద్గురు గురుకరుణాకటాక్షసంప్రాప్త కవితా
సాహిత్యనిధాన [illegible] లక్ష్మీనారాయణ
పేరమాంబికాగర్భ శుక్తి ముక్తాఫలాయమాన విద్వత్సభా
నిష్కృతానధానవిధాన జానపాటిపట్టాభి
రామాభిధాన విలిఖితంబగు స్వర్ణకార
వ్యవహారంబునందుఁ
జతుర్థ భాగము
సమాప్తము.

# తప్పొప్పుల పట్టిక.



| పుట. | పంక్తి | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 2 | 25 | సుడి | ఁజుడి |
| 4 | 8 | దర్మతిఁ | దుర్మతిఁ |
| 3 | 18 | సుడీ | జుడీ |
| 16 | 3 | వెఱుంగ | వెరుంగ |
| 18 | 21 | కాపు | కాఁపు |
| 19 | 2 | నిట్టమగు | లిట్టమగు |
| | 6 | తోడ్కొనిరా | తోడ్కొనిరాఁ |
| 20 | 5 | కాపుల | కాఁపుల |
| | 17 | గాపులు | గాఁపులు |
| 23 | 21 | తీసుకొనె | తీసికొనె |
| 24 | 18 | యప్రతిష్ఠ | యాప్రతిష్ఠ |
| 29 | 7 | కాఁపువై | కాఁపవై |
| | 19 | కర్మనిట్లు | కర్మమిట్లు |
| 32 | 7 | యాతనిది | యాతమిది |
| 35 | 14 | దిట్టగ | దిట్టక |
| | 24 | మొండివాడ | మొండివాఁడ |
| 36 | 15 | మాయుర్కమ్మలు | మాయూర్కమ్మలు |
| 37 | 7 | వర్ణమే | వర్ణమె |
| | 13 | లిట్టలే | లిట్టులే |
| | 16 | కిష్ఠుల | కిష్టుల ! |
| | 20 | గ్రామణిముఖ్యుల్ | గ్రామణ్యాదుల్ |
| | 21 | లప్రతిష్ఠ | లాప్రతిష్ఠ |
| | 24 | పోఁడటన్నధీఁ | పోఁడటంచు నేఁ |
| 38 | 14 | పల్యంజనేయ | పల్యాంజనేయ |
| 39 | 9 | యాత్మలోన | యాత్మలో |
| 43 | 8 | దట | దట్టె |
| 44 | 2 | గావుతికేరొ | గాకమ జేరొ |
| | 3 | పంచల | మందుల |
| | | బాఖ్యము | మానరు |
| 45 | 6 | యప్రతిష్ఠ | యాప్రతిష్ఠ |
| | 11 | యప్రతిష్ఠలు | యాప్రతిష్ఠలు |
| | 12 | షహీసురుల్ | మహీసురుల్ |
| 47 | 11 | నరకవీధుల గూరుచుండ | నారకవీధిఁ గూర్చుండ |
| | 18 | నరసయాహ్వ | సరవయాహ్వ |
| 48 | 12 | త్పరుషుఁ | త్పురుషుఁ |
| | 16 | దావనం | దానసం |
| 52 | 3 | ట్లొనరించు | ట్లొనరుచు |
| | 7 | దార్ఢ్యమున | ధార్ఢ్యమున |
| | 16 | పెలుచఁ | వెలుచఁ |
| | 20 | బోవలె | బోవవలె |
| 53 | 5 | నే | నేఁ |
| | 15 | రదితర | దదితర |
| | 23 | కొర్జువారు | గొర్జువారు |
| | 24 | తోచి | తోఁచి |
| 54 | 3 | యెదియొ | యెవియొ ! |
| | 14 | కించ | కించి |
| | 16 | ఖర్చుపెట్టు | కర్చుపెట్టి |
| | 24 | పర్గొచిత | సర్గొచిత |

| పుట. | పంక్తి | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 55 | 6 | వ్యాజ్యము | వ్యాజ్యేము |
| | 12 | నంజనేయ | నాంజనేయ |
| 56 | 15 | బ్రతిష్టనకగు | బ్రతిష్ఠలకగు |
| 57 | 11 | తలంవుతోడ | తలంవుతోడ |
| 58 | 7 | పిర్యాదు | ఫిర్యాదు |
| 59 | 23 | అవున్న | అట్లావున్న |
| 60 | 15 | కమసాల | కమసాలి |
| 61 | 1 4 | సైలునఁ | షైలునఁ |
| 62 | 2 | ఘాతుకులు | ఘాతకులు |
| 63 | 1 | ప్రియత్నించిరి | ప్రయతించిరి |
| | 11 | విధిట్లాస్మృతేః | విధిస్మృతేః |
| | 17 | అప్పకిణ్వావా చారి | అప్పకిణ్వాచారి |
| 65 | 2 | వర్గంబుల | వర్ణంబుల |
| | 15 | వగడంగ | వడంగ |
| 66 | 8 | చదునవురు | చదువునరు |
| | 17 | సంప్రోత్క్షుణ్యా | సంప్రోక్షణ |
| | 18 | నపహరించిన | కపహరించిన |
| 67 | 4 | ద్వేషమునుండె | ద్వేషముండె |
| 68 | 6 | బబ్జినీ | మబ్జినీ |
| 70 | 5 | దిగంతరాళుపై | దిగంతరాళులై |
| 72 | 15 | నంతర్లాపికా | నంతర్లాపిగా |
| 74 | 16 | పెని | పెను |
| 75 | 4 | మోనరించ్చిన | మొనరించిన |
| | 5 | వినబడని | వినఁబడని |
| | 6 | పయికి, | పయికిఁ |
| | 11 | గఁడచి | గడచి |
| | 24 | రుజు | ఋజు |
| 76 | 21 | కంసాలుల | కమసాలుల |
| 78 | ! | బోతులను | బోతులగు |
| | 3 | కూతె | కూఁతె |
| 78 | 4 | పక్షులవ్రాతలు | పక్షులఁవ్రాఁతలు |
| | 7 | మసిబూసుకొనె | మసిఁబూసికొనె |
| | 10 | శంకేతిత | సంకేతిత |
| 79 | 6 | బుట్టుట | పుట్టుట |
| 80 | 15 | కాలహాలము | కాలవాలము |
| | 22 | పృద్ధికి | వృద్ధికి |
| 81 | 8 | మేల్లొలుపునే | మేల్కొలుపనే |
| 82 | 11 | పవిత్రితమైన | పవిత్రితమైన |
| | 14 | కమసాల | కమసాలి |
| | 15 | కాబోలు | కాఁబోలు |
| | 16 | బైటబడు | బైటఁబడు |
| | 19 | సుప్రశిద్ధ | సుప్రసిద్ధ |
| 83 | 4 | ననుగూర్చి | ననుఁగూర్చి |
| | 6 | గలిగినగదా | గలిగినఁగదా |
| | 11 | ఉన్మత్తును | ఉన్మత్తును |
| | 25 | పనిజేయు | పనిఁజేయు |
| 84 | 16 | ఖ్యనం | ఖ్యాన |
| | 19 | ఇతిస్యా | ఇత్యస్యా |
| | 21 | రక్షైతేః | రక్షైతై |
| | | సమాసె | సమాసే |
| | 23 | సల | స్థల |
| | 26 | పక్షిశేపక్షి | పక్షిశేవపక్షీ |
| 85 | ! | త్యా | రీత్యా |
| | | విశ్య | విశ్వ |
| 85 | 18 | పస్టోపి | పష్ఠోషి |
| 85 | 20 | వచ | నచ |
| | 24 | రీర | శరీర |
| 86 | 7 | నిరత్వాది | నిరతత్వాది |
| | 18 | పర్వతాతి | పర్వతాది |
| 87 | 17 | బ్రాహాణత్వా | బ్రాహ్మణత్వా |
| | 19 | షట్కర్మాంతత | షట్కర్మాంతర్గత |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు. |
|---|---|---|---|
| 87 | 21 | ధేయం | దేయం |
| 88 | 8 | బ్రాహ్మణత్వస్య | బ్రాహ్మణత్వస్య |
| | 23 | శౌనిక | శౌనక |
| | 24 | స్వాతంత్రేణ | స్వాతంత్ర్యేణ |
| | | రీర | శరీర |
| | 28 | విధివత్సంత్కృత | విధివత్సంస్కృత |
| 89 | 21 | చ్ఛతుర్ముఖ | చ్చతుర్ముఖ |
| | 22 | న్పిపన్నో | నిష్పన్నో |
| | 32 | త్యక్తవలి | త్యక్తవతీ |
| 91 | 23 | ఃఖవకు | ఃఖనకు |
| | 28 | దేహాత్యాత్ర | దేహాన్యాత్మ |
| 93 | 28 | స్త్రీకి | స్త్రీకి |
| 95 | 20 | చరంబు | చరణంబు |
| 96 | 13 | కాతనూభవగర్భ | కాగర్భ |
| 98 | 16 | గాకితంబుల్ | గాకితంబులన్ |
| 101 | 5 | బేధ | భేద |
| 102 | 7 | స్కాంధ | స్కాంద |
| 104 | 15 | రధ | రథ |
| | 23 | యజ్ఞ | యజ్ఞ |
| 106 | 11 | మంజేసే | ముంజేసే |
| 107 | 26 | రైత్యర్థః | త్రైత్యర్థః |
| 108 | 4 | సార్యల్ | నెపుడున్ |
| 109 | 22 | ఆనులోమ | అనులోమ |
| | 26 | వైశ్య | దైవశ్య |
| 110 | 23 | భృగుణాం | భృగూణాం |
| 112 | 5 | వాక్పయోధరీ | వాక్సుధాధరీ |
| | 12 | జరువుతున్న | జరుపుకున్న |
| 115 | 15 | లేపి | లేని |
| 116 | 8 | సత్సంపదు | త్సంపదు |
| | 28 | ప్రాగ్గతం | ప్రాద్గతం |
| 119 | 6 | బాహ్య | బాహ్య |
| 119 | 19 | యదుసున | యదసున |
| | 20 | దదవరసంబు | దదవసరంబు |
| 118 | 6 | పోవు | పోవు |
| | 16 | హేతు | హేతు |
| 119 | 6 | సద్గుణ | సద్గుణ |
| | 20 | నేకాతు | నేకాక్షి |
| 120 | 17 | చెప్పి | చెప్పి |
| | 19 | దాన్య | ధాన్య |
| | 22 | నల్పిన | నిల్పిన |
| 125 | 17 | ఆప్పటికి | అప్పటికి |
| 127 | 1 | చండాలి | చాండాలి |
| 128 | 21 | దెవతల | దేవతల |
| 135 | 26 | త్సన్నిధిం | త్వత్సన్నిధిం |
| 137 | 8 | కొల్ప | కొల్పి |
| 142 | 20 | పోయివ | పోయిన |
| | 22 | పోలేరు | పోలేదు |
| 144 | 25 | చేయించివారు | చేయించినారు |
| 147 | 7 | నప్రతిష్ఠలన్ | నాప్రతిష్ఠలన్ |
| 148 | 7 | పేరమాంబికా తనూభవ | పేరమాంబికా |
| | 18 | కమసాల | కమసాలి |
| 148 | 21 | తీసుకొందురు కులకు | తీసికొందురు కులస్థ |
| 150 | 5 | అనిన తనను | అన్న తన్ను |
| 151 | 7 | పర్ణ | వర్ణ |
| | 18 | తసదు | తనదు |
| 152 | 11 | భోజనము | భోజనము |
| 154 | 1 | చతుర్వింశ | కములయిన |
| | 11 | పూరుషు సుడికి | భూసుర నుడికి |

| పుట. | పంక్తి | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 156 | 7 | తచ్చ్ క్తి | తచ్ఛక్తి |
| | 9 | మేతీర్జూచిన | మేతీర్చూచిన |
| 158 | 1 | నూర్వ్యశి | నూర్వ్యశీ |
| | 19 | వారి తెజము | వారి తేజము |
| | 28 | గరాఃత | రాగతః |
| 161 | 9 | ఋషిపరు | ఋషివరు |
| 162 | 15 | తెజోమూర్తి | తేజోమూర్తి |
| | 24 | కలలె | కలరె |
| 165 | 2 | పంశముండె | వంశమండె |
| | 4 | తసుజాత | తనుజాత |
| | 8 | మునివచః | భృగువచః |
| | 20 | నర్మహిళ్వరు | నస్మహిళ్వరు |
| 166 | 4 | మహాత్తు | మహాత్త |
| | 12 | మహాత్తుకల్మి | మహాత్రికల్మి |
| | 20 | దష్మాతజ | దక్షాత్మజ |
| 167 | 3 | సాగన | సానగ |
| | 9 | నునవని | మనువని |
| 169 | 4 | నసంతరా | వసంతరా |
| | 8 | సంకరపర్ణ | సంకరవర్ణ |
| | 10 | ప్రస్తాప | ప్రస్తావ |
| | 12 | సంకిర్ణ | సంకీర్ణ |
| 170 | 21 | సాధాస | సాధాన |
| | 24 | లకమని | కాలమని |
| 171 | 24 | వాత్త్రైవర్ణికో | వాత్త్రైవర్ణికో |
| | 25 | హినాస్తు | హీనాస్తు |
| 172 | 4 | పరమునులుం | వరమునులుం |
| | 19 | వ్యస్తాధ్యాయస్యః | మస్తాధ్యాయస్య |
| 176 | 25 | స్తతో | స్తతో |
| 177 | 5 | వ్రాసినాడన | వ్రాసినాండన |
| | 19 | మనో | మనో |
| 183 | 15 | దర్పరుండు | ద[illegible]కుండు |
| 185 | 13 | ఒడు | ఒ[illegible]కు |
| 186 | 17 | వృమ్మ్కరె | [illegible]మ్మ్కరే |
| | 20 | వృత్రోసి | [illegible]త్రోసి |
| | 23 | ధధిజాతోసి | ద[illegible]జాతోసి |
| | 26 | వశ్యతే[illegible] | వశ్యతే |
| 188 | 28 | క[illegible] | క్రృవ్య |
| 190 | 19 | గలకదంట | గలదంట |
| | 25 | వర్గములలో | వర్గములలో |
| 193 | 28 | కూద్రశబో | కూద్రశబ్దో |
| | 29 | అనిరగనితానా | అనిగవనితానా |
| 194 | 23 | పాత్రినంశుధ్యతి | పాత్రింగశుధ్యతి |
| | 27 | ద్వాహాకు | ద్వాహామునకు |
| 198 | 3 | తనువాకి | తనువాఙ్ |
| 200 | 20 | నలంరిగంతురు | నలంకరింతురు |
| | 24 | పశుపులలో | పసుపులతో |
| | 27 | యుండిలేదు | యుండ లేదు |
| 201 | 5 | సత్రా | సత్రి |
| | 26 | అందుపయిననేను | అందుపయిన |
| 201 | 27 | భోజనము యివ్వడం లేదని 1, 3, 4, 5, సాక్షులుఅన్నారు అందుపయిననేను. నేను | |
| 203 | 7 | చిన్నమల్లిజేవ | చిన్నమల్లీదేవ |
| 206 | 21 | నాలో | నాతో |
| 207 | 18 | కెమి | కేమి |
| | 22 | మునవిగ్రహాములు | వవిగ్రహాములు |
| 210 | 11 | తోముందుగ | తోముందుగ |
| 215 | 13 | పూజనావర | పూజనాదర |

# పండితాభిప్రాయములు.

... ... అయ్యా! తాము వ్రాసిన స్వర్ణకారవ్యవహారనను గ్రంధమును స్థాలీపులాకన్యాయముగా, చూచితిమి. కవితాపరిపాకము సహృదయహృదయానందమై యున్నది. ఇయ్యది శ్రుతిస్మృతిపురాణేతిహాసాది ప్రమాణోపబృంహితమై బ్రాహ్మణేతర బ్రాహ్మణతాభిమానగాఢధ్వాంతచండభాస్కరమై గన్పట్టుచున్న యది.

ఉ॥ చూచితిమయ్య శిల్పకుల చోద్యపుఁబోకడ పొత్తమందు, శా
స్త్రోచితయుక్తియుక్త భవదుక్తులు దుర్మతవాదివాదముల్
ద్రోచి మనంబునందు కవిధూర్వహ! సజ్జనమాన్య! మిత్రమా!
బీచనుఁడంపఁజాలఁగల పెంపునహించుచుమించె మోదముల్

కొప్పురం గ్రామం సిద్ధాంతులు. } చింతలపాటి సుబ్రహ్మణ్యశాస్త్రి. చింతలపాటి సూర్యనారాయణశాస్త్రి.

ఉ॥ ఒక్కెడ వేదశాస్త్రనిచయోదితసూక్తులు నొక్కచోట నా
తెక్కలికాండ్రు బత్తుల శ్రుతిస్మృతిదూషితదోషవాక్కు లొం
డొక్కెడ నెక్కసక్కియపునుక్తులు గేవలయుక్తు లొక్కచో
నెక్కువసప్రమాణముగ నీకృతియందుఁ బ్రకాశమొందెడిన్ ॥

మ॥ చరితంబా! యఘనాశనంబు, గవితా! సాహిత్యయుక్తంబు, వై
ఖరియా కమ్రము, పాకమా! మధురసాకాంతంబు, సారాంశమా
ధరణీనిర్జరవర్ణనిర్ణయము, సిద్ధాంతంబ శూద్రాదిధ
ర్మరహస్యంబును దెల్పు మీకృతి నుతిన్ మాబోంట్లశక్తుల్గదా ॥

ఉ॥ మంచిపనిన్ రచించి బుధమాన్యతఁజెందితిరీర లాంధ్రదే
శాంచితవిప్రపక్షమున న్యాయసభన్ శ్రమకోర్చి బత్తులన్
వంచనఁజేసి బ్రాహ్మణభవస్థితధర్మములెల్లనిల్పి ధ
ర్మించర" యన్ నుడిన్ దవిలి రాజిలుచుంటిరి ధార్మికావళిన్ ॥

